# కథలు



మొదటి సంపుటం

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# కథ

# 1

## మొదటి సంపుటం



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

**Sripada Subrahmanyasastri Kathalu - Vol-I**

ప్రచురణ నెం. : 2150

వి.పి.హెచ్.
ప్రథమ ముద్రణ : ఆగష్టు, 1992

ద్వితీయ ముద్రణ : జూలై, 1999



వెల: రూ. 100-00



ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్ - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు-500 029

# ఛాందస తమస్సు నుండి పుట్టిన సంస్కరణ జ్యోతి

**పుట్టింది** శుద్ధ శ్రోత్రియ కుటుంబంలో. 25 ఏండ్ల వరకూ సంస్కృతమే తప్ప తెలుగుతో పరిచయం కూడా లేదు. చాటుమాటుగా అప్పకవి ఛందోగ్రంథం చదివి పద్యాలు రాయదలుచుకుంటే, తండ్రి చీవాట్లు, అన్నగారి దేహశుద్ధి. ఇంట్లో అక్క పెత్తనం. తల్లి మాత్రమే "పోనివ్వండి, వాడు మీలాగే పంచాంగాలు రాసుకుంటూ ఉండాలనా? ఏమో, తెలుగుభాషలో గొప్పవాడవుతాడేమో!" అని అగ్నిహోత్రావధాన్లులాంటి తండ్రి పెత్తనానికి కొంచెం అడ్డుతగిలిన ప్రేమమూర్తి. ఈ వాతావరణంలో పుట్టి పెరిగిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తెలుగుభాషలో మొదట పద్యాలు వ్రాసి, నాటకాలు వేసి, వేయించి, చివరకు వచనంలో స్థిరపడటమే కాక, అనేక కథలు రాయటమే కాక, వ్యావహారిక భాషలో తెలుగు రాస్తే ఎంత మధురంగా ఉంటుందో నిరూపించిన కథక చక్రవర్తులలో ఒకరు.

వీటన్నింటికి మించి, వీరేశలింగంగారి సంస్కరణోద్యమాన్ని మనసారా అభిమానించి, రచనల రూపంలో విస్తృత ప్రచారం చేసిన ధన్యజీవి. ఈ సంపుటిలోని కథలను చూస్తేనే ఆ విషయం స్పష్టమౌతుంది. కథలన్నిటికీ రాజమహేంద్రవరం కేంద్రం. కథలలోని ముఖ్యపాత్రలు వీరేశలింగంగారి సంస్కరణ భావాలతో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ప్రభావితులైనవారే.

'అన్నంతపనీ జరిగింది' అనే కథలో ఉదారభావాలు గల ఒక విద్యాధికుడు, చిన్నప్పుడే బాల వితంతువైన తన కూతురికి తిరిగి వివాహం చేయటమే గాక, ఆ కుమార్తెకు ఉపాధ్యాయినిగా తన యింట్లో చేరిన ఉత్తమురాలిని, కుమార్తెకు తల్లిలేని కొరతను తీర్చిన మాతృమూర్తిని, తన సహధర్మచారిణినిగా స్వీకరిస్తాడు. అది కూడా వివాహితంతు ఏదీ లేకుండానే. శ్రీపాద వారి ముందు చూపుకు ఇది నిదర్శనం.

'ఇల్లు పట్టిన వెధవాడబడుచు', కీలెరిగిన వాత' – ఈ కథలు రెండూ ఈ సంపుటిలో ప్రత్యేకించి చెప్పుకోదగినవి. ముఖ్యంగా మొదటి కథ. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు స్వయంగా చూసి, అనుభవించిన ఘటనలన్నీ ఇందులో అన్యాపదేశంగా ప్రవేశిస్తాయి.

బ్రాహ్మణ కుటుంబాలలో ఒకరిద్దరు వితంతు కుమార్తెలు పుట్టింటికి చేరడం, వారి పట్ల జాలితో కాదనలేక తల్లిదండ్రులు వారికి ఇంటి పెత్తనం ఇవ్వటం,

దానిని దుర్వినియోగ పరుచుకుని, ఇంటి కోడళ్ళను వారు పెట్టే ఆరళ్ళు చెప్పనలవికానివి. తద్వారా కుటుంబాల విచ్ఛిత్తికి వారిలోని అసూయా ద్వేషాలు ఎలా కారణ భూతాలవుతాయో ఈ రెండు కథలలో ఎంతో శక్తిమంతంగా శ్రీపాదవారు నిరూపిస్తారు.

వెలమ వీర నారీమణులైన బొబ్బిలి స్త్రీలు, తమను తాము పొడుచుకు చావటం కంటే, శత్రువులతో పోరాడి మరణిస్తే తప్పేమిటి అనే ప్రశ్నను రాణి శ్రీ మల్లమ్మ ప్రశ్నిస్తుంది. ఆ ప్రశ్నలోనే వెలమస్త్రీల దైన్యం కనపడుతుంది. చివరకు వారు సాంప్రదాయం ప్రకారం తమను తామే పొడుచుకుని చనిపోతారు. కాని ఆ ప్రశ్నే చాలు ఈ కథను మహిళా చైతన్య దీప్తి ప్రజ్వలనలో ఒక మైలురాయి అని చెప్పటానికి.

అవినీతి, లంచగొండితనాలకు సంబంధించిన కథ ఒకటి, బాల వితంతువు తన అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు పెట్టే బాధలు పడలేక ఎవరికీ చెప్పకుండా పోవడం, పునర్వివాహాకాంక్షతో వీరేశలింగంగారి తోటకు వెళ్ళిపోవడం – ఇవి ఈ కథా వస్తువులు.

కథా రచనను గురించి చెప్పవలసిందే లేదు. సంభాషణా చాతురిలో శ్రీపాదవారిది పెట్టింది పేరు. సుమారు 60 ఏండ్ల నాటి కథలు ఇవన్నీను. మరుగుపడిన ఈ కథలను చదువుతుంటే, సామాజిక సమస్యల పట్ల ముఖ్యంగా స్త్రీ సమస్య పట్ల, శ్రీపాద వారి లోతైన, గాఢ స్పందన, వారి ముందు చూపే అడుగడుగునా ఆశ్చర్యచకితులను చేస్తుంది.

– ఏటుకూరి బలరామమూర్తి
'ఎడిటర్'
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

# జాతి కథకులు

ఇరవై ఏళ్ళకిందట, తెలుగులో కథలు రాసిన వాళ్లపేర్లు రాయడానికి పూనుకొన్నప్పుడు రెండువందల మందికిపైగా లెక్క తేలారు. ఇప్పుడు ఆ సంఖ్య రెట్టింపు ఉండవచ్చు; ఇంకా ఎక్కువా కావచ్చు. వీరిలో, మూడు నాలుగు కథల దగ్గరినుంచి మూడు నాలుగు వందల కథలవరకు రాసినవాళ్ళు ఉన్నారు. అంటే, గత ఎనభై ఏళ్ళలో ఎన్నో (కొన్నివేల) కథలు పుట్టినా వాటిలో బహూశా ఏ పదోవంతో పుస్తకాల కెక్కితే తక్కినవన్నీ పాత పత్రికల్లో–ఉన్నంత మట్టుకే–పడి మూలుగుతున్నాయన్నమాట!

మనవాళ్ళు రాసినవన్నీ–ఆ మాటకువస్తే, ఏ ప్రసిద్ధ రచయిత రాసినవయినా– అన్నీ అద్భుతంగా ఆణిముత్యాల్లా ఉంటాయని అనుకోనక్కరలేదు. ఉండాలనుకోడం దురాశా అవుతుంది; నిరాశా కలిగిస్తుంది. అయినా, అన్నీ పుస్తకరూపంలో రావడం న్యాయం. అవి అందరికీ కంటపడాలి; అందుబాటులో ఉండాలి. అవి అందరినీ ఆకర్షించాలి; చదివించాలి. అనుభూతినీ అవగాహననూ పెంచాలి. ఆలోచనలు రేకెత్తించాలి. సంపూర్ణ మానవుడిగా పరిణమించడానికి దోహదం చెయ్యాలి. రచన మంచి చెడ్డల్ని పరిశీలించే పాఠకులూ విమర్శకులూ ఎప్పుడూ ఉంటారు.

ఏమంటారా? ఇంత విశాలమయిన ప్రపంచంలో మన ఉనికీ మన పరిసరాలూ చాలా పరిమితమయినవి. మన అవగాహన, కేవలం మన వ్యక్తిగతమైన అనుభూతులకూ ఆలోచనలకూ అలవాట్లకూ పరిమితమయిపోతే నూతిలో కప్పలమయిపోతాం. హృదయమూ బుద్ధీ కుదించుకుపోతాయి; అర్చుకుపోతాయి–హరించుకుపోతాయి.

మనిషి పుట్టింది ఇందుకు కాదు. పుట్టినవాడు ఆదిమస్థితిలోనే ఉండిపోలేదు. రకరకాల అడ్డంకుల్నీ సవాళ్ళనూ ఎదుర్కొంటూవచ్చి హృదయాన్నీ మనస్సునూ బుద్ధినీ పెంచి పోషించుకొంటూ వచ్చాడు. అయినా అతని అంతర్–బహిర్ యుద్ధారావం సమసిపోలేదు; పోనూలేదు. పరిణామక్రమంలో అప్పటికీ ఇప్పటికీ సమస్యల తీర్లు మారినా సమస్యలు లేకుండా పోలేదు. అవగాహన పరిధి పెరిగినా అంతరాల అడ్డుగోడలు కూలిపోలేదు. ఇవి ఏదో ఒకరకంగా ఉంటూనే ఉంటాయని మనకు తెలుసు. కానీ, వీటిని ఇలాగే ఉండనివ్వడం మన నైజానికి విరుద్ధం. కనుక, పెనుగులాట తప్పదు. ఇది ఎప్పటికీ తప్పనిదే. అందుకు మనం ఎప్పుడూ సిద్ధంగా ఉండవలసిందే. ఎప్పుడూ మెలకువగా ఉండవలసిందే. బలం పెంచుకుంటూ ఉండవలసిందే. అందుకోసం హృదయాన్ని విశాలం చేసుకోవాలి; మనస్సును గాఢం చేసుకోవాలి; బుద్ధిని సునిశితం చేసుకోవాలి. ఇందుకు సాహిత్యం బాగా సాయపడుతుంది.

సాహిత్యంలో కథానికకొక విశిష్టత ఉంది. జీవితంలో ఏ ఒక్క అంశాన్నయినా కేంద్రంగా చేసుకొని దానిమీద వెలుగు ప్రసరింపజేస్తుంది. దీంట్లో గాఢత ఎక్కువ; పరిధి తక్కువ. ఇదొక ప్రత్యేక సాహిత్య ప్రక్రియ.

మానవ సమాజంలో ప్రతి దేశంలోనూ తరతరాలుగా కథలు వినవస్తూనే

ఉన్నాయి. రామరాను అవి రాతకెక్కాయి. నోటికథ రాతకథ అయేసరికి కొన్ని మార్పులు వచ్చాయి. ఆ రాత కథలో క్రమక్రమంగా మార్పులు వస్తూ సానబెట్టిన వజ్రంలా తయారయింది. దానికి 'కథానిక' అన్న పేరు మొదట అగ్నిపురాణంలో కనిపిస్తుంది. కథానిక అంటే 'చిన్నకథ' అని అర్థం. అయితే పరిమాణంలో చిన్నగా ఉన్నంతమాత్రాన అది చిన్నకథ అనిపించుకోదని, అదొక ప్రత్యేక ప్రక్రియ అని తెలియడానికే అగ్ని పురాణం, దానికి లక్షణాలు నిర్వచించింది. టూకీగా చెప్పాలంటే, ప్రతి కథానికా కథే; కాని ప్రతి కథా కథానిక కాదు. అయినా మన సులువుకోసం కథానికను కూడా కథ అనే అంటున్నాం.

తెలుగులో కథానికా సాహిత్యానికి ఆద్యుడు గురజాడ అప్పారావుగారు. ఆయన రాసిన ఐదు కథలూ ఆణిముత్యాలే. ఆ తరవాత కొన్ని వేల కథలు వచ్చాయి. వాటిలో తాలూ ఉంది, తగరూ ఉంది; మంచివీ ఉన్నాయి, గొప్పవీ ఉన్నాయి. తెలుగువాడి ప్రతిభకవి అద్దం పడతాయి; ప్రతిష్ఠ చేకూరుస్తాయి.

వస్తువును ఎంపిక చేసుకోవడంలో, శిల్ప సంపన్నంగా తీర్చిదిద్దడంలో, ప్రయోజనాన్ని సిద్ధింపజేయడంలో వివిధ రచయితలు, వివిధ రచనల్లో చూపించిన శక్తిసామర్థ్యాల తారతమ్యాల్ని పక్కకు పెడితే–మొత్తంమీద కథా సాహిత్యం తెలుగు రచయిత రూపు గట్టించిన జీవన దర్శనాన్ని సమగ్రంగా ప్రతిబింబిస్తుంది. అందుకోసం సాహిత్యాభిమానులు కథా సాహిత్యాన్ని విధిగా భద్రపరుచుకోవాలి. కనీసం కొందరు రచయితలవయినా, కొన్ని కథలయినా మనకు అందుబాటులో ఉన్నాయంటే, అది ప్రచురణకర్తల చలవే. ఆ ప్రచురణకర్తల్లో సంస్థలున్నాయి, ప్రోత్సాహక పోషకులున్నారు, స్వయంగా రచయితలూ ఉన్నారు. వాళ్ళందరూ అభినందనీయులు.

అనేక దశాబ్దాలుగా దాదాపు రెండువేల గ్రంథాలు ప్రచురించి విస్తృత ప్రచారం చేస్తూ వివిధ ప్రాంతాలవారి సాహిత్య తృష్ణను తీరుస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయం వారు కథాసాహిత్య ప్రచురణపట్ల ప్రత్యేక శ్రద్ధాసక్తులు చూపించడం ప్రశంసనీయమైన విషయం. వీరేశలింగంగారి సంపూర్ణ సాహిత్యమూ, కుటుంబరావుగారి కథా సాహిత్యమూ అందుబాటులోకి తెచ్చినందుకు తెలుగు పాఠకులు విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి ఎప్పుడూ కృతజ్ఞతలు చెప్పుకొంటారు. ఇప్పుడు మరొక గొప్ప రచయిత కథా సాహిత్యాన్ని పూర్తిగా అందించడానికి పూనుకొన్నందుకు ఇబ్బడి ముబ్బడిగా అభినందనలు అందుకొంటున్నారు. ఈ పూనిక ఆయన శతజయంతి సంవత్సరంలోనే కలగడం మరో విశేషం. ఒక మహా రచయిత ప్రతిభా ప్రాభవాలకు తన జాతి అర్పించే నివాళికి ఇది ప్రతీక. ఈ గౌరవం ఇప్పుడు విశాలాంధ్రకు దక్కింది.

ఏ రచయిత ప్రతిభ ఎప్పుడు ఎంత మంచి రచనను అందిస్తుందో చెప్పలేం. ఆ మంచి రచనకోసం ఎప్పుడూ ఎదురు చూడవలసిందే. అందుకని ఎప్పటికీ రచనను ప్రోత్సహిస్తూ ఉండాలి; రచయితల్ని ఆదరిస్తూనూ ఉండాలి. అది సమాజానికి గౌరవప్రదం. అయినా, ఏమాట కామాటే చెప్పుకోవాలి – విశిష్ట ప్రతిభావంతులకున్న అగ్రశ్రేణిని గుర్తించక తప్పదు. వాళ్ళ రచనకు విశేషార్థం చెప్పుకోక తప్పదు.

అందువల్ల—

జాతి జీవనాడిని పట్టి ఇచ్చే రచనే సిసలైన రచన.

ఆ జీవనాడి తనలో ఎప్పుడూ స్పందిస్తూ ఉండే రచయితే సిసలయిన రచయిత.

అది జీవద్రచన.

అతను జాతి రచయిత.

నవ్యాంధ్ర సాహిత్యంలో ఆ కోవలో నిలిచిన అగ్రస్థానీయులు—కందుకూరి వీరేశలింగంగారు, గురజాడ అప్పారావుగారు.

వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమ ప్రభావమూ అప్పారావుగారు అందించిన కథా ప్రక్రియ ప్రభావమూ ఒక్క హృదయంలో కలబోసుకొని జీవద్రచనా ప్రసరణ జేశాయి; జాతి కథకుణ్ణి అందించాయి. ఆయన్ని శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి అంటారు (1891–1961.)

సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పుట్టింది – పాతకాలపు విలువలకూ ఆచారాలకూ అలవాట్లకూ ఆలోచనలకూ కట్టుబడిపోయి మార్పుకు ఒప్పుకోని పల్లెటూరి కుటుంబంలో. చదివింది – ఇష్టంలేని వైదిక విద్య. పెరిగింది – తన వ్యక్తిత్వ వికాసానికి అన్ని విధాలా ప్రతికూలమయిన కుటుంబ వాతావరణంలో. అయినా ఆయన జీవలక్షణం బలిష్ఠమయినది. ఆయన ప్రవృత్తి స్వతంత్రమయినది. అందువల్ల ప్రతికూల పరిస్థితుల్నీ వ్యక్తుల్నీ ప్రతిఘటించి తమ కాళ్ళమీద తాము నిలబడ్డారు. తమకు ప్రాణతుల్యమయిన సంగీత సాహిత్యాల్ని దీక్షగా సాధన చేశారు. క్రమంగా సంగీతం వెనకబట్టింది. కవిత్వ సాధనను ఆయనే వెనకబెట్టారు. శాస్త్రిగారి జీవితంలో ఇదొక పెద్ద మలుపు. ఆయన్ని వచన రచనకు మళ్ళించిన గురువులు నిజంగా ప్రశంసార్హులు.

శాస్త్రిగారు నవలలు రాశారు. (ఆత్మబలి, శ్మశాన వాటిక, నీలాసుందరి, అనాథ బాలిక, రక్షాబంధనము.) నాటకాలు రాశారు. (రాజరాజు, కలంపోటు, నిగళ బంధనం.) చరిత్రాధారిత గ్రంథం రాశారు. (వీరపూజ.) 'ప్రబుద్ధాంధ్ర' పత్రిక నడిపారు. మల్లిడి సత్తిరెడ్డిగారి 'రెడ్డిరాణి' పత్రిక నడవడానికి సాయపడ్డారు. రాజమండ్రిలో ఒకరి పేర 'అభ్యుదయ' మాసపత్రిక స్థాపించి, రెండు నెలలు తామే నిర్వహించారు. తెలుగులో మొట్టమొదటిసారిగా వాడుకభాషలో వాల్మీకి రామాయణాన్ని అనువదించారు. మహాభారతం కూడా కొంతవరకు రచించారు. అనేక పత్రికల్లో వ్యాసాలూ వ్యాఖ్యలూ ప్రచురించారు. 'అనుభవాలూ–జ్ఞాపకాలూను' మూడు సంపుటాలు రచించారు.

అయినా ఆయన మనస్సును చాలావరకు ఆకట్టుకొన్నది కథాప్రక్రియే. ఆయన మొట్టమొదటి కథ 'ఇరువురమొక్క చోటికే పోదము.' దీన్ని, 1951లో ఆంధ్రపత్రికలో ప్రచురించడంకోసం కోటంరాజు పున్నయ్యగారు కోరిన ప్రకారం ఒక్క గంట వ్యవధిలో రాసి ఇచ్చారట.* మొత్తంమీద శాస్త్రిగారు వ్రాసిన 'చిన్నకథలు' 75. వీటిలో 65 సాంఘిక కథలు, 10 చారిత్రక కథలు. ఈ కథల్లో

* డాక్టర్ చామర్తి కనకయ్య 'కనక్‌ప్రవాసి'గారి పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథం 'శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి చిన్న కథలు–సమగ్ర సమీక్ష' (1985).

పందొమ్మిదింటిని 'పూలదండ' అనే పేరుతో ఒక సంపుటిగా కూర్చి 1925లో శాస్త్రిగారే ప్రచురించారు. ఆ తరవాత రాజమండ్రిలోని అద్దేపల్లి అండ్ కోవారు ప్రచురించిన సంపుటాల్లో ఉన్న మొత్తం కథలు 25. అంటే 31 కథలు పుస్తక రూపంలోకి రాకుండా ఉండిపోయాయన్నమాట!

డా॥ చామర్తి కనకయ్య వింగడింపులో, శాస్త్రిగారి కథలు ఏడు విభాగాల్లోకి వచ్చాయి: (1) ప్రణయ కథలు–5, (2) సంఘ సంస్కార కథలు–25, (3) ప్రబోధాత్మక కథలు–8 (4) కుటుంబ జీవిత కథలు–18, (5) అపరాధ పరిశోధక కథలు–3, (6) భాషా వివాదాత్మక కథ–1,(7) అవహేళనాత్మక కథలు–5. ఇవి 65. చారిత్రక కథల్లో (1) పూర్వసంస్థాన కథలు–7, (2) అధునిక జమీందారీకథలు–3.

శాస్త్రిగారు, పత్రికల్లో వచ్చిన కథల్ని సంపుటాలుగా ప్రచురించేటప్పుడు చాలావాటిలో మార్పులూ చేశారు, చేర్పులూ చేశారు. ఆయన 'పెంపకం'లో కొన్ని కథల నిడివి రెట్టింపుకుపైగా పెరిగింది; వాటి అందచందాలూ పెరిగాయి.

ప్రస్తుతం విశాలాంధ్రవారు ప్రచురిస్తున్న యీ మొదటి సంపుటంలో ఉన్నవి ఏడుకథలు. వీటిలో చారిత్రక నేపథ్యంలో ఉన్నది ఒకే ఒక కథ– 'విమానం యెక్కబోతూనూ'; తక్కినవి సామాజిక కుటుంబ కథలు. వీటిలో ఒక్కొక్కటి ఒక్కొక్క మణిపూస.

ఇందులో మొదటికథ 'అన్నంతపనీ జరిగింది.' పొట్టగడవడానికి ఏదయినా పని ఇప్పించమని రామచంద్రం అనే యువకుడు, చంద్రమౌళి పంతులు అనే వకీలును ఆశ్రయిస్తాడు. వకీలు అతన్ని బాగా ఆదరిస్తాడు. వకీలు కూతురు సుభద్ర. చిన్నతనంలోనే పెళ్ళి అయిన సుభద్ర తొమ్మిదో ఏటే వితంతువు అయింది. పదోయేట ఆమెతల్లి చనిపోయింది. వకీలు మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా కూతుర్ని అల్లారుముద్దుగా పెంచుకుంటాడు. ఆ అమ్మాయికి చదువుచెప్పే ట్యూటరు జానకమ్మ. ఆమె కూడా బాలవితంతువే. ఇద్దరికీ ఏర్పడ్డ చనువువల్లా అభిమానంవల్లా జానకమ్మ తమ ఇంట్లోనే ఉండిపోవాలని పట్టుకుంది సుభద్ర. ఆమెనే అమ్మ అనుకుంటాననంటుంది. వకీలు అందుకు అంగీకరించి, ఇంటి యాజమాన్యాన్ని జానకమ్మకు అప్పగించేస్తాడు. ఈ కుటుంబంలో ఆశ్రయం పొందిన రామచంద్రం యీ ముగ్గురి అభిమానాన్నీ సంపాదిస్తాడు. సుభద్రను రామచంద్రానికిచ్చి పెళ్ళిచెయ్యడానికి నిశ్చయిస్తాడు వకీలు. "సంఘ సంస్కారాశయంకన్న ప్రణయానికి ప్రాధాన్యం లభించిన వితంతు పునర్వివాహేతివృత్తంగల శాస్త్రిగారి కథలలో ఇది ఉత్తమశ్రేణికి చెందిన కథ" అంటారు డా॥ కనకయ్య. అయినా చంద్రమౌళి పంతులు వ్యక్తిత్వం గొప్పది. దీనస్థితిలో ఉన్నవాణ్ణి ఆదరించడమేకాక ప్రతిభను గుర్తించి, నడవడిని గమనించి, కూతురి ఇంగితాన్ని మన్నించి తన ఇంటికి అల్లుణ్ణి చేసుకోడానికి సమ్మతించాడు.

ఈ కథలో సుభద్రకు కథలు రాయడం ఒక సరదా. వాటికి రామచంద్రం సాపుప్రతులు రాసిపెట్టడమేకాక అందంగా దిద్దుబాట్లు కూడా చేసి మెప్పు పొందుతాడు. సుభద్ర వాడుక భాషలోనే కథలు రాస్తుంది. రామచంద్రానికీ వాడుకభాషే ఇష్టం. వకీలు కూడా దాన్నే ప్రశంసిస్తాడు; "మహాదిట్టమైనవాడోయ్

గిడుగు రామమూర్తి పంతులు. నవీన వాఙ్మయ నిర్మాతలయిన యువకులనందర్నీ లోపుచేసుకున్నాడు పంతులు. ముసలి తలకాయలు గ్రాంధికమో అంటూ ఎంత గోల పెడితే మాత్రం, ఆ వాదం యింకెన్నాళ్ళు నిలుస్తుందీ?" అన్న మాటల్లో శాస్త్రిగారి గొంతుకే వినిపిస్తుంది. శాస్త్రిగారు మొదట్లో గ్రాంధికంలోనే రచనలు చేసేవారు. ఆ తరవాత, సంభాషణలు వాడుకభాషలోనూ తమ కథనం (Narration) గ్రాంధికంలోనూ రాస్తూ వచ్చారు. పూర్తిగా వాడుకభాషలోకి దిగిపోయాక వీరవిహారమే చేశారు.

'విమానం ఎక్కబోతూనూ–' అన్నకథ బొబ్బిలిరాణీ మల్లమ్మ జీవిత చరమాంకం. ఇందులో ఉన్న రెండు పాత్రల్లో మరొకటి చెలికాని వెంకయ్య. విజయరామరాజు బొబ్బిలికోటను ముట్టడించినప్పుడు వెలమవీరులు భీకరంగా ఎదిరించగలిగారే, కాని నిలవరించుకోలేకపోయారు. ఆ స్థితిలో, రాణివాసం శత్రువుల చేతుల్లో అవమానాలకు గురికాకుండా ఉండడంకోసం, అక్కడి వాళ్ళను చంపిరమ్మని వెంకయ్యను పంపాడు వెలమ ప్రభువు రంగారావు. ఆ వెంకయ్యను రాణి మల్లమ్మదేవి నిలదీసి ప్రశ్నిస్తుంది. బొబ్బిలివీరుల ప్రతాపం మొక్కవోయినప్పుడు స్త్రీలుకూడా కత్తి పట్టాలంటుంది. తానూ యుద్ధరంగంలోకి దూకుతానంటుంది. "బొబ్బిలిపాటిమీదే, విజయరామరాజు కళేబరం శాశ్వతం కాదని నిరూపిస్తా"నంటుంది. మాటల ఈటెలతో వెంకయ్య రక్తం ఉండెకెత్తించడమేకాదు, గుండెల్లో తూట్లు పొడుస్తుంది. అయినా రాజాజ్ఞను జవదాటని మతిమంతురాలు కనక కైజారుతో తానే పొడుచుకొని చనిపోతుంది. ఆమె వీరనారి కనకనే ఆమెను విమానమెక్కించారు శాస్త్రిగారు. మల్లమ్మ మహత్తర మూర్తిమత్వాన్నంతటినీ ఆమె మాటల్లోనే రూపుగట్టించారు. వెలమస్త్రీలు పరపురుషుల కంటబడరాదనే కట్టడిని కాలదన్నేటంత తిరుగుబాటు ఆమెలో ప్రజ్వలించినట్టు ప్రదర్శించారు. శాస్త్రిగారి మల్లమ్మ సాటిలేనిది.

మూడోకథ 'ఇల్లుపట్టిన వెధవాడబడుచు,' నాలుగోది 'కీలెరిగిన వాత.' ఈ రెంటిలో కొంత సామ్యమూ ఉంది, కొంత వైవిధ్యమూ ఉంది. సంఘంలోని బాలవితంతువులు తాము నిర్బంధ వైధవ్యం అనుభవిస్తూ, దాంపత్యసౌఖ్యం అనుభవిస్తున్న వాళ్ళను చూసి ఓర్వలేక వాళ్ళ సంసారాల్ని కూల్చడానికి ప్రయత్నాలుచేస్తూ, పుట్టింట్లో తమ అధికారాలు చలాయిస్తూ ఎంత రాక్షసుల్లా ప్రవర్తిస్తారో నిరూపిస్తూ రాసిన కథలివి. బాలవితంతువుల సమస్యకు పునర్వివాహమొక్కటే పరిష్కారమార్గమని ధ్వనించే కథలివి. మొదటి కథలో బుచ్చమ్మా రెండో కథలో రాజమ్మా బాలవితంతువులే. మాటల్లో జాణలే. కాని బుచ్చమ్మ, తమ్ముణ్ణి తన గుప్పెట్లో ఉంచుకొని ఇంట్లో తన అధికారం చలాయించడానికి ఎంత తీవ్రంగా ప్రయత్నించినా మరదలు జోగమ్మ చాకచక్యంవల్ల తన ప్రయత్నాలు భంగపడ్డాక, ఇల్లు విడిచి అత్తవారింటికి పోక తప్పలేదు. రాజమ్మ మాత్రం చదువుకొన్న మరదలికీ లొంగలేదు, ఆమె తీసుకువచ్చిన లాయరు వాదానికీ లొంగలేదు. తమ్ముణ్ణి చేతకాని దద్దమ్మలా చేసి తనమాట జవదాటకుండా ఉండేలా నిలబెట్టింది. ఆత్మాభిమానం గల మరదలు, తన తమ్ముణ్ణి ఎన్ని మాటలని చీకొట్టి వెళ్ళిపోయినా రాజమ్మకు పంతం నెగ్గించుకున్నాక – విచారం ఎందుకుంటుంది?

ఐదోది 'కలుపు మొక్కలు.' సంఘంలో బాధ్యతగల పదవుల్లో ఉన్న వ్యక్తులు కొందరు ఎంత అవినీతిపరులో, ఎంత లంచగొండులో నిరూపించే కథ ఇది. సుక్షేత్రమయిన సమాజంలో పెరిగే కలుపుమొక్కలు వీళ్ళు. అందుకు భిన్నంగా, పతితలుగా ముద్రపడ్డ వేశ్యల్లో కూడా ఎంతటి ఉదారబుద్ధీ ఎంతటి త్యాగశీలతా ఉంటాయో కూడా ఉదాత్తంగా నిరూపించారు శాస్త్రిగారు.

వేదంలో ఘనాపాఠి అనిపించుకొన్న ఒక పెద్దమనిషి తన కొడుక్కు బడిపంతులు ఉద్యోగం ఇప్పించమని – జిల్లాబోర్డు ప్రెసిడెంటుకు సిఫార్సు చెయ్యమని – సబ్ కలెక్టరును ఆశ్రయిస్తాడు. ఆ సబ్ కలెక్టరు అయన దగ్గర ఒక పాడి ఆవునూ మణుగునేతినీ లంచం తీసుకొని సిఫార్సు ఉత్తరం ఇస్తాడు. తీరా ప్రెసిడెంటు దర్శనంకోసం వెళ్తే, అక్కడ గుమాస్తా సైంధవుడు అడ్డుతగిలాడు. అయిన కాడికి లంచం తీసుకొని అతను తేల్చింది ఏమిటంటే – ఆ సబ్ కలెక్టరుకూ ప్రెసిడెంటుకూ పడదు. కనక సిఫార్సు ఉత్తరం పనిచెయ్యదనీ, పని జరగాలంటే మెరకవీధిలో ఉండే దుగ్గిరాల శేషాచలం అనే వేశ్యను ప్రెసిడెంటుతో సరసానికి ఒప్పిస్తే చాలనీ! గతిలేని ఘనాపాఠి – ఎంత ఇష్టం లేకపోయినా – శేషాచలాన్ని ఆశ్రయించక తప్పలేదు. విషయం తెలుసుకొన్న శేషాచలం, ఆ ప్రెసిడెంటును తాను ఎరుగుదుననీ, అతను "పశువుకంటె అధముడు," అనీ, అతని గుమాస్తా "వూరకుక్క" అనీ తిట్టిపోసినా, "నా ఆత్మద్రోహమూ, మన ప్రెసిడెంటు పశుత్వమూ కలిస్తే వొక బ్రాహ్మణ కుటుంబానికి భుక్తి ఏర్పరుస్తాయన్నమాట," అని, అందుకు ఒప్పుకొంటుంది. ప్రెసిడెంటు సంగతి పూర్తిగా తెలిసేసరికి ఘనాపాఠి తల తిరిగిపోతుంది. "నేను వచ్చిన దారిని వెళ్ళిపోతాను. నువ్వు ఆత్మద్రోహానికి సిద్ధపడవద్దు.... నీకూ ప్రెసిడెంటుకూ ఇదివరకే సంబంధం వుందనీ, ప్రాధేయపడితే నువ్వు సిఫారసుచేసి పని యిప్పిస్తావనీ వచ్చాను. పైగా, నువ్వింత యోగ్యురాలవని ఎరుగనే ఎరుగను... కనుక తల్లీ, నన్ను క్షమించు. నా కోరిక మరిచిపో, నాకు సెలవియ్యి," అంటాడు. అయినా ఒక బీద కుటుంబానికి సాయపడ్డానికే ఆమె నిశ్చయించుకుంది. మాటల సందర్భంలో, "వేశ్యాకులంలో నువ్వు తప్ప పుట్టావమ్మా," అని ఆ ఘనాపాఠి అన్నప్పుడు "ఏం, వేశ్యాకులం అంత చెడిపోయిందా బాబయ్యా? అగ్రజాతి గృహిణులందరూ మచ్చలేనివారేనా నాయనగారూ? మాలో నన్ను తలతన్నే ఇల్లాళ్ళు–సానులయి వుండీన్నీ పాతివ్రత్యానికి వరవడి పెట్టేవారు వేలున్నారు. కాని లోకం గుడ్డిది, పురుషులు మత్తులు..." అంటూ ఆయన్ని ఆదరించి పంపిస్తుంది. 'తెలుగురక్తం చప్పబడిపోతూ ఉంది' అన్న పేరుతో మొదట 'ప్రబుద్ధాంధ్ర'లో ప్రచురించిన కథలోని చివరి ప్రకరణాన్ని పూర్తిగా మార్చి 'కలుపు మొక్కలు' కథగా తీర్చిదిద్దారు శాస్త్రిగారు.

'గూడు మారిన కొత్తరికం' తొలిమాటు కాపురానికి వెళ్ళిన ఒక ముద్దరాలి చుట్టూ అందంగా అల్లుకొన్న కథ. మహేంద్రవాడ గ్రామ కాపురస్తులయిన సోమసుందరానికీ ఆయన రెండో పెళ్ళి పెళ్ళాం రాజమ్మకూ ఒకత్తే కూతురు – నరసమ్మ. ఆమె మీదే వాళ్ళకు పంచప్రాణాలు. అంచేత కూతుర్ని వదిలి ఉండలేక ఒక ఏడాదిపాటు కాపురానికి పంపలేదు. కాని పంపక తప్పదుకదా! రాజమండ్రిలో అల్లుడి దగ్గిరికి పంపిన ఐదు రోజులకే వెళ్ళి కూతుర్ని చూసి

వచ్చాడు సోమసుందరం. రైతు తెచ్చి ఇచ్చిన పళ్ళూ చెరుకుపానకమూ పాలికాపుచేత కూతురికి పంపాడు. ఆ తిరిగివచ్చినవాడు ఊరుకోక, "మిమ్మల్నీ బాబయ్యాగారినీ చూడాలని వుందిటండి, అమ్మాయిగారికి," అని యాదాలాభంగా అనేసరికి, ఆ రాత్రంతా భార్యాభర్తలకు నిద్రపట్టక, మర్నాడు పొద్దునే రాజమండ్రికి ప్రయాణం కట్టారు. అక్కడ కొన్నాళ్ళుండి తిరుగుప్రయాణం అవుతుంటే, నరసమ్మకు కూడా మహేంద్రవాడ వెళ్ళాలనిపించింది, అయినా తాను పైకి తేలకుండా, గడుసుగా వాళ్ళచేత పిలిపించుకొని, తన మొగుణ్ణి కూడా పిలిచేటట్టు చేయించింది. ఆ ఊళ్ళో చుట్టుపక్కాలతో, ముద్దుముచ్చట్లతో రెండు రోజులు గడిపి మళ్ళీ మొగుడితో రాజమండ్రి ప్రయాణం కట్టింది.

ప్రధాన విషయం ఇదే అయినా, కథ చెప్పే తీరు తెన్నుల్లోనూ సంభాషణల నిర్వహణలోనూ మాటల పొంకంలో తెలుగుతనం గుబాళింపులోనూ శాస్త్రిగారి రచనా వైశిష్ట్యం హృదయానికి హత్తుకొంటుంది.

ఈ సంపుటిలో చివరికథ 'అరికాళ్ళకింద మంటలు.' పుట్టింట్లో వేగిపోతున్న ఒక బాల వితంతువు రుక్మిణి దయనీయగాథ ఇది. ఇంట్లో ఆడవాళ్ళంతా ఆమెకే పనులు పురమాయిస్తుంటారు. ఎవరి పని ముందు చెయ్యకపోతే వాళ్ళకే కోపం. తిట్లూ ఈసడింపులూ తప్పవు – ఎంత గొడ్డు చాకిరీ చేస్తున్నా! చివరికి, రుక్మిణి జుట్టు తీయించెయ్యడానికి ముసలి అమ్మమ్మ ముహూర్తం కూడా పెట్టించేస్తుంది. ఇంట్లో ఇక నిలవలేనంత దుర్భర స్థితి పరాకాష్ఠకు చేరుకొంటుంది. అప్పుడు రుక్మిణి తెగించి, అర్ధరాత్రివేళ ఇల్లివిడిచి వచ్చేస్తుంది. "బండి కావాలా?" అని అడుగుతాడు ఒక గుర్రబ్బండివాడు. "పంతులుగారి తోటకా?" అనీ అంటాడు. ఆ పంతులుగారు వీరేశలింగంగారే. "నా దగ్గిర వొక్క రాగిదమ్మిడీ లేదు," అని రుక్మిణి అన్నప్పుడు, "పంతులుగారి తోటకయితే నాకేమీ యివ్వనక్కర్లేదు తల్లీ," అంటాడు బండివాడు. మానవత్వం మూటగట్టుకొన్న అతని మాటలకు ఎవరికయినా కళ్ళు చెమర్చక మానవు. రుక్కమ్మ జీవితం చక్కగా మలుపు తిరిగింది.

సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తమ కథా వస్తువుల్నీ, పాత్రల్నీ, వారి పలుకుబడినీ జనంలోంచే తీసుకున్నారు. తమ చుట్టుపక్కల పరిసరాల్నీ లోకం తీరుతెన్నుల్నీ సునిశితంగా పరిశీలించారు. హృదయాన్నీ బుద్ధినీ సమన్వయంచేసి రచనల్ని కళాత్మకంగా తీర్చిదిద్దారు.

శాస్త్రిగారి కథా పరిసరాలు పరిమితమయినవే కావచ్చు. కాని అవి సంపూర్ణంగా ఆయనకు పరిచితమయినవి. ఆయన భాష తెలుగుదేశంలో ఒక ప్రాంతంలో, ఒక వర్గంలో వాడుకలో ఉన్నదే కావచ్చు. కాని దాంట్లో ఎంత చైతన్యముందో తమ కథల ద్వారా నిరూపించారు. తమకు బాగా నలిగిన భాషలో రాసినంత మాత్రాన ఇతర ప్రాంతాల, ఇతర వర్గాల పలుకుబళ్ళు ఆయనకు నచ్చలేదని అనుకోడానికి వీలులేదు. ఐదు ప్రాంతాల పలుకుబళ్ళూ తమ తెలుగు బాషకు ఐదు ప్రాణాలని ఒక సందర్భంలో ఆయనే స్వయంగా చెప్పారు.

శాస్త్రిగారిది ముందు చూపే కాని వెనక చూపు కాదు. తరతరాల ఆచారాలవల్లా ఆలోచనలవల్లా బిగుసుకుపోయిన సంకెళ్ళను తెంచుకోవాలన్నదే

ఆయన ప్రబోధం. సమాజంలో అన్ని వర్గాల వాళ్ళూ అన్ని రంగాలవాళ్ళూ సంపూర్ణ శక్తి సామర్థ్యాల్ని వినియోగించుకొని ప్రగతి సాధించాలన్నదే ఆయన ఆశయం. బానిస బ్రతుక్కు దిగజార్చే నౌకరీలకు ఎగబాకడంకంటె స్వతంత్ర జీవనానికి ఉపకరించే వృత్తులు చేపట్టడం మేలని ఆయన ఉద్బోధించారు. వాస్తవ పరిస్థితుల్ని కళ్ళకు కట్టించి కర్తవ్యోన్ముఖులు కమ్మని హెచ్చరించారు. సమాజాభ్యున్నతికోసం సాహిత్యాన్ని మీదుకట్టారు. సాహిత్య సృష్టికోసం జీవితాన్ని అంకితం చేశారు. ఆయన చరితార్థులు.

శాస్త్రిగారు ఇంగ్లీషు చదువుకోకపోవడం తెలుగు సాహిత్యానికి మేలయిందనీ, కండగల తెలుగు పలుకుబడి మనకు అందిందనీ కొందరంటే; ఆయన రాసిన వాటికి చిన్న కథలని ముద్రవేసినా 'చిన్నకథ' లక్షణాన్ని అయని ఏనాడూ పట్టించుకోలేదని కొందరన్నారు. ఏది ఏమయినా, తమ వ్యక్తిత్వానికి తగిన తీరులోనే ఆయన కథలు రచించారు. అందులో అసదృశులనిపించుకొన్నారు. 'కథ ఘనాపాఠి' అయారు. ఇంకేం కావాలి?

సుమారు నలభైఐదేళ్ళకిందటి శాస్త్రిగారి మౌన గంభీరమూర్తిని రాజమండ్రిలో తరచుగా చూస్తూవుండేవాణ్ణి. ఆయన ఇల్లు మా ఇంటికి పక్కవీధిలోనే ఉండేది. ఆయనది నిండయిన కండగల విగ్రహం. నడితరపు ఎత్తు. కొద్దిపాటి గిరిజాల జుట్టు. గుచ్చిగుచ్చి చూసే కళ్ళు. ఆత్మవిశ్వాసంతో నిండిన సింహసదృశమయిన ఠీవి రూపుగట్టి ఉండే మూర్తిమత్వం.

ఆయన సంపన్నులు కారు. నెల నెలకూ నిశ్చితంగా వచ్చే ఆదాయమేదీ ఆయనకు లేదు. ఒక్కొక్కపూట, ఎసట్లో బియ్యం పొయ్యడానికి, ప్రబుద్ధాంధ్ర పత్రిక చందాదారులో మరొకరో పంపే డబ్బుకోసం పోస్టుమాన్ కోసం ఎదురుచూసే పరిస్థితి కూడా ఉండేదని వినికిడి. అయినా ఆయన ముఖంలో దైన్యం ఎన్నడూ లేదు. ఆత్మగౌరవానికీ భంగమూ కలగలేదు. గాఢమయిన ఆలోచనలో మునిగి వీధి గుమ్మంపక్క అరుగుమీద ఆయన పచార్లు చేస్తూ ఉండడం చాలాసార్లు చూశాను. ఆ గుమ్మాని కెదురుగా గదిలో చాపమీద చిన్న డస్కుపెట్టె పెట్టుకొని రాసుకొంటూ ఉండడమూ చూశాను. రాజమండ్రిలో అనేక సాహిత్య సభలూ కవి సన్మానాలూ శ్రీపాదవారి పూనికతో జరిగినవే.

స్థానిక సాహితీ మిత్రులు ఉల్లితోట వీధిలో మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి ఇంట్లో తరచుగా కలుసుకొంటూ ఉండేవారు. మధునాపంతుల వారి ఇంట్లో, "ఇది భమిడిపాటి కామేశ్వరరావుగారి కుర్చీ; ఇది శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కుర్చీ...." అంటూ చూపించడం నే నెరుగుదును.

గాఢమయిన ప్రతిభకూ దృఢమయిన దీక్షకూ నిర్దుష్టమయిన కార్యదక్షతకూ నిష్కపటమయిన మాటకూ చెక్కుచెదరని పట్టుదలకూ మొక్కవోని ఆత్మవిశ్వాసానికీ పెట్టింది పేరు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఆయన రచనలు తమకొక్కరికే దక్కడం తెలుగువాళ్ళ అదృష్టం.

- పోరంకి దక్షిణామూర్తి

మన భాషలో ఇప్పుడు చిన్నకథలు రాస్తున్నవారిలో చాలామందికి నిశ్చితమైన వొక లక్ష్యమూ, ప్రాప్యమూ వున్నట్టు కనపడ్డంలేదు. తమదొక ప్రత్యేక జాతీయత అన్న ఎరుకా, దానికి దోహదం చెయ్యవలసిన బాధ్యత తమకు చాలా ఎక్కువగా వుందన్న విధాయకతా కూడా తెలిసివున్నట్టులేదు.

రాశిలో మానవజాతి అంతా వొకటే అయినా రకంలో - జాతీయతలో భిన్నం భిన్నం అయిపోయింది. సాహిత్యం ఆ జాతీయతకు ప్రతిబింబం. సాహిత్యం ఆ జాతీయతకు అదర్శమున్నూ కనుక, సాహిత్యం సందర్భంలో జాతీయత పాటించుకోవడం రచయిత అయినవాడికి చాలా అగత్యం.

ఇతరుల సాహిత్యాలుతెచ్చి మనభాషలో ప్రతిష్టించుకోడం తప్పుకాదు. తప్పు కాకపోవడమేకాదు, తప్పనిసరిన్నీ. అయితే యితరుల దృక్పథాలు మన దృక్పథాలను అణచివెయ్యడానికి వీలునివ్వగూడదు. ఇతరుల జాతీయతలు మన జాతీయతమీద దెబ్బకొట్టడాని కవకాశం యివ్వగూడదు. రచయితలు - మన సాహిత్య నిర్మాతలు జాగ్రత్తపడవలసిన ఘట్టాలివి.

చిన్నకథ అంటే, మూర్తిమంతాన్నిపట్టికాదు పరిగణన, ఆత్మనుబట్టి. కొండంత వుంటుంది ఏనుగు. మరి సింహం? చిన్నకథ కుండుకున్న యీ వైశిష్ట్యం గుర్తించుకోకపోతే, మంచి చిన్నకథ రాయడం సాధ్యమా?

మనిషి వ్యక్తిత్వం అంతా పూర్తిగా విశదం చేస్తుంది నవల. మనిషి వ్యక్తిత్వం అంతా ఉజ్వలంగా కళ్ళయెదుట పెడుతుంది నాటకం. మనిషి దీర్ఘజీవితంలో, రసవత్తరమైన ఒక ఘట్టం - జటిలమైన వొక అనుభూతి హృదయాల మీద అచ్చుగుద్దుతుంది చిన్న కథ. చిన్నకథ స్వస్వరూపం యిది. కనక, చిన్నకథ అంటే సామాన్యం కాదు. చిన్నకథ రాయడం అంటే పైపైని లేదు. స్థూలదృష్టికి అది చాలా సులభంగా కనపడుతుంది. కాని మిక్కిలి కష్టం. అపరిణతునకు అది చాలా కష్టంగా కనపడుతుంది. కాని చాలా సులభం.

కథకుడు - చిన్న కథ రాయడానికి తన వాఙ్మయంలో యెన్నో గ్రంథాలు చదివి గొప్ప కవుల పోకడలూ, పలుకుబళ్ళూ బాగా అవగాహన చేసుకుండి వుండాలి భాషలో. నిరంతరమూ రచన సాగిస్తూవుండాలి. లోకవృత్తం సూక్ష్మాతి సూక్ష్మంగా పరకాయించుకుంటూ వుండాలి. తన రచనలో జీవనాడి ప్రచలితం కావడానికి ఇన్నిటికీ పునాదిగా, తన జాతీయత పూర్తిగా అవగాహన చేసుకొని వుండాలి. అంటే? చిన్నకథ కల్పించడాని కెంతో ప్రతిభ వుండాలి. దాని విలువ గుర్తించడాని కెంతో పరిజ్ఞానం ఉండాలి. అది చెప్పడానికెంతో వాక్శుద్ధి వుండాలి. అది .వినిపించడానికెంతో నేర్పుండాలి. అది బోధపరచడానికెంతో సంస్కారం వుండాలి. అది రచించడానికి భాషమీద ఎంతో 'మాష్టరీ' వుండాలి.

చామర్తి కనకయ్యగారి పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథానికి "శ్రీపాదవారి ముందు మాటలు."

ఇలాంటి సాధన సామాగ్రి వుంటేనే సముజ్జ్వలమైన వొక చిన్నకథ పుట్టుకువస్తుంది. అప్పుడు, ఆ చిన్నకథ కళ్ళకి వెలుగుతోపిస్తుంది. ఆ చిన్నకథ బుద్ధికి పదును పెడుతుంది. ఆ చిన్నకథ మనస్సుకి ఉల్లాసం కలిగిస్తుంది. ఆ చిన్నకథ కల్పనాశక్తిని ఉజ్జీవింపచేస్తుంది. ఆ చిన్నకథ, ఆత్మకు మాయావరణం తొలిగించి స్వస్వరూప పరిజ్ఞానం కలిగిస్తుంది. ఇందుకు ఫలితంగా ఆ చిన్నకథ, ఎలాంటి విషమ ఘట్టంలోనూకూడా, వొక్కొక్కణ్ణి చులాగ్గా వొడ్డెక్కించేస్తుంది.

గ్రంథాలు చదివే నేను భాష తెలుసుకొన్నాను. స్త్రీల నాశ్రయించిన్నీ నేర్చుకున్నాన్నేను. తెలుగుభాష, ప్రయోగవిజ్ఞానం కూడా స్త్రీలవల్లనే అలవడింది నాకు. పురుషులభాషలో కంటే స్త్రీలభాషలో మాధుర్యమూ, హృదయాలను పట్టివేసే జాతీయతా కనపడింది నాకు. వారి మాటల పొందికా, వారి హావభావ ప్రదర్శన చాతుర్యమూ తెనుగుభాషలో నాకు మాతృభిక్ష ప్రసాదించాయి. ఇవాళ నేను రాస్తున్న భాష వా రనుగ్రహించినదాల్లో సహస్రాంశమయినా కాదు, యింతాచేస్తే.

వైదిక విద్యలన్నీ విడిచిపెట్టి కొత్తదారి తొక్కాను. మేరలేని ఆత్మానందమూ అనుభవించ గలుగుతున్నాను. ఎంచేతా? అంటే తెలుగుభాషలో ఒక రచయితను కాగలిగినందుకు, తెలుగుభాషలో – మధురాతి మధురమైన తెనుగుభాషలో నా జాతివాళ్ళు చిన్నచూపే చూస్తువుండినా, మాధుర్యం గుర్తించి శక్తిన్ని అవగాహన చేసుకుని పాశ్చాత్యులు కూడా ముక్తకంఠంతో కీర్తించిన నా మాతృభాషలో కలంపట్టి నాలుగు బంతులు రాసే అదృష్టం పట్టినందుకున్నూ... జనులకు స్వవిషయం విడమర్చి చెప్పడం – ఆత్మగౌరవం అలవర్చడం – సహనం కలిగించడం – సరికొత్తభావాలు మప్పడం – కొత్త ఆశలు రేకెత్తించడం – గతంలో వుండుకున్న సత్యం ఆవిష్కరించడం – భవిష్యత్తుకి కొత్తదారులు కల్పించడం – తన్మూలంగా దేశీయులందరికీ స్వయం నిర్ణయశక్తి కలిగించడం – ఇదీ నా పూనిక. అది నిర్విఘ్నంగానూ, నిరాఘాటంగానూ, నిరాటంకంగానూ సాగడం నా లక్ష్యం. జాతికి, ప్రాతిపదికలకు భంగంలేని గమ్యం కనబరచడం నా ప్రాప్యం.

– శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# క్రమంబెట్టిదనిన...

# అన్నంత పనీ జరిగింది

ఇంజను స్టార్టయివున్న మోటారెక్కడం కోసం చంద్రమౌళి పంతులు ద్వారమండపంలోకి వచ్చాటప్పటికి, వంగి నమస్కారం చేస్తూ వొక యువకుడు పక్కకి వచ్చి నుంచున్నాడు.

మోటారు తలుపు పట్టుకు నుంచుని వున్న నాలుగో గుమాస్తా "ఇదాసమయ" మన్నట్టు తీక్ష్ణంగా చూశాడు.

"వోరి శకునపక్షీ" అన్నట్టు నిరసనగా చూసి, డ్రయివరు, లోపల్లోపల గింజుకున్నాడు.

మొదట నమస్కారం అందుకున్నట్టు తల వూపి, తరవాత సులోచననాలలోనుంచి కిందికీ మీదికీ చురుగ్గా చూసి "కట్టినవి నీరుకావి బట్టలూ, దిద్దింది క్రాపింగు జుట్టూనూ. ఎవరయ్యా నువ్వూ?" అని దర్జాగా అడిగాడు పంతులు.

"అన్నార్తుల్లో వొకణ్ణండి" అన్నాడు చేతులు కట్టుకుని ఆగంతుకుడు.

"ఇదివరకే రోజుకి ముగ్గురు చొప్పున వున్నారు వారాల విద్యార్థులు. ఒక్క శనివారం మాత్రమే యిద్దరే వున్నారు. నువ్వు మూడోవాడవు. తప్పకుండా రావచ్చు."

ఆగంతుకుడితో యిలా చెప్పి పంతులు తనకేసి చూడగా "మరి రావయ్యా" అంటూ గుమాస్తా లోపలికి బయలుదేరాడు.

"నేనీపూట భోజనం చేసే వచ్చానండి, నా మనవి –"

"ఇంకేమిటీ మరీ? కోర్టుకి తొరగా వెళ్ళిపోవాలే?"

ఇలా అంటూ పంతులు రిస్టువాచీ చూసుకున్నాడు. పదకొండింటికీ యిక అయిదు నిమిషాలే తరవాయి.

ఇది వినీ, చూసీ వెనక్కి మళ్ళీ "సావకాశంగా మనవి చేసుకోవచ్చు, సాయంత్రం నాలుగున్నరకి రావయ్యా" అని గుమస్తా సద్ది చెప్పాడు; గాని ఆగంతుకు డది వినిపించుకోక "నా సంగతి నిమిషాల్లో –" అంటూ మాట నాన్చేశాడు.

"గంట కరవై నిమిషాలు"

"అయిదు చాలండి నా విన్నపానికీ, తమ సెలవుకూనూ"

"మోటా రెక్కబోతూ వుండగా –"

"నాలుగు –"

"అదీ యెక్కువే"

"మూడు –"

"మరి కానియ్యి" అని చెప్పి పంతులు మళ్ళీ వాచీ చూశాడు.

అపవారించి గుమస్తా వురిమి చూడగా, స్వగతంగా విసుక్కుని డ్రయివరు యింజ నాపు చేశాడు.

"ఇప్పుడు నే నున్న స్థితిలో తమర్ని కోరేది సాయంలోనే చేరుతుందండి" అని ప్రారంభించాడు ఆగంతుకుడు.

"ఉపోద్ఘాతం వద్దు."

"చిత్తం, చిత్తం, నేను విద్యార్థిని కానండి."

"అలానా?"

"కనక వారం కోసం రాలేదండి."

"డబ్బు కావాలంటావా?"

"సరిగా అంతే నండి. అయితే దానికి 'జీతం' అని పేరు పెట్టించవలసిందని ప్రార్థన."

ఈ విలక్షణధోరణి పంతుల్ని ఆకర్షించింది.

"కవిత్వం కడుతున్నావే? చమత్కార మయినవాడివిలాగే వున్నావు. అయితే, యేంపని చేస్తావు నా దగ్గిర?"

"తమ కేమి అవసరమయితే అదీ, తమ రేమి సెలవిప్పిస్తే అదీ చేస్తానండి."

పంతులు వొక్క క్షణం నిదానంగా చూసి "గుమాస్తా గిరీ?" అన్నాడు.

"చెయ్యగలనండి"

"అట్టెండరీ"

"అభ్యంతరం లేదండి"

"మోటారు డ్రయివింగు?"

ఈ మాట విని డ్రయివరు వులిక్కిపడ్డాడు. అది కనిపెట్టి, అతనికేసే చూస్తూ ఆగంతుకుడు "చేత నవునండి"అన్నాడు.

"మహోవసంమీద పెత్తనం"

"ఆక్షేపణ లేదండి"

పంతులు వొక్క క్షణం ఆగి, చురుగ్గా చూస్తూ, "ఎప్పుడైనా – పొరుగూరు వెళ్ళినప్పుడు ఆథ్వర్యం?" అనడిగాడు.

"సందేహించనక్కరలేదండి" అని తడుముకోకుండా బదులు చెప్పాడు ఆగంతుకుడు.

పంతులు చకితు డయినాడు. ఒకమాటు యెగాదిగా చూశాడు. చివరికి "అయితే నీకు చేతగాని పనేమిటయ్యా?" అన్నాడు.

"ఏదో వొక ప్రయోజనం తీర్చకుండా డబ్బడగడమండి."

"సెబాస్, చాలా దిట్టమైనవాడవే. చూడదగ్గవాడవు కూడాను. కనక వుండిపో, తరవాత మాట్లాడుకుందాం."

ఇలా అని పంతులు రెండడుగులు ముందుకి వేసాడు. డ్రయివరు ఇంజను స్టార్టు చేశాడు.

ఆగంతుకుడు పొంగిపోయాడు. అతని కళ్ళల్లో ఆనంద బాష్పాలు గిర్రు మనేశాయి. ఆ కళ్ళతోనే కృతజ్ఞత విన్నవించుకుంటూ, మొదట మాటరాక దోసిలి వొగ్గి నమ్రుడు మాత్రం అయి, తరవాత ప్రయత్నించి "ఇన్నాళ్ళకి నాకు అవలంబం దొరికింది" అన్నాడు.

తలుపుమీద చెయ్యివేసి "యేమిటీ?" అన్నట్టు చూశాడు పంతులు. తలుపు విడిచిపెట్టి గుమాస్తా పంతులు వెనక్కివచ్చి నుంచున్నాడు.

"ఎన్ని విధాలో ప్రయత్నించాను. ఎందర్నో ఆశ్రయించాను; కాని యీ మాత్రం మాట అనగలిగినవారు కనపడలేదండి"

"దానికేం లే? కాక, దీల్లో యేమంత విశేషం వుంది కానీ - మరి నేను వెళ్ళిపోవచ్చునా?"

"చిత్తం చిత్తం. ఒక్క అరగంటలో కోర్టుదగ్గిర కలుసుకుంటా నండి"

"ఇవాళ అక్కర్లేదు."

"అయితే నాకు శెలవు -"

"ఎక్కడికి వెళ్ళాలీ?"

"నాళంవారి సత్రంలో బస చేశానండి. అక్కడికి -"

"నీ కక్కడ తొందర పని యేదైనా వుందా?"

"ఏమీ లేదండి; కాని మూడు నిమిషాలూ ముగిసి -"

"అయితే లే. నువ్వేం చదివావూ?"

"సంస్కృతంలో మేఘసందేశం పూర్తిచేశానండి. ఇంగ్లీషులో లోవరు సెకండరీ సర్టిఫికెట్టు సంపాదించానండి."

ఇది విని డ్రయివరు కళ్ళు తేలవేశాడు. గుమాస్తా మొగం పక్కకు తిప్పుకుని పెదవి విరిచాడు.

వారిద్దరూ స్కూలుఫైనలు పట్టభద్రులు.

"అందులోనూ యిందులోనూ కూడా త్రయమే అన్నమాట" అన్నాడు పంతులు.

"టైపు కూడా కొంచెం అలవాటుందండి. సర్టిఫికెట్టు మాత్రం లేదండి."

"ఏం, పరీక్ష పోయిందా?"

"పరీక్షకి వెళ్ళలేదండి."

"డబ్బు లేకపోయింది?"

"అవునండి."

"మరి వెళ్ళిరా"

ఇలా అంటూ పంతులు పడిచెక్క మీద కాలుపెట్టాడు.

ఆగంతుకుడు పక్కకి తప్పుకున్నాడు; కాని "నీ పేరెవరూ?" అంటూ ఆగిపోయి పంతులు మళ్ళీ అడగ్గా యెదటికి వచ్చి "రామచంద్రశాస్త్రి" అని చెప్పాడు.

"ఇంటిపేరు?"

"వేమూరివారండి"

"వూరు?"

"రామచంద్రపురం తాలూకా మహేంద్రవాడ"

"సరే"

"తమరు కోర్టునుంచి వచ్చాటప్పటికి మళ్ళీ దర్శనం చేసుకుంటానండి." ఇలా అని రామచంద్రం పక్కకి తప్పుకున్నాడు.

"మా – మన హెంబెద్దుబండి తీసుకువెళ్ళి సామాను పట్టించుకు వచ్చి అదిగో, ఆ గదిలో ప్రవేశించు."

అంగుళినిర్దేశంతో గది చూపిస్తూ పంతులు గుమాస్తా కేసి చూశాడు. గుమాస్తా, స్తంభం చాటునవున్న పోతునాయుణ్ణి సంబోధించి "ఆ గది వారికి స్వాధీనం చెయ్యి. ముందు బాగా తుడిపించు – దులిపించు" అని చెప్పాడు.

"సామానల్లా చిన్న రైలు సంచీ మాత్రమే. బండి అక్కర్లేదండి"

"సరే"

ఇలా అని పంతులు మోటారులో ప్రవేశించబోయి, అంతలో మళ్ళీ యథాప్రకారంగా నుంచుని "చూడూ, నీకు పెళ్ళయిందా?"అని అడిగాడు.

"లేదండి"

"వెనక ఆసరా –"

"ఏకాకినండి. మా అమ్మగారు మా అన్నగారి దగ్గిర వున్నారండి."

"మీరెంద రన్నదమ్ములు?"

"ఇద్దరమేనండి. మా అన్నాగారు కాకినాడలో వకీలు గుమాస్తాగా వున్నారండి."

"అయితే, భోజనాని కిక్కడే వుంటా వన్నమాట నువ్వు"

"చిత్తం చిత్తం, తమ సెలవు –"

"ఉందు, పూటకూటింటి భోజనం యేమి సుఖమూ?"

రామచంద్రం మాట్లాడలేక నమ్రుడు మాత్రం అయినాడు.

పంతులు మోటా రెక్కాడు, తలుపు వేసేసి గుమాస్తా డ్రయివరు పక్కని కూచున్నాడు. డ్రయివరు వెనక్కి చూసి యజమాని యింగితం కనిపెట్టి కారు పోనిచ్చాడు.

గది తాళంతీస్తూ పోతునాయుడు "ఏం పనిమీద వచ్చారు బాబూ" అని అడగ్గా "భోజనాని"కని చెప్పి, తాళంచెవి పుచ్చుకుని, ఆనందతరంగాలమీద వూగిపోతూ సత్రానికి వెళ్ళిపోయాడు రామచంద్రం.

పంతులూ రామచంద్రమూ మళ్ళీ రాత్రి భోజనాల దగ్గిర కలుసుకున్నారు.

రామచంద్రం యెదటి బంతిలోనే వున్నాడు; కాని చివర పడిపోయాడు. ఆ సన్నివేశం పంతులుకి యెలాగో అనిపించింది; కాని యేమనడానికీ మాత్రం సాహసం కలగలేదు.

ఆపూట వారాల విద్యార్థులు కాక మరో అయిదారుగురు అభ్యాగతులున్నారు. అమలాపురం సబిన స్పెక్టరూ రైటరూ వున్నారు. చిన్నగుమాస్తా లిద్దరూ కూడా ఆపూట అక్కడే వున్నారు.

బంతి బాగా పూటుగా వుంది. వాయువేగ మనోవేగాలతో వంటలక్క వడ్డన పూర్తి చెయ్యగా, వేతిగిన్ని పట్టుకుని జానకమ్మ వంటింటి గుమ్మంలో నుంచుని వుంది.

అలవాటు చొప్పున పంతులు తన బంతీ యెదటి బంతీ పారజూశాడు. మెరుపు దీపాలు మూడూ ఝామ్మని వెలుగుతున్నాయి కనక హాలంతా నల్లపూస కూడా కనపడేటంత ప్రకాశమానంగా వుంది.

ఆ వెలుగులో పంతులుకి, రామచంద్రం మొగంమీద సమధికమైన విలక్షణ తేజస్సు కనపడి సాదరబుద్ధి కలిగించింది.

"వచ్చావా?" అని అడిగా డతను.

"చిత్తం. నేను చిన్న గుమాస్తాగారితో మాట్లాడుతూ వుండడంవల్ల తమరు కోర్టు నుంచి రావడమూ, షికారు వెళ్ళడమూ గమనించలేక పోయానండి"

"కోర్టులో వొక గంట వూరికే కూచోవలసి వచ్చింది. నిన్నక్కడికి తీసుకువెళ్ళనందుకు చాలా విచారించాను."

"తమరలా సెలవిప్పిస్తే –"

"తప్పేమీ? అది అక్షరాలా నిజం. నిజం వొప్పుకోడం తప్పా?"

"వాస్తవం అన్నదీ – చిత్తగించారూ?" అంటూ అందుకున్నా డొక అభ్యాగతుడు. "సత్యం హృదయాని కుత్తేజనం కలిగిస్తుంది. అసత్యం దాన్ని కుంగదీసేస్తుందండి."

"మీ ప్రసక్తి లేదిప్పుడు. చూస్తూ వింటూ వూరుకోం"డని ఆక్షేపించాడు పంతులు.

"చిత్తం చిత్తం, తమ శెలవు. అయితే సందర్భం వచ్చింది కనక –"

"లేదు కనక వూరుకోమంటున్నాను" అని కొంచెం చిరాగ్గా అన్నాడు పంతులు. దాంతో అభ్యాగతుడు నిర్విణ్ణుడూ, నిరుత్తరుడూ అయి, వూరుకున్నాడు.

తక్కినవారిలో యిద్దరూ "పిలవని పేరంటానికెందుకయ్యా?" అన్నట్టు అభ్యాగతుడికేసి చురుగ్గా చూశారు. ఒకడు "ఈ మాత్రానికే అంత నిర్మొగ మాటంగా మందలించాలా?" అన్నట్టు పంతులు కేసి, పక్కవాటుగా విషపు చూపులు చూశాడు.

"రామచంద్రం!"

"ఏమి సెలవు?"

"నువ్వని వచ్చేస్తోందిమాట. ఎవర్నీ కూడా 'మీ'రనడమే మంచిది కానీ –"

"భృత్యుణ్ణి నువ్వనడమే మంచిదండి"

"ఈమాత్రం భాగ్యానికి భృత్యుడంటే యేమిటికాని – అయితే నువ్వక్కడ కాదు నా యెదటికి రా"

ఈ మాట విని మూడో గుమాస్తా, నాలుగో గుమాస్తా కేసి చూసి, అతను లేచివెళ్ళి రామచంద్రం లేచినచోట కూచోగా తా నతని పీటమీద కూచున్నాడు. గుమాస్తాల యీ తర తమ భేదభావాలకు వింతపడుతూ రామచంద్రం పంతులుకి అభిముఖంగా కూచున్నాడు.

"ఇతన్నెరుగుదువా జానీ?"

"ఎరగను"

"ఇంట్లో మనిషిని చూసేటట్టు చూస్తూ వుండు"

"అలాగే"

ఈ మాటలువిని చకితురాలై, వంటింట్లో చారూ అన్నమూ తింటూవున్న సుభద్ర రామచంద్రాన్ని తొంగిచూసింది.

తరవాత పంతులు, వుద్ధరిణతో చేతిలో నీళ్ళు పోసుకుని "ఇక కానిద్దామా? ఏమండీ శాస్త్రులుగారూ, పరిషేచన చేద్దామా?" అంటూ ఆ నీళ్ళు విస్తరిమీద చల్లాడు.

"ఇవాళ నాన్నారూ నువ్వూ ముందు కూచుంటారుటా, నేను డింగీ నడుపుతానుట, ఏమే పిన్నీ?"

ఇలా అని గునిసి, లేడిపిల్లలాగ యెగురుతూ దుముకుతూ వెళ్ళి డింగీ యెక్కి, సుభద్ర, వెనకవైపున కూచుని తెడ్డు అందుకుంది.

"అయితే నేను రానుబాబూ" అంటూ మూతి బిడాయించుకుని, జానకమ్మ, చివరి పావంచామీద నిలిచిపోయింది.

"అదేమిటే?"

"ఏమో బాబూ నేను రాను."

"ఏం?" అని బతిమాలుతూ వున్నట్టడిగింది సుభద్ర.

"ఇవాళ చెరువు నిండుకుండలా వుంది. కెరటాలు కూడా వస్తున్నాయి."

"అయితే?"

"అయితే యేమిటి, అయితే? డింగీ వొరిగిపోతే?"

"నేను లక్షమాట్లు నడిపానే – నాకు బాగా చేతవునే మాతల్లీ!"

"అయినా సరే"

ఇలా అంటూ జానకమ్మ పక్కకి తిరిగింది.

"రావూ? రావూ?..... చూశావా? ఇవాళ నాకు సరదాగా వుందే!"

భయం పూర్తిగా పోలేదు గాని; జానకమ్మకి జాలియెక్కువయింది. వెంటనే ఆమె మళ్ళీ సుభద్ర కేసి తిరిగి "అయితే, చెరువు చుట్టూరా వొడ్డునే నడుపుతావా మరీ?" అంటూ లాలనగా అడిగింది.

సుభద్రకి వొప్పుకోక తప్పింది కాదు.

వెంటనే జానకమ్మ డింగీ యెక్కి ముందువైపున కూచుని, చేతిలోవున్న పొట్లం చెక్కమీద వుంచింది. అది చూడగా జ్ఞాపకం వచ్చి "మరి – మరి యివాళ పావురాలను పస్తు పెడతావా యేమిటమ్మా?" అంటూ ముదలకించింది సుభద్ర.

జానకమ్మ తెల్లపోయింది. ఆమె మాట్టాడలేక పొట్లంకేసి చూడసాగింది. ఇదే సందని సుభద్ర, వెంటనే ఆమె దగ్గిరికి వెళ్ళి భుజాలమీద అని మొగంమీద మొగంపెట్టి "నీకేమీ భయంలేదే! నువ్వెంత నింపాదిగా నడపమంటే అంత నింపాదిగా నడుపుతానే. కాకపోయినా, నాన్నారు దగ్గరే వుంటారు కాదుటే?" అని చాలా దూరం నచ్చచెప్పింది.

విధిలేక వొప్పుకున్నట్టు "సరే మరీ" అంటూ కొంచెం చురుగ్గా అంది జానకమ్మ.

తన కోరిక నెరవేరడమే ప్రధానం అనుకుని సుభద్ర పొంగిపోతూ వెళ్ళి తన స్థానంలో కూచుంది.

"ఇంకా రారేం?" అన్నట్టు జానకమ్మ వొడ్డుకేసి చూసింది.

పంతులూ వొకదొరసానీ మెల్లిగా వస్తూ పక్కనివున్న సిమెంటు బల్లకేసి మళ్ళారు. రామచంద్రం పదిగజాలలో నుంచుని వున్నాడు.

"ఎవరో దొరసానేవ్" అంది జానకమ్మ.

సుభద్ర వెనక్కి విరగబడి చూసి "మరేనేవ్! ఎందుకు వచ్చిందో?" అంటూ తెడ్డు డింగీమీద వుంచేసి జానకమ్మ కేసి చూసింది.

మాట్టాడుతూ మాట్టాడుతూ వున్నవాడు "వస్తావుండండి" అని దొరసానికి చెప్పి, పావంచాలు దిగి వచ్చి "ఇవాళ నువ్వు నడుపుతావా యేమిటమ్మా?" అని అడిగాడు పంతులు.

"అవునండి" అంటూ గారాం కుడిచింది సుభద్ర.

"ఇవాళకి వద్దమ్మా! ఇకముందు నేనున్నప్పుడు ప్రతీరోజునా నువ్వే నడుపుతూ వుండువుగాని. ఏదో మాట్టాడ్డానికి మిషను దొరసాని వచ్చింది, యివాళకి నేనురాను. ఇవాళమట్టుకి రామచంద్రం నడుపుతాడు నువ్వు పిన్ని దగ్గిర కూచో తల్లీ!"

"మేమూ మానేస్తే యేం?" అన్నట్టు చూసింది జానకి; కాని "వెళ్ళిరండి "అన్నాడు పంతులు.

మాట్టాడకుండా వెళ్ళి సుభద్ర జానకమ్మకి చేరబడి కూచుంది. రామచంద్రాన్ని పిలిచి, సంగతంతా చెప్పి పంతులు దొరసాని దగ్గిరికి వెళ్ళిపోయాడు.

"నాన్నారు లేరు కనక యివాళ తొరగా వచ్చేద్దామే" అంది సుభద్ర.

"వినపడిందిటోయ్?" అని అడిగింది జానకమ్మ.

"చిత్తం"

"తిన్నగా పావురాల గూటి దగ్గిరికి పోనియ్యి డింగీ"

"చిత్తం"

డింగీ వొయ్యారి నడకలతో బయలుదేరింది.

చేతికందిన పెద్ద యెర్ర కలవపువ్వు లందుకుంటూ, జానకమ్మతో కేరింతాలాడుతూ, సుభద్ర, మధ్యమధ్య తెడ్డువేసినట్టు తన చేతితోనే నీళ్ళు వెనక్కి గెంటసాగింది.

డింగీకి వడి యెక్కువయింది. అంత దూరాన్నుంచేచూసి "పెద్దది" అని నిశ్చయించుకుని సుభద్ర చెయ్యిచాపేటప్పటికి కొన్ని పువ్వులు వెనకబడిపోసాగాయి.

జానకమ్మ కూడా మధ్యమధ్య వొక్కొక్క పువ్వు అందుకుంటూ "అదిగో, అదిగో, వచ్చేసింది అందుకో – అందుకో – హ–య్యో, వెళ్ళే పోయింది" అంటూ మళ్ళీ, ముందుకి చూడసాగింది.

డింగీ సగం దూరం వెళ్ళింది. ఎడమ చేతి మీదుగా దూరాన తెల్ల తామరపువ్వొకటి పేద్దది కనబడగా "ఇవాళ అది కూడా పట్టుకు వెడదామే" అంటూ గునిసింది సుభద్ర.

"ఆలస్యం అయిపోదూ?"

"అయితే అయింది."

"తొరగా వెళ్ళిపోదామన్నావు కాదుటే యిందాకనూ?"

"ఆలస్యం అయినాసరే అంటున్నాను కాదుటే యిప్పుడూ?"

"వినపడింది టోయ్?"

"వినపడిం దండి"

దగ్గిరికి వెళ్ళాటప్పటికి అనుకున్నంతకంటేనూ పెద్దదిగా వుండడం చూసి "యించక్క – యించక్క" అని మురిసిపోతూ తీసి, తిప్పితిప్పి చూస్తూ పొంగిపోయి "దీనికి చుట్టూ నల్లకలవలూ, వాటికి చుట్టూ యెర్రకలవలూ వుంటే బేసిను ఎంతో బాగుంటుంది. కదుటేపిన్నీ?" అని అడిగింది సుభద్ర.

"అవి కావాలంటే ఆ చివరికి వెళ్ళాలి, తెలుసా?"

"కావాలే! తీసుకువెడదామే.... ఏమే పిన్నీ?"

జానకమ్మ రామచంద్రం కేసిచూసింది. రామచంద్రం నల్లకలువలున్న దిక్కుకి చూశాడు.

డింగీ బరిమీద తాచు లాగ పరిగెత్తింది.

తల్లీ కూతురూ పది పన్నెండు నల్లకలువలు తీశారు. చిన్న పరిమాణంలో ముద్దొస్తూ వుండగా, సుభద్ర అయిదారు తెల్ల కలువలు కూడా తీసి "పావురాలు గుటకలు మింగుతూ వుంటాయే పాపం" అంటూ వెనక్కి విరగబడి గూటికేసి సకరుణంగా చూసింది.

డింగీ మళ్ళింది.

అలికిడి విని గూళ్ళల్లో వున్న పావురాలన్నీ బయటికి వచ్చాయి. వెంటనే మహోల్లాసంతో సుభద్రా, జానకమ్మ "ఆ, ఆ,"అంటూ చేతులు చాపారు.

ఉన్న యేడెనిమిది పావురాలూ కిలకిల్లాడుతూ వచ్చి వారి చేతులమీదా బుజాలమీదా వాలాయి. ఒక నీలాపు పావురం సుభద్ర చెవిదగ్గర ముట్టె పెట్టి కువకువలాడగా, తెల్లని పావురం వొకటి యీ బుజంమీద ఆ బుజం మీదా వాలి ఆమె బుగ్గలు పొడిచింది.

ఒక్కొక్కటే చేతిలోకి తీసుకుని వారు ముద్దులాడి విడిచిపెట్టారు. వెంటనే అవి స్తంభంమీదికి వెళ్ళిపోయాయి.

ఉత్తరక్షణంలో డింగీ స్తంభం దగ్గిరికి చేరుకుంది. సుభద్రలేచి పెద్ద గూట్లోవున్న పింగాణీ పళ్లెం తీసి దులిపి పట్టుకుంది. జానకమ్మ లేచి పొట్లం విప్పి అర్ధశేరు సెనగపప్పూ పోసి పళ్ళెం గూట్లో వుంచేసింది.

తరవాత తల్లీ కూతుళ్ళిద్దరూ వొక్కొక్క పావురాన్నే తట్టి "లాం–జముండల్లారా, కమ్మగా తినండి" అని సెలవిచ్చి డింగీలో కూచున్నారు.

తిరిగి వచ్చాటప్పుడు కూడా సుభద్ర మరికొన్ని పువ్వులు తీసింది.

మందహాసం చేస్తూ పంతులుతో కూడా చివరి పావంచామీదికి యెదురు వెళ్ళి జానకమ్మతోటీ, సుభద్రతోటీ "గుడీవినింగ్, గుడీవినింగ్" అంటూ కరస్పర్శచేసింది దొరసాని.

అన్నంత పనీ జరిగింది

"మార్గరెట్టు దొరసానిగారి నర్సింగు హోముకి రేపు వార్షికోత్సవట తల్లీ" అన్నాడు పంతులు.

"అలాగా? చాలా సంతోషం" అని సుభద్ర అనగా, "మీరు మా పిల్లల్ని రక్షిస్తున్నారు. చాలా సంతోషం మార్గరెట్టుగారూ!" అంది జానకి.

దొరసాని మళ్ళీ మందహాసం చేస్తూ తల వూపింది.

"నువ్వు బహుమతులు పంచి పెట్టాలిట. పిన్ని అధ్యక్షత వహించాలిట" అని పంతులు చెప్పగా, "అయ్యో" అంటూ జానకీ సుభద్రా మొదట ఒకర్ని ఒకరు చూసుకుని, తరవాత పంతులు కేసీ దొరసాని కేసీ చూశారు.

"మా కది చాలా గౌరవం" అంటూ దొరసాని కళ్ళు తిప్పుకుంది. దొరసానికి తెలవకుండా పంతులు కళ్ళు మెరిశాయి.

దానిమీద "బహుమతులు మా అమ్మే పంచిపెడుతుంది కాని, అధ్యక్షులు పంతులుగారే" అంది జానకమ్మ.

"లేదు లేదు. తమరే అధ్యక్షత వహించాలి. అనుగ్రహించండి" అని దొరసాని యింగ్లీషు యాసగా చెబుతూ రెండు చేతులూ పట్టుకోగా, జానకమ్మ పంతులు యింగితం కనిపెట్టి చివరికి ఒప్పుకుంది.

ఈ లోపున తెల్ల తామరపువ్వూ, రెండు నల్లకలవలూ, మూడు యెర్రకలవలూ తెచ్చి సుభద్ర సగౌరవంగా యివ్వగా, ప్రీతిపూర్వకంగా పుచ్చుకుని దొరసాని వందనాలు సమర్పించింది.

అందరూ ఒడ్డుకి బయలుదేరారు.

"ఇప్పుడు చికిత్స పొందుతూవున్న పిల్లలెందరూ?" అని అడిగాడు పంతులు.

"ఇరవై మంది" అంది దొరసాని.

"నర్సులు?"

"ఎనమండుగురు."

"సరే, రేపు బజారుకి వెళ్ళి, ఆపిలుపళ్ళూ, ద్రాక్షపళ్ళూ, బిస్కత్తు డబ్బాలూ, యెనిమిది వుప్పాడ చీరలూ, పెద్దాపురం సిల్కు జాకెట్టు తానొకటీ, సిల్కు చీర ఒకటీ తేవాలి. మరిచిపోకేం రామచంద్రం?" అంటూ పంతులు వెనక్కి తిరిగి చూశాడు; కాని రామచంద్రం లేడు.

అందరూ ఆగిపోయి వెనక్కి తిరిగారు.

చూడగా, డింగీ చెరువు మధ్యని వుంది. రామచంద్రం మరో పెద్ద తెల్ల తామరపువ్వు తీస్తున్నాడు.

దయార్ద్ర హృదయురాలయి జానకమ్మ "నీకోసం" అన్నట్టు చూడగా సుభద్ర ఆనందపరవశురా లయిపోయింది.

సంగతంతా జానకమ్మ చెప్పగా విని "చాలా తెలివయినవాడు. మంచి యోగ్యుడు" అని మెచ్చుకుంటూ పంతులుకూడా ఆనందించాడు.

తరవాత మెల్లిగా వెళ్ళి నలుగురూ బల్లమీద కూచున్నారు.

డ్రయివ ర్లిద్దరూ కార్లు తెచ్చి రేవులో నిలపగా, నల్ల కలువలూ, యెర్ర కలువలూ, తెల్ల కలువలూ, అరవిచ్చిన యెర్ర తామర పువ్వొకటీ గొడుగు తామరాకుతో

యెడమసందిటా, తెల్ల తామర పువ్వు ప్రత్యేకంగా కుడిచేతా పట్టుకువెళ్ళి, కారులో వుంచి, రామచంద్రం పక్కగా నుంచున్నాడు.

బల్లమీద యేమి టేమిటో మాటలు వచ్చాయి. వాటితోపాటు సందె చీకటి వచ్చింది. దాని వెనకనే మెరుపుదీపం వచ్చింది.

సెలవు పుచ్చుకుని, మళ్ళీ కరస్పర్శలున్నూ చేసి వెళ్ళి, దొరసాని కారెక్కింది.

పువ్వులదొన్నె వొళ్ళోపుంచుకుని సుభద్ర మధ్య కూచోగా యీవేపునుంచి వొకరూ, ఆవేపునుంచి వొకరూ యెక్కి జానకమ్మా పంతులూ ఆమెకి రెండు పక్కలా కూచున్నారు.

బూరాలు బర్రు మన్నాయి.

కారులు తుర్రో మన్నాయి.

ఆవేళ రాత్రి భోజనా లయినాక, పంతులు పడకగదిలో వుయ్యాల మంచంమీద కూచుని వుండగా, తాంబూలపు పళ్ళెం తెచ్చి అందించి సుభద్ర, పక్కని కూచుంది.

"ఏమిటి తల్లీ కబుర్లూ?"

"మళ్ళీ వొక కథ రాసేశాను నాన్నారూ!"

"సాపు రాయించా లన్నమాట?"

"అవునండీ!"

"సూరయ్యని పిలిపించు"

"ఏ సినీమా కయినా వెళ్ళారో యింట్లో వున్నారో" అంటూ బయలుదేరింది సుభద్ర.

ఇంతలో జ్ఞాపకం రాగా "ఏం తల్లీ! రామచంద్రం రాయగలడేమో" అన్నాడు పంతులు.

అక్కడే మంచుని, గ్రీవాభంగాభిరామంగా చూస్తూ, సుభద్ర "కనుక్కోండి నాన్నారూ! సూరయ్యగారు రాస్తే మళ్ళీ నేను మొదణ్ణుంచీ దిద్దుకో వలసి వస్తోందండీ" అంది.

మెట్ల దగ్గరికి వెళ్ళి సుభద్ర పిలవడమూ, నాయుడు పైకి రావడమూ, సుభద్ర చెప్పడమూ, నాయుడు మళ్ళీ కిందకి వెళ్ళిపోవడమూ, రామచంద్రం పైకి రావడమూ వెంటవెంటనే జరిగిపోయాయి.

సుభద్ర, కథ తెచ్చి తండ్రిచేతి కివ్వడం యీలోపునే అయిపోయింది.

ఉయ్యాల మంచంమీద, చోటు చూపిస్తూ, పంతులు కూచోమన్నాడు కాని; రామచంద్రం మంచునే వుండిపోయాడు.

"మా అమ్మాయి తరుచు చిన్న కథలు రాస్తూ వుంటుందోయ్!"

"చిత్తం."

"నువ్వు సాపు చేస్తూ వుండాలి."

"అలాగే నండి."

"రాయగలవా?"

"రాయగలనండి."

"తెనుగులో నువ్వు రచన చెయ్యగలవా?"

"కొంచెం కొంచెం చేతవునండి. అయితే, వ్యావహారికంలో వెళ్ళినంత వుత్సాహంగా వెళ్ళదండి గ్రాంధికంలో కలం."

"అదేనోయ్! వ్యావహారికం దేశం అంతటా అప్పుడే పాకిపోయింది కాదూ? మహాదిట్టమైన వాడోయ్ గిడుగు రామమూర్తిపంతులు. నవీనవాఙ్మయ నిర్మాతలయిన యువకుల నందర్నీ లోపు చేసుకున్నాడు పంతులు. ముసలితలకాయలు గ్రాంధికమో అంటూ యెంత గోలపెడితే మాత్రం, ఆ వాదం యింకెన్నాళ్ళు నిలుస్తుందీ? మా అమ్మాయిక్కూడా రామమూర్తి పంతులు వాదమే నచ్చింది. నువ్వూ మా అమ్మాయీ చివరికి వొక జట్టే అయినారు. మహా బాగుంది. కనక నువ్వు సాఫు రాయడమే శ్రేయస్కరంగా కనపడుతోంది."

"తమ అమ్మాయిగారివంటి యువతీమణులు వ్యావహారికంలోనే చిన్న కథలు రాయడం చాలా గొప్పసంగతండి. నాకు చాలా సంతోషంగా వుందండి."

సుభద్ర మొగంమీద చిరునవ్వు మొలిచింది. ఆమె కళ్ళు వోరచూపులు చూశాయి.

"ఇదివరకి నాలుగో గుమాస్తా సాఫు రాస్తున్నాడు; కాని అతని సాఫుకంటే మా అమ్మాయి చిత్తే నయం."

"నా శక్తి కొద్దీ బాగారాసి దాఖలు చేసుకుంటానండి."

"ఒక కథ రాస్తే తెలుస్తుందండీ నాన్నారూ!" అంది సుభద్ర.

"విన్నావుటోయ్?"

"చిత్తం, విన్నానండి. దస్తూరీ విషయంలో మాత్రం ముందు తమర్నిద్దర్నీ మెప్పించుకోగలనండి."

"అది యేమంత తక్కువ యోగ్యత అనుకున్నావా?"

రామచంద్రం "చిత్తం" అన్నాడు కాని; సుభద్ర సిగ్గుపడింది. ఇక ముందయినా దస్తూరీ బాగుచేసుకోవాలనీ, సొంతంగానే సాఫు రాసుకోవడం మొదలుపెట్టాలనీ అనుకుందామె.

పంతులు కథ అందించాడు.

రామచంద్రం అది పుచ్చుకుని "యెన్నాళ్ళకి పూర్తిచెయ్యగల"వని పంతులు అడగ్గా, కాగితాలు లెక్కచూసి "రేపు తమరు కోర్టుకి వెళ్ళకుండా అందించేస్తానండి" అన్నాడు.

ఇది విని తండ్రీ కూతురూ చాలా ఆనందించారు.

"ముందు కథ అంతా పూర్తిగా చదివితే గాని రాత మొదలుపెట్టగూడదు నాన్నారూ!" అంది సుభద్ర.

"ఆ సంగతి అతనికి తెలవదుటమ్మా వెర్రిపిల్లా?"

"అలాగే చేస్తానండి నేను"

సుభద్ర కొంచెం సిగ్గుపడింది.

"మరి వెళ్ళు. సూరయ్య కింద వున్నాడా?"

"నేను వచ్చాటప్పటి కున్నారండి."

"అప్పుడే యెనిమిదీ యాభై. తొరగా వెళ్లు, లేకపోతే అతను వెళ్ళి పోతాడేమోను. కలమూ కాగితాలూ అతన్నడిగిపుచ్చుకో"

రామచంద్రం కిందికి వెళ్ళిపోయాడు.

ఇంతలో జానకమ్మ, వెండి చెంబుతో మంచినీళ్ళు తెచ్చి కడపరాతి బల్లమీద వుంచి, హాల్లోకి వెళ్ళి హొక సోఫాలో చతికిలబడింది.

వెంటనే తండ్రికి వార్తాపత్రిక అందించి "రేపటి వుపన్యాసం ఆలోచించుకుంటావే పిన్నీ!" అంటూ సుభద్ర తన గదిలోకి బయలుదేరింది.

"కథలు రాస్తావు కనక నువ్వు సొంతంగా ఆలోచించుకుంటావు. మరి నామా టేమి టమ్మా?"

"నీకేమమ్మా, నువ్వు మాష్టారివి!"

"అయితే జీతం యేమిస్తారో కనుక్కో"

సుభద్ర నవ్వుకుంటూ చక్కాపోయింది.

"జీతం కాదు, వుపన్యాసం బాగుండకపోతే చప్పట్లిస్తారు సభ్యులు" అని పంతులు కేకేశాడు.

"ఉపన్యాసం బాగున్నా చప్పట్లేయిస్తారు సభ్యులు; కాని మీరే హొప్పించారు. మరి నా భారం అంతా మీమీదే వుంది తెలుసా?" అని తల యెగర వేసుకుంటూ అడుగుతూ గదిలోకి వెళ్ళింది జానకమ్మ.

చిరునవ్వు నవ్వుతూ పంతులేదో గొణిగాడు.

"ఏమిటి?" అని మెల్లగా అడుగుతూ దగ్గరికి వెళ్లి, అతని బుజాలమీద చేతులువేసి కళ్ళల్లోకి చురుగ్గా చూసింది జానకమ్మ.

## 6

డరోతీ గొట్టంలోంచి పొగా, కొండల మొగంగా చలిగాలీ రివ్వురివ్వున వస్తున్నాయి. సూర్యకిరణాలు హొణుకుతూ హొణుకుతూ అడుగులు వేస్తున్నాయి.

రాజమహేంద్రవరప్పట్నం అంతా జాగ్రదవస్థలోనే వుంది గాని; రోగపరాయణులు కొందరింకా మంచాలూ దిగలేదు, కళ్ళూ విప్పలేదు.

అంతచలిలోనూ, గోదావరిలో, గట్టు పొడుగునా అన్ని రేవులలోనూ చాలామంది స్త్రీపురుషులు సావకాశంగా స్నానాలు చేస్తున్నారు.

రామచంద్రం అప్పుడే స్నానం చేసివచ్చాడు. కనక షర్టుమీద కండువా కప్పుకునీ కూడా కొంచెహొణుకుతూనే పొగడ చెట్టుకింద కూచుని, సాపు రాసిన కాగితాలలో అక్షరస్ఖాలిత్యాలున్నా యేమో అని పరిశీలిస్తున్నాడు.

నాలుగో గుమాస్తా, ఆవేళ చూడవలసిన కాగితాలన్నీ ఆఫీసులో మేజామీద సద్దుతున్నాడు.

కదంబవృక్షంకింద నుంచుని కక్షిదారు తెచ్చినకాగితాలు తిరగవేస్తూ, చెట్టుకింది ప్లీడరులాగ మధ్యమధ్య యేమిటేమిటో ప్రశ్నలు వేస్తూ లాయరు దర్జా అనుభవిస్తున్నాడు పెద్ద గుమాస్తా.

"కాఫీకి పొద్దెక్కిపోయిందిరా" అంటూ పాలికాపుమీద చిరాకుపడి జానకమ్మ, అప్పుడే మేడమీదకి వెళ్ళిపోయింది.

ఈ సమయంలో సుభద్రా, పంతులూ యినపగేటు తెరచుకుంటూ లోపలికి వచ్చారు.

ఇద్దరూ తలకి వూలు మఫ్లరులు చుట్టుకునీ, కాళ్ళకి కేన్వాసుజోళ్ళు తొడుక్కునీ వున్నారు. పంతులు చేతిలో పేముకఱ్ఱ వుంది. సుభద్ర చేతిలో టార్చిలైటుంది.

వారు గేటులోకి వచ్చి రావడంతోటే, పక్కనే పనిచేస్తూవున్న తోటమాలి, పెద్ద గులాబీపువ్వులు రెండు దోసిటిలో వుంచుకొని యెదురువెళ్ళి చెరొకటీ అందించాడు.

కొంచెం ముందుకి వచ్చాటప్పటికి, ముందు పెద్దగుమాస్తా, తరవాత కక్షిదారూ నమస్కారాలు చేసి తప్పుకున్నారు.

మరికొంత దూరం వచ్చాటప్పటికి, పక్కకి వచ్చి నమస్కరించి పంతులు చేతికి కాగితా లందించాడు రామచంద్రం.

"ఏమిటోయ్?"

"కథ సాపు చేసేశానండి"

"ఏమిటీ?" అంటూ పంతులయ్య చకితుడై చూశాడు. సుభద్ర కూడా మొదట చకితురాలై, తరవాత తండ్రి దగ్గిరికి వచ్చి, ముంగాళ్ళమీద నిలిచి కాగితాలు చూడసాగింది.

"నువ్వు కాగితాలు పుచ్చుకున్న దెప్పుడు, రాసిందెప్పుడు?" అని అడిగారు పంతులు.

"తమ దగ్గిర సెలవు పుచ్చుకున్న వెంటనే కాగితాలు పుచ్చుకున్నానండి. పదకొండు గంటలకే రాత పూర్తి చేశానండి."

"ఏంచురుకూ?" అని ప్రశంసించి, పంతులు "చూశావా?" అన్నట్టు సుభద్ర కేసి చూశాడు.

"సూరయ్యగారి చేతిలోనుంచి కాగితాలు వూడిపడేటప్పటికి విసుగొచ్చిందండీ."

"అక్షరాలు కావివి, ఆణిముత్యాలు. చూడు తల్లీ!"

"ఇంచక్కవుంది నాన్నారూ దస్తూరీ. ముద్దొస్తూ వుందండీ!"

ఈ మాట అన్నప్పుడు, ఆ ముత్యాల గౌరకాంతి ఆమె దంతాల శ్వేతకాంతితో మిళితం అయి, ప్రవాళాధారం మీద ప్రతిఫలించి మొగం అంతా కమ్మేసింది.

"మంచి ప్రజ్ఞ" అంటూ పంతులు, కాగితాలు సుభద్రచేతి కిచ్చాడు. ఆమె అవి తిరగవేస్తూ "మధ్య మధ్య యేవో కొత్తమాటలు – ఇవేమిటండీ నాన్నారూ?" అని ప్రశ్నించింది.

"మార్పు లేమయినా చేశావా యేమిటోయ్?"

"మార్పులంటే అవేమీ మార్పులు కావండి. తమ అమ్మాయిగారు నన్ను క్షమించకపోరనే ధైర్యంతో నేనాపని చేశానండి. అక్కడక్కడ కొన్ని మాటలు

కొంచెం పేలవంగా వున్నాయనుకుని, అవి అలాగే రాసి, అక్కడ వుండతగ్గవని నాకు తోచిన మాటలు యెర్ర సిరాతో పైని రాశానండి. ఇలా యిప్పిస్తే కొట్టేస్తానండి."

"ఏమంటావమ్మా?"

"చాలా బాగున్నాయండీ వారు చేర్చినవీ."

"అయితే, యిక కొట్టెయ్యడం యెందుకూ?"

"వెనుకటి కథలు కూడా యిలా సవరిస్తే – ఏమండీ నాన్నారూ?"

ఆమె తండ్రికేసి ప్రశ్నార్థకంగానూ, ఆశాపూర్ణంగానూ చూసింది. అవి అందుకుని, పంతులు యథాతథంగా రామచంద్రాని కందించాడు.

"నాకంత తాహతు లేదండి. ఏదో ఘుణాక్షర న్యాయంగా వచ్చాయండి ఆ మాటలు" అని వుల్లాసభరితమైన కృతజ్ఞత వెల్లడించాడు రామచంద్రం.

"పోనీ, తాహతున్నంత వరకే సవరించు. ఏం తల్లీ?"

"దిద్దడం మొదలు పెడితే ఆ ఘుణాక్షర న్యాయం అప్పుడు మాత్రం యెందుకు పట్టదండీ నాన్నారూ!"

"విన్నావుటోయ్?"

చక్కగా విన్నాడు; కనకనే రామచంద్రం మట్టాడ లేకపోయాడు. సుభద్ర మాటలు అతన్ని పరవశుణ్ణి చేసేశాయి.

రామచంద్రం చేసిన దిద్దుబాటువల్ల తన రచనకి వచ్చిన విశిష్టత తలుచుకుంటూ, మధ్యమధ్య అతని మీదకి క్రీగంటి చూపులు కూడా పోనిస్తూ సుభద్ర కూడా అలాంటి స్థితిలోకే వెళ్ళిపోయింది.

ఒక్క నిమిషం అందరూ అలాగే నుంచిని వున్నారు.

తరవాత పంతులు "సరే, తోటలో కూడా యేవయినా సవరణలు చేయించా లేమో చూస్తూవుండు. ఇంతలో నేను కూడా స్నానం చేసి పిలుస్తాను, కాఫీ పుచ్చుకుందాం" అని చెబుతూ వడాగా బయలుదేరాడు.

పదేసి అడుగుల్లో యీ వేపుకి తిరిగి వోమాటూ ఆవేపుకి తిరిగి వోమాటూ రామచంద్రాన్ని చూస్తూ, సిగ్గువల్ల అంతట్లోనే చూపులు గిరుక్కున మళ్ళించుకుంటూ, మెల్లిగా వడిచి, చాలా తాపీగా చీడీలెక్కి, యెవరో గెంటుతున్నట్టు బలవంతాన గుమ్మంలోకి వెళ్ళి తలుపు చాటుచేసుకుని వొక్కమాటు నిదానంగా చూసి, తరవాత వొక్క పరుగున మెట్లదగ్గిరికీ, వొక్క దూకున మేడమీదికీ వెళ్ళిపోయింది సుభద్ర.

జయంతి చంద్రమౌళి పంతులంటే రాజమహేంద్రవరం వకీళ్ళలో కిరీటం లేని రాజని ప్రసిద్ధి.

వెలవెలకీ యే లాయరుకీ లేని రాబడి. రెండు మూడు వందల యకరాల యినాములు. ఎన్ని కరువులు వచ్చినా తరగని గాదులు. ఇంద్రభవనం వంటి మేడ. చుట్టూ నందనవనం వంటి విశాలమైన వుద్యానం. మోరంపూడి రోడ్డున పాతిక

యకరాల తోట. నడిబజారున పెద్ద పెద్ద కొట్లు. అల్కాట్టు తోటలో వొక పెద్ద నివేశనం. దానవాయి గుంటలో కొత్త పంపిణీ బంగళా.

రెండు మూడు కంపెనీలలో యాభైవేల పైచిలుకు భీమా పోలసీలు. ఒక మోటారు. ఒక బ్రూహాం. ఒక వొంటెద్దు బండి. పుష్కలమైన పాడి.

ఇన్నీ వున్నందు కతను మాంచి భోగి త్యాగినీ.

చుట్టాలు, అతిథులు, అభ్యాగతులు, స్నేహితులు, పరిచితులు, ఆశ్రితులు, యాచకులు, పరదేశులు, ఆఫీసర్లు - యెవరో వొక రెప్పుడూ యింట్లో వుంటూనే వుంటారు.

రాజమహేంద్రవరంలో సాహసానికీ, ఔదార్యానికీ అతనిదే మొదటి పద్దు. అతని సమ్మతీ, అతని సలహో, అతని సాయమూ లేకుండా సాధారణంగా అక్కడ యే వుద్యమమూ ప్రారంభం కాదు. ఏ కార్యమూ నెరవేరదు.

వకీళ్ళకందరికీ అతనిమాట అంటే చాలా గురి. తప్పుడు కేసులు పట్టడని న్యాయస్థానంలో అతనిమీద యెంతో నమ్మకం.

ఆరేళ్ళనుంచి అతను పబ్లిక్ ప్రాసిక్యూటరుగా వున్నాడు. మూడోమాటు కూడా మొన్న మొన్ననే నియుక్తు డయినాడు. అతని దగ్గిర అల్లిక పనులు చెయ్యడాని కెలాంటి కక్షిదారులూ జంకిపోతారు.

ఏ విధంగా చూసినా అతని కాపట్నంలో ప్రాతికూల్యం అనేది లేదు. లోటూ పాటూ కూడా యేమాత్రమూ లేవు; కాని ముప్ఫయితొమ్మిదో యేట - అంటే ఆరేళ్ళ కిందట అతని ప్రథమభార్య చనిపోయింది.

పరామర్శ చెయ్యడానికి వచ్చి, మళ్ళీ పెళ్ళి చేసుకోవలసిందని రోజుల్లోనే యెందరో సలహాలు చెప్పారు. అనేకమంది కూతుళ్ళ తండ్రులు రకరకాలుగా రాయబారాలు పంపారు. వితంతువివాహం చేసుకుంటాడేమో అని తదుద్యమనిర్వాహకులు కూడా తీవ్రంగా ప్రయత్నించారు.

కాని అతను దేనికీ అంగీకరించలేదు.

"రోజు లెలాగేనా వెళ్ళిపోతాయి. సుభద్ర చల్లగావుంటే నాకదే సౌఖ్యం. అదే ఆనందమూనూ" అని అతనందరికీ వొకటే సమాధానం చెబుతూ వచ్చాడు.

అతనికి సుభద్ర యేకైక సంతానం. మరి కలగా లేదు, కలగలేదని అతనికి బెంగా లేదు. ఒక్కకొడుకు కూడా పుట్టనందుకు భార్య తల్లడిల్లిపోయేది; కాని "ఆడపిల్ల చేదా?" అనేవాడతను.

రోజు లిలా గడిచిపోతూ వుండగా ఆమె జబ్బుపడి, పదిమాసాలు తీసుకుని, యెన్నివైద్యాలు చేయించినా ప్రయోజనం లేక చివరికి కాలం చేసింది.

అయితే, జబ్బు ముదిరి, యిక జీవించడం దుర్ఘటం అని అనుమానం స్థిరపడగానే "పిల్ల పెళ్ళిఅయినా నాకళ్ళ బెట్టండి" అని ప్రాధేయపడింది.

కానైతే సుభద్ర అప్పటి కెనిమిదేళ్ళ పిల్లే. అంత చిన్నతనంలో ఆమెకి పెళ్ళిచేయడం అతనికి సుతరామూ యిష్టమూ లేదు. అయినా యిది భార్య తుది కోరిక అని తానుకూడా గ్రహించి వున్నాడు కనకనూ, స్వతహాగా ఆమె చెప్పిన

పని చెయ్యకుండా వుండలేకపోయేవాడు కనుకనూ, ఆమె కోరిన వరుణ్ణే తెచ్చి, దేవదుందుభులు మోగిపోయేటట్టు సుభద్రకి పెళ్ళిచేశాడు.

అదివరకి యింటోనే సరిగా మసల్లేని ఆమె, యీ వుత్సాహాతిరేకం వల్ల, పెళ్ళివారిని భోజనాలకు పిలవడానికీ, వారికి లాంఛనాలు తీర్చడానికీ, ఇంకా యిలాటివాటికీ, ఆ అయిదారు రోజులూ వూచలాగ మసిలింది.

"నా మాట విను. అన్ని విధాలా మంచిది, బండిలో వెళ్ళు" అంటూ అతనెంతయినా నచ్చ జెప్పబోయేవాడు; కాని ఆమె "నాళంవారి సత్రంలో విడిది – యేమంత దూరమండీ? కాకపోయినా, నా జబ్బు మళ్ళిపోయిందండీ" అంటూ ఆ గుంటలుపడ్డ కళ్ళే తిప్పుకుంటూ, చెల్లెళ్ళనీ, మరదళ్ళనీ, మేనగోడళ్ళనీ, వెంట వేసుకుని దుడుగూ దుడుగూ తిరిగేది.

మమగుడుపులు కాగానే అతను, ఆమె ఆజ్ఞ ననుసరించి అల్లుణ్ణి యిల్లరికం తీసుకు వచ్చాడు.

ఆవేళ రాత్రి, ఆమె, అతనివొళ్ళో కూచుని, అతని నోటికి తమలపాకుల చిలక్కొట్లు అందిస్తూ "మీరు చాలా మంచివారండీ. నా కోరికలూ, ముచ్చట్లూ అన్నీ తీర్చారండీ. ఎన్ని జన్మలెత్తి కూడా మీ రుణం తీర్చుకోలేనండీ" అంటూ మెడచుట్టూ చేతులు చుట్టేసి, బుగ్గకి బుగ్గ ఆనించి కొత్త పెళ్ళికూతురు లాగ గునిసింది.

అంతే.

తరవాత వారంరోజులకే రోగం తిరగబెట్టి, విషమించి ఆమె గుటుక్కుమంది.

మరో ఆరుమాసాలికి, గోదావరిలో యీతా లాడుతూ వరకంలోకి వెళ్ళిపోయి, పదహారేళ్ళ అల్లుడుకూడా దగాచేశాడు.

ఇలాగ భార్య పోవడం, కూతురు మూలపడడం, మరో సంతానం లేకపోవడం – కొన్నాళ్ళదాకా అతను అతనయి తిరగలేదు.

కాని మరో ఆరుమాసాలు గడిచాటప్పటికి "నువ్వానేనా?" అన్న క్రిమినల్ కేసొకటి రాగా అందులో పూర్తిగా దిగి, తరవాత ప్రాక్టీసులో మునిగిపోయాడు పంతులు.

వైధవ్యం వచ్చాటప్పటికి సుభద్రకి తొమ్మిదో యేడు వెడుతూ వెడుతూ వుంది. గారంగా పెరగడంవల్ల ఆమె ప్రతిపూటా బడికి వెళ్ళి యెరగదు. కాగా, మొగుడు పోయాటప్పటి కామె మూడో తరగతి చదువుతోంది.

అప్పటికి, ఆమె, భర్తను గురించిన దుఃఖం అట్టే యెరక్కపోయినా అతను తరవాత బడికి పంపడాని కిష్టపడలేదు.

వెంటనే లోవరుసెకండరీ అంతస్థుకి చేరేటట్టు లెక్కలూ, చరిత్రా, భూగోళమూ నేర్పడానికి బాలికల హైస్కూలు వుపాధ్యాయురాలి నొకామెనీ, సంస్కృతాంధ్రాలు నేర్పడానికొక శాస్త్రినీ యేర్పరిచాడతను.

అప్పటికే ఆమెకి సంగీతంలో మంచి రుచీ, పరిచయమూ యేర్పడి వున్నాయి. అంచేత, వుషఃకాలంలో వొక గంటా, సాయంత్రం రెండు గంటలూ సంగీతం చెప్పడానికీ, వీణావాద్యం నేర్పడానికీ వొక విఖ్యాత విద్వాంసుణ్ణి అతను సొంతంగా రాజమహేంద్రవరంలో ప్రవేశపెట్టాడు.

కుట్టుపనులూ, అల్లికపనులూ నేర్చుకోడానికి తగిన గోష్ఠినీ యేర్పరిచాడు.

తల్లి చూపవలసిన శ్రద్ధ కూడా తానే చూపిస్తూ యిలాగ, అతను, ఆమె భవిష్యత్తుకి మంచి పునాదులు వెయ్యసాగాడు.

## 8

జానకమ్మ కూడా చిన్నతనంలోనే వితంతు వయిపోయింది.

పుట్టింట పడి, గొడ్డులాగ నానా చాకిరీచేస్తూ, బానిసలాగ కుళ్ళుమాటలు పడుతూ, కుక్కిన పేనయివుంటే ఆమెకి నిష్పూచీగానే దినాలు వెళ్ళిపోయి వుండును.

కాని అందుకామె యిష్టపడలేదు.

అస్వతంత్రపు బతుకంటే ఆమెకి సుతరామూ అంగీకారం లేకపోయింది.

చిన్నప్పుడామె మిషనరీల బాలికా పాఠశాలలో యేడో తరగతి చదివివుంది. తద్వారా, వొక దారీ వొక తెన్నూలేని కుళ్ళు సంఘంమీద తిరగబాటు చేసే ధైర్యమూ సాహసమూ అలవర్చుకునీ వుంది.

కాగా, అన్నదమ్ములు కోపపడినా, తల్లి గోలపెట్టినా, వదినలూ మరదళ్ళూ దెప్పినా, అక్కలూ చెల్లెళ్ళూ యీసడించినా, కావలసినవాళ్ళు కళ్ళు తేలవేసుకున్నా లెక్కచెయ్యక, ఆడపిల్లలికి ప్రయివేట్లు చెబుతూ ఆమె రాజమహేంద్రవరంలోనే వుండిపోయింది.

ఈ వృత్తిలో ఆమెకి నెలకి పదిహేనురూపాయలు దొరికేవి. ఏపాతదో చిన్న కొంప కూడా సొంతం వుంది కనుక, అద్దెబాధ లేక, ఆ సంపాదనతో ఆమె రాజాంగంగా బతికేది.

ఇలాగ రెండేళ్లు గడిచాటప్పటికి ఆమెకీ సుభద్రకీ పరిచయం కలిగింది.

జానకమ్మ పాఠంచెబితే పండువొలిచి చేతిలో పెట్టినట్టుండడం చూసి, నాలుగైదు మాట్లు యాదాలాభంగా చెప్పి, చెవరికి కోరగా, నెలకి పదిరూపాయలివ్వడానికి అంగీకరించి, రోజా రెండుగంటలు పాఠం చెప్పడానికి జానకమ్మని కూడా యేర్పాటు చేశాడు పంతులు.

ఆమె యెనిమిదిన్నరకి వచ్చేది. ఇక్కడ తండ్రీ కూతుళ్ళకి పదింటికి భోజనసమయం.

ఏమి లేకపోయినా సద్దుకునీవాడు కాని, పంతులు, కుడివైపున యెడమచేతి కందేటంత దగ్గిరగా సుభద్ర కూడా వుంటేగాని భోజనానికుర్చునేవాడుకాడు. ఆమె రజస్వల అయిన తరవాత కూడా వొకటి రెండు మాసాలు యీ పద్ధతే నడిచింది కాని తరవాత్తరవాత నిర్బంధంగా మానుకోవలసి వచ్చింది.

అంచేత, జానకమ్మ ఆ గంటా పాఠం చెప్పి, మళ్ళీ సాయంత్రం వచ్చి మరో గంట చెబుతూ వుండేది. ఒక్కొక్కప్పుడు సుభద్ర భోజనం అయిాదాకా కనిపెట్టుకుని వుండి తరవాత పూర్తిచేసి వెళ్ళిపోయేది. మరొక్కొక్కప్పుడు – అంటే పిండి వంటలు చేసుకున్నప్పుడల్లా సుభద్ర పట్టుపట్టగా యిక్కడే భోజనంచేసి, యేవొంటిగంటదాకానో కబుర్లూ చదువూ చెప్పి ఆ దారినే తక్కిన పిల్లలయిళ్ళకి వెళ్ళేది.

ఇలాగ నాలుగుమాసాలు గడిచాయి. ఈ నాలుగుమాసాలలోనూ సంకురాత్రీ, సంవత్సరాదీ – రెండు పండగలు వచ్చాయి. ఆ పండుగల్లో సుభద్ర తండ్రి మనస్సు కరిగించి జానకమ్మకి రెండు పట్టుచీరలు బహుమతీ చేసింది.

మరో రెండు మాసాలికి తన హృదయమే ఆమెకిచ్చి వేసింది.

కాని పాతిక రూపాయల ఆర్జన చూసుకునీ, యీ శిష్యురాలిని చూసుకునీ సంతోషించినంత కాలం పట్టలేదు జానకమ్మకి. ఆమె ఆదాయమూ, అనుభవమూ కొందరు మొగరాజాలికి కళ్ళుకుట్టాయి.

# 9

వారు కుట్రలు పన్నారు.

"వెధవముండకి ఆ బర్మా స్లిప్పర్లేమిటండీ? ఆ గొడుగేమిటండీ? ఆ బర్మా ముడి యేమిటోయ్? ఆ పట్టుచీరలు – ఆ జంపర్లు – ఆ కాఫీలు – ఆ తాంబూలం – దాని దగ్గిర చదువుకున్న యేపిల్ల అయినా చేసుకున్న మొగుణ్ణి లక్ష్యపెడుతుందిటయ్యా?" అంటూ యిలాగ తీవ్రప్రచారం సాగించేశారు.

ఇందుకు ఫలితంగా "సుభద్రనే ప్రధానంగా చూసుకుంటూ మా పిల్లలికి సరిగ్గా చెప్పడంలే"దని వంకలుపన్ని, ముగ్గురుపిల్లల తండ్రులు ఆమెని నిషేధించారు. మరోపిల్ల "మానాన్న మరో మేష్టార్ని కుదురుస్తా–డు–ట" అంటూ పాట మొదలు పెట్టింది. ఇంకోపిల్ల తండ్రి "జీతం తగ్గించుకుంటేగాని నావల్లకా"దని కబురంపాడు.

"ఏమిటీ ఘోరకలి? ఏమిటి చెయ్యడం?"

ఇంకో పదిరూపాయల కాశపడితే అసలుకే మోసం వచ్చింది.

జానకమ్మకి ధైర్యం సన్నగిల్లి దిగులు పెరిగింది. సంతోషం పోయి యేడుపు పట్టుకుంది

"పోనీ, సుభద్రనే విడిచిపెట్టేస్తే?" అని ఆలోచించిందామె. "తక్కిన పిల్లల కందరికీ వరాసగా ముందు చెప్పేసి, యే మూడు గంటలకో సుభద్ర కోసం వెడితే?" అని కూడా ఆమె ఆలోచించింది.

ఆ సంరక్షకులు ఇందుకూ వొప్పుకోలేదు.

పూర్తిగా వొక్కవెల తంటాలుపడింది; కాని వ్యవహారం పొక్కుపడలేదు.

ఆ యీర్షాళువుల కీ సంగతి కూడా తెలిసిపోయింది.

మళ్ళీ వారు చెలరేగారు.

"దోగందిటయ్యా సంసారిపిల్లలికి పాఠం చెప్పవలసిందీ?" అని వొకడు, "పిల్లల చదువుకోసం ఆశిస్తే, దాని వెంటపడి మొగుళ్ళెక్కడ దికారులయిపోతారో అని ఆడాళ్ళు గగ్గోలు పడిపోయారు కాదుటయ్యా?" అని యింకొకడు, "ఆ గుడిశేటి పోకిళ్ళు చూపి ఆ మొగుడు ముండాకొడుకు పవిత్రాత్మ యెంత తపించిపోయిందోనయ్యా! ఆ వుసురు తగులదుటయ్యా పీనుక్కీ?" అని మరొకడు.

వీటికి చిలవలూ, పలవలూ పెట్టి మరికొందరు.

జానకమ్మ దీనికే బెంబేలుపడిపోయి వుండగా "నేమండగా నీకంత బెంగెందుకూ?" అని జిల్లాబోర్డు ప్రెసిడెంటు వొక వుపాధ్యాయురాలిద్వారా కబురందించాడు.

"మనం యెలాంటి సాయం అయినా చెయ్యగలం" అని వొక స్కూళ్ళయినస్పెక్టరు తన వుపాధ్యాయసచివుడి దగ్గిర సొరకాయలు నరికాడు.

"మనవార్డులో హెడ్‌మిస్ట్రెస్సుగా వేసేద్దాం, వచ్చి కనపడమనవోయ్!" అని మునిసిపల్ చెయిర్మను వొక బిల్లుకలెక్టరుతో చెప్పాడు.

"తగిన ఆడదిదొరక్క యింతవరకూ వూరుకున్నాం. స్థానం నరసింహారావుకి మూడురోజుల్లో వుప్పొగల్లయినా పుట్టకుండా చెయ్యవచ్చు, మనలోకి రమ్మనవయ్యా!" అని వొక నాటకసభ అధ్యక్షుడు తన కార్యదర్శి బుజం తట్టాడు.

"ఫలానా డైరెక్టరు మన గుప్పిట్లో వున్నాడు తెలుసా? మనం వూనుకున్నామంటే వొక మహోజ్జ్వలతారను చేసెయ్యగలం – యెరుగుదువా?" అని వొక స్టుడియో ఆశ్రితుడు తన ఆశ్రితుడు దగ్గిర వెన్ను విరుచుకున్నాడు.

దీనికి సాయం వరాసగా రెండురాత్రులు ఇంటిమీద రాళ్ళవర్షం కురిసింది.

దానిమీద, పోలీసు సబివన్స్పెక్టరొకరు "లక్ష్మీకొడుకుల్ని రెండేళ్ళు జెయిలుకి పంపించేస్తాను. సాయంత్రం స్టేషనుకి తీసుకురా దాన్ని, ఈలోపున కంప్లెయింటు తయారు చేయిస్తా"నని వొక యేజెంటుని తొందరపెట్టాడు.

"మనకి దమ్మిడీ ఫీజక్కర్లేదు సరిగదా, తక్కిన ఖర్చులు కూడా మనమే భరించేస్తాం. అల్లరి చేయించిన వాళ్ళెవరో, చేసిన వాళ్ళెవరో తెలుసుకునే బాధ్యతే కాకుండా, సాక్షులను సమకూర్చుకునే పూచీ కూడా మనదే, రాత్రి భోజనం అయినాక తీసుకురావయ్యా వకాల్తనామామీద సంతకం చేస్తుందీ" అని వొక క్రిమినల్ లాయరు తన గుమాస్తాని తొందరపెట్టాడు.

దీంతో, యెటుచూసినా దావానలం చుట్టుముట్టినట్టు కనబడి జానకమ్మ దిగ్భ్రాంతురా లయిపోయింది.

"రాజమహేంద్రవరానికీ మనకీ యిక రుణానుబంధం లేదూ?" అని తహతహ లాడిపోయింది.

## 10

ఎంతో చలాకీగా వుండే జానకమ్మ మందు తిన్నట్టుండడం చూసి, గుచ్చిగుచ్చి అడిగి, సుభద్ర వొకనాడిదంతా తెలుసుకుంది. అయితే, ఆమె కిందులో చాలాభాగం బోధపడలేదు. బహుకొంచెం మాత్రం అర్థం అయింది.

పాపం పదేళ్ళపిల్ల ఆమె, యిలాంటి సంగతులు తెలవకపోవడం వింత యేమిటిషి కాని "యిక నేనీవూళ్ళో వుండిబతకలేను" అని జానకమ్మ అన్నమాట ఆమెగుండెలు బద్దలు చేసేసింది.

జానకమ్మ అంటే ఆ చిన్న హృదయంలో విడిపోని అనుబంధం యేదో పురివేసుకుపోయింది. అంచేత "రాజమహేంద్రవరం విడిచి వుండడం యెలాగా?" అని జానకమ్మకి అనిపిస్తూ వుంటే "మేష్టార్ని విడిచి వుండడం యెలాగా?" అని సుభద్రకి అనిపించసాగింది.

కాని జానకమ్మకి లాగ సుభద్రకి మార్గం దొరక్కపోలేదు.

కార్య కారణ సంబంధాలూ, సాధ్యా సాధ్యాలూ, సంభవా సంభవాలూ చివరికి మంచి చెడ్డలు కూడా గుర్తించలేని లేత హృదయం ఆమెది. దానికింకా మాయావరణం ఏర్పడలేదు. మానవకోటిని నడిపే స్వార్థమూ, కుయుక్తులూ, కుశ్శంకలూ దాన్నింకా కలుషితం చెయ్యలేదు.

అది వొక పొంగు పొంగింది. ఆ పొంగులో వొక ఆశారేఖ రూపొందింది.

వెంటనే ఆమె "అలా అయితే ఆ పాతిక రూపాయలూ నే నొక్కత్తెనే యిచ్చేస్తానండీ. నేను మాట యిచ్చేశానంటే మా నాన్నారు తప్పకుండా వొప్పుకుంటారండీ. ఏమండీ, మేష్టారూ! మా యింటికి వచ్చెయ్యండి. మా యింట్లోనే భోజనం చేద్దురుగా నండీ. మా యింట్లోవుంటే యిక మిమ్మల్నెవరూ అల్లరి పెట్టలేరండీ" అంటూ జానకమ్మ రెండు చేతులూ పట్టుకుని "వస్తానంనండీ. వచ్చెయ్యండీ. మీ కాళ్ళు పట్టుకుంటానండీ. మీరే మా అమ్మ అనుకుంటానండీ" అని ఆ చేతులు వూపుతూ జాలిగా చూస్తూ ప్రాధేయపడింది.

జానకమ్మ గుండె ఝల్లుమంది. ఆమె స్త్రీత్వం ప్రబుద్ధం అయింది. సంసారజంజాటంలో అలుముకున్న కార్కశ్యం అంతా క్షాళితం అయిపోయి అది నిజరూపం పొందింది.

నమ్మినవాళ్ళు గొంతు క్కోసెయ్యడం – ఎప్పుడూ యెరగనివాళ్ళు భూతాల్లాగ మింగెయ్యాలని నోళ్ళు తెరుచుక్కూచోడం – అంత పట్నంలోనూ "అయ్యో, నీ గతి చివరికి యింతకి వచ్చిందా?" అని పరామర్శ చెయ్యగల వాళ్ళు కనపడక పోవడం – ఇలాంటి స్థితిలో వొక ఆడపిల్ల – పదేళ్ళ నిసుగు–తల్లి లేని గుడ్డు – ఇలా పాకు లాడడం – దీంతో జానకమ్మ నిలువునా మాతృదేవత అయిపోయింది.

"మామ్మే, మా తల్లే!" అంటూ గభీమని సుభద్రని యెత్తుతుంది. రెండు చేతులూ బిగించి రొమ్ముకి గాట్టిగా వొత్తుకుంది. ఊర్థ్వశ్వాసతో మూర్ధాఘ్రాణం చేసింది.

మాతృవేశంతో ఆ బుగ్గా యీ బుగ్గా ముద్దులాడి, వొక్కమాటు ఆ అమాయకపు కళ్ళల్లోకి సకరుణంగా చూసి, ఆ లేమోముదమ్మిలో తొణికిసలాడే శైశవ మౌగ్ధ్యమాధుర్యం అంతా అనుభవించి, కంఠంలో గద్గదికా, కళ్లల్లో బాష్పలహరీ ఆవిర్భవించగా, హృదయం వాత్సల్య పరిప్లుతమున్నూ అయిపోగా, ఆమె మొగం తన బుజం మీదికి చేర్చి పరవశురా లయిపోయింది.

సుభద్ర తన్ను తావే మరచిపోయింది.

## 11

ఏదో పనిమీద, యీ స్థితిలో పంతులు అక్కడికి వచ్చాడు.

అతని కళ్లు చెదిరిపోయాయి.

అవసరం అయితే గదుముతూ చదువు చెప్పవలసిన జానకమ్మా, యెదట కూచుని చేతులు జోడించుకుని భయభక్తులతో పాఠం చెప్పించుకోవలసిన సుభద్రా యిలా వుండడం అతన్ని ఆశ్చర్యచకితుణ్ణి చేసేసింది.

కింద పలకా పుస్తకాలూ చెదిరి చెదిరి పడివున్నాయి.

"సుభద్ర అల్లరి చేసిందా? చేస్తే జానకమ్మ యిట్టే అందా? అంటే రోషం వచ్చి సుభద్ర యేడ్చిందా? ఏడిస్తే తనకి తెలిసి యేమని పోతానో అని యెత్తుకుని జానకమ్మ సముదాయిస్తోందా?" అని మొదట అతని కనుమానం కలిగింది గాని; యిద్దరూ వొకర్ని వొక రింకా అదుముకుంటూనే వున్నారు. ఇద్దరి మొగాలూ ముగ్ధమోహనా లయే వున్నాయి. ఇద్దరి కళ్ళూ ఆనంద ముద్రితాలయే వున్నాయి.

ఎటు నిర్ధారణ చేసుకోడానికీ వీలుపడలేదు.

చివరికి "అదేమిటి తల్లీ?" అని మాత్రమే పలకరించి వూరుకున్నాడతను.

దీంతో ఆ యిద్దరూ ప్రకృతిలో పడ్డారు.

జానకమ్మ కొంచెం సిగ్గుపడింది.

కాని, సుభద్ర గభీమని దిగజారి, వొక్కదూకున తండ్రి దగ్గరికివెళ్ళి రెండు చేతులూ పట్టుకుని, అప్పటికీ కొంచెం సుడి తిరుగుతూనే వుండిన తాదాత్మ్యంవల్ల మధ్యమధ్య నట్టుకుంటూనే తాను విన్నదంతా యెగుడు దిగుడుగా చెప్పి "ఆ పాతిక రూపాయలూ నేనే యిచ్చేస్తానన్నానండీ. మీరు వొప్పేసుకోవాలండీ. మన యింటికి వచ్చెయ్య మన్నానండీ. మేష్టారే మా అమ్మ అనుకుంటానండీ" అంటూ కళ్ళల్లోకి అమాయకంగా చూసింది.

"మేష్టారే మా అమ్మ అనుకుంటానండీ!" అన్న మాట చెవిని పడేటప్పటికి పంతులు చూపులూ, జానకమ్మ చూపులూ చకితాలై శరవేగంతో తారసిల్లాయి.

వెంటనే ఆచ్ఛాదనం తొలిగిపోయి, పిహిత మయిపోయివుండిన దృఢతరానుబంధం యేదో వారి కిద్దరికీ హఠాత్తుగా అనుభూతం అయినట్టయింది.

ఇద్దరి కళ్ళల్లోనుంచీ వొక నూత్నసందేశం బయలుదేరి యిద్దరి హృదయాలకూ అందినట్టుకూడా అయింది.

దాంతో వారెప్పుడూ అనుకోని వొక కొత్త భావం అంకురించింది. దాని వేగానికి తట్టుకోలేక యిద్దరూ వొకమాటు వూగిపోయారు.

వల్లమాలిన సిగ్గువచ్చి జానకమ్మ మొగం కిందికి వంచేసి, పంతులు మొగం పక్కకి తిప్పేసింది.

ఇదంతా వొక్క క్షణంలోనే జరిగిపోయింది కాని; అక్కడికే యెంతో ఆలస్యం అయిపోయినట్టు అసంతృప్తురాలై సుభద్ర "ఏమండీ? ఏమంటారండీ? చూశారా? మాట్లాడరూ? మాట్లాడరూ? మాట్లాడరూ? పోనీయండి" అని ముచ్చెం మూడు మాట్లూ అడిగి, మూతి బిడాయించుకుని దూరంగా వెళ్ళిపోయింది.

సుభద్రను చూసి జానకమ్మ "వెర్రిపిల్ల. ఉబలాటం తప్ప మరేమీ యెరగదు" అని మాత్రమే అనుకుని వూరుకుంది; కాని పంతులు గజగజ లాడిపోయాడు.

ఎవ రసంతృప్తులయినా, యెవరు భీష్మించుక్కూచున్నా, యెవరు కోపించినా అతను జంకడు. లక్ష్యపెట్టడు. పైగా నిర్దాక్షిణ్యంగా యెదురుకుంటాడు. ఎంత పనయినా చేస్తాడు.

సుభద్ర అయితే మాత్రం యిక నిలవలేదు.

ఆమె మూతి ముడుచుకుందంటే, అతను, ప్రళయం వచ్చినంతగా తల్లకిందు లయిపోతాడు.

అంచేత, అతను, వెంటనే ఆమె దగ్గిరికి వెళ్ళి "లేదమ్మా లేదు" అంటూ యెత్తుకుని, తటపటాయిస్తూనే జానకమ్మకి కొంచెం దగ్గిరగా వచ్చి "మా అమ్మ చిన్నపిల్ల" అని అనుకోవద్దు. ఈ యింట్లో ఆమె మాటకి అడ్డులేదు. అది అక్షరాలా జరిగితీరవలసిందే. 'ఒక్క పిల్లకోసం పాతికరూపాయలా?' అని మీకు సంకోచం అక్కర్లేదు. నా సంపాదన అంతా మా అమ్మది. ఇదంతా జాగ్రత్తగా చూచుకోవాలంటే యెంతజ్ఞానం కావాలి? దానికి మీరువేసే పునాదిని పట్టి చూస్తే పాతికరూపాయలంటే యేపాటి? ఇక తక్కిన సంగతులు – వాటి విషయమై నేను చెప్పడం ధర్మంకాదు" అని జానకమ్మతో అని "ఏంతల్లీ? నీకోపం తీరిందా?" అని సుభద్రని గారాంగా అడిగాడు.

"కోపం తీరడానికిందులో యేం వున్నట్టూ?" అనుకుంది జానకమ్మ.

తనకి కావలసిందేదో అది లేకపోగా సుభద్రకి ఈ మాటలు నచ్చలేదు.

దాని మీద ఆమె తండ్రి బుగ్గలు పుణుకుతూ, తన కాళ్ళు వూపుకుంటూ "మరి–మరి– మన యింటికి వచ్చెయ్యమనండి" అంటూ గునిసింది.

పంతులు జానకమ్మకేసి చూశాడు. సిగ్గుపడి జానకమ్మ బదులు చూపులు చూడలేకపోయింది; కాని ఆ గండస్థలాల మీదా, ఆ పెదవులమీదా, ఆ క్రీగంటి చూపుల్లోనూ లాస్యంచేస్తూ వున్న చిరునవ్వు లొంగదీసుకోలేకపోయింది. దానికి ప్రోద్బలం చేస్తూ వున్న ఆమోదం వుపసంహరించుకోలేకపోయింది. మొగానిక గాంభీర్యం పూసుకోలేకపోయింది.

సుభద్ర కిది కూడా అర్థం కాలేదు. తన ప్రశ్నకి జవాబు వచ్చితీరాలి. తాను చెప్పింది జరిగితీరాలి. ఇదీ ఆమె పద్ధతి.

"మరి మన యింటికి వచ్చెయ్యమనండి నాన్నారూ!" అని ఆమె మళ్ళీ రెట్టించింది.

ఇరుకున పడ్డాడు పంతులు.

అంతా స్పష్టంగా తెలుస్తూనే వుంది; అయినా అతనికి ధైర్యమూ సాహసమూ కలగలేదు. మనస్సు పరిపరివిధాలా పోయింది.

ఏమయినా సుభద్రని మరిపించడం అసంభవం. చివరికతనికొక యుక్తి తోచింది.

"ఈ మేడ నాదేకాదూ తల్లీ?" అని కొంటెచూపులు చూస్తూ అడిగాడతను.

"అమ్మో! మీదేం? నాకిచ్చేసి? మామ్మే? మళ్ళీ పుచ్చేసుకుందా మనుకుంటున్నారు కామోసు పా–పం!"

కళ్ళుతిప్పుకుంటూ యిలా అని గారాం కుడిచిందామె.

"అయితే, మరి వీయింటికిరమ్మని నేనెలాగమ్మా పిలవడం?"

తల వూపుకుంటూ కళ్ళున్నూ తిప్పుకుంటూ యిలా అడిగి ఆమెకంటే యెక్కువ గునిశాడతను.

సుభద్ర తెల్లపోయింది.

ఆమెకి మాట తోచలేదు. అలా అని వూరుకోనూ లేకపోయింది. తండ్రి

చంకనే వుండి, కాళ్ళూపుకుంటూ, యిలాగా అలాగా అభావదృష్టులు పరుపుతూ యుక్తికోసం వెతకసాగింది.

అటు సుభద్ర లాగే యిటు జానకమ్మ కూడా మొదట తెల్లపోయింది.

"మన యింటికి రమ్మన మనండి" అంటూ సుభద్ర మళ్ళీ మళ్ళీ రెట్టించినప్పుడు తన కెంతో మధురమైన ఆహ్వానం వస్తుందని అనుకుందామె.

నమ్మింది. ఆశించింది. ఎదురు చూసింది కాని; అదేమి మాటా? అందులో యెన్ని అర్థాలూ? ఎంత బింకమూ ఎంత యుక్తీ? ఎంత ముస్సద్దీతనమూ?

చివరి కెంత ఆశాభంగమూ?

ఈ నిర్విణ్ణతకి సాయం, ఆమెకి, అమాయికురాలయిన సుభద్రమీద జాలి కూడా కలిగింది. తనకోసం అంతగా దేవుల్లాడుతూ వున్నందుకు ఆమె మీద మమకారమున్నూ కలిగి ఆ నిర్విణ్ణతను అణిచేసింది.

పైగా యెన్నాళ్ళనుంచో అణిగి వుండిన్నీ అప్పుడప్పుడే మళ్ళీ రేకెత్తి అల్లుకుపోయి వుండిన ప్రణయం చనువూ సాహసమూ కలిగించింది.

దాంతో, వోరకంట చూస్తూ జానకమ్మ "పా—పం? పసిదాన్నీ చేసీ—" అంటూ మందరంలో యేదో అనబోయింది కాని; సగంలోనే అత నందుకుని "పసిది కనకనే కథ యిలా నడిపించింది. లేకపోతే —" అంటూ శేషం చూపులతో పూర్తిచేశాడు.

చాలు.

ఆ చూపులు ఆమె హృదయం దూసుకుపోయాయి.

ఆమె యెదురుచూస్తూ వున్న మధురాహ్వానం కూడా అందించాయి.

వెంటనే "రాతల్లీ!" అంటూ చేతులు చాపుకుని ఆమె వొక్క అడుగు ముందుకివేసింది. "వెళ్ళమ్మా!" అంటూ అతనున్నూ వొక్క అడుగు ముందుకి వేశాడు.

కానీ ఆ సన్నివేశం, సుభద్రని చంటిపిల్లని చేసేసింది. ఇంకా మాటలు రాని పసిపాపనే చేసేసింది.

దీంతో తండ్రి చంకనే వుండి ఆమె "నేను దిగిరాను" అన్నట్టు, "ఊ, ఊ" అంటూ గునుస్తూ చేతులుచాపి గభీమని ముందుకి వాలింది.

ఆమె పడిపోతుందేమో అని యిద్దరూ కంగారుపడ్డారు.

మొదట కూతుర్ని గట్టిగా పట్టుకుని, తరవాత, అతను జానకమ్మ కేసి సాకూతంగా చూశాడు.

ఒకప్పుడు ఇక లేనే లేదని నిరాశ చేసుకున్న మాతృత్వం యిలాగ హఠాత్తుగా అనుభూతం అయి జన్మాంతర భావన కలిగించగా, జానకమ్మ, అప్రయత్నంగానే వొక్క అంగతో అతనికి దగ్గిరగావెళ్ళి, నిస్సంకోచంగా నిర్భర వాత్సల్యంతో అతని చేతుల్లోనుంచి సుభద్రను పుచ్చుకుని, అతని కళ్ళల్లోకి గంభీరంగా చూస్తూ రొమ్ముకి అదుముకుని వివశ అయిపోయింది.

ఇది సుభద్రకి, కన్నతల్లి మళ్ళీ బతికి వచ్చినట్టనిపించింది. రెండు మూడేళ్ళుగా ఘనీభవించి పోతూవుండిన మాతృవియోగ వ్యథ అంతా తీరిపోయినట్టున్ను అనిపించింది.

ఆమె కళ్ళల్లో కొత్త తేజస్సు మెరిసింది. హృదయవీణ కొత్తనాదం పలికింది. మొగంమీద పరిపూర్ణమైన జీవకళ అంకితం అయింది.

వెంటనే ఆమె రెండుకాళ్ళూ నడుముకీ, రెండుచేతులూ మెడకీ చుట్టబెట్టి భుజంమీదకి వాలి జానకమ్మ చేతుల్లో బొమ్మ అయిపోయింది.

ఇదంతా చూశాటప్పటికి పంతులు మనస్సు గుబగుబలాడి పోయింది. కళ్ళు చెమ్మగిల్లాయి.

ఆ కళ్ళకి, జానకమ్మ మొగంమీద సుభద్రతల్లి ముఖకళ స్పష్టంగా కనబడింది.

దానిమీద, నామకరణమహోత్సవంనాడు పీటలమీద నుంచి లేచాక, కళ్ళతో పిలిచి, గదిలోకి తీసుకువెళ్ళి, ఆమె, సుభద్రను తన చేతుల్లో వుంచి అనిరళిత కపోలంగా తన వక్షస్థలంమీద వాలి, "వొక్కమాటు కళ్ళు విప్పి చూడు తల్లీ! విన్నెవరమ్మా యెత్తుకున్నారూ?" అని గునుస్తూ, కెందమ్మిరేకలవంటి వేళ్లతో ఆ చిన్నినోరు పుణికిన ఘట్టం స్మృతికి తగలగా అతనూ పరవశుడయిపోయాడు.

# 12

అపూట కక్కడే భోజనం చేసి, యేదో మాటమీద మేడ అంతా కలయచూసి, ఆ వైభవానికి ముగ్ధ అయి "యెంత వుండి యేమి లాభం? అడివిలో వున్నట్టున్నాను. నా లావణ్యానికి వినియోగం యేది? నా యాతన యెవరెరుగుదురూ? ఇన్నాళ్ళకి నువ్వు కనబడ్డావు. నీకోసం యెదురు చూస్తున్నాను" అని గృహలక్ష్మి విన్నవించు కున్నట్టనిపించగా పొంగిపోయి, వొంటిగంట దాటాక మహోల్లాసంతో యింటికి వెళ్ళింది జానకమ్మ.

కాని తాళం తీశాటప్పుడు చేతులు పట్టు తప్పిపోయాయి. తలుపులు తెరిచాటప్పుడు వొళ్ళంతా వొణికిపోయింది. లోపల అడుగు పెట్టాటప్పటి కెవరో అదృశ్యులయి వచ్చి, అమాంతంగా మీద పడి, వొళ్ళంతా రక్కుతున్నట్టనిపించింది.

మనస్సు బేజారైపోయింది. కళ్ళు చెదిరి పోయాయి. తల తిరిగి పోయింది. కాళ్ళు తేలిపోయాయి.

మంచో లేకపోయింది.

వెంటనే తలుపులు చేర వేసిందీ లేందీ యెరగకుండానే వొక్కదూకున వెళ్ళి మంచంమీద పడిపోయింది.

ఆమె కళ్లు తెరుచుకునే వుంది; కాని గోడలికి ఆ పటాలు లేవు. ఆ కేటికీ లేదు. ఆ బీరువా లేదు. ఆ డ్రెస్సింగు టేబిలు లేదు. ఆ మెరుపులైటు లేదు. ఆ నిలువుటద్దం లేదు. గుమ్మానికి ఆ పూసల జాలరు లేదు. మంచాని కా దోమ తెర లేదు.

ఆ దృశ్యం అంతా మారిపోయింది.

డబ్బైయ్యేళ్ళ మొగుడు ముక్కుపొడుం మారిపెట్టలేదని గింజుకుంటున్నాడు. ఎవభైయేళ్ళ పెద్దాడబడుచు "మొగుడు మంచాన పడివుండగా నీకా పువ్వుల బేరం యేమిటే?" అని రుంజుకుంటోంది. అరవైయేళ్ళ చిన్నాడపడుచు "యేకాదశిపూటా రాత్రి నీకు అన్నం పెడతానేం? ఇంద, ఈ కాస్తా మింగి తగులడు" అంటూ నీళ్ళు

కారుతున్న చలిమిడి ముందు పడేసిపోతోంది. పక్కయింట్లో అద్దెకున్న భావకవి గోడ అవతల పచారుచేస్తూ యేడుపు పాటలు పాడుతున్నాడు.

జానకమ్మ వొళ్ళు జలదరించేసింది.

చూడలేక ఆమె కళ్ళు గుచ్చేసుకుంది.

అయినా ఆరాటం పోలేదు; కాని సుమారు వొక్క అరగంట గడిచాటప్పటికి కళ్ళు అలా మూసుకునే వుండగా నిద్ర వచ్చింది.

మళ్ళీ మెలకువ వచ్చాటప్పటికి థన్ థన్ థన్ అంటూ హాల్లో గడియారం నాలుగు కొట్టింది.

అంతసేపు వొళ్లు తెలవకుండా పడి వుండిపోయినందు కాశ్చర్యపడుతూ ఆమె లేచి కూచోబోతూవుండగా "మేష్టారూ!" అని పిలుస్తూ వూచలాగ సుభద్ర వచ్చింది.

పైట సవరించుకుంటూ ఆమె "వస్తూ"న్నా నంది కాని; మాట పూర్తి కాకుండా యెగిరి గదిలోకి వచ్చి "పడుకున్నారా? నిద్రపోయారా? వీధి తలుపులు చేరవేసే వుంచేశారేం?" అని గుక్క తిప్పకోకుండా అడుగుతూ తొడమీద కూచున్నంత యిరుగ్గా కూచుంది సుభద్ర.

ఈ మాటలవల్లా, యీ స్పర్శవల్లా బద్ధకం పూర్తిగా తొలిగిపోగా, జానకమ్మ, మెరుపు కొట్టినంత చురుగ్గా సుభద్రని చేతుల్లోకి తీసుకుని, వొక్కమాటు గట్టిగా కౌగిలించుకుని, ఆమె మొగం తన మొగం దగ్గిరికి చేర్చుకుని "మీ నాన్నారు కోర్టునుంచి వచ్చారా?" అని చెవిలో వూదినట్టడిగింది.

ముందు "వచ్చా"రన్నట్టు తల వూపింది సుభద్ర. తరవాత "మా నాన్నా రివాళ కాఫీ హోటల్లో ఫలహారం చెయ్యలేదుట. వొట్టి కాఫీ అయినా నోటికి పోయింది కాదుట" అంది.

"అయ్యో" అని జానకమ్మ స్తబ్ద అయిపోయింది.

ఈ మాట చెవిని పడేటప్పటి కామె అనుమాన శేషాలన్నీ యెరిగిపోయాయి. సంకోచాలన్నీ పటాపంచలైపోయాయి. భీతికూడా సన్నగిల్లిపోయింది. ఇన్నిటికిందా యిందాకణ్ణుంచీ నలిగిపోతూ వుండిన ప్రణయం మళ్ళీ పురెక్కేసింది.

వెంటనే "యింటి కయినా వచ్చారు కారేమమ్మా?" అని ఆత్రం అడిగింది.

"పని తెమిలింది కాదుట"

"మధ్యాహ్నం భోజనం కూడ సగం సగమే చేశారు పాపం."

"మీరు మాత్రం కడుపునిండా తిన్నారా యేమిటివాళ?"

ఇలా అని సుభద్ర నిశ్చలంగానే అడిగింది కాని; యిది విని జానకమ్మ పొంగిపోయింది.

"ఎవరన్నా రమ్మా?"

"మా నాన్నా రన్నా రమ్మా!"

సిగ్గూ, ఆనందమూ జానకమ్మని వూపేశాయి.

"ఇంటికి వచ్చా కయినా కసింత కాఫీ—"

"కలపడం తరవాయిగా అంతా సిద్ధం చేసి వుంచింది కామప్ప."

"కాఫీ యిచ్చి వస్తేం నువు?"

"మీకు మాత్రం యివ్వవద్దూ?"

సుభద్రని రొమ్ముకి అదుముకోబోయి, మళ్ళీ అంతలో ఆగి "ఇంట్లో పడుకుని సుఖంగా నిద్రపోయినదానికి నా కెందుకు తల్లీ యిప్పుడూ?" అని శిరస్సు మూర్కొంటూ అడిగింది జానకమ్మ.

"మీరూ పోలిపోయే వుంటారన్నారు మా నాన్నారు. నాకూ అలాగే తోచింది, వచ్చేశాను" అని జవాబు చెప్పింది సుభద్ర.

ఈ మాట వినడం తరవాయిగా వొక్క వూపున సుభద్రని గా-ట్టిగా కౌగలించుకుని "అప్పుడే మొదలయిందా విరహం? అప్పుడే, కాఫీ పుచ్చుకోడానికి జానకి పక్కని వుండవలసి వచ్చిందా? మామ్మే, మా తల్లే! నీకూ నేను పోలిపోయి వుంటాననే తోచిందా?" అంటూ వూర్థ్వశ్వాసతో ఆ బుగ్గ విడిచి యీ బుగ్గా, యీ బుగ్గ విడిచి ఆ బుగ్గా కందిపోయేటట్టు ముద్దులు పెట్టి మళ్ళీ వొకమాటు రొమ్ముకి అదుముకుని, యెలా వున్నదలా లేచి కొళాయి దగ్గిరికి బయలుదేరింది జానకమ్మ.

నీళ్ళు పోసుకునేటప్పుడూ, చీరా రైకా మార్చుకునేటప్పుడూ, నిలువుటద్దం యెదట నుంచుని తలా బట్టలూ సవరించుకునేటప్పుడూ, యేమి టేమిటో చెబుతూ యేమిటేమిటో అడుగుతూ, సుభద్ర కూడా కూడా తిరుగుతూ వుండగా యేమి టేమిటో భావించుకుంటూ, యేమి టేమిటో వూహించుకుంటూ యేమి టేమిటో కలలుకంటూ యేమి టేమిటో చెబుతూ, ఆమెవొక్క అరగంటలో తయారయింది.

ఉత్తరక్షణంలో యింటికి తాళంవేసి యిద్దరూ బండి దగ్గిరికి వచ్చారు.

వారిని చూడగానే సారథి, తలుపు తీసి పట్టుకునుంచున్నాడు. ముందు సుభద్ర యెక్కికూచుంది. ఇలాగా అలాగా వీధి పొడూగునా వొకమాటు పారజూసి "కుళ్ళికుళ్ళి చావండి" అంటూ యిరుగు పొరుగు వాళ్ళమీద సొడ్డు పెట్టేసి, జానకమ్మ తరవాత యెక్కింది.

సుభద్ర "తొరగా వెళ్ళాలి" అనగా "మంచిదమ్మా!" అని సారథి వెంటనే తలుపు వేసేసి, తన స్థానంలోకి వెళ్ళి కూచుని, కొరడా ఛెళ్ళు మనిపించాడు.

"ఈ బండిపేరు బ్రూహాం. మీకు తెలుసా?" అని అడిగింది సుభద్ర.

"ఇప్పుడు తెలుసు" అని బదులు చెప్పింది జానకమ్మ.

"మా అమ్మకోసం కొన్నారు మా నాన్న రీబండి. వూళ్ళోకి యెక్కడికి వెళ్ళవలసివచ్చినా మా అమ్మా నేనూ దీనిమీదే వెళ్ళేవాళ్లం. ఫ్లాస్కునిండా కాఫీ పోసుకుని, రోజూ సాయంత్రం నాలుగున్నరకి బయలుదేరి మా అమ్మా నేనూ దీనిమీదే తోటకి వెళ్ళేవాళ్ళం. మా నాన్నారు కోర్టునుంచే కారులో వచ్చేసేవారు. మా తోటల్లో యించక్కని బంగాళా వుంది. దానిముందు లో-తైన పే-ద్ద చెరువు కూడా వుంది. ఆ చెరువునిండా యెర్రకలవపువ్వులు. మధ్య మధ్య తెల్లతామరపువ్వులు. ఒకమూల నల్లకలవపువ్వులూ, మరోమూల తెల్లకలవ పువ్వులూనూ. చెరువుమధ్య గచ్చుస్తంభంమీద పెద్దపావురాలగూడు. ఆ గూటినిండా పావురాలు. మేష్టారోయ్! వాటిలో వొకటి నన్ను చూసిందంటే, వెంటనే మీదికివచ్చి వాలి, నన్ను

ముద్దుపెట్టుకుంటుండండీ. నేనూ దాన్ని ముద్దుపెట్టుకుంటానండీ. మరీ–తరవాతా? ఆ చెరువులో ముద్దులు మూటకట్టే డింగీ వుంది. అయిదుకాగానే కాఫీపుచ్చేసుకుని, ఆ డింగీలో కూచుని కబుర్లు చెప్పుకుంటూ మేము ముగ్గురమూ ఆరయీదాకా చెరువంతా తిరిగేవాళ్ళం. మా అమ్మ పావురాలగూట్లో రోజుకీ తవ్వెడు సెనగపప్పు పోసేది. మా నాన్నారి మేజామీది పూలబేసినులోకి నేను, తెల్లతామరపువ్వొకటి, నాలుగైదు నల్లకలువలూ, యేడెనిమిది తెల్లకలువలూ, పదిపన్నెండు యెఱ్ఱకలువలూ తీసేదాన్ని. ఇంటికి ముగ్గురమూ కారులో వచ్చేసేవాళ్ళం. ఒక్కొక్కనాడు మా నాన్నారి పక్కని కూచుని మా అమ్మే కారునడిపేది, నేను బూరా వొత్తేదాన్ని. అసలు బూరా వొత్తడం యెప్పుడూ నేనేలెండి, ఏమండీ, మేష్టారూ, మళ్ళీ రేపణ్ణుంచి మనమూ వెడతాం, కదుటండీ?"

మురిసిపోతూ, చేతులు పట్టుకుని వూపుతూ సుభద్ర యిలా అనేటప్పటికి జానకమ్మ వొళ్ళు ఝల్లుమంది.

## 13

ఆ వెళ్ళడం వెళ్ళడం జానకమ్మ పంతులు మేడలోనే వుండిపోయింది. మరి యింటికి వెళ్ళలేదు.

చూడ్డానికయినా – అర్ధరాత్రి అయినా వెళ్ళలేదు.

నిజానికి, ఈ సంగతి కొన్నాళ్ళదాకా అయినా బ్రహ్మభేద్యంగా వుండిపోవలసింది.

కాని, సామానంతా మేడకి పట్టించుకు వెడుతూ, టూలెట్టుబల్ల గోడకి తగిలిస్తూ "ఎక్కడా అనకూడదు సుమండీ. నా కూడు పడగొట్టినవారవుతారు. సుమండీ" అని బెదురుతూ బెదురుతూ యెత్తుకుని, చివరికి "చెప్పవద్దూ? కళ్ళతో చూడలేదే అనుకోండి; కాని నా కనుమానంగానే వుంది సుమండీ. మీరు స్నేహితులు కనక మీ దగ్గిర దాచలేక పోతున్నాను. బాబోయ్! కొంపతీసి – యెక్కడైనా – అపరాధిని" అని లెంపలు వేసుకుంటూ, నాలుగో గుమాస్తా, మన్నాడు పొద్దున్నే వొక ట్యూటరు దగ్గిర నోరుజారేశాడు.

అయితే అయింది, ఆ ట్యూటరు అలాంటివాడూ యిలాంటివాడూ అయితే బాధ లేకపోవును; కాని అత నసాధ్యుడూ అఖండుడూనూ.

అంత చక్కగా బోధించి పాఠాలు చెప్పగలవాడు రాజమహేంద్రవరంలోనే మరొకడు లేడు. అతనికున్నన్ని ప్రయివేట్లు కూడా మరెవరికీ లేవు.

అసలు, జానకమ్మ ప్రయివేట్లు పడగొట్టించినవాడే అతను.

ఇక చెప్పడానికేం వుంది?

అత నావేళ తన పలుకుబడి అంతా వినియోగించుకున్నాడు. తన బోధనాశక్తి పూర్తిగా కనబరిచేశాడు.

ఖరాగా పదికొట్టాటప్పటికి, ఇన్నీస్‌పేటకి యిన్నీస్‌పేట అంతానూ, వూళ్ళో కొంత వరకూనూ, మంగళవారప్పేట సగం దాకానూ గోలగోల చేసేశాడు.

దీంతో, ఆమెకోసం తపసు ప్రారంభించిన వారందరూ యోగభ్రష్టులయిపోయారు.

వ్యాఖ్యాత లందరూ గోష్ఠికి కూచున్నారు.

అమ్మలక్కలందరూ "చూశావుటో వోవిడా" అంటే, "విన్నావుటో వోయమ్మో" అంటూ నీలాటిరేవుల్లో బుగ్గలు నొక్కుకున్నారు.

ఆమె యిరవై అయిదేళ్ళ వితంతువుకావడం – అతను నలభైయైదేళ్ళ విధురుడు కావడం – ఇంటో సుభద్ర తప్ప మరో ఆడది లేకపోవడం – ఆమె పంతుల్ని అలుముకుందని వారందరూ నిర్ధారణ చేసేశారు.

ఆమె పంతులమ్మ కనక అతనికి "పంతులయ్య" అని బిరు దిచ్చారు.

అతనితో సంబంధం గల పెద్ద లందరూ మెరుపు కొట్టినట్టయిపోయారు.

లోకం యిలాగ కిందామీదా పడిపోతూ వుండగా, అప్పటికి "మేష్టారు" మాత్రమే అయివుండిన జానకమ్మ హొక్క వారానికి,

సుభద్రకి "వొసే పిన్నీ" అయిపోయింది.

పంతులయ్యకి "జానీ" అయిపోయింది.

ఇంటో వున్న నౌకర్లకీ, చాకర్లకీ, గుమాస్తాలకీ, వంటలక్క కామప్పకీ "అమ్మగా"రయిపోయింది.

ఆ యింటికి యజమానురాలే అయిపోయింది.

సుభద్ర తల్లే మళ్ళీ యీ రూపంగా వచ్చిందని నమ్మి, పంతులయ్య, సంఘానికి బలాదూరు చెప్పేశాడు.

## 14

రామచంద్రం సాపు రాసినకథ మలీనెల భారతిలో పడింది.

"ఈ మాటు నా కథకి బొమ్మలు రాయించారు నాన్నారోయ్" అంటూ యెగురుతూ దుముకుతూవెళ్ళి, సుభద్ర, యింటికి వచ్చీరావడంతోటే తండ్రి చేతిలోవుంచింది భారతి.

ఒకమాటు కథ వున్న పేజీలన్నీ తిరగవేసి "భేష్! మొలిచినట్టున్నాయి బొమ్మలు. అయితే, డి.యస్. అంటే యెవరో తెలుసా తల్లీ?" అని అడిగాడు పంతులయ్య.

"దామెర్ల సత్యవాణీగా రండీ"

"ఆ–న్నమాట. అంచేతే యింత చక్కగా వున్నాయి."

"ఒక్కమాటేం జరిగిందనుకున్నారు నాన్నారోయ్? ఆవేళా? సరిగా వారంరోజులు కాలేదండీ యింకానూ. ఆవిడ అన్నగారు సాంబశివరావుగారున్నారూ? వారి అబ్బాయిని చూడ్డానికి వెళ్ళామండీ నేను పిన్నీనీ, పాపం సత్యవాణీగారు బొమ్మలు రాయడం మానుకుని మాతో గంటసేపు వుండిపోయారండీ. గాలరీలోవున్న పటాలన్నీ చూపించారు కూడానండీ. అప్పుడు శ్రీనివాసరావు తాతయ్యగారు వచ్చి 'మా వాణీకి కథలు రాయడం నేర్పు తావుటమ్మా' అని అడిగారండీ నన్నూ. దానిమీద 'మా గాలరీలోవున్న చిత్రాల కన్నిటికీ కథలు రాస్తావా?' అని అడిగారండీ సత్యవాణీగారూ; కాని తాము నా కథకి బొమ్మలు రాసినట్టు చెప్పారుకాదు. చూశారా నాన్నారూ?"

"సరియైన విద్వత్తు కలవారెప్పుడైనా ఆత్మస్తుతి చేసుకుంటారా తల్లీ!"

"ఏమండీ, నాన్నారూ! వెనకటి కథలకి కూడా రాయించి పెట్టరుటండి అవిడచేత బొమ్మలూ?"

"నేను రాయించే దేమిటమ్మా? నువ్వు వెళ్ళి అడిగితే రాయరూ?"

"రాస్తారనే తోస్తుందండీ. నేనూ పిన్నీ వెళ్ళి అడుగుతామండి."

"వెళ్ళండి"

సుభద్ర, బొమ్మలుంటే తన వెనకటికథ లెలావుంటాయో రూపించుకుంది.

బొమ్మలు చక్కగా వున్నట్టేవుంది; కాని కథలు?

అక్కడక్కడ కొంచెంకొంచెం పొదులు పొదులుగా – కొన్నిచోట్ల సరియైన మాటలు పడక–

మెరుపు కొట్టినంత చురుగ్గా తండ్రికేసి తిరిగి "వెనకటి కథలు కూడా దిద్దించి పెట్టరుటండీ?" అని అడిగిందామె.

"అలాగే" అన్నాడతను.

"నిజంగా? ఏమండీ నాన్నారూ? నిజంగానే?"

"సందేహ మెందుకమ్మా?"

"అయితే యెప్పుడు చెప్పండీ?" అంటూ చేతులు పట్టుకుందామె..

"నువ్వెప్పుడు కావాలంటే అప్పుడు"

"నిజంగా?"

"అదేమిటమ్మా వెర్రితల్లీ?"

"అయితేనూ–మరీ–యివాళే చెప్పెయ్యండి రామచంద్రంగారితోటి"

"చెప్పేస్తాను."

దానిమీద యేదో చెప్పబోయిన్నీ ఆమె బెదిరిపోయి వూరుకుంది. అది గమనించి "యింకేమిటి?" అని అడిగాడతను.

"ఏమండీ నాన్నారూ!"

"ఏం తల్లీ?"

ఆమె గుటకలు మింగింది; కాని చెప్పలేకపోయింది.

"చెప్పవమ్మా" అని బుజ్జగించాడతను.

"నేను రాసిన కథలన్నీ –"

"అన్నీని. కొన్ని విడిచి పెట్టడం యెందుకూ?"

"సాపు రాయించి –"

"సాపు రాయించి?"

సాహసించలేక మొగం పక్కకి తిప్పుకుందామె.

"రాయించి?.... ఏమిటి తరవాత?"

అదేస్థితిలో వుండిపోయింది.

"అదేమిటమ్మా?"

"మీరు కోప్పడతా రేమో బాబూ"

"ఎప్పుడయినా –"

ఇలా అంటూ అతను గడ్డం పట్టుకోగా, మాట సగంలోనే అందుకుని ఆమె "చెప్పయ్యనా?" అంటూ తల యెరగవేసుకుంటూ అడిగింది.

"ఊ. తొరగా"

"అచ్చుకూడా –"

"వోస్! ఇంతేకదా? తప్పకుండానూ, ఈ మాట చెప్పడానికంత సందేహం యెందుకు తల్లీ?"

"భయం వేసిందండీ"

"ఎందుకమ్మా? దానికేమంత డబ్బవుతుందమ్మా? అయితే మాత్రం అగత్యమైన పని మానుకుంటామటమ్మా?"

"..............."

"కాకపోయినా నీ మాట కడ్డేమిటి తల్లీ? నీ కోరిక తీర్చడంకంటే నా కింకేమి ఆనందం వుందమ్మా?"

ఆమె మొగం విప్పారింది.

"నువ్వు కథలురాస్తూ వుంటే, లోకం అవి మెచ్చుకుంటూ వుంటే అది నాకు సంతోషకారణం కాదూతల్లీ? అవి అచ్చువేయించడం నా పూచీ కాదుటమ్మా?"

ఈ మాట విని సుభద్ర పొంగిపోయింది – సిగ్గుపడింది.

"ఇంకా యేదో వుంది. ఏమిటీ యివాళ ఇలా ఆరంభించావూ? సందేహించకు తల్లీ!"

ఇలా అంటూ అత నామె వీపు నిమిరాడు.

"అచ్చు కూడా రామచంద్రంగారే –"

"అతనే చేయించాలి. నాకు తీరుబడి లేదుకదా? నీకు వీలు లేదుకదా?"

మళ్ళీ యేదో చెప్పబోయి ఆమె ఆగిపోయింది.

"ఇంకా యేమిటి?"

ఒక్కమాటు తండ్రికేసి చూసి బిడియపడుతూ మళ్ళీ ఆమె మొగం వంచుకుంది.

"మా అమ్మవు కావూ? నాకు ఆందోళన –"

"అమ్మో! ఇంకేమీ లేదండి. నిజంగానండీ"

"ఇంకా వుంది. తప్పకుండా వుంది. చెప్పమ్మా"

ఇలా అని అతడు ఆమె గడ్డం పట్టుకుని మొగం పైకెత్తి కళ్ళల్లోకి చూస్తూ "చెప్పు" అన్నట్టు తలువూపాడు.

"చెన్నాపట్నంలో –"

"మరీ సంతోషం. రామచంద్రాన్ని వెళ్ళమందాం"

దీంతో ఆమెకి ప్రాణాలు లేచివచ్చినట్టయింది. ఆ వుల్లాసంతో యిలాగా అలాగా చూడగా, తోటలో, కుళాయి దగ్గిర పంచెకి సబ్బుపట్టించుకుంటూ రామచంద్రం కనిపించాడు.

అది చూశాటప్పటి కామె మనస్సు చివుక్కుమంది. కళ్ళల్లో యేదో గుచ్చుకున్నట్టూ అయింది.

## |15|

నిజానికి, ఈ దృశ్యం ఆమెకి కొత్తది కాదు.

ఇది యిప్పటికి నాలుగైదు మాట్లయినా కనపడివుంది. కనపడ్డప్పుడల్లా యెంతో జాలీ కలిగింది.

అయితే "బట్టలు తక్కువగా వున్నాయి కామోసు పా - పం" అని మాత్రం అనుకుంటూ వచ్చింది. అది అప్పటితోటే మరిచిపోతూనూ వచ్చింది.

కాని యీ సన్నివేశం అలా కాలేదు. ఇది చెయ్యిపెట్టి మనస్సంతా దేవేసింది. హృదయంమీద సమ్మెటపెట్లు పెట్టింది. కళ్ళల్లో టార్చిలైట్లు వేసింది.

వెంటనే "అలా - చూడండి నా - న్నారూ" అంటూ మాట సరిగా వుచ్చరించలేక అంగుళి నిర్దేశం మాత్రం చేసిందామె.

"అతను - రామచంద్రమేనా?" అని అడిగాడు పంతులయ్య.

ఆమె మాట్లాడలేకపోయింది.

"ఏం తల్లీ? రామచంద్రమేనా అతనూ?"

"అవునండీ."

"బట్టకి సబ్బు పెట్టుకుంటున్నాడు. అవునా?"

"మరేనండీ."

"ఏం, చాకలి ఆలస్యం చేశాడా యీ మాటూ?"

"రెండు రోజుల కోమాటు సబ్బు పట్టిస్తారండీ అయినా. రెండు పంచెలే వున్నట్టున్నాయండీ పాపం."

"మన ఇంటికి నీరుకావి ధోవతులతో వచ్చాడు. వచ్చాక సబ్బు పెట్టుకుంటున్నాడు కాబోలు."

"అలాగే వుందండీ."

"అంటే మన ఇంటికి వచ్చాక కూడా అతని స్థితి లేశమూ మారలేదన్నమాట."

ఇలా అని అతను మేజాదగ్గిరికి వెళ్ళి మెరుపు కాలింగు బెల్లు నొక్కి యేదో చీటీ రాసుకువచ్చాడు.

ఇద్దరూ అతనికేసి చూస్తూ నుంచున్నారు.

తువ్వాలు కట్టుకుని వున్నాడు రామచంద్రం. పంచెకి సబ్బు పట్టించడం అయిపోయింది. సబ్బు ముక్క కొళాయిమీద పెట్టి పంచె వుప్పుతిస్తున్నాడు. చేతుల మీదా, గుండెల మీదా, మొగం మీదా సబ్బు నురగ పడుతోంది.

మొగం మీద పడ్డది మాత్రం ఎప్పటి కప్పుడే తుడిచేసుకుంటున్నాడు.

"చిత్తం బాబయ్యా" అన్నాడు పోతునాయుడు వచ్చి. "పెద్ద గుమాస్తా గారికి. పరిగెత్తుకు రావాలి" అంటూ పంతులయ్య చీటీ వాడి చేతిలో పెట్టాడు.

తండ్రీ కూతురూ మళ్ళీ అతని కేసి చూడసాగారు.

"వో-ర్థి మొగమాటం మనిషి యెవరూ అంటే రామచంద్రం వొక్కడే కనపడుతున్నాడు. ఎలాంటి సందర్భాలు వచ్చినా నోరువిప్పి అడగడు సరికదా,

యెంత అడిగినా చెప్పడు. ఏ మడిగినా వెంట వెంటనే జవాబు చెబుతాడు కాని; డబ్బుమాట తెస్తే మాత్రం పెదవి కదపడు. ఇతనితో యిది చాలా చిక్కుగా వుంది. వచ్చి నాలుగు మాసాలు దాటినా, జీతం యెంత కావాలో తేల్చమంటే, నిన్న రాత్రి గిజా అన్నాడు. కాని తేల్చాడుకాడు చూశావా?"

"ముందు బట్టలు కొనిపెట్టండి పాపం."

"ఇదిగో బాబయ్యా" అంటూ వచ్చి పోతునాయుడు చీటీ అందించాడు.

జోడు లేకపోవడం వల్ల కళ్లు చికిలించుకుంటూ చూసి "నెల కొక్క రూపాయి చొప్పున యిప్పటికి నాలుగు —"

"అయ్యో!" అంటూ వులిక్కిపడింది సుభద్ర. "నెల కొక్క రూపాయిటండీ?"

"అవును. రోజుకి రెండు డబ్బులు."

"మనతో వచ్చినప్పుడు తప్ప సినీమా కయినా వెళ్ళడం లేదు కాబోలు పాపం."

ఈ మాట అన్నప్పుడు సుభద్రకి దిక్కు మొగం పడింది.

"అరకప్పు కాఫీ కూడా లేదన్నమాట."

"రామ రామా! ఎంత యిబ్బంది పడిపోతున్నారోనండీ పాపం."

"కోర్టులో వొక్కొక్క రోజున, సమయాని కెవరో వొక స్నేహితుడు చక్కావచ్చి, నాకు పోగా మిగిలిన కాఫీ కొట్టేస్తూ వస్తున్నాడు. ఇంటి దగ్గిర్నుంచి మైలున్నర దూరం మోసుకు రావడమే కాని అతను వొక్కచుక్క అయినా — అతని కడుపు మాడుస్తూ నేను చాకిరీ చేయించుకుంటున్నా నన్నమాట."

పంతులయ్య కళ్ళు గిర్రున నిండిపోయాయి.

"పా–పం" అంది సుభద్ర.

ఆమె రెండు కళ్లలో నుంచీ రెండు బాష్పబిందువులు పుట్టి అధరం మీదుగా జారి వెంటనే చినుకు చినుకు లయిపోయాయి.

ఇద్దరి కంఠాలు కషాయితా లయిపోయాయి.

మళ్ళీ యిద్దరూ అతనికేసి చూశారు. ఒక్కమాటు పంచెమీదికి కొళాయి వదిలి మళ్ళీ వుప్పులిస్తున్నాడు రామచంద్రం. ఒక్కక్షణం అయినాక, అంచు దగ్గిర రోడ్డుబురద మరకలున్నాయి కాబోలు, ఆ భాగం వొక అరచేతిలో వుంచుకుని రెండో అరచేత్తో గట్టిగా పాముసాగాడు.

"ముందు బట్టలు కొనిపెట్టండి నాన్నారూ" అని మళ్ళీ అంది సుభద్ర.

మెరుపుకొట్టినట్టయి, ఆమెకేసి తిరిగి, "అయితే బజారుకి వెళ్ళి నీకు నచ్చినవి పట్టుకురా"అన్నాడతను చురుగ్గా చూస్తూ.

ఆమె గతుక్కుమంది.

"వేళాకోళం కాదు. నీ కథలు అతను దిద్దిపెడుతున్నాడు. అతనికి నువ్వు బహుమతీ చెయ్యాలి."

ఆమె మరీ సిగ్గుపడిపోయింది.

"ఇప్పటిమట్టుకి అతనికి మనం చేసే బహుమతీ బట్టలే. నీ యిష్టం వచ్చినవి పట్టుకురా. పిన్ని కూడా వస్తుంది బజారుకి వెళ్లు."

"మరి నుంచోకు. తొరగా తెమల్చు. అతను ఆ పంచె వుతికి ఆరవేసుకునేటప్పటికి నువ్వు కొత్తబట్ట లివ్వాలి. వెళ్ళు".

"వెడతాలెండి" అంది సుభద్ర. ఆమెకి ఈ చెప్పడం చాలలేదు.

"ఇంకా యెప్పడో వెడతావా? అతను, ఆ బట్టలతో మోటారులో నా పక్కని కుచోడానికి జంకుతున్నాడు. సేలం చాపులు తేవాలి సుమా"

"పిన్నితో మీరే చెప్పండి"

"నేనే చెబుతాను, ముందు నువ్వు సొమ్ము తీసుకురా"

"మొత్తం తేల్చందే యెలాగా?" అన్నట్టు చూసిందామె.

"షర్టులూ కోట్లూ కూడా –"

"అవునండీ పాపం"

"ఎంత సొమ్ము పట్టుకువెళ్ళాలో యిప్పుడు తెలిసిందా?"

అంకె పెద్దదిగానే కనపడింది కాని; స్పష్టంగా లేదు. తెరలో లాగ మసక మసకగా వుండిపోయింది. దాంతో, పక్కవాటుగా చూస్తూ ఆమె ఆలోచన ప్రారంభించింది.

చేసినపని రాజాగా వుండాలి. కక్కూర్తి పనికిరాదు ....

మునపటికంటే కొంచెం బాగా కనపడుతోంది అంకె, కాని ఆమెకి ధైర్యమూ సాహసమూ యింకా కలగలేదు.

"అతను, అయిదారు మాటలు చేర్చడంవల్ల నీ కథ కెంత గాంభీర్యం వచ్చిందో జ్ఞాపకం చేసుకో. దాన్నిబట్టి యీ మొత్తం తేల్చు"

మాం–చి కొలబద్ద.

దీంతో ఆమె చూపులికి నైశిత్యం కలిగింది. తెరకూడా తొలిగిపోయింది. వెంటనే కొట్టవచ్చినట్టు కనపడింది అంకె కాని; ఆమెపైకి వుచ్చరించలేకపోయింది.

అది కనిపెట్టి అతను "పోనీ నాతో చెప్పనక్కర్లేదు. నీకెంత తోచిందో అంతా నిస్సంకోచంగా పట్టుకువెళ్ళు" అని తాళాలామె చేతిలో వుంచాడు.

అప్పటికీ ఆమె బిడియం పోలేదు. పైగా ఉన్న మౌగ్ధ్యం అంతా ఘనీభవించి మొగంమీద అలుముకుపోయింది.

"నీకు తోచకపోలేదు. నాతో చెప్పడానికి మాత్రం బిడియపడుతున్నావు. పోనీ నువ్వనుకున్నదెంతో నేను చెప్పేసుకోనా?"

ఆమె వుత్సాహం కనబరచింది. వెంటనే అతను "రెండు వంద"లన్నాడు. అది విని ఆమె మొగం వంచేసుకుని చుట్టుకుపోయినట్టయిపోయింది.

"వెర్రితల్లీ! ఎంత ఖర్చు పెడితే నీ కడ్డేమిటమ్మా? అసలు నీచేత్తో రెండు వందలు ఖర్చు పెడితే అదొక లెక్ఖటమ్మా? సందేహపడకు. వెళ్ళు, సొమ్ము పట్టుకురా."

ఇలా అని అతను, ఆమె వీపుమీద మెల్లిగా తట్టుతూ యినప్పెట్టివున్న గదికేసి పంపి–"సారథిని పిలవరా నాయడూ" అంటూ కిందికి బయలుదేరాడు.

# 16

"ఇవాళ మెయిల్లో నువ్వు చెన్నపట్టణం వెళ్ళాలోయ్"

అప్పుడే ముగించిన వుత్తరం కవర్లో పెడుతూ, జానకమ్మతోటీ, సుభద్రమ్మతోటీ యేదో మాట్లాడుతూ వున్న పంతులయ్య, తానక్కడికి వెళ్ళీ వెళ్ళడంతోటే తిరుగుడు కుర్చీతో తన కభిముఖంగా తిరుగుతూ యిలా అనేటప్పటికి "చి-త్-తం" అంటూ వులిక్కిపడ్డాడు, రామచంద్రం.

అది గమనించి "యేం, బెదిరినట్టున్నావేం?" అన్నాడు పంతులయ్య.

"లేదండి లేదండి. అక్కడి పనేమిటో తెలవకా, తమకి వుండుకున్న రాచకార్యాలు నేను నిర్వహించగలనా అన్న సందేహంవల్లా దృఢంగా మాట్టాడలేకపోయాను గాని; యిష్టం లేకా, వుత్సాహంలేకా కాదండి."

"పనంటే కోర్టు పనేమీకాదు. అమ్మాయి రాసిన చిన్న కథలు నాలుగు చేర్చి వొక సంపుటంగా అచ్చువేయించి తీసుకు రావడం"

ఈ మాట విని సుభద్ర మురిసిపోయిన్నీ సోఫాలో ముణుచుకుపోయింది.

"అయితే మరీ సంతోషంగా వెడతానండి. తమకి అందరికి పూర్తిగా తృప్తి కలిగేటట్టు నెరవేర్చుకు వస్తానండి."

"సత్యవాణిగారిచేత కథకి మూడేసి నాలుగేసీ బొమ్మలు రాయించి వొకవారం రోజుల్లో పంపిస్తాను. మొదటి కథ మొన్నటి భారతిలో పడింది సిద్ధంగానే వున్నది కదూ?"

"చిత్తం ఉందండి."

"నేను నాగేశ్వరరావు పంతులుగారి పేర రేపే వుత్తరం రాస్తాను. వారు ఆ బొమ్మల మాతృకలు దయచేయిస్తారు. అవీ, కొత్తవీ పుస్తకానికి సరిపోయే పరిమాణంలో అక్కడే బ్లాకులు చేయించు."

"చిత్తం"

"అచ్చుపని కూడా వారే చేయిస్తారు."

"సరేనండి."

"ఈలోపున పాపు రాసెయ్యడం-"

"రెండు మూడురోజుల్లోనే రాసేసి తమకి పంపుతానండి."

"ఏమంటావమ్మా? దిద్దాక నువ్వు చూడాలా?" అని అడిగాడు పంతులు సుభద్రని.

"అక్కర్లేదు నాన్నారూ! ఆలస్యంకావడం తప్ప మరేమీ లాభం లేదండి. వారెలా దిద్దినా బాగానే వుంటాయండి" అని ఆమె బదులు చెప్పింది.

"ఏం సరా?" అన్నట్టు పంతులయ్య తనకేసి చూడగా -

"నా శక్తికొద్దీ బాగా సవరించి అచ్చు వేయిస్తానండి" అన్నాడు రామచంద్రం.

"ఇవాళ మార్చి యిరవై అయిదు, ఏప్రిలు పందొమ్మిదో తేదీ యిప్పటి కెన్నాళ్ళుంది?"

"అదీ యిదీ కాక మధ్యని - యిరవై నాలుగురోజు లున్నాయండి"

"ఆవేళ అమ్మాయి పుట్టినరోజు. ఆమె కథల మొదటి సంపుటం కూడా ఆవేళ యిక్కడ అవతరించాలి."

సుభద్ర పొంగిపోతూ జానకమ్మకేసి చూసింది.

"ఆవేళ నీకు కూతురు పుదుతుందన్నమాట" అంటూ ఆమెని యెడమ చేత్తో పొదివి దగ్గిరికి తీసుకొని, కుడిచేత్తో మొగం పైకెత్తుతూ నుదురు ముద్దు పెట్టుకుంది జానకమ్మ.

దీంతో మరీ సిగ్గుపడిపోయి, వొక్కమాటు రామచంద్రం కేసి వోరచూపులు చూసి, తన మొగం తీసుకువెళ్ళి జానకమ్మ కంఠంలో దాచేసుకుంది సుభద్ర.

"శబ్దేందు శేఖరః పుత్రోమంజూషా మమ పుత్రికా" అన్నమాట జ్ఞాపకం వచ్చి మనస్సు వొక్క పొంగు పొంగాక, పంతులయ్య గంభీరంగా చూస్తూ "గడువు దాటకూడదు. పని తరవాయి వుండకూడదు. పుస్తకం చక్కగా వుండాలి. వెయ్యిప్రతులూ యేకకాలంలో పట్టించుకు రావాలి" అన్నాడు.

"అలాగేనండి"

"ప్రభల సుబ్రహ్మణ్య సోమయాజులు గారని అక్కడ పేరు పడ్డ వకీలు. వారు స్వయంగా స్టేషనుకి వచ్చి నిన్ను మైలాపూరు తీసుకువెళతారు. ఇప్పుడే వారికి తంతి వెడుతుంది. రేపీవుత్తరం చూపిస్తే వారు నీకు సమస్త సదుపాయాలూ యేర్పాటు చేస్తారు."

"చిత్తం" అంటూ రామచంద్రం ఆ కవరు పుచ్చుకున్నాడు.

"ఇందులో అయిదు నోట్లున్నాయి."

రామచంద్రం ఆ కవరు కూడా పుచ్చుకున్నాడు.

"సొమ్ము చాలకపోతే యెంత కావలసినా వారిని అడుగు. లేకపోతే యిక్కడికి తంతికొట్టు."

"అలాగేనండి"

"అది నీ సొంతసొమ్మే అనుకో. అందులో నీకు కావలసినంతా స్వేచ్ఛగా ఖర్చుపెట్టుకో, చూడవలసినవన్నీ చూడు. కావలసినవన్నీ కొనుక్కో, ఏమీ మొగమాటపడకు"

ఇది విని సుభద్రా జానకీ ఆ ఔదార్యానికి ముగ్ధులయిపోయారు.

"నా కవసరాలే తక్కువ. ఉన్నవిమాత్రం —" అని రామచంద్రం యేదో చెప్పబోగా, పంతులయ్య సగంలోనే అందుకుని "అదే వద్దంటున్నాను. వెళ్ళేది చెన్నపట్నం; అక్కడ చూడవలసినవీ, నోరూరించేవీ యెన్నో వుంటాయి. నువ్వు చిన్నవాడవు. కనక యింతగా చెబుతున్నాను" అని లాలనగా చెప్పాడు.

"ఆవేళ మెయిల్లో నువ్వు తప్పకుండా రావాలి సుమా!"

"తప్పకుండా వస్తానండి"

"ఆవేళ పుస్తకం చూడకపోతే మా అమ్మ గిలగిల్లాడి పోతుంది. ఆ పుస్తకాన్ని పురస్కరించుకుని నేనా వేళకి పెద్ద కార్యక్రమం యేర్పరచుకుంటున్నాను. నువ్వు సరిగా పని చెయ్యకపోతే అంతా చెడిపోయి, నా మనస్సు —"

"అక్కర్లే దక్కర్లేదండి. తమరు సరిగా లెక్కచూసే గడువు నిర్ణయించారు. ఆవేళ మెయిల్లో తప్పకుండా వస్తానండి పుస్తకాలతోటి."

సుభద్ర కళ్ళు ఆనందముద్రితా లయినాయి.

మెరుపు కాలింగుబెల్లు రెండు మాట్లు నొక్కి పంతులయ్య "క్రౌన్ సైజుట. ఫెదర్ వెయిటు కాగితాలుట. కాలికో బైండుట, బాగా జ్ఞాపకం పెట్టుకో" అనగా "నే నలాగే అనుకున్నానండి" అన్నాడు రామచంద్రం.

ఇంతలో "యేమి సెలవు?" అంటూ రెండో గుమస్తా వచ్చి దూరంగా నుంచున్నాడు.

"బజారుకి వెళ్ళాలి."

"చిత్తం."

"మెయిల్లో రామచంద్రం మద్రాసు వెడుతున్నాడు. అడుగున్నర తోలు సూటు కే సొకటీ, హోల్డాల్ వొకటీ - పక్క సామగ్రితో అన్నమాట - పార్కర్ కలం వొకటీ నిమిషాలమీద కొని పట్టుకురావాలి. బజారులో వున్నంతలో మంచి రకం కావాలి. ఈ తంతి సూరయ్య కిచ్చి, వెంటనే పోష్టాఫీసుకి వెళ్ళమను."

ఇలా చెబుతూ పంతులయ్య, నూరు రూపాయల నోటొకటీ, తంతి కాగితం వొకటీ యిచ్చి అతన్ని వెళ్ళిపొమ్మన్నాడు.

"మంచివి తెస్తాడో లేడో?" అన్నట్టు అనుమానదృష్టితో సుభద్రా, "లేకపోతే యెరగడూ?" అన్నట్టు జంకెన చూపులతో జానకమ్మా వొకర్ని వొకరు చూసుకున్నారు.

## 17

గుమస్తా వెళ్ళిపోయాడు. మెట్లమీది అతని కాళ్ళ చప్పుడు అంతకిముందే వెళ్ళిపోయింది.

"అమ్మా" అని పిలిచాడు పంతులయ్య.

"తయారుగా వున్నా" నన్నట్టు ఆమె నిటాగ్గా కూచుంది; కాని యెవరో అదిమేస్తున్నట్టు వెంటనే ముణుచుకుపోయింది.

ఆమె హృదయం దుడుకూ దుడుకూ కొట్టుకుంది.

"నీ చేత్తోటే యివ్వాలి. తొరగా కానియ్యి తల్లీ" అని మళ్లీ అన్నాడతను.

సుభద్ర చూపులూ, జానకమ్మ చూపులూ హఠాత్తుగా తారసిల్లాయి.

తండ్రికేసి చూడలేక పింతల్లి కేసి చూసింది పాపం సుభద్ర; కాని అక్కడ కూడా తండ్రి చూపుల్లో వున్న గాంభీర్యమే వుండడం గుర్తించి, ఆ చిరునవ్వులో "ఎన్నిమాట్లు చెప్పించుకుంటావ్" అని ముదలకిస్తున్న భావన కూడా వున్నట్టు గమనించి, మరీ సిగ్గుపడిపోయి మొగం వంచేసుకుంది.

పంతులయ్య జానకమ్మ కేసి చూశాడు.

వెంటనే జానకమ్మ వాత్సల్యంతో రెక్కపట్టుకుని లేవదీసి "నువ్వు తలపెట్టిందే కాదూ యిదీ?" అని మెల్లిగా చెవిలో వూది నింపాదిగా మేజా దగ్గరికి తీసుకువచ్చి, మేజామీద వున్న తాంబూలం బట్టల దొంతరమీద పెట్టి "ఊ, కానియ్యి తల్లీ" అంది.

అప్పటికి సుభద్రకి సాహసం కలిగింది. దొంతర అంతా యెత్తబోయి సాధ్యపడక పగమే పుచ్చుకుని వొక్కమాటు రామచంద్రం కేసి చూసి మళ్ళీ తలవంచుకుంది.

రామచంద్రం చూపులు అప్పటికీ పంతులయ్యమీదే వున్నాయి. అవి మేజాకేసి తిరగనే లేదు.

పంతులయ్య అది కనిపెట్టి గంభీరంగా చూస్తూ "అవి పుచ్చుకోవోయీ" అన్నాడు.

పంచెలు, కండువాలు, షర్టుగుడ్డలు, కోటుగుడ్డలు; వొక్కొక్కటే కాదు, చాలా చాలా.

"ఇవన్నీ నీకోసమే" అని తాంబూలం రాగగర్భితంగా సూచిస్తూనే వుంది; కాని రామచంద్రం అదేమిటో గ్రహించుకోలేకపోయాడు.

ఒక్క అడుగు ముందుకివేసి "అవేం చెయ్యమంటారండి?" అని అమాయకంగా అడిగాడతను.

జానకమ్మ "వెర్రినాయన" అన్నట్టు జాలిగా చూసింది. సుభద్ర "చెప్పకోలేక పోయారు" అనుకుంటూ లోపల్లోపల నవ్వుకుంది.

"నువ్వు వాడుకో. అవి నీకు బహుమతి చేస్తోంది మా అమ్మ. నువ్విందాకా పంచెకి సబ్బు పట్టించుకోడం చూసిందది. నీకు బట్టలు తక్కువగా వున్నట్టు గ్రహించి అదీ తల్లీ బజారుకి వెళ్ళి అవి తీసుకువచ్చారు. పుచ్చుకో. చొక్కాలు చెన్నపట్నంలో కుట్టించుకో" అని వివరంగా చెప్పాడు పంతులయ్య.

రామచంద్రం వాటికేసి వొక్కమాటు చూసి తరవాత పంతులయ్య కేసి మిడుతూ మిడుతూ చూశాడు.

"ఏం, అలా చూస్తావేం?"

"నాకు రెండు పంచెలే వున్నాయండి. మరో రెండు పంచెలయినా వుంటే బాగుండుననే అనిపిస్తోంది; కాని అలాంటి బట్టలూ – "

"నువ్వు చెప్పేదేమిటోయ్?"

"నాకు తాహతు –"

"మాట్లాడితే తాహతు, తాహతు! నీకు తాహతుకేం తక్కువోయ్?"

"నీకు తాహతే లేకపోతే వారి ప్రాపకం యెలా దొరుకుతుంది నాయనా" అంది జానకమ్మ.

"మరే" అన్నట్టొకమాటు క్రీగంట చూసి మళ్ళీ సిగ్గుపడింది సుభద్ర.

జానకమ్మ అన్నమాటతో రామచంద్రం హృదయం ఆర్ద్రమయిపోయింది.

"ఏమిటో నాకాదృష్టి లేకపోయింది; కాని వచ్చినప్పణ్ణుంచే నువ్విలాంటి బట్టలు కట్టవలసినవాడవు. పుచ్చుకో పుచ్చుకో. మోటార్లో నా పక్కని కూచోడానికి నువ్విక యిలాంటి బట్టలే కట్టాలి" అని దృఢంగా చెప్పాడు పంతులయ్య.

దానిమీద మళ్ళీ జానకమ్మ అందుకుని "లేనిపోని కుశ్శంకలు పెంచుకుని గజిబిజి పడకు. తలుచుకున్నారంటే కొసిరి కొసిరి యివ్వడం వారికి చేతకాదు. అప్పైని, మా అమ్మకి కలిగిన సంకల్పం యిది. ఎన్ని అంగళ్ళు చూసినా యింతకంటె మంచిరకం దొరకలేదు. లేకపోతే నీకు మా సుభద్ర యివ్వడం యిలాంటివేనా? ఇప్పటికివి పుచ్చుకుని లక్షణంగా కట్టుకో నాయనా" అని బుజ్జగిస్తూ చెప్పింది.

"నా కథలు దిద్దినట్టే మీరు మీ వేషం కూడా దిద్దుకోవద్దూ?" అందామనుకుంది సుభద్ర. మాట నాలుక చివరికి తెచ్చుకుంది కాని; దానితోటే సిగ్గుకూడా తోసుకురాగా నోరు మెదపలేకపోయింది. ఎత్తిన మొగం కూడా దించేసుకుంది.

ఇంత చెప్పినా రామచంద్రం సాహసించలేకపోయాడు.

"మనవి చేసుకుంటున్నాను –"

"నేను చిత్తగించుకుంటున్నాను కాని; ఆలస్యం కావడం తప్ప మరేమీ ప్రయోజనం లేదు."

"నా స్థితిగతులు తమరు కొంచెం యోచించకోరుతున్నాను. వెనకా ముందూ వుండే సందర్భాలు –"

"అవన్నీ బాగా యోచించే నే నీ యేర్పాటు చేశాను. నీ తల విలవ నీకు తెలవదు. ఇక మాట్లాడవద్దు, పుచ్చుకో"

పంతులయ్య యిలా అనేటప్పటికి రామచంద్రానికి వాగ్బంధనం అయిపోయింది. కళ్ళల్లో ఆనందబాష్పాలు గిర్రున తిరిగిపోయాయి. హృదయం అంతా కృతజ్ఞతాభావం నిండిపోయింది. అప్రయత్నంగా వెళ్ళి వెంటనే అతను పంతులయ్య పాదాలు పట్టుకున్నాడు.

అందరి కళ్ళూ అర్ద్రాలయినాయి.

అందరి హృదయాలూ ముగ్ధాలయిపోయాయి.

అందరి కంఠాలూ రుద్ధాలయిపోయాయి.

కాని, మేఘ గంభీరనిస్వనంతో గంటలు కొద్దీ విలాసంగా మహోపన్యాసాలు చెయ్యగల గొప్ప వక్త కనక – అయినా అతి ప్రయత్నం మీద, పంతులయ్య మాత్రమే, మాట్లాడగలిగాడు.

అప్పుడేనా "పుచ్చుకో" అని మాత్రమే పలికి అతను రామచంద్రం వీపు నిమిరాడు.

ఈ స్పర్శ రామచంద్రం రక్తనాళాల్లో మెరుపులు మొలిపించింది. అయినా కృతజ్ఞత అతి భారంగా వుండడంవల్ల అతను చాలా మెల్లిగా ముందుకి అడుగు వేశాడు.

జానకమ్మ, సుభద్రని కూడా వొక్క అడుగు ముందుకి వేయించింది.

అయితే, ఆ లేతహృదయాలు రెండూ కూడా ఆ సాన్నిధ్యం భరించలేకపోయాయి.

వెంటనే వొణుకుతూ వొణుకుతూనే ఆ బట్టలు రెండు దొంతర్లుగా సుభద్ర అందించగా, జంకుతూ జంకుతూనే రామచంద్రం వాటిని అందుకున్నాడు.

అదిచూసి జానకమ్మా, పంతులయ్యా యేదో మహోత్సవం చూస్తూవున్న ఆనందం అనుభవించారు.

ఇచ్చేటప్పుడు సుభద్రకీ, పుచ్చుకునేటప్పుడు రామచంద్రానికీ వొకరి చెయ్యి వొకరికి తగిలింది.

దాంతో రామచంద్రం శరీరం వొణికిపోయింది. సుభద్ర వొళ్ళు ఝల్లుమంది.

## |18|

"మిర్తిపాటి కాయలుట. అప్పలమ్మ బత్తాయి కాయలు తెచ్చింది నాన్నారూ"

"ఏమంటుంది?"

"ఇవ్వకుండా వెళ్ళదుట"

"దానబ్బసొమ్ము దాచపెట్టిందా యేమి టిక్కడ? అయితే యేమాత్రం తెచ్చిందిట?"

"గంపెడు"

"ఇవాళకి పాతికకాయలు పుచ్చుకో. మళ్ళీ రేపురమ్మను"

సుభద్ర కదల్లేదు.

ఈ జవాబు ఆమెకి నచ్చలేదు. ఆమె వుద్దేశించుకు వచ్చిన సంగతే బయటికి రాలేదు. పోనీ, మాటల ధోరణిలో యిక ముందు రాకూడదూ అంటే, యిలా జవాబు చెప్పి అతను మళ్ళీ పత్రిక చదువులో పడిపోయాడు.

ఒక్కక్షణం ఆమె ఆలోచించింది. భావచక్రం వొక్కమాటు గిర్రున తిరిగి పోయింది. తమాయించగా వొక్క చక్కని మార్గం కనపడింది.

దానిమీద "ఈపాటికి కథలు సాపు రాసెయ్యడం అయిపోయి వుండదుటండీ నాన్నారూ?" అంటూ అందుకుందామె.

"అయిపోయే వుండవచ్చు" అని పత్రిక చదువుకుంటూనే అతను జవాబు చెప్పాడు.

"ఇవాళో రేపో అచ్చు మొదలు పెడతారన్నమాట. కాదుటండీ నాన్నారూ?"

దృష్టి అంతా పత్రికమీదే వుంది కాని; అతనికి మళ్ళించుకోక తప్పింది కాదు.

"అలా యెందుకూ? రాసిందల్లా అచ్చు వేయించేస్తూ వుండవచ్చు కాదుటమ్మా?"

"అవును నాన్నారూ! అలా చేయించమని రామచంద్రం గారికి రాయండీ"

"అతనికి తెలవదుటమ్మా అదీ?"

ఈ మాట అన్నప్పుడతని శ్రద్ధ అంతా పత్రికమీద నుంచి మళ్ళీ వుండడం ఆమె గ్రహించింది. వెంటనే "ఏమండీ? మనం రాస్తే యేమండీ? మొన్న భారతిలో పడ్డ కథ సిద్ధంగానే వుంది కాదుటండీ?" అని అడిగింది.

"అది మొదటే వెయ్యవలసింది కదా, యీ మాత్రం ఆలోచనే అతనికి తట్టదూ తల్లీ?"

ఇలా అడిగి, మరొక్కక్షణం ఆమెకేసి నిదానంగా చూసి, తరవాత "అయినా మనమేమీ రాయవద్దు. గడువునాటికి పుస్తకాలు పట్టించుకురాగలడో రాలేడో చూద్దాం" అంటూ మళ్ళీ పత్రిక చదువుకోసాగాడతను.

ఈ మాట ఆమె లేతహృదయంమీద ములుకులాగ కసిక్కున గుచ్చుకుంది. "తేగలరో తేలేరో పాపం" అంటూ ఆ వ్యధితహృదయం తపా తపా కొట్టుకుంది.

పంతులయ్య అప్పటికీ దారికి రాకపోవడమే కాదు, రావడానికి అవకాశాలున్నట్టు కూడా కనపడలేదు.

అయితే వచ్చిన పని కాకుండా ఆమె అక్కణ్ణుంచి కదలదలుచుకోలేదు.

"అమ్మాయిగోరూ, అమ్మాయిగోరూ" అని కేకమీద కేకవేస్తూ కింద అప్పలమ్మ గోల చేస్తూ వుండడమూ, "అంత తొందరయితే యెలాగే మరీ?" అని జానకమ్మ కూకలేస్తూ వుండడమూ, వుండుండి కొంచెం కొంచెం వినపడుతూనే వుంది.

అయినా అది లెక్క చెయ్యలేదామె.

నిశ్చలంగా అలాగే నుంచుంది. రెప్ప వెయ్యకుండా తండ్రికేసి వొక్కచూపు చూసింది. తన పట్టుదలకి వుబికివుబికి వచ్చే నవ్వు బాగా అదుముకుంది.

చివరికి "చెన్నాపట్నంలో యింత మంచి బత్తాయిపళ్ళు దొరకవు కాదుటండీ నాన్నారూ?" అని కొంటెచూపులు చూస్తూ అడిగిందామె.

అయినా దృష్టి అంతా చదువుమీదే పెట్టుకుని, చూపులు కూడా పత్రిక మీదే వుంచుకుని "అక్కడ యింత మంచివి దొరకవు. అక్కడ దొరికేవి మనకి నచ్చవు; కాని అక్కడి వారి కవే అమృతగుటికలు" అని దానికతను యాదాలాభంగా జవాబు చెప్పి వూరుకున్నాడు.

"ఇంకా పత్రిక విడిచిపెట్టరూ?" అన్నట్టొక్కమాటు శిరస్సు పంకించి ఆమె "అలాగే కనపడుతోంది. ఇక్కడి వాళ్ళక్కడికి వెడితే అవి కనపడ్డప్పుడల్లా యిక్కడి పళ్ళు తలచుకుని గుటకలు మింగుతూ కూచోవలసిందే కామోసు" అంది.

ఊరుకొన్నట్టే వూరుకుని "మహా బాగా చెప్పావమ్మా" అని మందర స్థాయిలో జవాబు చెప్పి మళ్ళీ పత్రికాపఠనంలో పడిపోయాడతను.

కార్యాంతరవ్యగ్రతే తండ్రిని ఆ స్థితిలో వుంచిందని తెలిసి వుండినా సుభద్రకి విసుగు వచ్చింది. అయినా వొక్కనిమిషం చూసి చూసి యిక అలస్యం కానివ్వకూడదని ధోరణి మార్చేసింది.

"ఏమండీ, నాన్నారూ? పోనీ యిక్కణ్ణుంచి వెళ్ళిన వాళ్ళకోసం అక్కడి వర్తకులు ఇక్కణ్ణుంచి తీసుకువెళ్ళి అమ్మకూడదుటండీ?"

"అమ్మవచ్చు. అమ్మితేనే బాగుండును."

పత్రిక చూస్తూనే యిలా అన్నాడతను. అంతటితో వూరుకోబోయాడు కాని; సాగిందికాదు.

"సుభద్ర మాటలో స్వరం కొంచెం భేదించిందిసుమా?" అని చెవులు రహస్యంగా అందించగా "అదేదో చూడ్డం వుందా, నీ ధోరణే నీదా?" అని హృదయం మందలించింది.

ఉలిక్కిపడ్డా డతను. చేతిలో వున్న పత్రిక వొళ్ళోకి జారిపోయింది.

దీంతో అటుండిన శ్రద్ధ యిటు తిరగ్గా "పోనీ, రామచంద్రాని కేమయినా పంపుదామా తల్లీ?" అని అప్రయత్నంగా అనేశాడతను.

"అమ్మయ్యా" అనిపించింది సుభద్రకి.

ఆనందం తల ములకలయిపోయింది; కాని ఆ జంజాటంలో పడిపోయి జాప్యం చేస్తే మళ్ళీ అతనెక్కడ తిరిగిపోతాడో అని "పంపించండి నాన్నారూ" అంటూ అవ్యవధానంగా అందుకుందామె.

"పాపం – సాపు రాయడమూ, ప్రూఫులు దిద్దడమూ, మైలాపూరూ టవునూ మధ్యట్రాముల్లోనో, బస్సుల్లోనో తిరగడమూ–"

"అయితే తెచ్చినవన్నీ యిచ్చేసి పొమ్మను అప్పలమ్మని" అంటూ సరిగా కూచున్నాడతను.

అతని చూపులన్నీ సుభద్ర మొగంమీద వున్నాయి.

తన అంతరంగం పరిశీలిస్తున్నాడేమో అని ఆమె కొంచెం బెదిరింది. ఏమయినా ధోరణి కొంచెం మార్చాలని నిశ్చయించుకుని "పాపం, వారి మూలాన నా కథ లించక్క తయారవుతాయి. పుస్తకం కూడా ముద్దులు మూటకడుతూ వుంటుంది. కదుటండీ నాన్నారూ?" అని బెల్లిస్తూ అడిగిందామె.

"మరే" అంటూ అలాగే చూశాడతను.

"బొమ్మలు కూడా వుంటాయి కనక పుస్తకం విడిచిపెట్ట బుద్దికాదు. అవునా నాన్నారూ?"

"ఇంకా సందేహమా?"

ఇలా అని రిస్టువాచీ చూసి "అప్పుడే పదయింది. ఇంకా బుట్ట కొనాలి. కట్టాలి, స్టేషనుకి వెళ్ళాలి —" అంటూ అతను తొందరపడగా "తెచ్చిన పళ్ళన్నీ పుచ్చుకోనా?" అని ఆమె తొందరలేనట్టడిగింది.

"వందేనా వుంటాయా?" అని అడిగాడతను. ఆ లోచించి "తక్కువయితే తెమ్మంటాను, ఏం?" అంటూ తల యెగరవేసుకుంటూ యెదురడిగిందామె.

"తెమ్మను"

"మనకి రెండు డజన్లు చాలు. మళ్ళీ రేపు తెస్తుంది కాదూ? అవునా నాన్నారూ?"

"అవును."

"సూరయ్యగారి నిక్కడికి పంపించనా?"

"పంపించు."

సుభద్ర పొంగిపోతూ బయలుదేరింది. ఇలా తిరగడంతోటే నక్కి వుండిన ఆనందం అంతా వొక్కమాటుగా ఆమె మొగం కమ్మేసింది కాని; "అయితేనూ? ....... అమ్మా" అంటూ పంతులయ్య మళ్ళీ యేమిటో ప్రారంభించాడు.

మళ్ళీ గాంభీర్యం కొనితెచ్చుకుని, విధిలేక ఆగి, మొగం యిలా తిప్పిందామె.

"వందే పంపితే యెలాగమ్మా?" అని అడిగాడతను.

అక్కడికి తానే మహా పొదుపయిన మనిషిలాగ "అంతకంటే యెందుకండీ?" అంటూ కళ్ళు తిప్పుకుంది ఆమె.

"సోమయాజులు గారికి పంపకుండా వారి యింట్లోవున్న రామచంద్రానికి పంపి వూరుకుంటే బాగుంటుందా?" అంటూ నసిగా డతను.

ఇది విని ఆమె వులిక్కిపడింది.

ఇదంతా ముస్పద్దీ పేచీలాగ కనపడిందామెకి.

దానిమీద "వారం రోజుల కిందటే కాదుటండీ రెండు వందలు బత్తాయిలూ, రెండు వందలు నారింజలూ పంపాము వారికీ?" అని యెదురు వాదం చేసింది.

"అయినా బాగుండదమ్మా! మూడు వందలు తెమ్మను."

—గే" అనక తప్పింది కాదు. ఈ మాట ఆమె వో పట్టాన అవలేకపోయింది.

"వాటిలో వొక వంద, ప్రత్యేకంగా రామచంద్రంగారికని రాయిస్తే బాగుంటుందో, బాగుండదో? అలా రాయించక పోతే కామేశ్వరమ్మ పిన్నిగారు పది పళ్లయినా వారి చేతితో పెడతారో పెట్టరో?" అని ఆమెకి బెంగ పట్టుకుంది.

ఇంతలో జాబు రాయడానికి పంతులయ్య కలమూ కాగితమూ పుచ్చుకున్నాడు.

అది చూడగానే ఆమె మనస్సులో వొక మెరుపు మెరిసినట్టయింది.

"ఇదంతా పిన్నితో చెబుతాను. పిన్నిచేత వొక చీటీ రాయించి, అది బుట్టలో పడేయిస్తాను" అనుకుందామె.

కాని, మొత్తానికి, యెంత వుబలాటపడుతూ పైకి వచ్చిందో, తండ్రి దారికి రావడం చూసి యెంత సంబరపడిపోయిందో, చివరికి, అంత దిగాలుపడిపోయి యెత్తడిపోయిన మనిషిలాగ కాళ్ళీడ్చుకుంటూ కిందికి వెళ్ళిపోయింది.

## 19

"మొన్న మనం కొన్నామూ — కోటు గుడ్డలూ—? వాటిలో నీలాపురంగుదీ—? 'నేవీబ్లూ' అంటారు దాన్ని. మిల మిల మెరిసిపోతోంది, కాదుటే పిన్నీ అదీ?"

"మరే"

"చెన్నాపట్టంలో వాళ్ళు కుడితే చొక్కాలు వొంటికి పూసినట్టు సరిపోతాయట. నాన్నారి కోట్లన్నీ అక్కడ కుట్టించుకున్నవే."

"అవునుట."

"ఆ పేలం పంచెలు తెలుపు చేయిస్తే పాము మీసంలాగ మెరిసిపోతాయి."

"తే—ల్లని ఆ పంచెలూ, ఆ నీలాపు కోటూ వేసుకుంటే, పా—చ్చని రామచంద్రం — కళ్ళు చెదిరిపోతాయి. కదూ తల్లీ?"

కొంటె చూపులు చూస్తూ యిలా అడిగింది జానకమ్మ. కాని మీగడ గిన్ని వొంచుకుంటూ వున్న సుభద్ర, పక్క చూడ్డానికి వీలులేక "ఊ, ఊ" అంటూ పొంగిపోయింది.

జానకమ్మ, తరువాత కూడా వొక్క క్షణం వోరచూపులే చూసి, కనిపెడితే సిగ్గుపడిపోతుందని జాలిపడి "ఆ కోటు కిందికి బాగుంటుందని ముచ్చటపడితే, నాలుగు కొట్లు తిరిగితేగాని సన్న యెరుపు చారల పాపులెను దొరికిందే కాదు చాశావా?" అని మొగం కంచం మీదికి తిప్పేసుకుని, మళ్ళీ యేమీ యెరగనట్టు చూస్తూ "ఆ వేళ కొత్త సరుకు వచ్చింది. కనక ముద్దినుసు రకాలూ దొరికాయి. ఆ ఆకు పచ్చంచు చాపూ — జ్ఞాపకం వుందా? కళ్ళకి కట్టినట్టు కనపడుతోందది" అంది తల యెగరవేసుకుంటూనూ.

"మరే మరే"

"అన్నిటిలోనూ అదే బాగా నచ్చింది మీ నాన్నగారికి — జ్ఞాపకం లేదూ?"

"అవును, కాని పిన్నీ, నిన్న మా నాన్నారు తెప్పించుకున్నవి చూస్తే జ్ఞాపకం వచ్చిందే. వుప్పాడ కండువాలు కూడా రెండు జతలు కొనవలసింది సుమా?"

"నాకు మొదణ్ణుంచీ జ్ఞాపకం వుంది; కాని యెన్నిమాట్లు తీసినా అయిదూ సేలంవే తీస్తూ వచ్చావు నువ్వు. అవంటే నీకంత సరదా అయినప్పుడు కాదనడం యెందుకని నే నూరుకున్నాను."

"చూ–శావా?.... కాస్త అందించి చూస్తే యేమే మా తల్లీ? నేనేనా వొకదానికంటే వొకటి బాగుండడంవల్ల అవి విడిచి పెట్టలేకపోయాను. అక్కడికీ వొకదానికి డబ్బు లేకేపోయింది."

"అదే వచ్చింది పులకం,. ఒక్క పది రూపాయలయినా మిగిలితే నేను జ్ఞాపకం చేసి వుందును."

"అసలు, రెండువందల యాభై పట్టుకువెళ్ళవలసింది."

"పోనీ, అతనింటికి వచ్చాక కొని యివ్వరాదూ? ఇంతలో మించిపోయిందేమిటి?"

"అలా అన్నావా?" అంటూ ఆలోచనలోపడి, సుభద్ర, యెత్తినముద్ద కంచంలో పెట్టేసింది.

"మీ నాన్న మాత్రం వొద్దంటారా యేమిటి?"

"మా నాన్నా రలాంటివారు కారు సుమా పాపం. దయ వచ్చిందంటే కొసిరి కొసిరి యివ్వడం యెరగరు వారు."

"అవతలి వాళ్ళకి అంత కావాలా అనయినా చూడ్డంలేదు. ఇవ్వడం వొక్కటే తెలుసు వారికి. నా బీరువాలో యాభై చీరలకి తక్కువ వున్నాయా? అందులో వొకటయినా పదిహేను రూపాయలకి తక్కువది వుందా. కొన్ని జరీముద్దలే కదా?"

"అదేమిటే, మనిషికి బట్టలే కాదుటే అందం?"

"నిజమేలే."

"ఆవేళ వారు పంచెకి సబ్బు పెట్టుకుంటూ వుంటే నాకు జాలివేసింది. అప్పటిదాకా యెంత యిబ్బంది పడ్డారో?"

"బీదవాళ్ళకి యిబ్బంది కాకపోతే సబ్బంది యెలా వస్తుంది తల్లీ?"

ఈ మాట అన్నప్పుడు, ట్యూటరుగా వున్నప్పుడు బట్టలకోసం తానెంత ఇబ్బంది పడ్డదీ జ్ఞాపకం వచ్చి జానకమ్మ వొణికిపోయింది.

"వారికి బట్టలు కొనిపెట్టండని నోరుజారి వచ్చేసింది మాట. నాన్నారేమంటారో, అసలు, యేమనుకుంటారో అని గుండెలు పీచు పీచు మని – నేను బేజారయిపోయానేవ్ పిన్నోయ్."

"అదలా అనిపిస్తుం దమ్మా"

"ఇప్పుడు వుప్పాడ కండువాల మాట చెప్పినా – నాన్నారి క్కోపం వస్తుందేమోనే. చెప్పవద్దే. ఏమే పిన్నీ?"

"నీకంత భయం అయితే నేను చెబుతాలే అమ్మా?"

"అవును, నువ్వు చెప్పవే. నువ్వు చెబితే, నాన్నారు వెంటనే తెప్పించి చెన్నాపట్టం పంపేస్తారు కూడానూ. కదుటే పిన్నీ?"

"అలాగే."

"రామచంద్రంగారి మూలానే నా కథలు, పుస్తకం అయిపోతున్నాయి. ఆవేళ వారా కథ సవరించకపోతే నాకీ వూహ తోచకపోవును. వారి మేలు మరిచిపోగూడదు.

ఈ పుస్తకం వచ్చాక తక్కిన కథలుకూడా అచ్చువేయించి పెట్టమని కోరాలి నాన్నార్ని. ఈ మాటు చెన్నాపట్టం పంపాటప్పుడు అక్కడ రిస్టువాచీ కొనుక్కోమంటారు నాన్నారు వారిని."

"మీ నాన్న తప్పకుండా అలా అంటారు. చూశావుకాదూ – నాకు వొద్దు మొర్రో అంటూ వుంటే వచ్చిన వారం దినాలకే యీ రవ్వల వుంగరం కొని పెట్టారూ వేలికీ? దీని మూలాన, పంతులుగారి తోటకి వెళ్ళడం ఖరాగా వొకవారం ఆలస్యం అయినా మానేరా?"

"అవునవును. పోనీ, రిస్టువాచీ కంటే – ఏమంటావే నువ్వు పిన్నీ?"

"అదా యిదా అని అంత ఆలోచన యెందుకే? రెండూ –"

"బాబోయ్."

ఇలా అని సుభద్ర, అప్పటికయిన ఆలస్యం కూడదీసుకోడానికా అన్నట్టు గబగబా భోజనం చేసేసింది.

## 20

రామచంద్రం చెన్నపట్టం వెళ్ళాక రోజులు గడిచినకొద్దీ సుభద్ర మనస్సేమిటేమిటో గజిబిజిపడిపోసాగింది.

అదివరకి ఆమె యేపని చేసినా యేకాగ్రచిత్తంతో చేసేది. అలాంటి మనిషి కిప్పుడు మనస్సు దేనిమీదా, కాస్తసేపూ నిలవడం లేదు.

ఎంత మంచిపుస్తకం పుచ్చుకున్నా నాలుగు బంతులు చదివాటప్పటికి చప్పచప్పగా వున్నట్టు తోస్తుంది.

ఎంత పేరుపడ్డ పత్రిక విప్పినా చదవతగ్గ రచన కనపడదు.

గ్రామోఫోను దగ్గిర కూచుంటే బ్రేకువేసిన గుడ్సు రెయిలు చప్పుడా అనిపిస్తుంది. వీణ అందుకుంటే శ్రుతే కలవదు.

తోటలోకి వెడితే వొకచెట్టూ, వొక పాదా, వొక తీగా సజీవంగా కనపడదు. ఒక పువ్వూ ముట్టుకోవాలని వుండదు. అప్రయత్నంగా కొయ్యడం తటస్థపడితే నాలుగడుగుల వేశాటప్పటికి దానికదే చేతిలోనుంచి జారిపోతుంది.

రాత్రిళ్ళు చప్పున నిద్రపట్టదు. పట్టడమే వస్తే గాఢంగా వుండదు. ఏమిటేమిటో కలలు వస్తాయి. మళ్ళీ బాగా చీకటి వుండగానే మెళుకువ వచ్చేస్తుంది. కన్ను పొడుచుకున్నా మరి నిద్రరాదు. లేచాటప్పటికి కళ్ళు బరువుగా వుంటాయి.

స్నానం చేశాటప్పుడొక్కొక్కనాడు సబ్బుమాట మరిచి పోతుంది. ఒక్కొక్కప్పుడు తడిబట్ట విడవకుండానే తల దిద్దుకుంటుంది.

బీరువా తెరుస్తుంది కాని చీరా జాకెట్టూ వోపట్టాన యేరుకోలేదు. ఏరుకున్న దయినా తీరా కట్టుకున్నాక "అబ్బే" అనుకుంటూ వుంటుంది.

నిలువుటద్దం యెదట నుంచుంటే మొగం వాడిపోయినట్టూ, కళ్ళు అలిసి పోయినట్టూ అనుకుంటుంది.

ఫలహారానికొచ్చోవాలనే వుండదు. కూచుంటే చెయ్యి చాపదు. చాపితే

యెంతసేపటికో గాని యే పదార్థమూ నోట వుంచుకోలేదు. ఉంచుకుంటే రుచే కనిపెట్టలేదు.

కాఫీలో ఘాటూ కమ్మదనమూ కనపడక సగం సగమే చప్పరించి వూరుకుంటుంది.

భోజనానికూర్చుంటే మాటలేకాని లోపల కేమీపోదు. మూడాకులతోటే తాంబూలం పూర్తి అయిపోతుంది.

కథ రాయాలని కూచుంటుంది. మొదటి సంపుటం అచ్చయి వచ్చాటప్పటికి, వున్న కథలు అలా వుండగా మరో సంపుటానికి సరిపడ్డ కథలు రాసెయ్యాలని సంకల్పం. అయితే, తిరుగుడు కుర్చీయేకాని చెయ్యి తిరగదు. కాళ్ళేకాని కలం ఆడదు. మొదట ప్లాటే కుదరదు. కుదిరితే వుపక్రమోప సంహారాలు అతికినట్టు కనపడదు. కనపడితే ఆ కథలో విశిష్టత వున్నట్టు తోచదు.

పాతకథలు తీస్తే, అన్నీ వొదులు వొదులుగా కనపడతాయి. వాటిలో యెన్నోఘట్టాలు అసందర్భంగానూ, యెన్నో వర్ణనలు అసహజంగానూ, యెన్నో మాటలు పేలవంగానూ కనపడి "యేమిటీ యీ రాతా?" అనిపిస్తాయి.

ఒక్క రామచంద్రం సాపు రాసిన కథమాత్రం పొంకంగా కనపడుతుంది. అది యెన్నిమాట్లు చదివినా విసువురాదు. పైపెచ్చు, చదివినకొద్దీ సారస్యాలు కనపడతాయి.

వెంటనే ఆమె దృష్టి అంతా అతనిమీద సుడితిరిగిపోతుంది.

ఆమె, అతని ఆకారం రూపించుకుంటుంది. చేష్టలు మననం చేసుకుంటుంది. మాటలు జ్ఞాపకం చేసుకుంటుంది.

ఆ సందర్భాలలో వొక్కొక్కప్పుడు బొమ్మలాగ వుండిపోతుంది.

హఠాత్తుగా పంచెకి సబ్బుపట్టిస్తూ వున్న ఘట్టాలు జ్ఞాపకం చేసుకుని మనస్సు చివుక్కు మనిపించుకుంటుంది.

ఒకనాడామె యేదో పనిమీద ద్వారమండపంలోకి వెడుతూ వుండగా అప్రయత్నంగా రామచంద్రగది కనపడింది. వెంటనే ఆమెకి తలుపు తియ్యాలని తోచింది. గదిలోకి వెళ్ళాక అతని కేమేమి సామాను ఎలాంటిది వుందో చూడాలనిపించింది; కాని యెన్నిమాట్లెన్నివైపుల తిరిగినా చిలక్కొయ్యిని వేలాడుతూ రైలుసంచీ తప్ప మరేమీ కనపడలేదు.

అదేనా తప్పగా వుంది. ఏమీ లేకపోతుందా అని చూస్తే అయ్యావార్లంగారి నట్టిల్లు.

"పాపం" అని జాలిపడింది.

తరవాత పక్కకి చూడగా కుర్చీమీదా మేజామీదా సన్ననిధూళి కనపడింది. అది చూశాటప్పటి కామెచూపులు జిలజిల్లాడిపోయాయి.

ఆమె భరించలేకపోయింది.

వెంటనే పనిమనిషిని రప్పించి, గది అంతా తుడిపించి నీళ్ళు చిలకరించి, తుండుగుడ్డతో బల్లా, కుర్చీ స్వయంగా బాగుచేసింది.

ఇదంతా అయాటప్పటికి కామెకొక కమ్మనికోరిక కలిగింది.

వెంటనే తలుపులు వేసేసింది. కిటికీతలుపులు కూడా బిగించేసింది. లైటు వేసింది. మెల్లిగా, మురిసిపోతూ వెళ్ళి కుర్చీమీద కూచుంది; కాని వెనక్కి చేరబడీ

చేరబడ్డంతోనే యెవరో కితకితలు పెట్టినట్టు కాగా యెరిగిపడి లేచి నుంచుంది.

ఒక్క క్షణందాకా ఆమెకి ఆ వులుకు పోలేదు.

తరవాత మేజా సొరుగు లాగింది. దాల్లోవున్న రూళ్ళ కాగితాలు చెదిరి చెదిరి వుండగా, చక్కగా కుదించి, బొత్తిగా పెట్టి మళ్ళీ సొరుగు మెల్లిగా వేసేసింది.

గదిలో చెయ్యవలసిందంతా అయిపోయింది; కాని అప్పుడు "ఎందుకిలా చెయ్యడం?" అని యెవరో అడిగినట్లయింది.

వోస్! "ఎందుకు"ట "ఎందుకు?"

తను కథలు దిద్ది పెడుతున్నాడుకదూ? చెన్నాపట్టంకెళ్ళి సంపుటంగా అచ్చువేయిస్తున్నాడు కదూ?

ప్రతీదానికీ ఆమె యీ కారణమే వూహించుకునేది. ఈ కారణమే చెప్పుకునేది; కాని యిందులో వూతం చాలినట్టు కనపడేదికాదు. ఎంత సరిపుచ్చుకుందామనుకున్నా యేదో లోటుగా వున్నట్టూ, యెంతమాత్రమూ అతకనట్టూ తోచేది.

అసలేమిటో మాత్రం అవగాహన అయేది కాదు.

ఉన్నట్టుండగా ఆమెకి అతని ఫోటో చూడాలని వుబలాటం కలిగింది; కాని యేదీ?

మొదట వుసూరుమనిపోయింది; కాని తరవాత మాత్రం లేకపోవడమే మంచిదనుకుంది.

ఉండడమే వస్తే ఆ నీరుకావి బట్టలతో తీయించుకున్నదే కాదూ?

ఛీ, అదేం వేషమూ? ఆ ఫోటో యేం బాగుంటుందీ?

అయితే, కొత్త వేషం యేదీ?

బట్ట లందుకునే టప్పుడు పుట్టిన వొణుకుతోనే అతను మెయి లెక్కాడు, వొక్కటేనా కట్టుకున్న దేదీ?

సేలం పంచెలు పాము మీసంలాగ వుండడం చలవ చేశాక కదా, అదేదీ?

చెన్నాపట్టంలో వాళ్లు కుడితే కోట్లు పూసినట్టే వుంటాయి; కాని కుట్టడం యేదీ?

అతనా చాపులు మడతకూడా విప్పలేదు; కాని ఆ సేలం పంచె కట్టుకుని ఆ యింగ్లీషు ట్వీల్లు షర్టుమీద ఆ నేవీ బ్లూ కోటు తొడుక్కుని, యెడమ భుజం మీద సేలం పట్టుకండువా వేసుకుని, అతను, యెదట నుంచునివున్నట్టనిపించింది.

చిరునవ్వు నవ్వుతూ, బెళ్లింపు చూపులు చూస్తూ "బావున్నానా?" అని అడుగుతూ వున్నట్టున్నా అనిపించింది.

ఓహ్! ఎంత చక్కనివాడూ!

అయితే, యీ భావన కలిగేటప్పటికి, ఆమెకి, వల్లమాలిన సిగ్గువచ్చి గుంజేసింది.

ఉక్కిరి బిక్కిరి చేసేసింది –

తరవాత వొక్క నిమిషానిక్కాని ఆమె తేరుకోలేకపోయింది.

తేరుకున్నా మరి ఆ గదిలో వుండలేక, లైటు తీసేసి, తలుపులు వేసేసి, తోటలోకి బయలుదేరింది.

## |21|

తోట అంటే ఆమెకి మునపటి గౌరవం లేదు; కాని ఆమె అంటే తోటకి మాత్రం మునుపటిదే కాదు, యెక్కువ గౌరవమే యేర్పడింది.

అంచేత వచ్చీ రావడంతోటే, తోట, ఆమెకి చల్లని గాలితో సేదతీర్చింది.

ఆ గాలి తగిలాటప్పటికి, సుభద్రకి, మద్రాసు మెరీనాబీచి జ్ఞాపకం వచ్చింది.

దాంతో, చెదిరి చెదిరి యెక్కడి కెక్కడికో యెగిరిపోయి వుండిన మనశ్శకలాలన్నీ యేకమయి చక్కని బిళువారీ అద్దంలా తయారయింది.

వెంటనే, అందులో, మళ్ళీ నిలువునా సాక్షాత్కరించాడు రామచంద్రం. అయితే, యీమా టామెకి సిగ్గుకి బదులు జాలి పుట్టింది.

వేషం అదే కాని; యేదీ పది గంటలకో తిన్నతిండి కామోసు పాపం, సోలిపోయి కనపడుతున్నా డతను.

అతను, వొక చక్కని మేడ గుమ్మంలో నుంచుని వున్నట్టున్నాడు.

అది ఆంధ్రపత్రికా ముద్రాక్షరశాల కామోసు. అప్పటిదాకా కళ్ళు పోటెత్తేటట్టు ప్రూఫులుదిద్ది బయటికి వస్తున్నాడు కామోసు.

కళ్ళు గుంటలు కట్టినట్టున్నాయి, యెక్కడికయినా వెళ్ళి వొక్క అరకప్పయినా కాఫీ పుచ్చుకుంటాడో పుచ్చుకోడో?

ఇక యే బస్సులోనో, యే ట్రాములోనో యిరుకుళ్ళుపడుతూ మైలాపూరు వెళ్ళడమే కామోసు పని.

దీనిమీద ఆమె కింకో బెంగ పట్టుకుంది.

"చేతిలో డబ్బుందో లేదో? సోమయాజులు బాబుగారు, కావలసింది యిచ్చారో లేదన్నారో? పోనీ, యిక్కడికి తంతికొట్టారుకా రెంచేతో?"

"నాన్నారు, ఎక్కువ ఖర్చుచేసుకున్నా వని పోతారో యేమో అని యేమి వొడిదుడుకులు పడిపోతున్నారో?"

"లేకపోతే డబ్బు మిగిల్చి తీసుకురావడమే ప్రజ్ఞ అనుకుంటున్నారో?"

"రోజూ సాయంత్రం బీచికి వెడుతున్నారో లేదో? ఇం చక్కని చేపలున్నాయీ? అదేదీ? ....అదీ...ఆక్వేరియం. మరే. అది చూశారో లేదో?"

"మెరుపు రెయిలూ, లైటుహౌసూ, విమానమూ యెక్కారో లేదో?"

"ఆ అడయారు – ఆ బీసెంటునగరం – ఆ పే – ద్ద మర్రిచెట్టు – తరవాతా, ఆ మూజియం – ఆ పీపిల్సుపార్కు – ఆ మౌంటు రోడ్డు షాపులు – ఆ థియేటర్లు – ఆ హార్బరు – ఆ పైపుల చెరువు – అవన్నీ చూస్తూన్నారో లేదో?"

"కూడాతీసుకువెళ్ళి సోమయాజులు బాబుగారు హైకోర్టూ, కోటా చూపించారో, మరిచిపోయారో, యీ ధోరణే లేదో వారికి?"

"అసలు, వారు, రామచంద్రంగారిని గౌరవంగా చూస్తున్నారో లేదో?"

"అన్నట్టు పిన్ని స్పష్టంగా రాసింది కనక నూరుబత్తాయి పళ్ళూ వారికివ్వక తప్పదు కాని; పిన్నిగారు రుంజుకుంటూ యిచ్చారో, ముభావంగా యిచ్చారో, సాదరంగా యిచ్చారో?"

"వాళ్ళ రెండోకొడుకు, రామనాథం, వారిని ఆ పళ్ళు పుచ్చుకోనిస్తున్నాడో లేదో?"

"అవిడచేత మంచివాడనిపించుకోడానికి రామచంద్రంగారే యిచ్చేస్తున్నారేమో వారి పిల్లలికి పళ్ళన్నీని?"

ఇలాగ సుభద్ర మనస్సు మనస్సులో లేదు. పోనీ ఆ వున్న చోటయినా నిలకడగా వుందేమో అంటే అదీ లేదు.

## 22

ఉదయం యేడున్నర.

మూడో అంతస్థు గుమ్మీమీద నుంచుని వుంది సుభద్ర.

అప్పుడే తల అంటుకుని, చిక్కు తీసుకుని వున్న దీర్ఘకబరీ భారం, గాలికి విప్పారి ఆ బంగారు బొమ్మకి పరస్థలం లాగుంది.

సూర్యబింబానికి తెల్లని మేఘశకలం వొకటి అడ్డంగా వుండడంవల్ల ఆమె ధరించి వున్న లేతగులాబీ పట్టుచీర విలక్షణంగా మెరుస్తోంది.

కొంతసేపామె పిట్టగోడమీదకి వాలి, వంతెన దగ్గిరనుంచి ధవళేశ్వరం దాకా – బొబ్బర్లంక, విఘ్నేశ్వరాలదాకా గోదావరి పొడుగునా చూస్తూ నుంచుంది.

ఆ చూడ్డంలో, పెద్దవాడపల్లి దగ్గిర, డరోతీస్టీమరు వూదర కొట్టినట్టు పొగవిడిచి పెడుతూ రయిమని వెడుతూ వుండడం కనపడింది.

దానిమీద జ్ఞాపకంరాగా మెరుపుకొట్టినట్టామె కొవ్వూరికేసి చూసింది.

మద్రాసు మెయిలు అప్పుడే గోదావరి వంతెన యెక్కింది.

వెంటనే మనస్సు గుబగుబలాడిపోగా, తన్నెవరేనా చూస్తున్నారేమో అని వొక్కమాటు నాలుగువేపులా బాగా చూసుకుని, ఆమె, మురిసిపోతూ, సిగ్గుపడుతూ పట్టురుమాలొక్కమాటు సుతారంగా విసిరి, మళ్ళీ గభీమని గుప్పిట్లో దాచేసుకుని, అపవారించి కిలాకిలా నవ్వుకుంది.

ఆ నవ్వుతో వట్టివేళ్ళ అత్తరు సౌరభం వుద్రిక్తమై మెయిలు బండికి యెదురుసన్నాహం నెరిపింది.

వంతెనమీద నడిచినంత సేపూ సుభద్ర కోసమే అన్నట్టు మెయిలు చాలా నింపాదిగా నడిచింది. అందుకు సంతోషిస్తూ ఆమె యింజన్ దగ్గర్నుంచి వెనక్కీ, వెనకనుంచి యింజన్ దగ్గిరికీ, మొదటకొంచెం వడిగానూ, తరవాత చాలా తాపీగానూ మెయిలు పొడూగునా పదిమాట్లు చూసింది గాని; గుర్తుంచుకో లేకపోయింది.

ఇంతలో, మెయిలు, వంతెన దిగిపోయింది. సుభద్ర గుమ్మీదిగి రెండో అంతస్థు వీధివసారాలోకి వచ్చింది.

వెంటనే, సుమారు యిరవైదినాలనుంచి వాడిపోయివుండిన తోట, నవనవలాడుతూ, ఘుమఘుమలాడుతూ ఆమె ముద్దు మొగానికి మిసమిసలు కానుక పెట్టింది.

ఆ పొద్దుటిపూట, ఆ లేతయెండలో, ఆ మేడమీదికి యెంతో ముచ్చటగా కనబడగా సుభద్ర మేడదిగి తోటలో ప్రవేశించింది; కాని, మనస్సు గేటుకేసీ, కళ్ళు తోటలోకీ పడలాగగా వొకటి రెండు నిమిషాలామె గిరగిర లాడిపోయింది.

కొంతసేపటికో వొంటెద్దుబండి వచ్చి ద్వారమండపంలోకి వెళ్ళిపోయింది; కాని ఆమె దానికేసి చూడనేలేదు.

దాని తరవాత వొక ఫీటన్ వచ్చింది. ముసిలి పండొకడు కుళ్ళూ కుళ్ళూ దగ్గుకుంటూ అందులో కూచునివున్నాడు.

అదయిన తరవాత వొక మోటారు వచ్చింది. దాన్లోవున్న వాడెవరో పిల్లాడేగాని, నల్లగా జీడిగింజలాగ మోటారుకి సరిపోయి వున్నాడు.

ఆమె అటు చూడలేకపోయింది.

ఎనిముదింబావయింది.

మనస్సుకి గుంజాటన ప్రారంభమయింది.

"ఏం చెప్మా?" అనుకుంటూ వుండగానే మేఘాలమీద యెగిరిపోతూ వొక జట్కా వచ్చింది. ఆ విసురు విసురు ద్వారమండపంలోకి వెళ్ళి అది, యే స్తంభానికో గుద్దుకోవలసిందే కాని బండివాడు లగాములు బిగించి తోటలోనే ఆపేశాడు.

వెంటనే వొక యువకుడు కింది కురికి సుభద్రకేసి బయలుదేరాడు.

కట్టింది సేలంపంచె. తొడిగింది నేవీ బ్లూ. ఆపైని పట్టుకండువా – నిదానించగా అతను రామచంద్రం!

సుభద్ర మొగమ్మీద చిరునవ్వు మెరిసి తోట అంతా తళుక్కు మనిపించింది.

అతనూ ఆమే వొకరి నొకరు సమీపించినట్టు కనపడ్డారు.

అంతే.

మళ్ళీ చూడగా ఆమె మేడకేసి వెళ్ళిపోతోంది.

అది నడకా కాదు, పరుగూ కాదు, వురుకులూ కావు కాని; బండికీ మేడకీ మధ్య వున్న తోట అంతా క్లుప్తమయిపోయినట్టనిపించింది.

ఆ సంతోషానికీ, ఆ వుత్సాహానికీ, ఆ చాకచక్యానికీ, ఆ లాఘవానికీ అతను చకితుడయిపోయాడు.

మొదట అతను "పుస్తకాలు తెచ్చానండి" అన్నాడు. ఇలాంటి సన్నివేశం తటస్థించవచ్చుననీ, అప్పుడు పెట్టె తియ్యబోతే రసాభాస అవుతుందనీ వూహించుకుని, జట్కా యెక్కగానే పెట్టితీసి మూడు పుస్తకాలు చేతిలోనే వుంచుక్కూచున్నాడతను కాని; తానే యిచ్చాడో, ఆమె వులాక్కుందో మాత్రం యెరగడు.

తరవాత "పాకేజీలు వొంటెద్దుబండిలో వస్తున్నాయండి" అన్నాడు కాని; యిక్కడ వొక్కొక్క మాటపలికి అతనీవాక్యం పూర్తి చేశాటప్పటికి, అక్కడ, వొక్కొక్క మెట్టే యెక్కి ఆమె మేడమీదకి వెళ్ళిపోయింది.

మేడమీది ఆఫీసులో కూచుని వొక జమీందారీ దావా తాలూకు కాగితాలు చూస్తున్నాడు పంతులయ్య.

అడిగినవాటికల్లా జవాబులు చెబుతూ పక్కని జమీందారూ, జమీందారు చెప్పలేని సంగతులు వివరిస్తూ యెదట దివానూ కూచుని వున్నారు. దివాను వెనకకూచుని రాణేదారొకడూ, ఫీటన్‌లో వచ్చిన ముసిలాయనా సాయం చేస్తున్నారు.

ఇద్దరు జూనియర్లు, దివానుకి రెండుపక్కలా కూచుని చదివేసిన కాగితాల్లోని ప్రధానసంగతులు మననం చేసుకుంటున్నట్టు పంతులయ్యకి జ్ఞాపకం చేస్తూ వుండగా, నాలుగోగుమస్తా తెచ్చి యిచ్చిన లా గ్రంథాలు పేజీలు తీసి మరో జూనియరు, పంతులయ్యకి అందుబాటులో బల్లమీద వుంచుతున్నాడు.

ఇలాంటప్పుడు సుభద్ర గదిలో కాలు పెట్టింది.

జమీందారు వెనక, తలుపు వోరచేసుకుని నుంచుని వున్న వృద్ధదాసి ఆ జంగమవల్లిని చూసి చకితురాయింది.

అతను పలకరిస్తే జవాబులు చెప్పడానికి తప్ప, అతన్ని పలకరించడాని కెవరికీ ధీమా చాలనంతటి తాదాత్మ్యమూ గాంభీర్యమూ కనపడుతూ వున్నాయి పంతులయ్య మొగంమీద.

కాని సుభద్ర యిదియేమీ చూడలేదు. ఎంతమాత్రమూ జంకనూ లేదు.

ఊచలాగ వెళ్ళింది.

వెళ్ళీ వెళ్ళడంతోటే యెడమ చెయ్యి అతని మెడమీద ఆన్చి, అతని మొగానికి తన మొగం తగిలేటట్టు ముందుకు వంగి "పుస్తకాలు వచ్చాయి నాన్నారోయ్" అంటూ మూడు పుస్తకాలూ అతని చేతిలో వుంచింది.

అందరూ వులిక్కిపడ్డారు.

ఆ చనువుకీ, ఆ ధైర్యానికీ, ఆ సాహసానికీ, ఆ స్వాతంత్ర్యానికీ జమీందారు వూగిపోయాడు.

ఆ మాట విన్నాడు పంతులయ్య. ఆ పుస్తకాలు చూశాడు.

"అప్పుడే వచ్చాయిటమ్మా రామచంద్రం?" అని అడిగాడు.

అంతే.

మరేమీ అనలేదు. ఎవరికీ యేమీ చెప్పలేదు. జమీందారు దగ్గిర కళ్ళతో అయినా సెలవు పుచ్చుకోలేదు. ఎక్కడికి చదివింది అక్కడికి ఆపుచేసి, యెలావున్న కాగితాలు అలా వుంచేసి, గభీమని లేచి పుస్తకాలు తిప్పి తిప్పి చూస్తూనే కిందికి బయలుదేరాడు అతను.

"బంగారపు అక్షరాలు. మనం చెప్పలేదు కాదుటండీ నాన్నారూ? ఎంత ముద్దొస్తున్నాయో?" అని పొంగిపోతూ సుభద్ర వెనకాలే వెళ్ళింది.

## 23

"రామచంద్రం కనక పని తొరగా తెమిలింది. పుస్తకంకూడా మెరిసిపోతోంది. సూరయ్యగా రయితే —"

"సడే — సూరయ్యగా రయితే కథలు దిద్దగలరేం?"

కళ్ళు ఇంతలేసి చేసుకుని, మొగం అయిమూలాగా వంచుకుని, తల యెగరవేసుకుంటూ యిలా దురుసుగా అడిగింది సుభద్ర.

మేడమీద మూడో అంతస్థులో, సుభద్ర గదికి చేరివున్న తూర్పు వసారా గదిలో, జంట కుర్చీలో కూచునివున్నారు సుభద్రా, జానకమ్మానూ.

ఇద్దరి చేతుల్లోనూ చెరొక కథల పుస్తకమూ వుంది.

ఇద్దరూ సర్వాభరణాలూ ధరించి లక్ష్మీసరస్వతుల సమ్మేళనంలాగ కన్నుల పండువుగా వున్నారు.

అప్పటికి నాలుగ్గడియలు పొద్దు మాత్రమే వుంది. సూర్యబింబానికి మేడ అడ్డు కావడంవల్ల యింటి ముందరితోట వింత వెలుగుతో ప్రకాశిస్తోంది.

తోటలో ఆ భాగం అంతటా తాత్కాలికంగా వింత వింత మెరుపు దీపాలు అమర్చబడి వున్నాయి.

దగ్గిర వుండి, వరదారావు, ఫలహారపు బల్లలూ, వాటిమీద బందరు కలంకారీ దుప్పట్లూ, వాటిమీద రంగు రంగుల పింగాణీ సామానూ సర్దిస్తున్నాడు.

చిన్ని గుమాస్తాలు ముగ్గురూ ఆ పింగాణీ సామాను మధ్యగా అగరువొత్తుల కూజా లుంచుతున్నారు.

ఒక చెట్టుకింద గుడ్డకుర్చీలో పడుకుని వున్నాడు పంతులయ్య. రామచంద్రమూ, పెద్ద గుమాస్తా యెదట నుంచుని సలహాలు చెబుతూ, ఆజ్ఞలు అందుకుంటూ సర్వమూ లక్షణంగా జరిగేటట్టు చూస్తూ వున్నారు.

రెండో అంతస్థులో, గానసభ నిమిత్తం, పోతునాయుడు కుర్చీలు సర్దిస్తూ వున్న చప్పుడు వినపడుతోంది.

జానకమ్మా, సుభద్రమ్మా అత్యుల్లాసంగా మాట్టాడుకుంటున్నారు.

"మహా బాగా చెప్పావు."

"చెన్నాపట్టం వెళ్ళి అచ్చు వేయించడం కూడా ఆయనకి చేతనవునేం?"

ఇలాగ అదే ధోరణిలో ముదలకించింది సుభద్ర.

"వెళ్ళి వెళ్ళి చెన్నపట్టం కూడా వెళ్ళాలి ఆ పెదబాబు. బజారుకి వెళ్ళి చెప్పిన కూరలయినా సరిగా తీసుకురాలేడు కానీ?"

"ఆయన కయితే నాన్నారలాంటి బట్ట లిప్పిస్తురేం? నేను బత్తాయి పళ్ళు పంపిస్తునేం?"

"బట్టలు కూడా యివ్వాలి. నంగినంగి మాటలాడుకుంటూ – ఆయన పేరు చెబితేనే నాకు వొళ్ళు మండిపోతుంది సుమా!"

"నాకూనూ" అని తల తాటించుకుంటూ అందుకుంది సుభద్ర. "ఒక్క కథ సాపు రాయడానికి పది రోజులు పట్టేది." 'ఆఫీసు పనులు తేలడంలే'దని నాతోనూ, 'అమ్మగారి కథలు సాపు రాయడంతోటే సరిపోతోం దని నాన్నారితోనూ చెబుతూ, ఇంట్లో రెండో పెళ్ళి పెళ్ళాముకి పడిపడి దణ్ణాలు పెడుతూ –'

మాట సగంలోనే రుసరుస లాడుతూ అందుకుని "చెప్పిచెప్పి ఆ పెళ్లాన్నే చెప్పాలి, ఆ మొగుణ్ణే చెప్పాలి. ఫర్లాంగు దూరం వినపడేటట్టు నవ్వులుతుంది ఆ యిల్లాలు, తాంబూలం. యాక్కురారీ" అంటూ మొగం చిట్లించుకుంది జానకమ్మ.

"వోక్!..... నాకు నిజంగా డోకే వచ్చేలాగుందే. ఆవిడ మాట చెప్పకేయిక పిన్నీ! ఆ గొడవ మరిచిపో. మరిచిపోడానికి, రామచంద్రంగారు కథలు దిద్దడమూ, అచ్చు వేయించడమూ – ఇలాంటివి చెప్పు."

ఫక్కుమని నవ్వబోయింది జానకమ్మ కాని; చాలా కష్టంమీద అణచుకుంది. రామచంద్రం చెన్నపట్నం వెళ్లినప్పణ్ణుంచీ లెక్కచూస్తే, ఆమె కిలాంటి సందర్భం పది పన్నెండుమాట్లు తటస్థించింది; అయితే అప్పుడప్పుడు కూడా యింతా అవస్థపడుతూనే వచ్చింది.

నిజంగా, వొక్క మాటయినా బెసికిపోకుండా అన్నిమాట్లు జాగ్రత్తపడడం కష్టమే; కాని ఆ విషయం జానకమ్మకి అలవాటయిపోయింది.

ఆ మాట మీద మొగం పక్కకి తిప్పకోడం ప్రయత్నంలో, జానకమ్మ తోటలోకి చూసింది. ఎందుకో అని సుభద్ర కూడా అలా చూసింది.

పంతులయ్య ద్వారం దగ్గిరగా నుంచుని వున్నాడు. రామచంద్రం యెదట నుంచుని యెందుకో చిరునవ్వు నవ్వుతున్నాడు.

అదిచూసి సుభద్ర వుత్సాహవంతురాలు కాగా, జానకమ్మ, కొంటెచూపులు చూస్తూ "రామచంద్రానికి పెళ్ళికళ వచ్చిందేవ్" అంది.

సుభద్ర మనస్సు గుబగుబలాడిపోయింది. "అవు...." నన బోయింది; కాని మాట సగంలోనే మెరుపు కొట్టినట్టయి నీరవురా లయిపోయింది.

ఆమెచూపులు వొళ్ళోవున్న పుస్తకం మీదకి వాలాయి. ఆ గిల్టు అక్షరాల మెరుపులు సాయపడ్డాయి కనక సరిపోయింది గాని లేకపోతే ఆమె మొగం సిగ్గు దాచలేకపోయి వుండును.

ఇంతలో తోటలో బాండు వాద్యం వినపడింది.

ఇద్దరూ వులిక్కిపడి చూశారు. మేళగాళ్ళు ప్రహారీపొడూగునా నిలిచి వున్నారు. అందరూ వల్లదొరలలాగ యేక వేషంతో వున్నారు. చాలా వుత్సాహంగా బాండు వాయిస్తున్నారు.

సుభద్ర మళ్ళీ పుస్తకంకేసి చూసి "యీ గిల్టు అక్షరాలు యీ పుస్తకానికి మరీ అందం తెచ్చాయి, కదుటే పిన్నీ?" అంది.

దానిమీద, జానకమ్మ వొక్కమాటు శిరఃపంకంచేసి "అంత మేలు చేశాడు కదా, మరి, రామచంద్రానికి ఇవాళ నువ్వేం బహుమతీ చేస్తావు తల్లీ?" అని యేమీ యెరగనిదానిలాగ అడిగింది.

అందుకు సుభద్ర "అవునేవ్; నాకు తోచిందే కాదు చూశావా? ఏం చెయ్యమంటావే పిన్నీ?" అంటూ అమాయకంగా చూసింది.

"అలాంటి పిల్లాడికి, నీలాంటి పిల్ల, యెలాంటి బహుమతీ చెయ్యాలో నాకెలా తెలుస్తుంది తల్లీ?"

ఇలా అంటూ సాగతీసుకుంది జానకమ్మ.

"అదేమిటే అంత వులకంగా మాట్లాడతావూ?"

"కాకేమే? న్ ృ కథలు రాయడమూ, అతను దిద్దడమూ, ఈ విధంగా యిద్దరి వుద్దేశాలూ కలవడమూ–"

"బహుమతీ మాట చెప్పమంటే దండకం విడేస్తావేమిటే మామ్మా?"

"నేనేం చెప్పగలనే నా కూతురా? నీ మనస్సులో యేంవుందో–"

"ఉంటే నిన్నడగడం యెందుకే?"

"నీ కబుర్ల కేంలే, నిజంగా నువ్వు తోచనిదానవే అయితే వొక్క కథ మాత్రం దిద్దినవాడికి అన్ని రూపాయల బట్టలు నీ చేతుల్తో యివ్వగలవేం? చెన్నపట్నం వెడితే పదిరోజుల్లో వచ్చే వాడికి మించిపోయినట్లు వంద బత్తాయిపళ్ళు పంపగలవేం? పైగా, వుప్పాడ కండువాలూ, రిస్టువాచీ, రవ్వల వుంగరమూ –"

"ఆ మాట నువ్వు తెచ్చావు"

"నువ్వు గట్టిగా పట్టుకున్నావు."

సుభద్ర మిడుతూ మిడుతూ చూసింది. ఆ చూపుల్లో మౌగ్ధ్యం మిసమిసలాడిపోయింది.

జానకమ్మ జాలిపడిపోయింది.

"అతనింటికి వచ్చేదాకా నీకు నిద్రాహారాలు సయించాయా? ప్రపంచకం యేమైనా కనపడిందా? ఇదంతా నే నెరగ నను కున్నావేం?" అంటూ యిలాగ కూడా ఆమె అనేసేదే కాని; పస్తాయించింది.

ఆ మాట లంటే సుభద్ర సిగ్గుపడిపోతుంది. చిన్నబుచ్చుకుంటుంది. ఆ స్థితి తాను చూడలేదు. ఆపైని గొప్ప విందూ, గానసభా, వుపన్యాసాలూ, కానుకలూ.... పెద్దతంతు జరగవలసివుంది.

సుభద్ర వుల్లాసంగా లేకపోతే యివన్నీ వెలవెలపోతాయి. దానికంతటికీ కారణం తానయిపోతుంది.

అది చాలా విచారకరమైన సంగతిగా పరిణమిస్తుంది.

జానకమ్మ వొక్కక్షణంలో యిదంతా ఆలోచించుకుని, మొదట ఆ ప్రవాహానికి అడ్డువేసేసింది. తరవాత "ధోరణి యెలా మార్చనూ?" అనుకుంటూ కిందకి చూసింది.

ఫలహారపు వస్తువులు కావిళ్ళతో వస్తున్నాయి.

వీణ పట్టించుకుని గురువుగారు వస్తున్నారు.

అరటిదొప్పలతో పూలదండలూ; దాగర్లతో పూలగుత్తులూ తెస్తున్నారు పూల వర్తకులు.

చిన్న గుమస్తాలు ముగ్గురూ అగరువొత్తులు వెలిగిస్తున్నారు.

"చూడు తల్లీ" అంది జానకమ్మ.

సుభద్ర అలాచూసి "అతిథులు వస్తున్నారు పిన్నోయ్" అంది ఆత్రంగా.

ఇద్దరు ప్లీడర్లు వచ్చారు. పంతులయ్య వారిద్దరికే కరస్పర్శ చేసి పూలగుత్తు లందించి కుర్చీలు చూపిస్తున్నాడు. పెద్ద వెండిపళ్ళెంతో పూలగుత్తులు పట్టుకుని పోతునాయుడు పక్కని నుంచునివున్నాడు. తమ కోసమే కాబోలు రామచంద్రం మేడకేసి వస్తున్నాడు.

తల్లీకూతురూ అప్రయత్నంగా లేచారు.

"ముందు వచ్చినవాళ్ళు ఆడాళ్ళయూరుకాదు నయమే" అంది సుభద్ర.

"తొరగారా" అంటూ అడుగువేసింది జానకమ్మ.

## 24

పంతులయ్య, మేడమీద, వుత్తరపు వసారాలో పచారుచేస్తూ శనివారపు పత్రిక చదువుకుంటూ వుండగా, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ వచ్చి జానకమ్మ పత్రిక వుళాక్కుంది.

తనూ, ఆమే, సుభద్రా, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ఫలహారం చేసి, కాఫీ పుచ్చుకుని, తాంబూలం వేసుకుని అప్పుడప్పుడే అక్కడికి వచ్చాడతను. ఇంకా అరగంట అయినా పూర్తి కాలేదు.

కనక యింతలో ఆమె రావలసిన కారణం కనపడక, శ్రద్ధ అంతా సంపాదకీయం మీద కేంద్రీకృతమయి వుండడంవల్ల మాట్లాడాలేక "యేం?" అన్నట్లు చూశాడతను.

అలాగే – ముసిముసి నవ్వులతోనే ఆమె బదులుచూపులు చెల్లించింది.

చివరికి "ఏమిటి కథ?" అని అడగక తప్పలేదతనికి.

"అమ్మాయికి సమ్మంధం చూడండి" అంది ఆమె.

ఆమెచూపులు గంభీరముద్ర వహించి వున్నాయి.

అది గ్రహించి వెంటనే శ్రద్ధ అంతా యిటు మళ్ళించుకున్నాడతను.

"ఏం?"

"ఈడు వచ్చింది కాదూ?"

"చిన్నపిల్ల. దాని కప్పుడే పెళ్ళి –"

"అదేమిటండీ? పదహారేళ్ళు నిండినదాన్ని మీరింకా చిన్నపిల్లే అంటారేమిటండీ?"

"నిజంగా?... అప్పుడే పెళ్లియీడు వచ్చిందంటావా?"

"పెళ్ళియీడేకాదు, బిడ్డనికనే యీడు కూడా వచ్చింది. ఇప్పుడు పెళ్ళి చేస్తే మళ్ళీ యీ రోజుల్లోనే మీరు మనవణ్ణి యెత్తుకుంటారు."

అతను ఆమె బుగ్గలు పుణికాడు.

"నిజం. ఇక ఆలస్యం చెయ్యడం అమ్మాయిని బాధపెట్టడంగాని సుఖపెట్టడంకాదు. ప్రేమించడం కానే కాదు."

అతనికి, ఆమె సుభద్రని కన్నతల్లిలాగ కనపడింది.

అయితే నువ్వే చూడరాదూ?

"ఇంతకంటేనా? చాలా సంతోషం. భారం అంతా మీరు నామీద పెడితే, నేను అమ్మాయిమీద పెట్టేస్తాను. పెట్టేశాను"

"అంటే?" అని అతను గతుక్కుమన్నాడు.

"నాతో రండి తెలుస్తుంది" అంది ఆమె.

ముందు జానకమ్మా, తరవాత పంతులయ్యా బయలుదేరారు.

జానకమ్మ తనకి చూపించే దేమిటో పంతులయ్య గ్రహించేశాడు; కాని వరు డెలాంటివాడో అని కంగారు పట్టుకుంది పాపం, అతనికి.

సగం దారిలో జానకమ్మ "మీరేమీ మాట్లాడకండేం!" అన్నట్టు కళ్ళు తిప్పుకుంటూ, చేత్తో నిషేధించింది కాని; అంతకి ముందే నీరవు డయిపోయి వున్నాడతను.

## 25

ఆగ్నేయంగా వున్న వసారా గదిలోకి వెళ్ళి యిద్దరూ దక్షిణపు కిటికీ దగ్గిర నుంచున్నారు.

ముందు తాను వెళ్ళి నుంచుని, చూడవలసిన దృశ్యం యింకా వుందా లేదా అని తోటలోకి పరకాయించి, తరవాత, అతణ్ణి తన వెనక్కి రమ్మని సన్న చేసిందామె.

ఆమె బుజాలు పట్టుకుని, తల పక్కకి వంచుకుని నుంచున్నాడతను.

అలాగే నుంచుని, మొగం పైవాటుగా వెనక్కి తిప్పుకుని, మందహాసంతో కళ్ళు చేరెడేసి చేసుకుని "యేం, కనపడిందా?" అన్నట్టు తల యెగరవేసిం దామె.

మేడకి పాతిక గజాలదూరంలో వొక పొగడచెట్టు, ఆ చెట్టుకి చుట్టూరా పాలగచ్చు అరుగు. దానికి నాలుగైదుగజాల దూరాన గులాబీ కట్టవకి ఆనుకొని వొక పెద్ద అశోకవృక్షం.

తువ్వాలు పరుచుకుని, యేదో పుస్తకం చూసుకుంటూ ఆ అరుగుమీద పడుకుని వున్నాడు రామచంద్రం.

ఒకమాటు అతన్ని తొంగిచూస్తూ, వొకమాటు దాక్కుంటూ, మధ్య మధ్య మేడకేసి బెదిరి బెదిరి చూస్తూ సుభద్ర, అశోకం చాటున నుంచుని పొంగిపోతోంది. సిగ్గుపడిపోతోంది. పరవశురాలున్నూ అయిపోతోంది.

తర్జనితో నిర్దేశిస్తూ జానకమ్మ పంతులయ్యకి ఆ దృశ్యం చూపించింది.

ఆ యువకుడు ఫలానా అని నిశ్చయించుకోగలిగేదాకా తేరిచూసి పెద్ద నిట్టూర్పు విడుస్తూ కిటికీ చాటుకి తప్పుకున్నాడు పంతులయ్య. ఎదటికి వెళ్ళి నుంచుని యేమని పోతాడో అని జానకమ్మ ఆదుర్దాపడిపోసాగింది.

"ఏమి టంటావ్?"

"మీరేమి టంటారూ?"

ఒక్కక్షణం ఆలోచించి "యెప్పణ్ణుంచీ యిదీ?" అని అడిగాడతను.

"అతను చెన్నపట్టం వెళ్ళినప్పణ్ణుంచీనీ"

"మరి చెప్పావు కాదేం?"

"ఇది చూసేదాకా నిరుకు చేసుకోలేకపోయాను."

మళ్ళీ వొకమాటు తొంగి చూశాడతను. వెనక్కీ, పక్కలికీ, మేడకేసీ బెదిరి బెదిరి చూసి మళ్ళీ రామచంద్రాన్ని తొంగిచూస్తోంది సుభద్ర. ఇదేమీ యెరక్కుండా చదువులో మునిగిపోయే వున్నాడు రామచంద్రం.

"ఆవేళ అతణ్ణి మెయి లెక్కించి వచ్చింది. అది మొదలు దానికి నిద్రలేదు. ఆహారంలేదు. అతను తప్ప మరి ప్రపంచకమే కనపడ్డం లేదు."

"అతనికి తెలుసా?"

"ఏమీ యెరుగడు పాపం. అసలు, ఆడదానిమీదకి దృష్టి పోయినట్టే కనపడ దింకాను"

"అలాగా?"

"ఆరు నెల్లయింది వచ్చి. వచ్చిననాడెంతో నేడూ అంతే. పలకరిస్తే తప్ప నాతోటే దాంతోటి కూడా మాట్లాడడు. ఆ మాట్లాడ్డం అయినా మాకేసి చూడకుండానే."

"అమ్మాయి–"

"మొదట మొదట యే వారానికో, యే పదిరోజులకో వొకమాటు, వొకమాట అతనితో చెబుతూ వుండేది. క్రమ క్రమంగా అదీ లేదిప్పుడు. అతను యెదట వున్నంతసేపూ అతనితో సరిగా మొగం వంచుకుంటుంది. ఓరచూపులు మాత్రం చూస్తూ వుంటుంది. నా దగ్గిర అతణ్ణి గురించి యిక యిసకపాతర్లు. నే నేమయినా అనుకుంటానేమో అని మధ్య మధ్య అతను కథ దిద్దడమూ, పుస్తకం అచ్చు వేయించడమూ, పంచెకి సబ్బు–"

"ఇప్పుడర్థం అవుతోంది. బత్తాయికాయల మాటతెచ్చి, నాచేత పంపుదామని పించడానికి అది వేసిన యెత్తులు తలుచుకుంటే, యిప్పుడు దాని తపన కళ్ళకి కట్టినట్టు కనపడుతోంది."

"మీకు తెలవకుండా నా చేత వొక పని చేయించింది సుమండీ!"

"ఏమిటదీ?"

"అయిన మూడు వందలూ తమకే పంపామనుకుంటారేమో, అతనికిస్తారో యివ్వరో కామేశ్వరమ్మ అక్కయ్యగారు అని అది పొందిన ఆవేదన శత్రువులకైనా వొద్దు. నేను చూడలేకపోయానది. చివరి కేమయినా సరే అని 'ఇందులో వంద పళ్ళు రామచంద్రానికి' అని యెవరు రాశారో తెలవకుండా –"

"ఇచ్చినట్టా?"

"వద్దువద్దన్నాట్ట తాను; కాని పెద్ద కూతురూ ఆవిడా పళ్ళేలతో తెచ్చి తనకిచ్చిన గదిలో అలమార్లో వుంచి వెళ్ళిపోయారట. అన్ని పళ్ళు ప్రత్యేకంగా తాను పుచ్చుకున్నట్టు తెలిస్తే ఇక్కడ మీరేమని పోతారో –"

"వో – త్రీ అమాయకుడు. అన్నానికి మొగం వాచిపోయి వచ్చాడు పాపం; కాని జాతిరత్నం!"

"మీ అనుగ్రహం తప్పిపోకుండా వుండేటట్టు చూసుకోడం తప్ప మరో కోరికే వున్నట్టు లేదతనికి."

"ఏమిటి చెయ్యడం?"

"నన్నా అడుగుతారు?"

"అడగడానికి నీకంటే నా కెవరున్నారూ?"

ఇలా అంటూ అతనామె బుజం మీద చెయ్యి వేశాడు. ఆ చేతి మీదికి తన శిరస్సు వాల్చుకుని అవ్యక్తానందం అనుభవించిందామె.

"నీ వుద్దేశం చెప్పు. ఏమి చెయ్యమంటావో ఆజ్ఞాపించు."

"ఏం చెప్పడానికీ అంతా విషమంగా వుంది."

ఇలా అంటూ, ఆమె మొగం పక్కకి తిప్పుకుని ఆలోచించసాగింది.

"ఏమి టా వైషమ్యం?" అని అడిగాడతను.

ఒక్క నిమిషం అలాగే వుండి, చివరికి మొగం పైకెత్తుకుని "ఏమంటే? ఇటుచూస్తే యీడూ జోడూనూ. ఆ పైని అమ్మాయి తల్లడిల్లిపోతోంది. ఏంచేసినా దాని దృష్టి మరొకడి మీదికి తిరుగుతుందని తోచదు, అందామె."

"ఇంకా యేమిటి?" అన్నట్టు చూశాడతను.

"అటు చూస్తే – " నసికేసిందామె.

"చెప్పు, సందేహించకు. ఇది ఆలోచన."

"మీ తాహతుకీ, మీ దర్జాకీ, మీ సంప్రదాయానికీ–"

మాట సగంలో ఆపివేసి "యింకా చెప్పాలా?" అన్నట్టు చూసిందామె.

"నిజమే" అంటూ వొక్కక్షణం పక్కకి చూస్తూ ఆలోచించి "నువ్వు చెప్పింది కాదనను. కాని, అతని సంప్రదాయం మనకి తెలవదు. ఇంతకీ నువ్వు పైపై సంగతులు చూసి పైపై మాటలు చెప్పావు."

"లేకపోతే నేను ఖండనగా చెప్పగలనా?" అన్నట్టు చూసిందామె.

"అవునా?" అన్నాడతను.

అయినా సాహసించలేకపోయింది.

"చెప్పవూ?" అంటూ గడ్డం పట్టుకున్నాడతను.

ఈ సన్నివేశం ఆమెకి ధైర్యమూ, సాహసమూ కలిగించింది.

"అతని భావోన్నతి యెదట మన ఐశ్వర్యమూ, అతని వినయ విధేయతల యెదట మన దర్జా యేపాటిదీ?"

"సెబాస్!" అంటూ చిటికెవేసి "నువ్వు అసలు సంగతి కనిపెట్టావు" అని ప్రశంసించాడతను.

"అతను నా కడుపున పుట్టివుంటే –"

"బెంగ పెట్టుకోకు" అని రెండు చేతులూ పట్టుకుని ప్రారంభించాడతను.

"వాత్సల్యం తెలిసినవాళ్ళకీ తదనుభూతి కలవాళ్ళకీ అల్లుడయినా వొకటే, కొడుకయినా వొకటే. నువ్వేకాదు – నేనూ అలాగే అనుకుంటూ వచ్చాను. కడుపున పుట్టి నా చేతిలో పెరిగి పెద్దదయిన సుభద్రా, నిన్నగాక మొన్న – గాలికి కొట్టుకువచ్చిన అతనూ నా హృదయంలో వొక్కస్థానమే ఆక్రమించుకుని వున్నారు."

ఆశ్చర్యచకితురా లయిపోయింది జానకమ్మ.

"అతనే నీ అల్లుడు!"

జానకమ్మ వొళ్ళంతా గరిపొడిచి జల్లుమంది.

"అమ్మాయికి తగిన వరుడు అతను తప్ప భూమ్మీద మరివొకడు లేడు. ఈశ్వరుడు, యిందుకోసమే అతణ్ణి మన ఇంటికి తీసుకువచ్చాడు. అతణ్ణిచ్చి పెళ్ళిచెయ్యడం కంటే అమ్మాయికి నేను చెయ్యవలసిందీ చెయ్యగలదీ మరేమీ లేదు?"

అప్రయత్నంగా ఆమె అతని రెండు భుజాలూ పట్టుకుని అతని మొగంకేసి యేకాగ్రంగా చూడసాగింది.

"నేనీ పని చెయ్యకపోతే అమ్మాయికి అపకారమూ, దాని కన్నతల్లికి ద్రోహమూ చేసినవాణ్ణయిపోతాను."

ఆమె అదే చూపు.

"అమ్మాయికి పెళ్ళియీడు వచ్చిందని నా కప్పుడప్పు డనిపిస్తూనే వుంది. అయితే, దాని చూపు యెవరిమీదికి పోతుందో, నా సంపత్తి కెలాంటివాడు వ్యవహర్త అవుతాడో అని నేను చాలా బెంగ పెట్టుకుని వున్నాను."

ఆమె యింకా అదే చూపు.

"ఇప్పటికి ఆ బెంగ తీరడమే కాదు, నా తపస్సు ఫలించింది."

హృదయంలో యేదో భావం పురికింది; కాని ఆమెకి కంఠం స్వాధీనం కాలేదు.

"ఏమంటావ్?" అని అడిగాడతను.

అప్పటికి కంఠం స్వాధీనపడింది; కాని నాలుక తడబడిపోయింది. మాట రాలేదు. చూపు మాత్రం అదే.

అప్పటికాచూపు గుర్తించాడతను. అది భరించలేక "యేమిటి చూస్తున్నావ్?" అని సాదరంగా అడిగాడు.

"దేవతాకళ!"

అప్రయత్నంగానూ, అజ్ఞాతంగానూ పలికింది ఆమె యీ మాట.

"ఎక్కడా?"

"మీ మొగాన"

పొంగిపోయి ఆమె యెడమ బుగ్గమీద యిట్టే అన్నాడతను.

అది ఆమెకి పులకలు పేరెత్తించింది.

"మీరు వేసే ప్రతీ అడుగులోనూ, చేసే ప్రతీ పనిలోనూ, పలికే ప్రతీ అక్షరంలోనూ, పరిపే ప్రతీ చూపులోనూ అంతులేని ఔదార్యం యెప్పుడూ కనపడుతూనే వుంది. అయినా అది యింతటిదని నే నిప్పటివరకూ గుర్తుంచుకోలేదు. మీ హృదయంలో యింత అమృతం నిండివుందని నే నెప్పుడూ భావించుకోలేకపోయాను. నిజంగా, మీ నిజస్వరూపం నా కిప్పుడు కనపడ్డంత స్పష్టంగా యెప్పుడూ కనపడలేదు. లోకంలో – పధ్నాలుగు లోకాల్లోనూ కూడా యే సంపన్నుడూ, యే పండితుడూ, యే త్యాగీ, యే భోగీ, యే పెనిమిటీ, యే తండ్రీ కూడా మీ కాలిగోటికయినా సాటిరారు."

ఇలా అని, ఆమె, తన చేతు లతని మెడకి చుట్టబెట్టి, తన కుడిబుగ్గ అతని వక్షస్థలంమీద ఆన్చుకుని, అతను గుచ్చి కౌగిలించి తన శిరస్సు మూర్కొనగా నిలువునా కరిగిపోయింది.

ప్రబుద్ధాంధ్ర 1934 అక్టోబరు
(సవరణలతో విపులీకృతం)

★ ★ ★

# విమానం యెక్కబోతూనూ

"వెంకయ్యా!"

దిగాలు పడిపోయిన్నీ దిటవు తెచ్చుకుంటూ – బరువుగా అడుగులు వేస్తూ – అప్పుడే గుమ్మందాటి వచ్చిన చెలికాని వెంకయ్యను చూసి, యెదురు చూస్తూనే వున్న మల్లమ్మ, యిలా అంటూ లేచి నుంచుని రెండడుగులు ముందుకు వేసింది.

"ఏమి తల్లీ?"

"ఏమని సెలవు?"

"ఇదిగో కైజారు"

ఇలా అంటూ, అతను, చర్రుమని వొరలోంచి కైజారు తీసి పట్టుకుని చెయ్యిచూపాడు. "రాజుగుండెలు తియ్యడానికేనా?" అంటూ ఆమె అది అందుకుంది.

"అదెలాగ మా తల్లీ?"

"ఎలాగంటే? నేను వెలమబిడ్డను కాదుటయ్యా?"

"అది పురుషుల పని తల్లీ!"

"వెలమల ఆడవాళ్ళు చేతగాని వాళ్ళా?"

"వెలమస్త్రీలు అసూర్యంపశ్యలు కారు టమ్మా?"

"అంటే?"

"అంటేనా?"

ఉలిక్కిపడ్డాడు వెంకయ్య. ఇది ప్రతిఘటనం అన్నట్టు కూడా తోచిందతనికి. "ఇదేమిటి చెల్లెమ్మా, యివాళ కొత్తమాటలు మాట్లాడుతున్నావూ? ఇది నీకు తెలవందా? నేను చెప్పాలా?"

"ఇప్పుడు మీ అర్థం యేమిటో అని –"

"ఇప్పుడేమిటప్పుడేమిటి, యెప్పుడూ వో–క్కటేఅర్థం, మీరు బయటికి రాకూడదు"

"మంచి అర్థమే. ఏం, బయటికి వస్తే?"

"తమ స్త్రీలు పరపురుషుల కంటపడ్డ తరవాత, యిక వెలమలకు మర్యాద యెక్కడిదమ్మా?"

"ఎంత పాపిష్ఠి బతుకయ్యా మాదీ? మాలమాదిగల దగ్గిర్నుంచి బ్రాహ్మలదాకా అన్ని వర్ణాలస్త్రీలూ అవసరం వచ్చినప్పుడు బయటికి వస్తూ వుంటే, వారికిలేని మానభంగం మాకెలా వస్తుందయ్యా"

"మొదణ్ణుంచీ అది మన ఆచారం కాదుటమ్మా?"

"స్థితి విషమించినప్పుడు కూడా అంతేనా?"

"తెగించినవాళ్ళకి విషమించడం యేమిటి తల్లీ?"

"అదీ మాట. మరి మేము తెగించవద్దూ?"

"అవశ్యమూనూ."

"ఎందుకో?"

"ప్రభువు ఆజ్ఞ నెరవేర్చడానికి."

"గొంతుకు పిసుక్కోడాని కన్నమాట...అవునా?"

ఈ మాటలో శౌర్యం తలమునక లయింది.

అతను మొగం వంచుకున్నాడు.

"అంతేనా?"

మొగం పైకెత్తాడు; కాని పక్కకి తిప్పుకున్నాడు.

"మాట్లాడవేమయ్యా?"

"ఏమి చెప్పను తల్లీ?"

"ఏమి చెబుతావూ? ఏమి చెప్పగలవూ?...ఎంత కర్మమయ్యా? శత్రువు వచ్చి పీకమీద కూచున్నప్పుడయినా మొగవాళ్ళకి తలదాటి వచ్చినప్పుడయినా–"

"వెలమవీరులకు తలదాటి రావడం యేమిటమ్మా?"

ఈ మాట అనేటప్పుడతని చూపులు చెరకాకు బల్లేలయిపోయాయి.

"ఏమిటీ?...మళ్ళీ అను ఆ మాట"

"ఏం అనకా?"

"అయితే, యిప్పుడు నీ రాకకు కారణం?"

"అది దొరవారి ఆజ్ఞ"

"అదేనయ్యా! పోనీ, దానిక్కారణం?"

"మానభంగభయం –"

"ఏమిటీ?...ఎవరికీ? బొబ్బిలి వెలమస్త్రీలకే?"

మల్లమ్మ యిలా వురిమింది. గతుక్కుమన్నాడతను.

"మేము యుద్ధరంగంలోకి వెడితే పగవాళ్ళింతకంటే కఠినంగా మాట్లాడతారా?"

"తర్కానికిది సమయమా అమ్మా?"

"అది వేనడుగుతున్నమాట. వెలమస్త్రీలు బయటికి రాకూడదన్నది సామాన్య ధర్మం. స్థితి విషమించినప్పుడెందుకు రాకూడదూ?"

"వెలమలు ఇదివరలో చేసిన యుద్ధాల్లో ఎప్పుడయినా స్త్రీలు కత్తిపట్టడం–"

"శత్రువు దుష్ప్రయత్నాలు ఫలించడానికి సిద్ధంగా వుండడమూ – పైవారు కోట విడిచి పొమ్మనడమూ –"

"ఒకదానికొకటి యెప్పుడైనా పోలిక వుంటుందా?"

"మరి యింకెందుకామాటా? అప్పటప్పటి వెలమస్త్రీలు యుద్ధరంగాల కెందుకు వెళ్ళలేదో మనకేం తెలుసూ?"

అతనికి జవాబు తోచలేదు.

"కాకపోయినా, ఇప్పుడు మనకి వచ్చిన అవస్థలవంటివే వారికీ వచ్చాయనీ, అయినా అప్పటి వెలమస్త్రీలు యుద్ధరంగాలలోకి వెళ్ళక అంతఃపురాల్లోనే పొడుచుకునో, కాల్చుకునో బుగ్గి అయిపోయారనీ నిదర్శనాలేవీ? అదీగాక: వారు వీరమాత లయివుండవచ్చు. వీరపత్నులున్నూ అయి వుండవచ్చు. తాము వీరాంగనలే అని అనిపించుకోడానికి వారు ముచ్చటపడి వుండకపోవచ్చు. ఇప్పుడు మేమలా కాదు. కోటలో వున్న వెలమస్త్రీలందరూ 'మనమైనా విజయరాముణ్ణి పొడిచెయ్యవద్దా?' అంటున్నారు. మా శౌర్యం అంతా యేమి కానూ? కత్తి పట్టాలని నాకు సరదా పుట్టింది. నేను వీరమాత నవుదునో కానో తెలుసుకోవాలంటే నా బిడ్డ పాలబుగ్గలవాడయిపోయె. ఇక నేనేం చెయ్యాలీ? చిన్నతనంలోనే 'మల్లమ్మ యెన్నిక అయిన'దని పేరు తెచ్చుకున్నాను. నీ ప్రభువుకి తగిన రాణి ననిపించుకున్నాను. మరి యిక 'విజయరాముడి పాలిటి మహిషాసురమర్దని' ననిపించుకో వద్దుటయ్యా?"

ఈ మాటలతో వెంకయ్య చెవులు గళ్ళుపడ్డట్టయిపోయాయి.

"ఏమంటావు వెంకయ్యా?"

ఏదో అనబోయాడు కాని మాట రాలేదు.

"వెలమల ప్రయత్నాలు వ్యర్థం అయినప్పుడు – వెలమదొరల శౌర్యం నిస్తేజం అయిపోయినప్పుడు–"

"ఏమన్నావు తల్లీ?"

ఇలా అంటూ అతను వుద్రిక్తుడైనాడు. ఈ మాటలో అతని శౌర్యం అంతా మూర్తీభవించింది.

"ఉలిక్కి పడకు. నువ్విప్పుడేమి చెయ్యడానికి వచ్చావో తెలుసుకుని మరీ మాట్లాడు...చూడూ. బొబ్బిలి వెలమ వీరుల ప్రతాపం మొక్కపోయినప్పుడు–"

"వినలేను, అమ్మా! సహించలేను. నువ్విక యీ ధోరణి మార్చకపోతే నా రక్తం వుడికెత్తిపోయి–"

అతని చెయ్యి గభీమని కైజారుమీదికి పోయింది.

"ఇంకా యెప్పుడో వుడుకెత్తుతుంది. ఇప్పటికి మంచుగడ్డలాగే వుంది కదూ?"

"హరహర! మహాదే–వ! చెల్లెమ్మా!"

ఇలా అంటూ, పళ్ళు పటపట కొరుకుతూ, కైజారుదూస్తూ, నిప్పులు కక్కుతూ పైకి చూశాడు. వీరావేశంతో అతని శరీరం ఆపాద మస్తకమూ మెరుపుతీగ అయిపోయింది; కాని ఆ చూపులకు "నేనేం చెప్పాను? నువ్వేం చేస్తున్నావు?" అంటూ కసురుతున్నట్టు రంగారావు ఉగ్రముఖం కనపడింది.

వెంటనే గభీమని ఆ వుద్రేకం అడ్డుపడిపోయింది. మొగం వాలిపోయింది. దంతఘర్షణం క్రమాంతరువులలో తగ్గుతుండగా, "తల్లీ...తల్లీ...తల్లీ..." అని ఆగి ఆగి పలుకుతూ అతనది నిట్టూర్పులుగా మార్చేశాడు.

చెయ్యి, తోటకూర కాడలాగ వేలాడిపోయింది.

ఈ బుస్సలూ, యీ చల్లబడి పోవడమూ మల్లమ్మకు ఏవ పుట్టించాయి.

"బీరాలకా విరోధులు లొంగుతారు? ఒక్క రోజుకే నిరాశ చేసుకోవలసి వచ్చినప్పుడు వెలమల కింకా మర్యాద అంటే యేమిటయ్యా? నిజంగా, ఇప్పుడు,

బొబ్బిలి వెలమల రక్తం వుడుకెత్తే స్థితిలోనే వుంటే శత్రువింకా అలా కులుకుతూ వుంటాడా? ఏమి దుష్కాలం వచ్చిపడింది?"

"కాలం దుష్టమయిపోయింది కనకనే ప్రభువు ఆజ్ఞ యిలా వుంది."

"తప్పు, తప్పు. కాలం దుష్టమయిపోయింది కనకనే స్త్రీలు కూడా కత్తి పట్టాలి. వీరాధివీరు డయ్యుండిన్నీ బొబ్బిలి మీదికి రాజు సొంతంగా రాలేకపోయాడు. వజ్రాలవంటి మహాయోధులు పదుగురుండినా అతగాడు తురకలసాయం పుచ్చుకున్నాడు. దాని ఆంతర్యం మీరేమయినా గ్రహించగలిగారా? ఇలాంటి స్థితిలో స్త్రీల సాయం పుచ్చుకోడం వెలమలకు లజ్జాకారణం కాదని వూహించలేరా వెలమలు?"

అతనేదో అనబోయాడు గాని; అంతలో –

"పైగా, పురుషులు స్త్రీలను కోరడం కాదిది. స్త్రీలే వురుకుతామనడం. భేదం యేమయినా తెలిసిందా?"

"ఫలితం–"

"ఫలితమా? వెర్రివాడా! రాజు బొబ్బిలిమీదికి సొంతంగా రాలేకపోయాడంటే అది అతనికి స్త్రీత్వం కాదుటయ్యా? అలాంటి శత్రువును బొబ్బిలి వెలమ దొరసానులే పరిమారిస్తే ఫలితం యెంత చక్కగా వుంటుందో వూహించుకోలేవుటయ్యా?"

"తల్లీ–"

"ఇలా చూడు నాయనా! రాజా శ్రీ రావు రంగారావు దొరవారికి నేను ధర్మపత్నినే. మరి వారికి సహధర్మచారిణ్ణని కూడా అనిపించుకోవద్దుటయ్యా?"

"కాక ఇప్పుడేమి లోటు వచ్చిందమ్మా?"

"ఏమి మిగిలింది తండ్రీ? బొబ్బిలి రాణికి మూడూళ్ళు ముండభరణం యిస్తానన్న రాజు బతికేవుండగా, బొబ్బిలి రాణీ ఆత్మహత్య చేసుకోడమా? ఇది నాకు మానభంగం కాదూ?"

"ముండభరణం" అనే మాట అతనికి చురుక్కు మనిపించింది. "అలా అంటాడా?" అని రాజు మీదా, "అలా కబురంపడం యేమీ?" అని మల్లమ్మ మీదా అతనికి చాలా కోపం వచ్చింది. అయితే, అది ప్రారంభంలోనే మిళితమయిపోయి యేకధారగా రావడంవల్ల ఇక్కడ ప్రకటించడానికి వీలులేక – గుండెలు తాళక లోపల్లోపలే అణిచేసుకున్నాడు. ఈ ప్రయత్నంలో వుండడం వల్ల అతను మరి జవాబయినా చెప్పలేకపోయాడు.

"మీ ప్రభు వెక్కడయ్యా?"

"మొగసాలలో – వెలమల మధ్య – సర్వసన్నద్ధులై–"

"వెళ్ళి యీ సంగతి చెప్పిరా."

"ఆజ్ఞ లేదు తల్లీ!"

"పోనీ, నేనే వెడతాను. నా కడ్డేమిటి?"

"మీ కడ్డేమిటమ్మా? మిమ్మడ్డుకోడాని కెవడికి గుండెలున్నాయి తల్లీ? అయితే – ముందిక్కడ పొడిచి–"

ఇలా అంటూ, అతను, తర్జనితో నిర్దేశించుకుంటూ యెదురొమ్ము విరుచుకు నుంచున్నాడు.

"ఏమి మాట అన్నావూ? అదా మల్లమ్మ చేసే పని! ఎంత చక్కగా వూహించావూ? నేను కైజారు దుయ్యడమే వస్తే అది రాజు పేగులు బయటికి తియ్యాలి. స్వజనంమీదటయ్యా నా ప్రతాపం?"

ఈ మాట శూలమై అతని గుండె దూసుకుపోయింది. దాంతో మాట నిలిచిపోయింది.

"మల్లమ్మ అంటే నీకు వో-ర్తి స్వపక్ష పరపక్ష నిర్ధూమధామురాలని తోచిందా నాయనా?"

పక్కవాటుగా వున్న మొగం ఆమెకేసి తిప్పకున్నాడు కాని; చూపులు మాత్రం తివాసీమీదే వున్నాయి.

"అయితే, వెంకయ్యా! నాకిక నా దేవుడి దర్శనం లేదుటయ్యా?"

అప్పటికి గుక్క తిప్పకోగలిగాడు. అయ్యవార్లంవారు నూరిపోసిన పురాణసారం అంతా గభీమని నెమరికి వచ్చింది. దాంతో "ఈ క్షుద్రమానవ కళేబరం విడిచిపెట్టేసిన తరవాత అది శాశ్వత బ్రహ్మకల్పమే కాదుటమ్మా నీకు?" అంటూ మొండిగా బదులు చెప్పాడు.

"మెట్టవేదాంతం చాలించు. ఈ మానవ కళేబరం వున్నంతసేపే – మానవ కళేబరానికే పగ అయినా, కసి అయినా"

"ఈ కళేబరం శాశ్వతమా?"

"నీ వెలమతనం మాత్రం శాశ్వతమా?"

అతను మళ్ళీ మొగం వంచుకున్నాడు.

"బొబ్బిలి కొట్టడానికి వచ్చిన రాజుకి మాత్రం తన కళేబరం శాశ్వతం కాదని తెలవదూ?"

"ఈ బొబ్బిలి పాటిమీదే అది వొరక్కపోతే కదా?"

"ఆ పనే కాదూ నేను చేస్తానంటున్నదీ?"

యుక్తితోచక, అతను "వాగ్వాదం చాలించవు తల్లీ?" అని లాలనగా అడిగాడు.

"బొబ్బిలి బేరి కోమటి రమణులు గోల్కొండ సరదార్లను తూనిక రాళ్ళతో చీకాకుపరిచారుట. బొబ్బిలి పాటకపు స్త్రీలు విజయనగరం సరదార్లను రోకళ్ళతో కుమ్మారుట. బొబ్బిలి వెలమదొరసాను లామాత్రం అయినా కారుటయ్యా?"

"ప్రభువు నాకోసం కనిపెట్టుకుని వుంటారమ్మా!"

"నువ్వు కూడా వుంటే కాని వారు రాజుమీదికి వెళ్ళరూ? తోడబుట్టవులనూ, తల్లులనూ, పిల్లలనూ, పాడిస్తేగాని నీకు పౌరుషం రేకెత్తదు కాబోలునేం?"

పేగులు తోడేసినట్టయిపోయి, అతను నిట్టూర్పు విడుస్తూ కళ్ళు మూసుకున్నాడు.

"ఎంత పాపం బద్దలాసిపోయిందయ్యా! సత్యభామ కాసె బిగించి విల్లువంచి నరకాసురుణ్ణి గజగజ లాడించివేసింది. ఓరుగంటిలో రుద్రమ్మా పల్నాటిలో నాగమ్మా కత్తి విసరగా పరసేనలు చెల్లాచెదరయిపోయాయి. మరి బొబ్బిలిగడ్డమీద, మల్లమ్మ కైజారుదూస్తే రాజేమయిపోతాడో లోకానికి తెలవద్దుటయ్యా?"

"ఊహలతో యేమి లాభం తల్లీ?"

విసిగిపోయి అతనిలా అనేటప్పటికి, తోకతొక్కిన తాచులాగ, ఆమె "ఊహాలా?... ఏమిటే?" అని కస్సుమంది.

"జరుగుతోందో జరగదో –"

"ఇంకా అదేమాటా? వెలమవీరుడినోట రావలసిందేనా యీ మాట?"

"........."

"నేటికి బొబ్బిలిగడ్డ విరిగిపోయిందా?"

"తాండ్ర పాపారాయణింగారుంటే–"

"పాపారాయణింగారికీవార్త అయినా తెలిసిందో లేదో? అక్కడ రాజాము కోటగతి యేస్థితిలో వున్నదో?"

"నిజమే – పాపారాయణింగారికీవార్త అయినా తెలిసిందో లేదో? రాజాము కోట సంగతి అలావుంచు. బొబ్బిలికోటమాట యేమిటే? ఇక దీనికి నీళ్ళు వదులుకోవలసిందేనా?"

"......."

"పాపారాయణింగారు లేరు. తక్కినవారంతా? బీరాలు పలికిన వెంగళరాయ ణింగారేం చేస్తున్నారయ్యా? చెలికాని వేంకటరాయణింగారి సంగతి కనపడుతూనే వున్నది, మరి రావు చిన్నారాయణింగారు, ఇనగంటి నరసా రాయణింగారు, కాకర్లపూడి వెంకటరామరాజుగారు, పంతెన బుచ్చన్నగారు – ఏరయ్యా వీరంతానూ, ఏంచేస్తున్నారయ్యా? రాజు దుర్మరణవార్త నా చెవిని వెయ్యగల మొగవాడు బొబ్బిలి పాటిమీద లేడుటయ్యా?"

"........."

"మాట్టాడవు.... అయినా ఏమని మాట్టాడతావూ? కత్తి ఝుళిపిస్తూ జనానాలోకి వచ్చావు. మహాగొప్ప పని దొరికింది నీకు; కాని, నాయనా! బొబ్బిలి వెలమ దొరసానులకు, పగవాళ్ళని పొడిచెయ్యడానికి లేకపోతేమానె, సొంతంగా పొడుచుకోడానికయినా అవకాశం వుండనియ్యి"

"..............."

"నూరుకుటుంబాల వెలమస్త్రీలు. చికిలీచేసిన చంద్రహాసాలు. కష్ట సమయంలో వుపకరించవలసిన యెంతశక్తి అడవిగాసిన వెన్నెల అయిపోతున్నదీ? బొబ్బిలికిలాంటి పాట్లు వచ్చినందుకు వారెంత కుమిలిపోతున్నారో, శత్రువులను చీల్చి చెండాడాలని యెంత తహతహ లాడిపోతున్నారో యెవరు చూశారూ? వెంకయ్యా, ఇష్టం లేకపోతే జయించినా మేము బతకమయ్యా! చచ్చిపోడానికయినా యుద్ధంలో వురకడానికనుజ్ఞ యిమ్మని అడగవయ్యా దొరగారిని"

"నీకు పది జవాబు లెందుకు తల్లీ? మాకు అక్కడ రంగారాయణింగారెంతో యిక్కడ మల్లమ్మ అంత"

"అయితే, యుద్ధంలోకి వెడదాం పద"

"అది రాజాజ్ఞకి వ్యతిరేకం తల్లీ!"

"ఇంకెందుకూ మరి పొగడడం?"

"నేను రావుగారి సేవకుణ్ణి. దొరవారి ఆజ్ఞ యిలా వున్నది. జవదాటడానికి నేనెంత–"

"అది దొరవారి ఆజ్ఞ అయితే, యిది దొరసానిగారి ఆజ్ఞ! వెళ్ళి మీదొరగారినిలా తీసుకురా"

"పని కాకుండా కళ్ళబడడానికి ఆజ్ఞలేదు తల్లీ!"

"అంతే! ..... ఎంత చెప్పినా ఆ మాటే? మనం పోయినా లోకం వుంటుంది. బొబ్బిలి వెలమలు, అమానుష చర్యలు నడిపిన రాజుని పొడిచెయ్యలేక పోయారనీ, ఆ పని చెయ్యడానికి స్త్రీలు సిద్ధపడగా అడ్డుకున్నారనీ–"

"వెంకయ్యా?"

"అమ్మా!"

"ఏమంటావు?"

"అలస్యం అయిపోతున్న దంటాను. దీనివల్ల యేమీ ప్రయోజనం లేదంటాను."

"అంటావు......అనవూ మరీ? దొరకి తగిన జెట్టివి. ఈ విషయంలో అయినా యింత స్థిరంగా వుండగలిగినందుకు చాలా సంతోషిస్తున్నాను. నాయనా! ఆలస్యం అయిపోతున్నది – అయేపోయింది కాదూ? ఏమంటేయేం చెబుతా వక్కడ? 'పగవాడి గుండెలు తియ్యవలసిన కైజారు చేసుకున్న పెళ్ళాం మీదికి తిప్పారా' అని అడిగిందని చెప్పేం! 'శత్రువుల చేజిక్కి మేము మానభంగం పొందకుండా యిలా ముందు జాగ్రత్త వహిస్తున్నట్టే, యీ స్థితి సంభవించకుండా వుండేటట్టు పైనుంచి తాఖీదు వచ్చినప్పణ్ణుంచీ జాగ్రత్తపడి వుంటే యెంత బాగుండిపోవునూ?' అని అడిగిందని కూడా చెప్పేం!"

"పట్టుమంటే గుప్పెడుండదు ప్రాణం, దానికోసం కాదు సుమా యీ రాద్ధాంతసిద్ధాంతాలు.
కన్ను మూసి తెరిచేటప్పటికీ లోకం యెక్కడో – యీ జీవుడెక్కడో? ఇదివర కిలాంటి తలువు లెన్నయినాయో? ఎన్ని అనుభవాలు సంభవించాయో? ఇక ముందెన్ని కనిపెట్టుకున్నాయో? కాని యింతకంటే నికృష్టత మరి వుండదు. ఇంతకంటే దౌర్భాగ్యం మరి తటస్థించదు. పగవాడు కానిమాటలాడడమూ, మొగవాడు కానిచేత చెయ్యడమూనూ, శరీరం వుడికి పోతున్నదయ్యా! ఇంతకంటే చిత్రవధ మేలుసుమా!"

అతనికీ చెయ్యి పెట్టి కడుపు కలిచేసి నట్టయింది.

"ఆత్మహత్య మహాపాతకం అన్నారు పెద్దలు. కాని బొబ్బిలి రాణికి అదే సంభవించింది. పొడిచి పొడిచేసుకుంటే యీ తహతహ లేకపోవును. బొబ్బిలి కొట్టాలని యెక్కడ షంకల్పం కలిగిందో ఆ రాజు గుండెలమీద కసుక్కున పొక్కపోటు పొడిస్తే తరవాత యేమయిపోయినా యీ ఆరాటం లేకపోవునయ్యా"

"..............."

"ఇప్పుడేమనుకుంటే యేమి లాభమూ? నిన్ను మాత్రం యెన్నంటే యేమి ప్రయోజనమూ? రంగారాయణింగా రంతటి వీరాధివీరుడి యిల్లాలికే యిలాంటిగతి

తప్పనప్పుడిక యితర్ల మాట చెప్పేదేమి వున్నదీ? బతికుంటే బొబ్బిలి రాణికి భరణమే యిస్తాడు విజయరాముడు–"

"అమ్మా!"

"ఏమినాయనా! నీ వీరవిహారానికి మల్లమ్మ అడ్డువచ్చిందా? ఇదిగో పంపేస్తున్నాను. ఇంతసేపు వాగాను, వాగడం వొక్కటే కనపడుతున్నది కాని; మరేమీ లేదు, నిజమే. పగతీరకుండా చచ్చిపోయాటప్పుడిక యెవరి నేమంటే యేమి వస్తుందీ? అక్కసు పట్టలేక యేమి టేమిటో అన్నాను. క్షమించాలి సుమా అన్నయ్యా! మల్లమ్మ మంచీ చెడ్డా చెప్పేదే కాని, చివరికి, ఆజ్ఞ జవదాటేది కాదని చెప్పి, తప్పులు మరిచిపొమ్మన్నా నని ప్రార్థించినట్లు కూడా మీ బావగారితో చెప్పాలి సుమా అన్నయ్యా!"

------- -

"శ్రీమన్నారాయణమూర్తీ! సూర్యచంద్రుల్లారా! ఇదే నా కడపటిపూజ. ఇదే నా కడపటి నమస్కారం. ఇదే నా కడసారపు ప్రార్థన. పాలబుగ్గల వాడయిన నా బిడ్డని చల్లగా చూడండి, నా ఆయువంతా అతనికి పొయ్యండి. బొబ్బిలి రావువారి రాజవంశం అతని పేరుగా నిలపండి. ఆకాలమరణం పొందుతున్న యీ వెలమవీరుల శేష శౌర్యం అంతా అతనికి దఖలుపరచండి. నా భర్తగారు చెయ్యవలసిన పని అతనిచేత చేయించండి. అదే నాకు పదివేలు, అదే నాకు వరప్రసాదం. అప్పుడే నా యాతన తీరుతుంది...... కైజారు పదునుగానే వుంది. లేకపోయినా సాహసం వుంటే తడిపాతే చాలుతుందెంతకైనా.

శ్రీహరీ! శ్రీహరీ! శ్రీ...హ...రీ...ఈ..."

ఒక్కటే పోటూ, ఒక్కటే పాటూను.

వెంకయ్య కళ్ళు చిరతలు కమ్మాయి. చివరికి అతని కళ్ళకి అంతా శూన్యంగా కనపడింది. క్షణంలో అతని చేతులు రాణె వాసం శూన్యం చేసేశాయి.

*1926,* ఫిబ్రవరి
(భారతినుంచి సవరణలతో)

★ ★ ★

# ఇల్లుపట్టిన వెధవాడబడుచు

"వొరేయ్ తమ్ముడూ!"

సాయంత్రం నాలుగున్నర దాటాక, నూతి పెరట్లో కూచోపెట్టి, చలపతిరావు నెత్తిమీద చమురుపెడుతూ యిలా ప్రారంభించింది బుచ్చమ్మ:

"పదిమాట్లు చెబుతుందేమిటీ పిచ్చిముండ అనుకోకేం? నువ్వు చిన్నవాడవు. ఆటలూ పాటలూ తప్ప, సంసారం అంటే యేమిటో యిప్పటికీ యెరగవు నువ్వు. నేను పెద్దదాన్ని. పిల్లాపీచా నాకు? మొగుడి మొగమే యెరగనయితి నసలు. అందుచేత, నాకు తమ్ముడివయినా నువ్వే, కొడుకువయినా నువ్వే, కూతురివయినా నువ్వే. నలుసంత చెల్లెలయినా లేదు కదా? కనక, నా ముద్దుముచ్చట్లన్నీ నీమూలంగానే తీరాలి. అందుకోసం చెబుతున్నానిదంతా బాగా వింటున్నావా?"

"........."

"కానయితే, పంచశిఖలతో వుండగానే నీకు పెళ్ళికావడం బాగానే వుంది. అయితే, జోగమ్మ యింత త్వరగా కాపరానికి వస్తుందని మేమెవళ్ళమూ అనుకోలేదు. మొన్న మొన్నటిపిల్ల కాదుట్రా అదీ? తల్లివైపు సంప్రదాయంపట్టి అలా బొబ్బిలావుంది గాని; మొన్ననేరా నిండాయి పదహారేళ్ళు దానికి?"

"ఇంతకీ, – కోడలు కాపరానికి రావడం కళ్ళతో చూసుకుందమ్మ. ఒక్కగానొక్క కొడుకు వయినందుకు ముచ్చట్లు బాగానే తీరాయమ్మకి."

".........."

"ముప్పయ్యెకరాల పల్లబ్భూమీ, పదెకరాల కొబ్బరితోటా, ఇనప్పెట్టెలాంటి యిల్లూ – చదువు లేకపోతే లేకపోయింది, నీకేం లోటూ? కాలిమీద కాలువేసుక్కూచున్నా – దమ్మిడీ అయినా సంపాదించకపోయినా – పది తరాల దాకా సరిపోతుంది నీకూ నీవాళ్ళకీని – తెలుసా? "

"..........."

"బతికి వుండినంతకాలమూ నిన్ను కనిపెట్టుకుని వుంటాను కదా నేను?"

"............"

"అమ్మ లేనిలోటు తీర్చలేను గాని; కింద నడవనిస్తానా నిన్ను నేను?"

"............"

"చూడు తమ్ముడూ, నేనిల్లు పట్టాను. నాకు నువ్వే దిక్కు. నీకూ నేనే దిక్కు సుమా! నువ్వు నిస్సాకారంగా చూశావంటే – అబ్బే, వూరికే అన్నాను. నేనంటే నీకు భయభక్తులున్నాయి – నాకు బాగా తెలుసు"

"కాని రోజులు మంచివి కావు. అంచేత, ఎప్పటికేమిటో అని – అందుకోసం చెబుతున్నానిదంతా"

"..............."

"అనుమానం పెనుభూతం అన్నారు పెద్ద లెరుగుదువా? ఎందుకు చెప్పవచ్చానంటే – మన యింటి మొగవాళ్ళు పెళ్ళాలమాట వినడం యెప్పుడూ లేదు"

"..............."

"ఛా, అదేం బతుకు తమ్ముడూ? ఎక్కడో పుట్టి యెక్కడో పెరిగి, గుప్పెడు మెతుకులకోసం చేరిన పెళ్ళామా యింట్లో పెత్తనం చెయ్యడం? మొగజన్మ యెత్తినవాడికది యెంత పరువుతక్కువ పని?"

"..............."

"ఇంట్లో పుట్టి, యింటికోసమే బతుకుతూ, యిల్లే కనిపెట్టుకుని వుండిన ఆడబడుచులు మట్టికొట్టుకుపోవలసిందేనా?"

"..............."

"మన తాత కిద్దరుండేవారుట తోడబుట్టిన పడుచులు. ఇద్దరూ యిల్లు పట్టారుట – వొకర్తి రెండేళ్ళు కాపరంచేసీ, మరొకర్తి సమర్తే ఆడకుండాను. చాకిరీ చెయ్యడం తప్పించింటో యెప్పుడూ పెత్తనం లేదుట నాయనమ్మకి. భోజనం చెయ్యడమూ, నిద్రపోయినంతసేపు నిద్రపోయి స్వాములవారి వుపదేశాలు వింటూ మార్కండేయస్వామివారి గుళ్ళో కూచోడమేట యెప్పుడూనూ, తాతయ్య. ఇంటి సంగతి యెరగనే యెరగడుట, కాస్తా కూడా."

"..............."

"సరే, నాన్న సంగతి నువ్వే యెరుగుదువు"

"..............."

"మన అమ్మ, చాకిరీ కూడా చేసెరగ దెప్పుడూ, అదీ నువ్వే యెరుగుదువు. అమ్మకి చీర కావాలన్నా రైక కావాలన్నా అత్తయ్య కొనిపట్టుకు రావలసిందే బజారుకి వెళ్ళి"

"..............."

"కిక్కురుమన్నాడా నాన్న యెప్పుడైనా? ఎందుకూ? నానాబాధలూ పడేవాళ్ళింట్లో వున్నప్పుడు నిశ్చింతగా కూచోక మొగరాజుకి?"

"..............."

"కన్న కూతురన్నట్లు చూసుకుంది అత్తయ్య నన్నెప్పుడూ. సంసారం గుట్టంతా నా చెవిలో పోసిందావిడ. పోతూ పోతూ తాళాలగుత్తి నాచేతికే యిచ్చింది గాని నాన్న కిచ్చిందా మరి?"

"..............."

"ఏ పొరపాటునైనా, తప్పే దారి, అత్తయ్య యిస్తుందే అనుకో. అయితే మాత్రం? నే నెదటే వుండగా, సాహసించి పుచ్చుకోగలడా నాన్న?"

"..............."

"ఇంటి గుట్టు బ్రహ్మకయినా తెలియనివ్వ నన్నీ, కుటుంబ గౌరవం బాగా నిలబెడతా నన్నీ, ఈ ఇంట్లో ఆడబడుచుల అధికారం అన్యాక్రాంతం అయిపోకుండా

జాగ్రత్త పడతాననీ – ఎన్నిమాట్లు నా చెయ్యి తన చేతిలో వేయించుకుందో అత్తయ్య, నువ్వెరుగుదువా?"

"............."

"ఇవాళ నేను హరీ అంటా ననుకో. ఎందుకయినా పనికి వస్తుందా యీ కొంప?"

"............."

"పోనీ, నా అత్తవారి ఇంటికి నేను వెళ్ళిపోతా ననుకో. యీ ఇంటిమీద కాకయినా వాల్తుందా యింక?"

"............."

"నీరెండిపోయిన చెరువులో చేపల్లాగ, బయటిపడిపోరూ నాన్నా నువ్వూను, క్షణంలో?"

"నాదంతా చేదస్తంగాని – ఇదంతా నువ్వే యెరుగుదువు, ఊరికే మాట వరసకి చెప్పా నంతే, మరేం లేదు."

"బుద్ధికలిగి, నీకు నువ్వే తెలుసుకోవలసిం దయినా, నేనుపని కట్టుకుని చెప్పవలసిం దయినా, వొక్క టేరా తమ్ముడూ! ఏమి టంటావా? చేబోలు వారి ఆడవాళ్ళు కజ్జాకోర్లు. అందులోనూ నీ అత్తగారు మరీనూ. నెలకి నూటయాభై రూపాయల జీతం తెస్తాడన్నమాటే గాని, తెచ్చిందంతా – తెచ్చిన వుత్తర క్షణంలో నీ అత్తగారి చేతిలో పొయ్యవలసిందే గదా నీ మామగారు?"

"లేకపోతే పచ్చి మంచినీళ్ళ కయినా గతి వుందా ఆ బ్రాహ్మడి కాయింట్లో?"

"............."

"ఛీ, యెందుకు వచ్చిన బతుకు తమ్ముడూ అదీ?"

"

"ఏమయినా, నీ అత్తగారి వూసు నా కెందు గ్గానీ, నీ పెళ్ళాం యేమి చేసిందో యెరుగుదువా? ముదిమాటలూ అదీ – నీ బావ మరిది పోయినప్పుడు చూశాలే నేనదంతా."

"అన్ని విధాలా తల్లిని పుణికి పుచ్చుకుందది యేమనుకున్నావో గాని."

"కావలసిన వాళ్ళు కదా అనీ, పుట్టెడు దుఃఖంలో వున్నారు పోనీ అనీ, ఆ పది రోజులూ వండిపెట్టాను కాదూ నేను? తల్లి వొకమూల పడివుండేదనుకో, తానయినా నాకు సాయం కావచ్చునా? ఆడబడుచు నవుదునా, సమర్తాడిన పిల్ల గదా, రాత్రిపూట అయినా కాస్త వంట చెయ్యగూడదూ తమ్ముడూ అదీ?"

"ఎప్పుడు వెళ్ళిపోతానా? అనిపించనా యివతలి వాళ్ళకి?"

"నువ్వు చిన్నవాడవు. అంచేత చెబుతున్నా నిదంతా. వెయ్యికళ్ళతో నేను కనిపెడుతూనే వుంటాను గానీ – ఏమాత్రం చనువిచ్చినా నెత్తెక్కి కూచుంటుంది సుమా, క్షణంలో."

"............."

'నేనంటే కుక్కిన పేనయి పడివుండేటట్లు చూస్తూ వుండాలి సుమా దాన్ని?"

.............

"నాన్న వెర్రిబాగులవాడనీ, నేను మనోవర్తి మనిషి ననీ, యిదివరకే బోధించి వుంటుంది తల్లి. అబ్బో, ఆమాటకి వస్తే నీ పెళ్ళామే నెల్లూరి నెరజాణల రకం అసలు. అవతల పెద్దవాళ్ళున్నారు కదా అనీ, మన కెందుకనీ నదురు బెదురూ వుందనుకున్నావా కసింతయినా మనిషికి?"

"............."

"వేషాలంటే నువ్వు సరదా పడతావని అదనీ యిదనీ నగలు పురమాయిస్తుంది విన్నావు సుమా, వెర్రి నాగమ్మా! అంత సరదా అయితే అక్కణ్ణుంచి తెచ్చుకోమను డబ్బు. తానొక్కర్తే కాదూ వారికి బిడ్డ? వారి కున్నదంతా తనకి ముట్టేదే కాదూ?"

"............."

"నీ మామగా రామాత్రం మనిషి కాదు గానీ, కొంపతీసి, నీ అత్తగారే యే కుర్ర కుంక నయినా దత్తత చేసుకుందా మంటుందేమో, అది పడనివ్వగూడదు సుమా నువ్వు. అలా జరిగిం దంటే అక్కడిది వొక్క పూతిక పుల్ల కూడా దక్కదు సుమా నీకు?"

"కాస్తా కూస్తా కాదు, పదమూడు యకరాల భూమిరా వాళ్ళది? అయినకాడి కమ్ముకున్నా యాభై వేల కరుకులు రాలతాయిరా."

"అదంతా నీ స్వాధీనం కావాలి, తెలుసా?"

"............."

"ఎప్పుడో అనుకున్నావేమో – వల్లకాదు, నుంచున్న పాళంగా జరిగిపోవాలి రాతకోతలు. ఒక్కొక్కటే చరాస్తి అంతా ఇక్కడికి చేరవేసుకోమని తొందరపెట్టు నీ పెళ్ళాన్ని. అలా చేస్తేనే నువ్వు మాట్లాడాలి దాంతో."

"వాళ్ళు పిల్లపేర రాస్తా మంటారు, వల్లకాదు సుమా!"

"మీ ఆస్తి మీ పిల్లపేర రాస్తే మా ఆస్తి అంతా మా నాన్నా నేనూ మా అక్కపేర రాసేస్తా మను, కచ్చితంగా"

"...... "

"ఆ రాత కాస్తా అయిపోయిందా, కిక్కురుమన నిస్తానా యిక వాళ్ళని?"

"        "

"పోనీ గాని తమ్ముడూ, అడిగేవాడు లేకగానీ – ఎంత వుద్యోగస్థులయితే మాత్రం అవేం కాఫీలురా? హవ్వ, పొద్దుటిపూట చాలదూ, మధ్యాహ్నం కూడానా?"

"............"

"కుడితికీ కాఫీకీ భేదం యేమిటంట?"

"అక్కడ రుచిమరిగివుంటుంది గానీ – ఇక్కడ సాగనిచ్చా మంటే గుడ్డిగవ్వకు మారము సుమా మనం?"

"తనకి రొస్టు లేకుండా నీకు మప్పుతుందది, విన్నావు సుమా; నువ్వు కాఫీరుచి మరిగావంటే, దానివల్లో పడిపోయా వన్నమాటే సుమా!"

"............"

ఇలాగ చాలా సంగతులూ చెప్పింది బుచ్చమ్మ. చాలా దూరమూ చెప్పింది; కాని దేనికీ బదులు చెప్పలేదు చలపతి. ఆ మాటలు వినగా, అతనికి, ఒక పంటికింద తీపీ, మరో పంటికింద చేదూ పడ్డట్టుంది.

దాంతో, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ కొంతసేపూ, సిగ్గుపడుతూ కొంతసేపూ, ఏమనాలో తోచక కిందా మీదా పడుతూ కొంతసేపూ, ఏమంటే యేమిటో అని జంకుతూ కొంతసేపూ నోరు కుట్టేసుక్కూ చున్నాడతను.

ఇదంతా తనకి విధేయతే అనుకుంది బుచ్చమ్మ. "ఇది జ్ఞాపకం వుందా" అని వొకటీ, "అన్నట్టు మరిచిపోయా, నిది బాగా విను" అని వొకటీ, "ఇది ముఖ్యం సుమా" అని యింకొకటీ అని యేమిటోమిటో చెప్పి, చివరికి "నామాటే వింటాడు తమ్ముడు" అనుకుని తలంటూ పూర్తిచేసిం దామె.

పొడిబట్ట కట్టుకున్నాడు చలపతిరావు. "చొక్కా తొడుక్కురా" అందామె. కండువా తెచ్చి తానే అతని బుజాన వేసిందెందుకో చెప్పకుండా. ఒక అర్ధణా తెచ్చి అతని చేతిలో పెట్టింది "తెలిసిందా?" అన్నట్టు చూస్తూ, "దర్జాగా కాఫీహోటలుకి వెళ్ళు. కమ్మగా అరకప్పు కాఫీ పుచ్చుకో, కాలిమీద కాలు వేసుక్కూచుని. పెళ్ళాంగారు పుట్టింటినించి వచ్చాటప్పటికి, మొగంవాచి వుండినట్టు ఇంటో ఎదురుగా వుండగూడదు మొగుడు. కనుక, గోదావరిగట్టే వెళ్ళి, మూజియంతోటలో కూచుని, యెనిమిదింటికో యెనిమిదిన్నరకో యింటికి రా గప్చిప్గా" అంది కళ్ళు తిప్పుకుంటూ.

జబ్బపట్టుకు తీసుకువెళ్ళి వీధి గుమ్మం దాంటించింది ఉత్తరంగా దారి చూపిస్తూ. భడీమని వీధి తలుపున్నా వేసేసుకుంది; కాని నాలుక కరుచుకుంటూ వెంటనే తలుపు తెరిచింది. ఆత్రంగా వీధిలో కొక్కదూకు దూకింది కాని; అప్పటికే మాయమయిపోయాడు చలపతి.

"అది గోదావరి స్టేషనులో రెయిలు దిగుతుంది, తమ్ముణ్ణటే వెళ్ళమన్నా మేమిటి మనం? ఈ వెర్రినాగమ్మ స్టేషనులోనే కూచుంటా డేమో కొంపతీసి" అని విసుక్కుంటూ అక్కడే వుండిపోయింది, అటే చూస్తూ.

రాత్రి యేడింటికి తీసుకువచ్చాడు జగ్గయ్య, కోడలు జోగమ్మని. మళ్ళీ తన భార్యపోయిన యిన్నాళ్ళకి తన నట్టింట పుణ్యస్త్రీ పడుచు మసల బోతున్నందుకు చాలా పొంగిపోతూ తీసుకు వచ్చాడతను. తాను స్వయంగా , తన కోడలిని తీసుకు తెచ్చుకోడం ఆ వీధిలో నలుగురూ చూడాలని యెంతో ముచ్చటపడుతూ కూడా తీసుకు వచ్చాడతను; కాని, సాయంత్రం అయిదు కాకుండానే గోదావరిస్టేషనుకి చేరుకోవలసిందల్లా, ఆవేళ, యేడున్నర దాటాక వచ్చింది రెయిలు.

తన ముచ్చట్లన్నీ యిలా అయిపోయేటట్టు గుర్తుకి రాగా, నిడదవోలు స్టేషనులోనే విసుగూ రోషమూ పుట్టుకువచ్చాయతనికి. మెయిలు బోటు దిగి, రెయి లెక్కడ మించిపోతుందో అని కంగారు పడిపోయినవా డల్లా, స్టేషను చేరుకున్నాక కొయ్యయి పోయాడతను.

అంచేత, జట్కాబండి గుమ్మాన ఆగడం తరవాయిగా బండి దిగి చర్రున యింటోకి చక్కాపోయా డతను.

ఆచంటలో బిక్కుబిక్కుమంటూనే బయలు దేరింది జోగమ్మ; కాని యెంత ఆలస్యం అయినా, మెయిలు దిగాక, చాలా వుల్లాసంగానే జట్కా యెక్కిందామె. బుచ్చమ్మ, తనకోసం బండిదగ్గిరికే యెగిరివస్తుందనీ "దయచేశారూ రాణీగారు?" అంటూ తన కణతలమీద మెటికలు విరిచి పొదివి పట్టుకుని తనని బండిదింపుతుందనీ, ఏ యిరుగుపొరుగు పిల్లనైనా సిద్ధంగా వుంచి, తాను గుమ్మం దగ్గిరికి వెళ్ళాటప్పటికి ఎర్ర అక్షింతలూ పచ్చ అక్షింతలూ దిగతుడిపించి, తన కాళ్ళమీద చెంబెడు నీళ్ళు కూడా పోయించి యెక సక్కాలాడుతూ యింటోకి తీసుకు వెడుతుందనీ అనుకుంటూ వచ్చింది, పాపం.

అప్పుడు తానెలాగు నవ్వాలో, సిగ్గెలా నటించాలో, ఎంత అమాయికంగా కనపడాలో, దానాదీనా తన కెంత సంబరం కలుగుతుందో - ఇదంతా వూహించుకుంటూ కూడా వచ్చిందామె.

బుచ్చమ్మ కళ్ళబడకుండా, చలపతిరావు తనని తొంగిచూస్తాడనీ, తానున్నూ అతణ్ణలాగే చూడాలనీ - ఇలా కూడా అనుకుంటూనూ, ఆశించుకుంటూనూ కూడా వచ్చిందామె; కాని, బండి దగ్గిరికి రాకపోడమే కాదు, తొంగిచూడగా, గుమ్మంలో వున్నట్టున్నూ కనపడలే దామెకి బుచ్చమ్మ.

ఉత్సాహం అంతా చల్లబడిపోయింది. మనస్సు కూడా చెదిరిపోయింది ఉసూరుమంటూ బండిదిగి, కాళ్ళీడ్చుకుంటూ బయలుదేరి, తెలతెలపోతూ యింట్లో ప్రవేశించింది జోగమ్మ, ఎవళ్ళయింట్లోనో అన్నట్టు.

అప్పటికి, మండువా అంచున నుంచుని ఉత్తరపు గదిగుమ్మాన పెట్టిస్తున్నాడు సామాను జగ్గయ్య. సిమెంటుబొమ్మలాగ పడమటింటి గుమ్మాన నుంచుని వుంది బుచ్చమ్మ, ద్వారానికి చేరబడి.

"అబ్బాయి కనపడ్డేం?" అనడిగాడు జగ్గయ్య, ఉండుండి.

"వంటెద్దుబండయితే మూడణాలకే వచ్చునుగదా, పావులా ఖర్చుపెట్టి గుర్రబ్బం డెందుకు తీసుకువచ్చావూ?" అని యెదురడిగింది, దీనికి బుచ్చమ్మ.

చుర్రుమన్నాడు జగ్గయ్య. "అబ్బాయిమాట అడిగాన్నే" నంటూ గదించాడు కూడా.

ఎగిసిపడింది బుచ్చమ్మ, తండ్రిధోరణి చూసి, "ఏమిచూసుకునీ యీ వాలకం?" అనిన్నీ అనుకుందామె, తన పెత్తనం నెమరుకి తెచ్చుకుంటూ.

"ఇంటో లేడు" అనిన్నీ అంది, వంటింటికేసి చూస్తూ నిర్లక్ష్యంగా.

"ఎక్కడికి పంపావూ?"

"నేను పంపానా?"

"పోనీ యెక్కడికి వెళ్ళాడూ?"

"నేను చూశానా?"

"..........."

"నాతో చెబుతున్నాడా వాడేమయినా, అసలు?"

"ఎంత సేపయిందీ వెళ్ళి?"

"నాకేం తెలుసూ?"

"భోజనం అయిందా?"

"లేదు"

"ఏం?"

"ఏమో?"

"వంటయిందా?"

"సడే! ఇప్పటిదాకా వూరికే కూచున్నాననే నీ వుద్దేశం?"

జగ్గయ్యకి మళ్ళీ చుర్రుమంది; కాని, ఏమి చెయ్యాలో, కనీసం యేమి చెప్పాలో కూడా తోచలే దతనికి. బుచ్చమ్మే అందుకుంది:

"తమలపాకులూ పోకచెక్కలూ తెచ్చుకోమని డబ్బిద్దామని నేను వాకిట్లోకి వచ్చాటప్పటికే లేడు వాడు. రోజులు బాగా లేవు కనక, ఏ దొంగయినా యింటో దూరతాడేమో అని తలుపు గడియవేసి వంటింటోకి చక్కాపోయీనా పళంగా"

"..........."

"నువ్వు తలుపు తట్టేదాకా నేనివతలికే రాలే దసలు."

"..........."

"నాలుగుఘడియల పొద్దువేళ తలంటిపోశాను. అంతే, మళ్ళీ చూడలేదు తమ్ముణ్ణి నేను"

జగ్గయ్య కేమీ పాలుపోలేదు. "ఎక్కడికి వెళ్ళాడో యెవరితో తిరుగుతున్నాడో?" అని స్వగతంగా అనుకోబోయాడతను; కాని, పైకే వచ్చేసింది మాట.

ఇది విని జోగమ్మ వులిక్కిపడింది. "ఎక్కడికి వెళ్ళాడో" అన్నమాట కేం, "యెవళ్ళతో తిరుగుతున్నాడో" అన్నమాటతో యేదో కంగారుపట్టుకుందామెకి.

ఇది గుర్తించేసింది బుచ్చమ్మ. మాటమరిపించా లనుకుని "ఏ చల్లగాలికయినా - యే గోదావరివొడ్డు కయినా వెళ్ళి వుంటాడు తమ్ముడు. వెడితే మాత్రం భోజనాల వేళ కయ్యా రాకుండా అక్కడే వుండిపోతాడా? స్నానానికి నువ్వెలాగా గోదావరికి వెడతావు కనక, నీకు దారిలోనే యెదురవుతాడు వాడు" అంది తండ్రితో.

జోగమ్మ జగ్గయ్యకేసి చూసింది. జగ్గయ్య మండువా అంచునవున్న బిందెకేసి చూశాడు. అది చూసి వంటిటోకి వెళ్ళి కుంభకోణం చెంబు తెచ్చి తన యెదట వుంచింది బుచ్చమ్మ.

"సామాను సర్దుకోతల్లీ" అంటూ కోడలికి చెబుతూనే చెంబు పుచ్చుకుని వీధిలోకి వెళ్ళిపోయాడు జగ్గయ్య.

వెలగలేక వెలగలేక వెలుగుతున్న బుడ్డిదీపం వదినా మరదళ్ళ చూపులు కలిపింది.

"ఏమిటీవాలకం?" అనుకుంది జోగమ్మ.

"మామగారు సామానుసర్దుకో మని చెప్పేదాక బొమ్మలా నుంచోవాలి కామోసు. అదంతా సిగ్గు కామోసు. మేమెప్పుడూ యెరగం" అని వినపడీ వినపడకుండా సాగతీసుకుని గిర్రున తిరిగి వంటింటోకి చక్కాపోయింది బుచ్చమ్మ.

గోదావరిలో స్నానంచేసి, శ్రీసూక్త పారాయణం పూర్తికాగా కింది చీడీమీదే బ్రహ్మార్పణంగా యిన్ని నీళ్ళు విడిచిపెట్టి "అబ్బాయి వచ్చాడా?" అనడుగుతూ యింటో అడుగుపెట్టాడు జగ్గయ్య.

ఉలిక్కిపడి "లే"దని బదులు చెప్పింది జోగమ్మ.

"సినీమాకే వెళ్ళాడో, యెవళ్ళతోనయినా తిరుగుతున్నాడో వెర్రినాయన" అనుకుంటూ వంటింటోకి చక్కాపోయాడు జగ్గయ్య.

ఇన్నాళ్ళకి వచ్చినా - ఇంతదూరం వచ్చినా - ఇంతసేపున్నా అయినా తన వస్తువు కళ్ళకయినా కనబడకపోగా బెంబేలుపడిపోయి, నుంచున్నది నుంచున్నట్లుగా చతికిలబడిపోయింది జోగమ్మ.

ఆచంటలో, పొద్దున్న తొమ్మిదింటికి తిన్న మెతుకులు జోగమ్మకి.

ఆకలయినప్పుడు దారిలో తినమని జంతికలూ అవీ యిచ్చే పంపించింది తల్లి; కాని, మెయిలుపడవలో, ఆడవాళ్ళలో తానీచివరా, జగ్గయ్య ఆ పెట్టెభద్రంగా తన దగ్గిర పెట్టుకుని మొగవాళ్ళలో ఆ చివరా వుండిపోడంవల్ల అవి తలుచుకుని గుటకలుమింగుతూనే కాలం గడపవలసి వచ్చిందామెకి.

ఇదేమీ యెరగని జగ్గయ్య, నిడదవోలు స్టేషనులో "అరటిపళ్ళు కొనమంటావా?" అనడిగాడు. బేరమున్నా సాగించాడు, అంగడిమనిషితో గాని; "వద్దుగాక వద్దనేసిం"దామె, సిగ్గుపడీ, మొగమాటపడిపోయీని.

మొత్తానికి, రాజమహేంద్రవరం వచ్చాక, అడిగి పుచ్చుకునేదాకా పచ్చి మంచినీళ్ళయినా యెరగ దామె.

ఎనిమిదిన్నర కింటికి వచ్చాడు చలపతిరావు.

నీరసంతో గాఢనిద్రపట్టి వుండడంవల్ల జోగమ్మ అది యెరగదు.

ఇక్కడ జోగమ్మలాగే, అక్కడ – ఉత్తరవసారాలో గాది అరుగుమీద జగ్గయ్యకూడా గాఢనిద్రలో వున్నాడు.

ఏదోపనిమీద అటూ ఇటూ తిరుగుతున్నట్టు నటిస్తూ యిందుకోసమే యెదురు చూస్తున్న బుచ్చమ్మ, మెల్లిగా వెళ్ళి తలుపు తీసి, దురుసుగా హాల్లో అడుగుపెట్టినవాణ్ణి వీధి చీడీలమీదికి తీసుకువెళ్ళి "నీ పెళ్ళాం వచ్చిందిరా" అంది, కంఠం నొక్కుకుని.

"ఏదీ?" అనడిగాడు చలపతి.

అతను కూడా బుచ్చమ్మలాగ కంఠం నొక్కుకోడానికే ప్రయత్నించాడు గాని; వుబలాటం కొద్దీ గట్టిగానే వచ్చేసింది మాట.

ముందు ముక్కుమీద వేలు పెట్టుకుంది బుచ్చమ్మ. "ఇక గట్టిగా మాట్లాడ వద్దన్న"ట్టతని నోటి కడ్డంగా చెయ్యి పెట్టి "ఉత్తరపింటి గుమ్మాన పడుకుని నిద్రపోతోంది" అని చెప్పింది.

"సరే"

"ఇప్పుడు మాట్లాడించకేం?"

"ఏం?"

లంఘనాలు చేసినవాడి మాటలాగ అతినీరసంగా వుందతని మాట.

"తప్పు తప్పు, లోకువయిపోవూ? గదిలోకి వచ్చి అదే ముందు నిన్ను పలకరించాలి"

"అలాగా?"

"ఇంటో నాలాంటి పెద్దవాళ్ళుండడం ఇలాగ మంచీ చెడ్డా చెబుతూ వుండడానికే"

"ఊఁహూఁ"

"బాగా అర్థం అయిందా?"

"ఆఁ"

"చదీచప్పుడూ కాకుండా గదిలోకి వెళ్ళి పట్టుపంచె కట్టుకు చక్కారా"

ఇద్దరూ బయలుదేరారు గాని గభీమని అతని కద్దుగా మంచుని "ఎవరైనా అడిగితే నీకు నువ్వే గోదావరిగట్టుకి షికారువెళ్ళినట్టు చెప్పేం?" అంది.

"నువ్వు వెళ్ళమన్నా వంటేం?"

"అ–వ్వ" అని రుంజుకుంటూ నోరు నొక్కుకుందామె.

కారణం లేని ఆజ్ఞ యిది కావి; జరిగిపోవాలి. ఇలాంటి సందర్భాల్లో ఆడవాళ్ళు వేసే తస్సా యిది. దీంతో మహా ప్రత్యవాయం యేదో స్ఫురిస్తుం దవతలివాళ్ళకి. ఏమీ బోధపడదు; కాని నాడులు కుంగిపోతాయి.

"సరేలే" అనేశాడతను.

తరవాత, జోగమ్మ యెక్కడ చూసిపోతుందో అని నక్కుతూ, పిల్లిలాగ అడుగులు మెల్లిగా వేసుకుంటూ ఉత్తరగదిలోకి చలపతీ, పడమటింటోకి బుచ్చమ్మా చక్కాపోయారు.

బుచ్చమ్మ, వంటింటో పీటవాల్చింది. విస్తరివేసింది. కంచుచెంబుతో మంచినీళ్ళుంచింది, వడ్డించింది. వెచ్చగిల్లడం కోసం నేతిగిన్నె పొయ్యిదగ్గిరగా పెట్టింది.

ఒక్కక్షణం గుమ్మంకేసి చూసింది కాని; యిన్ని చేశాటప్పటికిన్నీ చలపతి మడి కట్టుకురాలేదు.

వెంటనే మండువాలోకి వచ్చి ఉత్తరపుగది కేసి తొంగి చూసిందామె. అతని జాడేమీ కనపడలేదు. ఒక్కక్షణం చూసి గదియెదటికి వెళ్ళినుంచుంది, అలికిడయి జోగమ్మ మేలుకుంటుందేమో అని భయపడుతూనే.

గదిగుమ్మంలోకి వెళ్ళి తొంగిచూసింది చివరికి. మంచానికి చేరబడి నుంచుని వున్నాడు చలపతి. జోగమ్మకోసం యెదురు చూస్తున్నాడతను. "లేచిందా?" అనీ "వస్తోందా లేదా?" అనీ రెండుమాట్లు తొంగిచూశాడు కూడా అప్పటి కతను.

ఇంతలో అలికి డయింది. జోగమ్మే వస్తోందనుకుని కుడికాలి బొటనవేలితో గోదినీ రాస్తూ గభీమని మొగం వంచేసుకున్నాడు; కాని వోరకంట చూశాడు.

తెల్లని బట్ట కనపడింది.

కిందచూపులే నిదానించి చూశాడు.

బోసికాళ్ళు కంటబడ్డాయి.

అనుమానిస్తూనే మొగం పైకెత్తుకుని చూశాడు. కళ్ళనిండా.

విలువునా బుచ్చమ్మ!

తెల్లపోయాడతను. నీరున్నా అయిపోయాడు.

ఆ స్థితి గ్రహించి, లోపలికి వెళ్ళి "రావేం?" అనడిగింది బుచ్చమ్మ, వెనకటిలాగే కంఠం నొక్కుకుని.

"లోపలి కది యింకా రాలేదు మరి?"

"ఇప్పుడు కాదురా"

మెల్లిగానే గదిమిందిలాగ బుచ్చమ్మ, నోరునొక్కుకుంటూ.

"మరెప్పుడూ?"

"భోజనం చేశాక"

"అయితే పద"

బుచ్చమ్మ ముందు బయలుదేరింది. పట్టుపంచె కట్టుకుని, జోగమ్మ నిద్రపోతోంది గదా అన్న దిలాసాతో వెన్ను విరుచుకుంటూ తరవాత వెళ్ళాడు చలపతి.

వెళ్ళీ వెళ్ళడంతోనే పరిషేచన చేసేశాడు చలపతి.

వెంటనే బుచ్చమ్మ నెయ్యి వడ్డించబోయింది కాని; రెక్క పట్టుకుని యెవరో వెనక్కి లాగేస్తున్నట్టాగి పోయి, చురచుర చూస్తూ "కాళ్ళు కడుక్కున్నావా?" అనడిగింది కంగారుగా.

చూసుకోగా, కంకరదుమ్ము కొట్టుకుని వున్నాయి కాళ్ళు.

తెల్లపోయాడు చలపతి.

దిక్కు మొగమున్నా వేశాడు.

ఎలా వున్నవారలా కొయ్యయిపోయా రిద్దరూ, వొకరికేసి మాత్రం వొకరు చూసుకుంటూ.

ఏమిటీదారి? ఇంటికి పెద్దదిక్కు కదా, అనాచారం జరిగిపోతూ వుంటే చూస్తూ వూరుకోడమేనా బుచ్చమ్మ? ఊరుకోగలదా అస లామె?

కాని, జరిగిపోయింది. ఇక కలిసిరాదు. అయినా, సంప్రదాయం నిలబెట్టవలసిన పూచీ తనకే వుండడంవల్ల వొక్కక్షణం ఆలోచించింది బుచ్చమ్మ. ఆమె ఆలోచించినంత సేపూ, విస్తరిలో యెక్కడ యెలావున్న చెయ్యి, అక్కడే – అలాగే వుంచేసుకుని ఆమె కేసే చూశాడతను.

చివరికి – అంతర్వాణి ఆదేశం అందింది, బుచ్చమ్మకి. "ఇంకెప్పుడూ ఇలా చెయ్యకేం?" అంటూ గద్దించింది. కాళ్ళివతలికి చాపమని తానే కాసిన్ని నీళ్ళు చిలకరించింది. "భోజనం చేశాక మాత్రం నూతికి వెళ్ళి బాగా కడుక్కో సుమా" అని గట్టిగా కట్టడి చేసింది. చివరికి నెయ్యి మరో గరిటె యెక్కువ వడ్డించింది.

తరవాత ఆమె మామూలుగానే మాట్లాడింది మెల్లిగా; కాని సంజ్ఞలతోనే కాలక్షేపం చేశాడతను. వంచిన తలయెత్తకుండా నాలుగుమెతుకులున్నా తినేశాడు గబాగబా. చెయ్యి మాత్రం కడిగేసుకున్నా డాదరాబాదరా. జోగమ్మకి మెలుకువ రాకుండా గదిలో కుడాయించాడు. అప్పటికే నిద్ర ముంచుకురాగా అతికష్టాన పట్టుపంచె విడిచి నూలుపంచె కట్టుకుని, మంచాన పడ్డాడు.

అతనిలా నిద్రకి పడ్డాడు, గడియారం అలా తొమ్మిది కొట్టింది. జోగమ్మ వులిక్కిపడిలేవడమూ "బొట్టుపెట్టి పిలవాలి కామోసు" అనుకుంటూ ధుమధుమలాడుతూ బుచ్చమ్మ మండువాలోకి రావడమూ వొక్కమాటే జరిగిపోయాయి.

ఇద్దరికళ్ళూ కలిశాయి, అంతే, వెంటనే ముందు బుచ్చమ్మా, ఆమె వెనకనే జోగమ్మా వంటింటోకి బయలుదేరారు. కట్టుకున్నది పెద్దాపురం పట్టుచీర కావడంవల్ల కాళ్ళు మాత్రం కడుక్కుని భోజనం ప్రారంభించింది జోగమ్మ.

"నా కేమవసరం?" అనుకుంటూనే "మీనాన్నా మీ అమ్మా కులాసాగా వున్నారా?" అని నోరు జారేసింది బుచ్చమ్మ.

"ఆ" అంది జోగమ్మ.

బుచ్చమ్మ యిక వాక్ప్రవాహం ఆపుకోలేకపోయింది.

"మీ నాన్న దగ్గిర మూడో గుమాస్తా? ఆయన చెల్లెలు? మరిచిపోయా నావిడపే రేమిటీ?"

"పుల్లమ్మ"

"ఆచంటలోనే వుందా ఆవిడ?"

"ఆ"

"అప్పుడే వెడుతుం దనుకున్నారు, రామేశ్వరం వెళ్ళి వచ్చిందా ఆవిడ?"

వొళ్ళు మండుకుపోయింది జోగమ్మకి. "వత్తా రామేశ్వరమేనా?" అనడిగింది కొంటెగా చూస్తూ.

"అదేమిటే అలా అంటావు?"

"ఏం? ఆ వూళ్లో వాళ్ళకి చుట్టాలున్నారుట కాదూ?"

"ఉంటే?"

"చుట్టాల యింటికి వెళ్ళరుటండీ?"

మాటతోచలేదు బుచ్చమ్మకి; కాని వూరుకోలేక "మహా మంచి మనిషావిడ. నాలుగురోజులు మాట్లాడుకున్నామో లేదో బాగా కలిసిపోయింది మాకు. ఎప్పుడో ఒకమాటు వెళ్ళి చూసి రావాలి" అంది, అటు చూడకుండానే.

ఒక్కక్షణం యిద్దరూ మౌనంగా భోజనం చేశారు.

మళ్ళీ అందుకుంది బుచ్చమ్మ.

అయితే, అదనీ యిదనీ ఆచంట గొడవ లడిగింది. ఉండుండి యిక్కడి కబుర్లు చెప్పింది. మధ్యమధ్య యిరుగు పొరుగు దంపతులకు పేర్లూ పద్దులూ పెట్టింది. కొత్తిమిరి కారంతోనూ, మామిడిపిందెల పచ్చడి బద్దలతోనూ, చివరికి మీగడపెరుగుతోనూ కాస్తకాస్త చొప్పున వుప్పుపిండి తింది. తానిలాగా అలాగా తిరుగుతూ ఇల్లంతా జోగమ్మచేత సర్దించింది. తన పక్క సవరించుకోవడంలో జోగమ్మ సాయం పుచ్చుకుంది.

"అమ్మయ్యా, రామయ్య తండ్రీ, చాకిరీ అంతా చేసుకునేటప్పటికి నడుం లాక్కుపోయింది రామయ్యతండ్రీ" అంటూ గభీమని పక్కమీద కూచుంది. "హూ-హూ-హూ" అంటూ వొక్కమాటూవైపూ యీవైపూ దొర్లింది. "ఇక పడుకో" అంటూ జోగమ్మకి సెలవిచ్చింది, కళ్ళుమూసుకుని.

పదిమ్ముప్పావు వయింది ఖరాగా, అప్పటికి.

తెల్లవారుజామున మూడున్నరకే మెలుకువ వచ్చింది బుచ్చమ్మకి.

తరవాత మరి నిద్ర రానూలేదు, అందుకోసం ప్రయత్నించనూ లేదామె.

పైగా, ఏమిటో మించిపోతున్నట్టు మనస్సు గందరగోళపడిపోయింది.

రెండుమూడు మాట్లామె ఉత్తరపుగది తలుపు దగ్గిరికి వెళ్ళి తలుపు సందులకు చెవి ఆనించివింది గావి; దంపతుల్లో వొకరూ కూడా మేలుకుని వున్నట్టు కనపడలేదు.

తరవాత, వొక అరగంటసేపు మంచానకూచుంది. అతి కష్టంమీద.

మరో పావుగంట పస్తాయించింది. ఇంకో అయిదు నిముషాలున్నూ వూరుకుంది కావి; మరి వుండలేకపోయింది. వెనకబడి యెవరో తరుముకు వస్తున్నంత కంగారుపడిపోయింది కూడా ఆమె.

సరిగా యీ సమయాన పక్కయింటి గడియారం నాలుగు కొట్టింది. "ఇంకేముంది బాబోయ్" అనిపించింది దాంతో, వెంటనే వొక్క అంగవేసింది మళ్ళీ గుమ్మంలోకి. గొళ్ళెం దడదడలాడించింది, ఆవేశంతో. "తెల్లావారిపో వచ్చింది, లేచి చదువుకో తమ్ముడూ" అంటూ పిలుపుమీద పిలుపున్నూ మొదలుపెట్టింది.

జవాబు లేకపోగా, వొక నిమిషం చూసి మళ్ళీ పిలిచింది. ఓరుగాలి గొడుతున్నట్టు తలుపు గుంజింది; దాంతో జోగమ్మకి మాత్రం మెలుకువ వచ్చింది గాని; పలకలేదామె.

అన్నిమాట్లు పిలిచినా యెవరూ పలకనందుకు చాలా అభిమానపడింది బుచ్చమ్మ. ఇదంతా జోగమ్మ మూలంగానే జరిగిందని కూడా నిశ్చయించుకుందామె. దీంతో చాలా వుక్రోషం వచ్చింది. దాంతో "హారేయ్, వోరి నీ నిద్ర–" అంటూ చెండుకుంది. మళ్ళీ గొళ్ళెం కదిపింది. తలుపు గుంజింది. ఉరిమిన్నీ పిలిచింది మళ్ళీ మళ్ళీ.

దీంతో జోగమ్మకి మెళుకువ వచ్చింది. "తెల్లవారిందా" అనుకుందామె కళ్ళు నులుముకుంటూ; కాని చదువుమాట వినపడింది. "రోజా చదివిస్తోందా భామ?" అనుకోకపోలేదు గాని; "అయినా చూద్దాం" అనిన్నీ అనుకుని "మీ అక్క పిలుస్తోంది" అంది, చలపతిని కుదుపుతూ.

భోజనం చేసి పడుకున్నాడు, మళ్ళీ చలపతి కిదే మెళుకువ రావడం! కాని బద్ధకం తగ్గలే దతనికి. కాక, తన్ను లేపుతున్నది జోగమ్మ కాని బుచ్చమ్మ కాకపోయింది. "వాకిట్లో యెంత చించుకుంటేం, అక్క యింటోకి రాదు కదా?" అనుకున్నాడు. "ఊరుకుందూ" అని ముసముస లాడా డీదిలాసాతో, ముసుగున్నూ బిగించాడు.

స్పష్టంగా తెలియకపోయినా లోపల యేదో సంభాషణ జరగడం గ్రహించేసింది బుచ్చమ్మ. ఒక్కక్షణం చూసింది, మళ్ళీ మాట సవ్వడి కాలేదు. "వాడు మేలుకున్నాడు; కాని అదే లేవనివ్వడం లేదు" అని నిశ్చయించుకుంది. "తమ్ముడూ" "అబ్బాయీ" "హారే బుల్లాడా" అంటూ యెంతో ప్రేమగా మళ్ళీమళ్ళీ పిలిచింది. చివరి "కిలా వుందా నీ పని?" అనుకుని "మొగుడూ పెళ్ళామూ గూడా యిద్దరి కిద్దరే. యీ కొంపలో మొగవాళ్ళ కెప్పుడూ యింత బండ నిద్దరలేదు. ఏడిచినట్టే వుంది సడసం. సిగ్గూబిడియమూ లేకపోతే సరి. మొండివాడు ముక్కుకోస్తే నెత్తురు తాగాడుట. అలా వుందిది. ఇలా అయితే, తెల్లవారిందన్నమాటే సంసారం. మంచి సంప్రదాయమే దాపరించింది మాకు, చివరికి. పోనీ, నీకయినా మెళుకువ రాలేదుటే మాతల్లీ?" అని సాగదీసుకుని రెండునిమిషాలసేపు తలుపు గుంజిగుంజి విడిచి పెట్టింది.

ఈ అల్లరికి "మామగారు లేవకపోతారా" అనుకుంది జోగమ్మ. ఎంత చూసినా, తానూ బుచ్చమ్మా తప్ప మరో మనిషి మేలుకున్నట్టు తోచలేదామెకి. అయినప్పుడు రొష్టు మనకెందు కనుకుని లేచివచ్చి తలుపుతీసిం దామె, మాట్టాడకుండా.

తలుపు తెరుచుకుందంతే, వొక్క దూకుదూకింది మంచం దగ్గరికి బుచ్చమ్మ. అదిచూసి జోగమ్మ యివతలికి వచ్చేసింది. అందుకు మరీ సంతోషించింది బుచ్చమ్మ. వెంటనే నాలుగుమాట్లు అటూ యిటూ దొర్లించిందామె తమ్ముణ్ణి. చెవిలో నోరుపెట్టి "యేదో చదువుకుంటున్నట్టు కనపడకపోతే నీ పెళ్ళాం లోకువచేస్తుందిరా" అని చెబుతూ తానే పట్టుకుని మంచానకూచోబెట్టింది. ఒక్కక్షణం చూసి చెయ్యి పట్టుకుని యివతలికిన్నీ లాక్కువచ్చి అరుగుమీద కూచోబెట్టింది.

ఇదంతా చూశాటప్పటికి జోగమ్మకి అరికాలిమంట నెత్తికి వచ్చింది, వల్లమాలిన దుఃఖమూ ముంచుకు వచ్చింది. దిక్కు తోచలే దామెకి. వెంటనే లోపలికి వెళ్ళి, తలుపు గొళ్ళెం పెట్టుకుని రెండుచేతులా మొగం కప్పుకుని యేడుస్తూ కూచుంది.

"దీపం పెద్దదిచెయ్యి మరి" అంటూ చెరబడ్డాడు చలపతి కాని; యెప్పుడూ లేని దివాళ యీ పురమాయింపేమిటో అర్థం కాలేదతనికి. అయినా యేమి పుస్తకం చదవడమో కూడా తోచలేదు.

అతని దగ్గిర పుస్తకాలే లేవసలు.

సంవత్సరం కిందట, జోగమ్మ రజస్వల అయిందన్న శుభలేఖ రాగా, వెంటనే అతని బడిచదువు మానిపించేసింది బుచ్చమ్మ. అప్పటి పుస్తకాలయినా యేమయి పోయాయో యెవరూ యెరగరు.

జగ్గయ్యదగ్గిర పంచాంగం తప్ప మరేమీ లేదు. పోనీ అంటే, చలపతి కది నడవదు.

తమ్ముని స్థితి అంతా గ్రహించింది బుచ్చమ్మ. నమకమైనా చమకమయినా— విఘ్నేశ్వరపూజ అయినా చలపతికి వచ్చివుంటే బుచ్చమ్మ అవే యేకరువు పెట్టుకోమని ఆజ్ఞాపించి వుండును; కాని అవే కాదు, చలపతికి సంధ్యావందన మయినా రాదు.

ఏమయినా, దేని కయినా ఆ యింటో బాధ్యత అంతా బుచ్చమ్మది. పెత్తనం కావాలని పాకులాడేవారు ప్రతీ యింటోనూ వున్నారు, సందేహంలేదు కాని; వారిలో చాలామంది, సమయం వచ్చినప్పుడు తమ బాధ్యత గుర్తించుకోరు. బుచ్చమ్మ అలాందిటి కాదు. కనక, చలపతి కిప్పుడు ఏదో వొక పుస్తకం అందించవలసిన బాధ్యత తనది అని గుర్తించుకుందామె. అది నిర్వహించుకోడానికీ పూనుకుందామె.

చూడగా, అన్ని గోడలకూ మధ్యగా ఆ యింటో వున్నది, అప్పుడప్పుడు బుచ్చమ్మ పాడుకునే లంకాయాగంపాట పుస్తకం వొకటే. ఆలోచించగా – పదిహేనువిమిషాలు పాటున్నా వెతగ్గా, వంటింటో చింతపండు బుట్టమీద మూత అయివుందది. అదే తీసుకువచ్చి అతని చేతిలో వుంచిందామె.

దీపం కూడా పెద్దది చేసింది.

చలపతి పుస్తకం విప్పాడు. నిద్రమత్తుతో ఎక్కడికో పోయివున్న అక్షరజ్ఞానం నెమరుకు తెచ్చుకున్నాడు. "శ్రీ రామ రఘుపతీ సీత పిలిపించుకుని కోరి వేగము చదవగా" అంటూ పాడ్డమున్నూ మొదలుపెట్టేశాడు, లక్షణంగా.

చదువుల్లో శ్రుతపాండిత్యం అన్నది వొకటి. పనిపట్టి శ్రద్ధగా నేర్చుకున్న దానికంటే అదే యెక్కువగా పట్టుబడుతుం దెవరికైనా. ఇంటో యే విద్య అయినా వుండడం వుంటే, ముందుగా అదే పట్టుబడుతుంది కూడా.

ఆ యింటికల్లా వున్నవిద్య – ముఖ్యంగా యెవరి కయినా వినిపించే విద్య వొక్క బుచ్చమ్మ దగ్గిరే వుంది. అది తరచుగా లక్షణంగా ఆమె లంకాయాగం పాడుకోడం. కనక, చలపతికే గాదు, మరియెవరి కయినా, ఆ నాలుగ్గోడలమధ్యా శ్రుతం అయేది అదొక్కటే. అంచేత, ఆ స్థితిని పట్టిపోయి వుంది చలపతి కది.

కనక, బుచ్చమ్మ ఆజ్ఞ అయింది కనక అది లక్షణంగా పాడ్డమే అతని బాధ్యత.

దీంతో, చలపతి బాధ్యతా తీరింది, బుచ్చమ్మ బాధ్యతా తీరిపోయింది కాని; అదే విని తెల్లపోయిందామె.

పురుషులు నేర్చుకోవలసిన విద్యలు వేరనీ, స్త్రీలు నేర్చుకోవలసిన విద్యలు వేరనీ ఆమెకి బాగా తెలుసు మరి.

కాక, కావలసినంత భూవసతి వుంది కనకా, పెట్టెవంటి యిల్లున్నూ వుంది కనకా చలపతికి చదువే అక్కర్లేదని ఆమె నిర్ధారణ చేసింది కాని, అతను స్త్రీలపాటలు పాడ్డం యెప్పటికీ వొప్పుకోదు.

కాగా, లక్షణంగా కాలిమిద కాలువేసుకుని మంచానపడుకుని చలపతి తనమాట వింటున్నందుకు మురిసిపోతున్న దల్లా నాలుక కరుచుకుంటూ యిది వినగానే గభీమని లేచి కూచుందామె. కూచున్న వెంటనే చలపతి దగ్గిరకిన్ని వురుకింది. తీవ్రంగా చూస్తూ మూతిబిడాయించుకుని ముందతని చేతిలో వున్న పుస్తకం వుళాక్కుంది. తరవాత, కిందికి వాలివున్న అతని మొగం రెండు చేతులతోనూ పైకెత్తి, వొకచెవి పైకి వచ్చేటట్టు వెంటనే పక్కకిన్నీ వంచి, ఆ చెవిలో తన నోరుపెట్టి "వోరి వాజమ్మా, పైకి పాడతావుట్రా, నీ తెలివి తెల్లవారిపోను. నీ పెళ్ళాం నవ్వదుట్రా వినపడితే? ఇవాళకీ లోపల్లోపలే పాడుకో. అంటే, కూడబలుక్కో, తెల్లవారాటప్పటికి నాన్నని బజారికిపంపి పెద్దబాలశిక్ష అయినా యెక్కాలపుస్తకం అయినా తెప్పించి యిస్తాను, రేపణ్ణుంచి గట్టిగా చదువుకుందువుగాని" అని చెప్పింది. అందుకు సరే అన్నట్టు చలపతి బుర్ర వూపగా, మళ్ళీ ఆ పుస్తకమే అతని చేతిలో పెట్టి దీపం తగ్గించి వచ్చి పడుకుంది, ముందు సంగతి ఆలోచించుకుంటూ.

"బతికాం" అనుకున్నాడు చలపతి. నిద్రచెడగొట్టి పుస్తకం చేతికిచ్చి దీపం దగ్గిర కూచోపెట్టినందు కామెమీద కోపంగానే వుందతనికి; కాని యీ మాట చెవిని పడాటప్పటికి కోపం పోడమేకాదు, సంతోషమున్నూ కలిగిందతనికి.

నిజానికి, బుచ్చమ్మ అప్పుడప్పుడు పాడుకోడం వింటున్నాడు కనక, రెండుమూడు చరణాలు మాత్రమే నలిగివున్నాయతనికి. అవి అయిపోయాయా, ఎక్కడి కక్కడే కూడబలుక్కోకుండా, ముందుముందు, వొక్క అక్షరమైనా నసిగా నడవ దతనికి.

అత నక్షరాస్యుడు కాడనడానికి వీల్లేదు. ఏమంటే, విద్యా శాఖవారి లెక్కల్లో అతను ప్రయిమరీ పరీక్షలో నెగ్గినవాడనీ, ఆపైని మరికొన్ని తరగతులున్నూ చదివివున్నాడనీ పెద్దక్షరాలతో రాసివుంది.

అయితే జరిగిందేమిటంటే? "అబ్బాయిచేత బి.ఏ. పరీక్ష యిప్పించి మేస్రీటు పని చేయించాలని వుబలాటపడి మేనత్త అతణ్ణింగ్లీషులో ప్రవేశ పెట్టించింది ఆదిలో; కాని ఫస్టుఫారంతోనే దండయాత్రలు ప్రారంభించాడతను. చివరికి, ఫస్టుఫారంలో ప్రవేశించిన యేడేళ్ళకి, అంటే, తన పందొమ్మిదోయేట థర్డుఫారం చదువుతూ చదువుతూ బడివిడిచి పెట్టేశాడతను.

ఇక్కడ "బడి విడిచిపెట్టేశాడతను" అంటే అతనది స్వతంత్రించి చేసిన పనని చెప్పడంలేదు. పెద్ద చదువులు చదివించాలని అతణ్ణి బడిలో వేయించింది మేనత్త. అప్పటి కాయింటి బాధ్యత అంతా ఆమెది. తరవాత అతణ్ణి బడి మానిపించింది బుచ్చమ్మ. ఇప్పటి కాయింటి బాధ్యత యీామెది మరి.

దానాదీనా అతని కింగ్లీ షంటలేదు. పాఠశాలకే - అసలు విద్యాశాఖకే బలాదూరు కావడంవల్ల తెనుగు గుంటపువ్వులు పూసేసింది.

పైపెచ్చు - ఆ లంకాయాగం, "పి.కె.థ భ ఢ థ క్క మొదలియారు సుకీయ అరుముగం ముద్రాపాలన్ ముద్రింపించి బహిష్కరించ బడ్డది" కూడాను.

ఇంతకీ, - లాంతరునిండా చమురుండడంవల్ల దీపం బంతి పువ్వులా వెలిగిపోతూనూ వుంది. పుస్తకంలో మొదణ్ణుంచి చివరికీ చివరినుంచి మొదటికీ గిరగిరా తిరిగిపోతూనూ వున్నాయి కాగితాలు. "తమ్ముడు నా చేతిలోనే వుంటా"డని బుచ్చమ్మ గర్వపడుతూనూ వుంది. ఇదేమిటో బోధపడక - తనముందు గతిన్నీ తోచక గదిలో జోగమ్మ అటమటించి పోతూనూ వుంది కాని; యిలాంటి సమయాన, యెలా వచ్చిందో యెవరికీ తెలియకుండా వచ్చి ముగ్గురినీ అలుముకుంది గాఢనిద్ర.

భళ్ళున తెల్లవారాక అప్పలమ్మ వచ్చి "బుచ్చమ్మ గోరూ, బుచ్చమ్మ గోరూ" అంటూ పదిమాట్లు వీధితలుపు గుంజేదాకా యెవరికీ మెళుకువ రాలేదు.

అప్పుడయినా, అందరికంటే ముందు జగ్గయ్యకి వచ్చిందా మెళుకువ.

తుళ్ళిపడి మేలుకుని, కళ్ళునులుముకుంటూ లేచి, తూల్తూ తూల్తూ బయలుదేరి వచ్చాటప్పటికీ, నడవలో వున్న అరుగుమీద వెలవెలబోతున్న లాంతరు దగ్గిర కొట్టేసిన పాములా పడివున్న చలపతి కనిపించా డతనికి.

"ఏమిటిదీ?" అనుకున్నాడు జగ్గయ్య.

"జోగమ్మ నడవలో పడుకుందా" అనుకున్నాడు గాని; యెవరూ లేరక్కడ.

బుచ్చమ్మ తనమంచంమీదే వుంది, అటుతిరిగి.

తలుపు అప్పటికీ గుంజుతూనే వుంది అప్పలమ్మ. అందుకూ యిందుకూ చాలా కోపం వచ్చింది జగ్గయ్యకి. "వినపడింది, వస్తున్నానే " అంటూ గుమ్మం కేసి చూస్తూ వొక్క వురుమురిమాడు ముందతను దాంతో. "ఇక్కడ పడుకున్నావేం నాయనా" అంటూ ఆప్యాయంగా అడిగాడు తరవాత తట్టిలేపుతూ చలపతిని.

చలపతికి మెళుకువ వచ్చింది; కాని "చదువుకోమంటూ నాలుగ్గంటలకే లేచి కూచోబెట్టిం దక్కయ్య" అంటూ వుబ్బెత్తుగా లేచి తడబడుతూ పెరట్లోకి చక్కాపోయా డతను.

"చదువా?" అని కళ్ళు చికిలించుకుంటూ పుస్తకం తీసిచూశాడు జగ్గయ్య. "లంకాయాగం" అన్న అక్షరాలు కొట్టవచ్చాయి. తెల్లపోయాడతను. కాని మళ్ళీ తలుపు గుంజింది అప్పలమ్మ.

ఇటు లంకాయాగం పుస్తకమూ, అటు లంకిణిలాగ అప్పలమ్మానూ. వీటికి సాయం యెప్పుడూ లేంది, చలపతికి తెల్లవారుజామున చదువు!

అగ్గయిపోయాడు దీంతో జగ్గయ్య. వొళ్ళు మరిచిపోయి ఆ పుస్తకం నిలువుగానూ అడ్డంగానూ రెండుచింపులు చింపి ముందువాలోకి విసిరేశాడు ముందతను. తరువాత

తలుపుతెరిచి "వస్తున్నానే అంటూనే వున్నాను గదా, ఆదే గుంజడమా తలుపు? ఒక్క క్షణం నుంచోలేవూ? ఇంత తొందర పడేదానివి, ఇంత పొద్దెక్కేదాకా యేమి చేస్తున్నా వసలు?" అంటూ బాగా చెండుకున్నాడు.

ఈ రభసకి తుళ్ళిపడి, గదిలో జోగమ్మా, వాకిట్లో బుచ్చమ్మా వొక్కమాటే మేలుకున్నారు.

అయితే, తండ్రి రుసరుసలూ - అప్పలమ్మ గొణుగుడూ చూసి అదంతా తలుపు తియ్యడం దగ్గిరే వచ్చిందనుకుంది బుచ్చమ్మ. దీనిమీద "నేనొక్క క్షణం యెక్కడి కైనా వెడితే - వొక్కక్షణం నిద్రపోతే - వొక్కక్షణం బద్ధకిస్తే కొల్లేరయిపోతుంది కొంప. నేనేం కావాలని నెత్తిన పెట్టుకున్నానా యేమిటీ పెత్తనం? పనిమునిషిమీద యెగిరి పడకపోతే నన్నే లేపితేయేం?" అంటూ లేచికూచుందామె.

ఆలేవడం అయినా, జోగమ్మ యివతలికి వచ్చిందా లేదా అని వోరకంట గదికేసి చూస్తూనే లేచిందామె.

"మరి, నీకంత బండనిద్ర యేం?" అనడిగాడు జగ్గయ్య. అప్పటి కింకా ధుమధుమలాడుతూనే వుందతని మొగం.

"కొట్టుకొట్టుకుని పదకొండింటికి పడుకున్నాను, పట్టక పట్టక తెల్లవారగట్ల నిద్రవచ్చింది నాకు"

"నాలుగ్గంటలకే లేపావుట అబ్బాయిని?"

"నాలుగే అయిందో, అయిదే అయిందో నాకేం తెలుసూ?"

"వాణ్ణి లేపవలసిన అగత్యం యేమి వచ్చిందీ?"

"చదువుకో మనడం తప్పా?"

"లంకాయాగమా వాడు చదవ్వలసింది?"

కొయ్యయిపోయింది బుచ్చమ్మ. ధుమధుమ లాడుతూనే నూతి పెరట్లోకి వెళ్ళిపోయాడు జగ్గయ్య.

అప్పటికీ మంచంమీద కూచునేవుంది బుచ్చమ్మ. "ఇంటో మరో పుస్తకం లేక లంకాయాగం యిచ్చాను, తప్పా" అనుకుంది. తండ్రికీ లేకపోయె, కొడుక్కీ లేకపోయె చదువులీ కొంపలో, మరి పుస్తకాలెలా వస్తాయీ మరో రకం? అనిన్నీ రుంజుకుంది. ఈ రుంజుకోడంలో అటూ ఇటూ చూసింది, గుర్రాలక్కలాగ మొగం తిప్పుకుంటూ. అలా తిప్పుకోడంలో మండువాలో వున్న కాగితాలముక్కలు కనపడ్డాయామెకి. నిదానించగా యేదో పుస్తకం చింపేసిన బాపతన్నట్టున్నా యవి. ఆత్రంగా తీసి చూడగా లంకాయాగం!

తన లంకాయాగానికి పట్టిన గతి అది. "అయ్యో, అయ్యో" అంటూ నోరు నొక్కుకుని కొయ్యయిపోయింది వెంటనే. "నాకీ గతిపట్టిన కొత్తరికం అత్తయ్య కొనిపెట్టిం దీపుస్తకం. ఇంతకాలమూ నా చేతిలో నలిగిన దీని కిప్పటి కీగతి పట్టింది" అనుకుంటూ చాలా బాధపడిపోయిందామె. "మరి, యిలాంటి పుస్తకంటే మొగపిల్లవాడి చేతిలో పెట్టవలసింది?" అని యెవరో అడిగినట్టయింది కాని, అది వినిపించుకోలేదామె.

"ఏమీ చూసుకునీ యీ మిడిసిపాటు? ఎలాగయితేం వచ్చిందే కోడలు, అవిణ్ణే

చూసుకునా యిదంతా? అయితే, తిన్నారన్నమాటే యిద్దరూ కూడా బువ్వ" అని యీసడించుకుంది. "చూస్తాకాదూ? ఈ కళ్ళ కీ రెప్పలు దూరమవుతాయా?" అనుకుంటూ తల పంకించుకుంది చివరికి.

దంతధావనం ముగించుకుని యిలాంటప్పుడు మండువాలోకి వచ్చింది జోగమ్మ, మొగం తుడుచుకుంటూ. ఆమెని చూడగానే వొళ్ళు మండుకుపోయింది బుచ్చమ్మకి. "ఇంటో అడుగుపెట్టావో లేదో అప్పుడే కజ్జాలు పెంచుతున్నావు ఇనప గజ్జెల తల్లివి" అనుకుందామె. "నన్ను కాదని యీ కొంపలో యెవరు నెగ్గుకురాగలరో చూస్తా కాదూ?" అని వొట్టున్నా పెట్టుకుంది.

ఉండుండి "ఇంత పొద్దెక్కేదాకా మంచం దిగకపోతే పనులెలా తెమలుతాయీ? నేను మాత్రం పడుకోలేనా యేమిటి భోజనాలవేళ దాకా కమ్మగా?" అంటూ సాగతీసుకుంది కూడా; కాని ఇదేమీ వినిపించుకోకుండా గదిలోకి బయలుదేరింది జోగమ్మ.

"వంటిల్లు అలకాలి, బొట్టుపెట్టి చెప్పనక్కరలేదో వోవిడా"అంటూ ఝాంకారంగా పిలిచిందామెని బుచ్చమ్మ. ఆమె అలా అంటూ వుండగానే గదిలోకి వెళ్ళింది జోగమ్మ; కాని వొక్కక్షణాన మళ్ళీ యివతలికి వచ్చి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

తానున్నా కాళ్యాలు తీర్చుకుంది గాని; తిన్నగా వీధి గుమ్మంలోకి వెళ్ళి నుంచుంది బుచ్చమ్మ. అప్పటికప్పుడే పక్కయింటి సోదెమ్మ కరివేపాకూ, కొత్తిమిరీ, పచ్చిమిరపకాయలూ, గుమ్మబద్దలూ – ఇలాంటివి కొంటోంది.

అక్కణ్ణుంచి ఆవిడా యిక్కణ్ణుంచి యీవిడా వొక్కమాటే చూసుకున్నారు. "మీ మరదలు వచ్చిందా యేమిటి?" అనడిగింది సోదెమ్మ. "ఆ తోడితెచ్చుకున్నాడమ్మా మా నాయన కోడల్ని" అంది బుచ్చమ్మ, ముక్కూ మూతీ తిప్పుకుంటూ. ఆ మాట యీ మాట అనుకుంటూనే యిద్దరూ సోదెమ్మ అరుగుమీద చేరుకున్నారు.

ఇద్దరూ మాటమీద మాట ప్రవాహ వేగంగా వాడేస్తున్నారు . ఉండుండి "అయితే, వొసే వదినా, సుఖంగా నిద్ర పోకుండా పాపం నాలుగ్గంటలకే లేపావెందుకే చలపతి బావనీ?" అనడిగింది సోదెమ్మ. "ఆ మరే లేపకపోతే వూరుకుంటాను పాపం. పెళ్ళాంగారు వచ్చారని చదువు మానుకుంటే యెలాగా? చూశావా మా వాన్నవి? బంధువులకు ఉత్తరాలు రాయాలన్నా, వచ్చిన వుత్తరాలు చూడాలన్నా నీ మరిది కాళ్ళు పట్టుకోవాలి గదా? తెలిసివుండీ కూడా అలా తయారు కానివ్వ మంటావుటే చలపతిని?" అంటూ యెదురడిగింది బుచ్చమ్మ.

గతుక్కుమనిపోయింది సోదెమ్మ అది విని; కాని ధోరణి అంతా గ్రహించేసింది. ధోరణి మార్చేసింది నిమిషంలో; కాని బుచ్చమ్మ ఆమె ప్రయత్నం సాగనివ్వలేదు. "కోడల్ని చూసుకుని మా నాన్న మహా పొంగిపోతున్నాడు గాని కావెడు సారె అయినా తెచ్చుకోలే దావిడ" అంటూ ముందుకు సాగిందామె. దానిమీద "అయ్యో, నా తెలివి తెల్లవారిపోనూ చెప్పావే కాదేమిటే?" అంటూ సోదెమ్మా, "వోసి నీ మొగం యీడ్చా, నేను మాత్రం చూశానా యేమిటే" అంటూ బుచ్చమ్మా సాగదీసుకుంటూ ఈ యింటికి బయలుదేరారు.

అప్పటికి జోగమ్మ, ఆడబడుచు చెప్పిన పని పూర్తిచేసి, చేతికందిన మరి

రెండుమూడు పనులున్నా చేసి, పుట్టింటినుంచి తెచ్చుకొన్న సామాను సద్దుకుంటోంది మెల్లిగా.

గది గుమ్మాన అడుగు పెట్టాటప్పటికి, బుచ్చమ్మకీ సోదెమ్మకీ బల్లమీద మొదట హార్మోనియం కనపడింది. దానితరవాత ట్రంకు పెట్టే, బొట్టుపెట్టే, పాందానూ, వెండిసామాను కొంతావున్నాయి. బుచ్చమ్మ మూతిబిడాయించుకుంది గాని; సోదెమ్మమాత్రం సంబరం కనబరిచింది. "ఏమేమి సారెపెట్టారమ్మా మీవాళ్ళు?" అని చాలా ప్రీతిగా కూడా అడిగిందామె.

ఆ మాటలో జోగమ్మ కెంతో ఆత్మీయత కనబడింది. బుచ్చమ్మ ధోరణిని పట్టి కూడా ఆమెకిది తృప్తి కలిగించింది. వెంటనే "అక్కయ్యగారూ" అంటూ ఆమెని సంబోధించి "సెలవు పుట్టక మా నాన్నారు నాకూడ రాలేక పోయారండీ. ఈ నెల ఆఖరుకి తప్పకుండా వీలవుతుందని నమ్మకుని వున్నారు వారు. మా అమ్మకూడా వస్తుందప్పుడు. పందిరి మంచమూ, బట్టల బీరువా, కుర్చీలూ, టేబిలూ, ఇత్తడి సామానూ, వెండిసామాను మరికొంతా కూడా కొని పెడతారండీ అప్పుడు" అని మిక్కిలీ ముద్దుగా బదులు చెప్పిందామె.

సోదెమ్మ చాలా సంతోషించింది. "బాగుంది తల్లీ" అందామె బుజం తట్టుతూ ముందు. "అందచందాలు బాగా తెలుసు మీవాళ్ళకి. అచ్చటాముచ్చటా నీకు బాగానే తీరతాయి నాకు తెలుసు" అని చాలా మెచ్చుకుంది. చివరికి.

కాని బుచ్చమ్మ అనుకోని దిది. సోదెమ్మ తన మరదల్ని చూసి యింత సంతోషిస్తుందనుకోలే దామె. జోగమ్మ గుట్టూ మట్టూ తెలుసుకోడానికే సోదెమ్మ మాట్లాడుతుందనీ, చివరికి తనలాగే ప్రాతికూల్యమే వహిస్తుందని కూడా ఆశించిందామె. దాంతో, యిది కొట్టినంత పనయిందామెకి. మొగం మాడిపోయింది కూడా.' "సానిపాపని పంపినట్టు ముందు ఆర్మణీ యిచ్చి పంపారుగదా?" అంటూ యీసడించుకుంటూ యివతలకి చక్కావచ్చిం దామె, వెంటనే.

జోగమ్మ చిన్న బుచ్చుకుందది విని. కళ్ళనీళ్ళ పర్యంతమూ అయిందామెకి. అది చూడగా గుండెల్లో కలుక్కుమంది సోదెమ్మకి. నాలుక కరుచుకుంటూ తానున్నా యివతలకి వచ్చి "అదేమిటే, నీ బుద్ధిగడ్డితినా! అంతమాట అన్నావూ?" అనడిగింది కంఠం నొక్కుకుని.

ఇద్దరూ గోదావరికి బయలుదేరారు మరి మాట్లాడకుండా.

## 8

కాఫీహోటలుకి వెళ్ళి అప్పుడే వచ్చాడు చలపతి, బిందెలు బుజాల పెట్టుకుని బుచ్చమ్మా, సోదెమ్మా గోదావరికి బయలు దేరడం అల్లంత దూరాన వుండగానే కనపడింద తనికి. పరుగన్నట్టు నడిచి యింటో పడ్డాడు వెంటనే అతను. గది గుమ్మం సమీపించాటప్పటి కతనికిన్నీ ముందు హార్మోనియమే కనపడింది. అనుకోకుండా కూనిరాగమున్నా వుబికేసిందతనికి.

"ఓహో, యిది తెచ్చావూ? భలేదానివి!" అంటూ వొక్క దూకున గదిలో పడ్డాడతను.

అప్పటికి జోగమ్మ జంతికల బరిణే, అరిసెల బరిణే పైకి తీస్తోంది పెట్టెలో నుంచి.

"అరిసే, జంతికా పుచ్చుకుందురుగాని యిలా కూచోండి" అంటూ బల్ల కాళీచేసింది వెంటనే ఆమె.

"ఎక్కడికి పంపిందో రాకాసి" అనుకుంటూనే వుందామె, అలాంటిదల్లా బుచ్చమ్మ అలా యిల్లు విడిచిపెట్టగానే అతనిలా యింటికి వచ్చినందుకెంతో మురిసిపోయింది, మరి.

"సాంబారుతో యిడ్లీ తిని యిప్పుడే కాఫీ పుచ్చుకు వచ్చాను గానీ; – ఇలాతే" అంటూ ముందవి అందుకునే తరవాత కూచున్నాడతను. కూచోడమే తడువుగా అరిసె కూడా విరిచాడు, ఆత్రంగా.

తానున్నూ కొంచెం అరిసెముక్క నోట వుంచుకుని అతి నాజూకుగా నములుతూ "నాకు కాఫీ తెచ్చిపెడతారా?" అనడుగుతూ అతనికి చేరబడి నుంచుందామె, వయ్యారంగా.

"మా అక్కని రానివ్వ" మన్నాడతను.

"ఎందుకూ?"

"మరి డబ్బులో?"

"మీరెలా పుచ్చుకువచ్చారూ మరీ?"

"ఎన్నడూ లేదుగానీ – నిన్నా యివాళా తనకి తానే యిచ్చింది మా అక్క."

"మీకు మీ అక్క యివ్వడం యేమిటీ?"

"నాకేమిటి మానాన్న కేమిటి, డబ్బులు కావాలంటే మా అక్కే యివ్వడం."

"ఏం?"

"ఇనప్పెట్టె తాళాలు మా అక్కదగ్గిరే వుంటాయి, మరి."

ఆమె కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"పోనీ, నేనిస్తాను పట్టుకురండి వెళ్ళి" అందామె చూసి చూసి.

"తే" అంటూ చెయ్యి చాపాడతను. పెట్టెకేసి రెండడుగులు వేసిందామె గాని; అంతలో వొక సందేహం తోచగా ఆగిపోయి "ఈ సంగతి రహస్యంగా వుంచుతారా?" అనడిగింది.

"ఏం, రహస్యం యెందుకూ?"

"నేను కాఫీ పుచ్చుకున్నట్టూ, అది మీచేత తెప్పించుకున్నట్టూ వారికీ వారికీ యెందుకు తెలియాలీ?"

"మా అక్క అడిగితే?"

"ఎలా అడుగుతుందీ?"

"నువ్వు పుచ్చుకోడం చూస్తే?"

"నే నెవరూ చూసేటట్టు పుచ్చుకోను. మీరు కూడా వొకళ్ళు చూసేటట్టు తీసుకురావద్దు."

"తరవాత తెలిస్తే 'నాతో యెందుకు చెప్పావు కా'దని గదమదూ మా అక్క?"

అదిరిపడింది జోగమ్మ.

"అయితే, మీరు తీసుకురానే వద్దు. నేనిలా అడిగానని మాత్రం యెవరితోనూ చెప్పకండి"

"చెబితే యేం?"

"అగత్యం యేమిటీ మీకూ?"

"చెప్పినా యేమీ అనదు మా అక్క"

"వొక రనడమూ అనకపోడమూ – ఇదంతా యెందుకు రావాలీ? కనక, మీరు చెప్పనే వద్దు, తెలిసిందా?"

దీనికి బదులు చెప్పలేదు గాని; "నీకు ముఖారి రాగం వచ్చునా?" అని మాత్రం అడుగుతూ హార్మోనియంకేసి తిరిగాడతను.

"వచ్చు" నందామె. అయితే, "చెప్పకండేం?" అంటూ అతని బుజాల మీద చేతులు వేసి, మొగం మీద మొగంపెట్టి పక్కవాటుగా నుంచుంది.

"చల్ మోహనరంగా పాడగలవా?"

"అది నాకు రాదం"దామె. అని, "కాఫీ సంగతి మీ అక్కతో చెప్పకుండా వుంటారు కాదూ?" అనడుగుతూ అతని గడ్డం పట్టుకుంది కూడా.

"పోనీ – 'సిరిసిరిమువ్వ' – పాడగలవా."

"అలాంటి వడుగుతా రేమిటండీ? మీరు నేర్చుకున్నారా అవన్నీ?"

"వో, దంచేసి పాడతా న్నేను."

చూసి చూసి "మీ అక్క నేర్పిందా?" అనడిగిందామె.

"బండప్పలసామి నేర్పాడు నాకు. 'అప్పనా తనా మనా' 'ఓరోరి బండోడా' 'అద్దురూపాయి డబ్బులికీ'– ఇలాంటివి చాలా వచ్చు నాకు."

"కాకి ముక్కుకి దొండపండు కట్టడం" అంటే యేమిటో ఆమె కిప్పుడర్థం అయింది. అందుకే ఆమె కుమిలి పోసాగగా "నేనవి పాడతాను, నువ్వు వాయించు" అంటూ తొందర పెట్టాడతను.

చాలా చురుగ్గా చూసిందామె, అతనికేసి. "నా కలాంటివి రామూ రావు, నేనవి వాయించనూ వాయించలేను" అంటూ కరుగ్గా కూడా చెప్పింది, తన అసహ్యభావం కనపరుస్తూ. కాని, అతని కదేమీ అర్థం కాలేదు. ఆ ధోరణే లేదతని కసలు.

"మరేం వచ్చునూ?" అని మాత్రం అడిగాడు.

"రామ నీ సమానమూ, రామభక్తి, పక్కల నిలబడీ, మనసు కరుగదేమీ, ఎంత వేడుకొందునూ, ఎందరో మహానుభావులూ, సంగీత శాస్త్ర జ్ఞానమూ –"

ఇంకా చెబుతూనే వుందామె; కాని "అలాంటి ముసలమ్మ పాట లెవరిక్కావాలీ యిప్పుడు?" అన్నా డతను, విరసనగా.

"వెధవ పల్లెటూళ్ళ వాళ్ళ బతుకింతే" అని అనుకున్నాడు కూడా అతను. గిరికీలు కొడుతూ యెందరో అప్పలస్వాములు కనపడ్డా రతని కళ్ళకి. "వాళ్ళలా పాడగలిగితేనా, నారాజా!" అని వూరిపోయాడు. బోగమ్మ వాళ్ళ పెళ్ళాల వంటిది కాకపోయినందుకున్నూ వుసూరుమనిపోయాడు.

దీనికి సాయం, ఆ పాటలమీద సరదా యెక్కువయిపోయిందతనికి. "మా అక్క ఇంటికి రాకుండా యేదో వొక మట్టు పాడెయ్యి తొరగా" అంటూ హార్మోనియం కేసిన్నీ లాగాడత నామెని.

కౌయ్యియిపోయింది జోగమ్మ. ఆడబడుచు దౌర్జన్యానికి సాయం యీ వుద్వృతం కూడా చూసి ఆమె బల్లమీద కూలబడిపోయింది నుంచోలేక.

అదిన్నీ గమనించ లేదతను. "లే మరి. మా అక్క వచ్చేవేళ అయిపోతోంది కానియ్యి తొరగా" అంటూ ఆమెను లేవతీశాడు.

"మీ అక్క వస్తే యేం?"

"తిడుతుంది."

ఇలా అంటూ హార్మోనియం మీదకి లాగాడత నామె చెయ్యి.

"ఎవర్ని తిడుతుందీ?"

"నిన్నూ నన్నూ కూడా."

"మీరింకా ఆవిడచేత తిట్లు తింటున్నారా?"

"లేకపోతే చంపెయ్యదూ?"

"అంటే?"

"అన్నం పెట్టదు. గుమ్మంలోనికి రానివ్వదు."

మీది ప్రాణాలు మీదికే యెగిరిపోయా యామెకి. బుచ్చమ్మ యెంత గడ్డుమనిషో గుర్తించ గలిగింది గాని; చలపతి యింత మడ్డుమనిషి ని వూహించుకోలేకపోయింది.

ఏడుపు వచ్చిందామెకి. అయినా, కన్నీళ్ళు రెప్పల్లోనే అప్పళించుకుని, ధైర్యమున్నూ చిక్కబట్టుకుని యేదో అనబోయింది కాని; మాట తొణకనివ్వలేదతను.

"తొరగా తొరగా" అని రెక్కగూటిమీద పొడుస్తూ తరమసాగాడు కూడా.

మాట రాలే దామెకి; ఆజ్ఞాపిస్తున్న వాడు భర్త. కాదనలేకపోయింది. "తొలి నేజేసిన పూజాఫలము"అన్న కృతి వాయించడం మాత్రం పెట్టుకుంది.

అతని కదేమీ నచ్చలేదు. పైగా, వుబలాటం వశం తప్పిపోయింది. వెంటనే జోగమ్మ నివతలికి లాగేసి హార్మోనియం తనకేసి తిప్పుకున్నాడతను.

పెట్టె స్వాధీనం అయింది; కాని మెట్లు? ఆ వుత్సాహంలో – బుచ్చమ్మ వచ్చేస్తుందన్న ఆ కంగారులో యిదేమీ తోచలే దతనికి,

మొదట, యెడమచేతి శక్తి అంతా వినియోగిస్తూ గాలి పొయ్యసాగాడతను. తనకి వచ్చిన టుమ్రీలన్నీ యేకబిగిని వాయించేయ్యాలని యేకకాలంలో నాలుగుమెట్లు వొక్కాడు.

ఒక్క టుమ్రీ కూడా పలకలేదు. కాని, యేకటాకీని నాలుగు వూరకుక్కలు మొరుగుతున్నట్టు మాత్రం అయింది.

విసిగిపోయా డతను, దానాదీనా.

దీనికి సాయం బుచ్చమ్మ వచ్చేసిన సవ్వడిన్నీ అయింది.

ఎలా వున్న హార్మోనియం అలా వదిలేసి, వెంటనే వాకిట్లోకి వొక్క దూకున్నూ దూకేశాడు.

జోగమ్మ అందుకే తెల్లపోగా, బిందె బుజాన వుంచుకునే యెదురుగా నుంచుని, బిందె బరువుకీ కోపావేశానికీ వూగీస లాడిపోతూ "మా పరువు దక్కనివ్వవూ? నేను బతికి వున్నంత కాల మయినా అర్మణీ కట్టిపెట్టు. తరవాత నువ్వెలాగా భూమ్మీద మన్నవులే" అంటూ గింజుకుని, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వంటింటోకి యెగిరిపోయింది బుచ్చమ్మ.

## 9

జోగమ్మ చాలా యిదయిపోయింది.

"ఎందుకూ తిట్టడం? హార్మోనియం వాయిస్తే తప్పేమిటీ?" అంటూ యెంతో బాధపడింది.

కానయితే, వచ్చినప్పణ్ణుంచీ తెలుస్తూనే వుంది బుచ్చమ్మ వాలకం. కాని, యింతలో అది యింతగా ముదిరిపోతుందనుకోలే దామె.

ఆమె తల్లి పూర్ణమ్మమాత్రం యెప్పుడో గ్రహించి వుందిది.

బుచ్చమ్మ, తాను వితంతు వయివుండిన్నీ తన తమ్ముని పెళ్ళిలో అన్నిటికీ తానే ముందుకి వస్తూ, ప్రతీదానికీ పెడర్థాలు తియ్యడమూ, కుయుక్తులు పన్నడమూ, ఒక్కొక్కపూట చలపతిని ఫలాహారానికి విడిది నుంచి తమ యింటికి రానివ్వకపోడమూ, అలక మంచం మీద తగని పట్టు పట్టించడమూ, ప్రోల్లో పట్టుచీర వెనక్కి పెట్టించి తన కూతురుకి సాదా రంగునేత చీర పెట్టించడమూ – ఇలాంటివి పూర్ణమ్మ మరిచిపోలేదు, వొక్కటి కూడా.

తరవాత, పండుగలకు చలపతితో కూడా వచ్చి ఆమె చేసిన అల్లరి కూడా మరిచిపోలే దామె.

తన యేకపుత్రుడు పోయినప్పుడు బుచ్చమ్మ చేసిన అగాయిత్యం కూడా మరిచిపోలే దామె.

మొత్తానికి, మొగుడి అప్రయోజకత్వమూ, ఆడబడుచు రాగతనమూ తన కూతురుకి ముప్పు తెచ్చి పెడతాయని మొదణ్ణుంచీ అనుకుంటూనే వుందామె.

కాగా, జోగమ్మని అందుకు తగ్గట్టే తయారుచేసింది.

అసలు, జోగమ్మయినా సిసింద్రీకాని వాలుజెవ్వుల మనిషికాదు.

"తాళాలు నీ మామగారి చేతిలో వుండాలి. లేకపోతే నీ మొగుడి దగ్గర వుండాలి. అతనికీ చేతకాకపోతే నువ్వు చేసుకుంటావు పెత్తనం. మధ్యగా యీ గాలివాన మనిషెవరే నీ యింటోను?" అని తల్లి అడిగిన మాట బాగా జ్ఞాపకం వచ్చింది జోగమ్మ కిప్పుడు.

అయితే, తొలీమాటు వచ్చాటప్పటికే కథ యిలా అడ్డం తిరిగింది గదా, యేమిటి దారి?

బుచ్చమ్మకి స్థానబలం వుంది. అంటే – తండ్రిబలం వుంది. తమ్ముడి బలం వుంది. ఇరుగుపొరుగుల ఆసరా కూడా వుంది.

మరి, తనమాట?

వచ్చీరావడంతోనే కజ్జాకి సిద్ధపడితే, తరవాత జయంమాట యేమయినా, ముందు లోకులు పీకెయ్యరూ? చివరి కే యిరుగుపొరుగు ముసలమ్మ అయినా తనకి ఆసరా అవుతుందన్న భరవసా లేనప్పుడు యిక న్యాయం తనదయితే మాత్రం యేమి లాభమూ?

తల్లిచేసిన బోధ అంతా ఆమె కిప్పుడు బాగా నెమరుకి వచ్చింది. అంతా గమనించుకుంది. దురదృష్టపురోజు లెన్నాళ్ళో అన్నాళ్ళూ తన కిది తప్పదనుకుంది.

ప్రాజ్ఞత లేనివాడు కనక తన మొగుడీ వేళ బుచ్చమ్మ చేతిలో వున్నాడు. ఆ దారినే రేపు తన చేతిలో పడకుండా వుంటాడా? అనిన్నీ ఆలోచించుకుంది. ఈ నిశ్చయంతో, బుచ్చమ్మ యెన్నిమాటలన్నా యెలాంటిమాట లన్నా బదులు చెప్పడం మానుకుంది.

కాని, వచ్చిన మూడోనాటి రాత్రి, ఇక పడుకోడమే తరవాయి అయివున్నప్పుడు, బుచ్చమ్మ "ఇవాళ రంగూన్ రౌడీ నాటకంట కాదూ? చూడాలని లేదుట్రా తమ్ముడూ నీకు?" అని అంటించి, యెరగనివాణ్ణి రెచ్చగొట్టి, అర్ధ రూపాయకాసు చేతిలోపెట్టి, తండ్రికి తెలియకుండా చలపతి నవతలికి పంపేసినప్పుడు బేలపోయి వొక్క గంటసేపు మాత్రం కుమిలి కుమిలి యేడ్చిందామె.

ఆ దుఃఖం కొత్తగోదావరి వరద అంత వుద్ధృతంగా వచ్చింది. గజగజలాడించేసింది. అటూ యిటూ విసిరేసింది. సుడిగుండాలలో తిప్పితిప్పి కొట్టింది. అడుక్కంటా ముంచేసింది. ఆకాశానికిన్నీ యెగరగొట్టేసింది. ఇన్ని చేసిన్నీ చివరికి మాత్రం ఆమె బేలతనం కొట్టుకు చక్కాపోయింది.

అంతటితో పూర్తి కాలేదది.

ఆ రాత్రి చలపతి మూడున్నర కింటికి వచ్చాడు. అతను తలుపు గుంజడమూ, బుచ్చమ్మ తలుపు తియ్యడమూ "నీ కిప్పుడు నాటకాలేమిటి నాయనా?" అని జగ్గయ్య మందలించడమూ వరాసగా జరిగిపోయాయి.

ఈ సందడితో తనకి నిద్రాభంగం కాగా, మొగుడింటోకి వస్తాడు కదా అని, చడీ చప్పుడు కాకుండా తలుపు గడియతీసి వుంచి పడుకుంది జోగమ్మ.

కాని బుచ్చమ్మ వుక్రోషం అంతటితో తీరలేదు.

చలపతిని తన మంచంమీద వాకట్లోనే పడుకోమని, కొంగుపరుచుకుని తాను అరుగుమీద పడుకుంది. అదేమిటో – ఇదెందుకో గూడా అర్థంకాక – వుసూరుమంటూ పడుకుని, పడుకోడం తడువుగా వొళ్ళు మరిచి గాఢనిద్రలో పడిపోయాడు చలపతి.

అప్పుడు కూడా వుత్తర వరదలాగ వుడుకుమోత్తనం వచ్చింది జోగమ్మకి; కాని తనే తుమ్ముకుని తనే దీవించుకున్నట్టు, కొంతసేపటికి తన్నుతానే వోదార్చుకుందామె.

కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ గోడవైపు తిరిగి పడుకుని ఆలోచన ప్రారంభించిం దామె.

"ఏమిటి దీని కుపాయం?"

ఇలా యెత్తుకుందామె విషయం; కాని దీనికి జవాబు తోచడానికి బదులు "నీ ఇంట్లో మాయబుచ్చమ్మకి పెత్తనం యెలా వచ్చిందీ?" అని యెవరో ముదలకించి అడిగినట్టయింది.

అవును - నిజమే - ఎలా వచ్చింది?

జగ్గయ్య వెర్రిబాగులవాడు కనక, చలపతి వో-ట్టి తులసీదాసు కనక, ఇప్పటివరకూ ఆ కొంపలో యిలా ఆలోచించినవారు లేకపోయారు కనక!

అయితే, ఇప్పుడు చెయ్యవలసిం దేమిటీ?

ముందు చలపతికీ బుచ్చమ్మకీ భేదాలు పెట్టడం. తా నతణ్ణి లోపు చేసుకోడం. కొంతవరకేనా యిది సాధ్యం అయితే, అప్పుడు తన కాళ్ళకి నేల అంది నుంచోడానికి వీలవుతుంది.

తరవాత, జగ్గయ్యకి, కూతురిమీద ప్రేమే యెక్కువో తనమీద వాత్సల్యమే యెక్కువో కనిపెట్టడం.

అతను కూతురుపక్షం అయివుంటే, సేవచేసి, పూజచేసి కాళ్ళు కడిగి దాహం పుచ్చుకుని, తన తెలివి తేటలూ, వినయ విధేయతలూ, జాగ్రత్తగా కనబరిచి, బుచ్చమ్మ రాగతనం గ్రహించేటట్టున్నూ చేసి అతని వాత్సల్యానురాగాలు సంపాదించుకోడం.

ఈ యిబ్బంది లేకపోతే, అతనిచేత చలపతికి బుద్ధిచెప్పించుకోడం.

ఈ ఆలోచనా, ఈ ప్రణాళికా జోగమ్మకి తృప్తీ, ఆశా, ధైర్యమూ కలిగించాయి. ఆందోళన పూర్తిగా తగ్గిపోయింది. దీంతో నాలుగుంబా వయాటప్పటికి గాఢనిద్ర పట్టిందామెకి.

## 10

బుచ్చమ్మ విషయమై చదరంగపెత్తులున్నూ ప్రారంభించింది జోగమ్మ; కాని నాలుగు రోజుల్లోనే ఆ సంగతి గ్రహించేసింది బుచ్చమ్మ.

జోగమ్మా చలపతీ యేకం అయితే యిక తన బతుకేంగానూ? నిజానికి వారేకంకావడమే ధర్మం అని తెలుసుకాని తాను "మనోవృత్తి ముండ"గా మాత్రమే బతకడం ఆమె కిష్టంలేదు.

ఇంటిపెత్తనం తానే చెయ్యాలనీ, చలపతికి ముకుదాళ్ళుపోసి అవి తన చేతిలోనే వుంచుకోవాలనీ, ముప్పతిప్పలు పెట్టి జోగమ్మని మూడు చెరువుల నీళ్ళు తాగించాలనీ ఆమె వొట్టుపెట్టుకుంది.

"చూసుకో విన్నేం చేస్తానో?" అని జోగమ్మ నుద్దేశించి పళ్ళున్నూ పటపట్టాడించుకుంది.

చలపతి మొదణ్ణుంచీ తన చెప్పుచేతల్లోనే వున్నాడు. అంటే బాగా జాగ్రత్తపడి తా నతణ్ణలా తయారుచేసుకుంది. కనక, తన పెత్తనం యెవరూ తప్పించలేరని దృఢనిశ్చయం చేసుకుంది. అయినా, ఎటొచ్చి యెటుపోతుందోనని చూపంతా అటే వుంచుకుంది.

ఒకనాడు జోగమ్మ నూతిపెరట్లో నీళ్ళు పోసుకుంటున్న సమయం కనిపెట్టి, చలపతిని వీధిగుమ్మంలోకి తీసుకువెళ్ళి "వెర్రినాయనా, పగలు పెళ్ళాంతో మాట్లాడగూడదు" అని వొక మంత్రోపదేశం చేసింది. "పదిపన్నెండు తరాల నుంచీ మన కుటుంబం సంప్రదాయం యిది" అని తమ ఘనత విశదం చేసింది.

"కోడి కూసింది మొదలు పూరుమాటుమణిగే దాకా రాజుల యిళ్ళ మొగుడూ పెళ్ళాం లౌకరికంట పొకరు పడరు. గొప్పవాళ్ళ మర్యాదలవి. నీ మామగారు నౌకరీ చేసుకుంటేగాని పొట్టగడవని కుటుంబంలో పుట్టారు. ఇలాంటి మర్యాదలు ఆయనకే తెలియవు, నీ పెళ్ళాని కెలా తెలుస్తాయి? పోనీ అంటే, రాచకొమాళ్ళు నీదగ్గిర దిగతుడుపు. నీకేం తక్కువ?" అని బాగా వుబ్బేసింది, తరవాత.

"సాయంత్రం మనం యిద్దరమూ బజారికి వెడదాం, పొంటెద్దు బండేం కర్మం, జట్కామీదే వెడదాం దర్జాగా. ఒక టేబులూ, పొక కుర్చీ, ఒక సిరాబుడ్డీ, పొక కలమూ, పొక అద్దుడుకాగితమూ, నాలుగు తెల్లకాగితాలూ కొనుక్కొందాం. నాలుగు కాపీబుక్కులు కూడా కొనేస్తా నీకోసం నేను. పగలస్తమానమూ నువ్వు దొరగారిలాగ వీధిగదిలో కచేరి చేసుకుంటూ వుందువు గాని, నెలకొక రూపాయి ఇస్తే నీదగ్గిర అపనీ యీపనీ చేస్తూ వుంటుంది, పొక పిల్లని కూడా జీతానికి పెట్టేస్తాను. ఇంతలో నీ క్కొతురు పుడితే అదే యెత్తుకుంటూ కూడా వుంటుంది. అయితే, నేను పిలిస్తేనే నువ్వింటోకి వస్తూవుండాలి. మరెవరు పిలిచినా రాగూడదు సుమా" అంటూ పూరించినట్టే పూరించి ముందరికాళ్ళకి బందమున్నూ వేసింది.

ఇది పొద్దున్న జరిగింది.

కాని యిదేమీ యెరగని జోగమ్మ, ఆవేళ మధ్యాహ్నం మూడుగంటల వేళ తల దువ్వుదామని సన్నచేసి చలపతి నింటోకి పిలిచింది. చలపతి మెల్లగా బయలుదేరనూ బయలుదేరాడు. అతను గదిలోకి వచ్చీరావడంతోనే తలుపులు వేసెయ్యడానికి జోగమ్మ సిద్ధంగా నుంచుంది కూడా.

కాని, పడమటింట్లో వున్న బుచ్చమ్మ యిదంతా కనిపెట్టేసింది.

"తమ్ముడూ" అంటూ పిలిచిందెంతో ముద్దుగా ముందామె. "ఇప్పుడే వెడుదువుగాని పొకమాటిలా రా నాయనా" అని మెల్లిగా రమ్మంది, తరవాత. వచ్చీరావడంతోనే అతని రెక్కపట్టుకుని, యేమిటేమిటో అంతరమంతర గొడవలు చెబుతూ వంటింటి పెరట్లోకి తీసుకువెళ్ళింది, చివరికి.

ఎందుకో అనుకున్నాడతను: కాని "ఇదేమిట్రా రోడ్డు బూడిద, అంతా నీ తల్లోనే వుందీ?" అంటూ కూచోపెట్టి, నిమిషంలో సాధన సామగ్రి తెచ్చి తనే తలదువ్వేసింది, ఆదరాబాదరా. "ఇక వెళ్ళు, అదెందుకో పిలిచింది పాపం" అంటూ పంపేసింది, మండువాదాకా సాగనంపి.

మర్నాడు పిల్లికంటే పొదుపుగా కూచుని గదిలోకి రమ్మని కన్నుగీటింది జోగమ్మ. "మాట చెబుతా కూచోండి" అంటూ రెండు రెక్కలూ పట్టుకుని కూచోపెట్టి నూనె సీసా అందుకుంది తటాలున.

అరిసెలో జంతికలో పెడుతుందన్న ఆశతో వచ్చాడు చలపతి. నిన్న కూడా అత నలాగే అనుకున్నాడు; కాని బుచ్చమ్మ అవి దక్కకుండా చేసిందని అవతలికి వెళ్ళాక చాలా బాధపడ్డా డతను పాపం. చివరికయినా పెట్టకపోతుందా అనుకుంటూ ఆశపడుతూ కూచున్నాడివాళ.

కాని బుచ్చమ్మ యిది కూడా కనిపెట్టేసింది.

ఒక్క అంగలో గదిగుమ్మం దగ్గిరికి వెళ్ళి, తా నెంతసేపణ్ణుంచో ఎంత గట్టిగానో పిలుస్తూ వుండినట్టు చురచురలాడుతూ "ఎంత గొంతుకు చించుకున్నా పలకవేమిటే మా తల్లీ?" అంటూ రుంజుకుని జోగమ్మ నివతలికి రప్పించేసింది వెంటనే.

మెల్లిగానే ఇవతలికి వచ్చింది జోగమ్మ; కాని "యేమి మించిపోయిందేమిటి?" అన్నట్టు చురుకూ చురుకూ చూసింది.

మించిపోలేదు, అసలు, పనీ లేదు; కాని తెల్లపోతే యెలాగా? అంచేత, తనవెంట రమ్మని ముందామెని వుత్తరపు వసారాలోకి తీసుకువెళ్ళింది బుచ్చమ్మ. ఏదయినా పని కల్పించా లక్కడ, అప్పటికప్పుడు. కనక అలాగా యిలాగా చూడగా వొక స్తంభం దగ్గిర చీపురుకట్ట పడివుంది. వెంటనే "ఇది ఇక్కడేనా పడెయ్యడం?" అనడిగింది, ఏదో అకార్యకరణం జరిగిపోయిం దన్నట్టు రూక్షంగా చూస్తూ.

ఉగ్రురాలయిపోయింది జోగమ్మ. ఆమె వచ్చాటప్పటికే అక్కడే వుందది. వచ్చినప్పణ్ణుంచీ దాని స్థలం అదే అనుకుని అక్కడే పడేస్తుంది జోగమ్మ, దినమ్మా. అయితే, ఇప్పుడీ ఆక్షేపణ ఎందుకు వచ్చిందో తెలుసునామెకి. అంచేత "మరెక్కడ పడెయ్యా లేమిటి?" అనడిగిందామె, నిలవదీస్తూన్నట్టు చూస్తూ.

"అక్కడ గాదిసావట్లో మా నాన్న పడుకునే మంచమా? ఇది ఇక్కడా యెదురుగా?"

"నే నీవూరు వచ్చాటప్పటికే యిది యిక్కడ వుంటోందా? ఇవాళ దీనికి తప్పొచ్చిందా?" అని యెదురుపడింది జోగమ్మ.

బుచ్చమ్మ తెల్లపోయింది.

పులుకూ పులుకూ చూసుకున్నా రిద్దరూ.

"పనిమనిషి పడేసిందేమో యెప్పుడయినా? ఇంటో వాళ్ళకయినా ఆలోచన వద్దా?" అనడిగింది బుచ్చమ్మ.

"ఇల్లు మోసినవాళ్ళు వెంటనే చెప్పకోవద్దా మొదటే?"

"ఇదిగో ఇప్పుడు చెబుతున్నాను."

"ఇదిగో నేనూ ఇప్పుడే వింటున్నాను."

"అక్కడా ఇది వుండవలసినచోటు" అంటూ బుచ్చమ్మ వొకమూల చూపించింది జోగమ్మకి తానక్కడే వుండి.

వెంటనే "యిదిగో" అంటూ జోగమ్మ ఆ చీపురు పుచ్చుకుని అటువెళ్ళి "అక్కడ పడేశాను సరా?" అంటూ అక్కడ యెత్తిపడేసి, "మరి ఇంకేమిటి తరవాయి?" అనడిగింది యెదటికి వచ్చి.

బుచ్చమ్మ ఆ వెటకారం గుర్తించపోలేదు; కాని "తొందర పడుకో భామా" అనుకుంది మనస్సులో. ఈ వ్యవధానంలో అలాంటివే మరో చిన్న పనులు కనిపించా యామెకి. "అదిగో అది" "అదిగో యిది" అని అవిన్నీ చూపించిందామె వెంటనే.

జోగమ్మ అవి అందుకునేటప్పటికి మరో రెండు పనులు కనిపెట్టింది బుచ్చమ్మ. అవి పూర్తి చేశాటప్పటికి మరొకటి కూడా కల్పించింది. అయితే, పనిమీద పని కల్పించడంలోనూ,. అవి పురమాయించడంలోనూ తానూ అక్కడే వుండిపోవలసి రావడంవల్ల బుచ్చమ్మ కూడా చలపతికి తల దువ్వలేకపోయింది.

## 11

ఆవేళ రాత్రి చలపతి గదిలోకి వచ్చాక, మీదిమీదికి వెళ్ళి నుంచుని, "తలదువ్వుతాను కూచోండి" అంది జోగమ్మ.

"ఇప్పుడా?" అన్నాడు చలపతి చకితుడయి.

"అయితే యేం?"

"పగలు –"

"అందరూ పగలే దువ్వకుంటారు తల; కాని మీకు తీరుబడేదీ పాపం? ఇవాళ ఆల్కాట్టుతోటకి వెళ్ళారా మరి? రేపు ఆర్యాపురమో, దానవాయిగుంటో, వీరభద్రపురమో, సీతంపేటో, చివరికి హుకుంపేటో –"

"రాత్రి తలదువ్వుకుంటే సానిపుట్టుక వస్తుందిట కదూ?"

"ఎవరన్నారూ?"

"చాలా మాట్లంది మా అక్క"

"చాలా మంచిమాట అన్నారావిడ. ఇంతకంటే మీకదే నయం అవి కోరుకుంటున్నా రన్నమాట అవిడ. పైగా, ఆ జన్మలోకూడా మీ అక్క మీకు అక్క అయే పుడతారు లెండి, బెంగపెట్టుకోకండి"

గతుక్కుమనిపోయాడు.

మొగమున్నూ బాగా వంచేసుకున్నాడు.

ఇలా అని ఆమె వెంటనే దీపం హెచ్చించి, అది ట్రంకుపెట్టెమీద వుంచి, దాని కెదురుగా అతణ్ణి కుర్చీపీటమీద కూర్చోపెట్టి, పెద్దబిళువారీ అద్దం చేతికిచ్చింది.

బుచ్చమ్మ తలదువ్వితే యెప్పుడూ అద్దం చేతికివ్వదు.

అతను తరవాత చూసుకున్నా అది యింత పెద్దదీ కాదు, ఇంత మంచిదీ కాదు, ఇంత చక్కనిదిన్నీ కాదు.

పైపెచ్చు దానికి చట్రమే లేదు.

"కళాయి పోతోంది నాన్నా" అంటూ బుచ్చమ్మ యెన్నాళ్ళో పోరగా పోరగా, జగ్గయ్య, వొక తాటాకుపెట్టె మూతలో బిగించా డది. దాని కొక నులకతాడు ముక్క కట్టాడు. అది తగిలించడానికి వంటింటి గుమ్మంపక్కని వొక వాసంమేకున్నూ కొట్టాడు.

అద్దం సంగతి యిలా వుండగా, జోగమ్మ తెచ్చిన నూనె మామూలుగా కాక, యెర్రగా వుంది. అది ఆమె చేతిలో వేసుకున్నప్పుడే ఘుమఘుమలు మొదలుపెట్టింది. అది తన తలకు రాసినప్పు డతనికి పాతముక్కు పోయి కొత్తముక్కు వచ్చిన ట్టనిపించింది.

బుచ్చమ్మ తలదువ్వితే, చెవులూ నుదురూ చెంపలూ మెడా నూనె మరకలతో నిండిపోతాయి. ఎక్కడో వొకచోట దువ్వెన్న తప్పకుండా గీసుకుపోయి రక్తం కూడా కళ్ళబడుతుంది, కాస్తో కూస్తో.

# |11|

ఆవేళ రాత్రి చలపతి గదిలోకి వచ్చాక, మీదిమీదికి వెళ్ళి నుంచుని, "తలదువ్వుతాను కూచోండి" అంది బోగమ్మ.

"ఇప్పుడా?" అన్నాడు చలపతి చకితుడయి.

"అయితే యేం?"

"పగలు –"

"అందరూ పగలే దువ్వకుంటారు తల; కాని మీకు తీరుబడేదీ పాపం? ఇవాళ అల్కాట్టుతోటకి వెళ్ళారా మరి? రేపు ఆర్యాపురమో, దానవాయిగుంటో, వీరభద్రపురమో, సీతంపేటో, చివరికి హుకుంపేటో –"

"రాత్రి తలదువ్వుకుంటే సానిపుట్టుక వస్తుందిట కదూ?"

"ఎవరన్నారూ?"

"చాలా మాట్లంది మా అక్క"

"చాలా మంచిమాట అన్నారావిడ. ఇంతకంటే మీకదే నయం అవి కోరుకుంటున్నా రన్నమాట అవిడ. పైగా, ఆ జన్మలోకూడా మీ అక్క మీకు అక్క అయే పుడతారు లెండి, బెంగపెట్టుకోకండి"

గతుక్కుమనిపోయాడు.

మొగమున్నూ బాగా వంచేసుకున్నాడు.

ఇలా అని ఆమె వెంటనే దీపం హెచ్చించి, అది ట్రంకుపెట్టెమీద వుంచి, దాని కెదురుగా అతణ్ణి కుర్చీపీటమీద కూర్చోపెట్టి, పెద్దబిళువారీ అద్దం చేతికిచ్చింది.

బుచ్చమ్మ తలదువ్వితే యెప్పుడూ అద్దం చేతికివ్వదు.

అతను తరవాత చూసుకున్నా అది యింత పెద్దదీ కాదు, ఇంత మంచిదీ కాదు, ఇంత చక్కనిదిన్నీ కాదు.

పైపెచ్చు దానికి చట్రమే లేదు.

"కళాయి పోతోంది నాన్నా" అంటూ బుచ్చమ్మ యెన్నాళ్ళో పోరగా పోరగా, జగ్గయ్య, వొక తాటాకుపెట్టె మూతలో బిగించా డది. దాని కొక నులకతాడు ముక్క కట్టాడు. అది తగిలించడానికి వంటింటి గుమ్మంపక్కని వొక వాసంమేకున్నూ కొట్టాడు.

అద్దం సంగతి యిలా వుండగా, బోగమ్మ తెచ్చిన నూనె మామూలుగా కాక, యెర్రగా వుంది. అది ఆమె చేతిలో వేసుకున్నప్పుడే ఘుమఘుమలు మొదలుపెట్టింది. అది తన తలకు రాసినప్పు డతనికి పాతముక్కు పోయి కొత్తముక్కు వచ్చిన ట్టనిపించింది.

బుచ్చమ్మ తలదువ్వితే, చెవులూ నుదురూ చెంపలూ మెడా నూనె మరకలతో నిండిపోతాయి. ఎక్కడో వొకచోట దువ్వెన్న తప్పకుండా గీసుకుపోయి రక్తం కూడా కళ్ళబడుతుంది, కాస్తో కూస్తో.

జోగమ్మ, అలాకాక చాలా జాగ్రత్తగా నూనె రాసింది. చాలా నాజూకుగా దువ్వింది. ఆ పెద్దద్దంలో వొకదాన్నొకటి రాసుకుంటున్నట్టు ఇద్దరి మొగాలూ ఎంచక్క కనపడుతున్నాయి.

కాక, – మధ్యమధ్య మీదికి వాల్తూ, చెవిలో నోరుపెట్టి "ఇలాగేనా తలదువ్వడం?" అని వొకమాటూ "ఎక్కడయినా దువ్వెన్న గీసుకుపోతే యేమీ అనకండేం" అని వొకమాటూ "ఎంచక్కుంటుంది ముచ్చటముడి వెయ్యనా?" అని యింకోమాటూ "రేపణ్ణుంచి కాకిలాగ గోదావరిలో మునిగి చక్కారాకండి. మీ అక్క గోదావరికి వెళ్ళాక వినోలియా సబ్బుతో వొళ్ళు తోమి నేను స్నానం చేయిస్తూ వుంటాను" అని మరోమాటూ – అని యిలాగ మెల్లిమెల్లిగా యేమిటేమిటో అడుగుతూ, నవ్విస్తూ తుళ్ళిస్తూ, ఉండుండి బుగ్గలకు తన పెదవులు అనిస్తూ, చక్కలిగిల్లిపెట్టి వూపేస్తూ, చిరునవ్వు నవ్వుతూ కొంటెచూపులు చూసి మైకం కమ్మిస్తూ, జంకెనచూపులతో చురుకు పుట్టిస్తూ క్రొత్త ప్రపంచంలో తిప్పేసింది కూడా ఆమె.

అక్కడికే ఏదో కొత్తదనం జాగృతం అయిం దతని ప్రకృతిలో. దీనికి సాయం, జోగమ్మ, ముందు తాను సబ్బుతో చేతులు కడుక్కుని వచ్చి తడిగుడ్డతో మొగమంతా మెల్లిగా తుడిచిం దతనికి. కమ్మని స్నో రాస్తూ మొగం అంతా నిమిరింది. అంటీ అంటకుండా పౌడరు రాస్తూ బుగ్గలు పొడిచింది.

పాందానుమూతలో వున్న తమలపాకుచిలక లెడమచేత వుంచుకుని, వక్కపొడిచేర్చి రెండుమూడు చిలక లతని నోటి కందించి, తన నోటకూడా నాలుగు చిలక లుంచుకుని "కాస్త చోటివ్వండి నాకు" అంతా సుతారంగా బుజాలు పట్టుకుని చూపింది, కళ్ళల్లోకి చూస్తూ.

ఇద్దామనే అనుకున్నాడు చలపతి; కాని, వొక్క మనిషికే చాలీచాలని పీట అది. ఈ సంగతి ఆమెకీ తెలుసు. జరగడానికి చోటులేక అతను కంగారు పడుతూ వుండడమున్నూ గుర్తించిందామె; కాని విలాసవతి కనక "పోనీలెండి.... ఏం?" అంటూ వెంటనే అతని వొళ్లో కూచుంది.

అందుకే అతను పరవశుడయిపోగా, ఎడమచెయ్యి అతని మెడకి చుట్టేసి, వొక చిలక పుచ్చుకుని సగం తన నోట వుంచుకుని, "ఊ, ఊ," అంటూ పావురంలా గుబాళిస్తూ ఆ నోటితోనే తక్కిన ఆ సగం చిలకా అతని నోటి కందించి, వొకమాటు పెదవి కరిచి తరవాత కటుక్కున కొరికి మళ్ళీ కళ్ళలోకి చూసింది, బెళిసూ.

# 12

తెల్లవారాక అలాగా యిలాగా తిరగడంలో – వొకమాటు పక్కపక్కగా నడవడంలో చలపతి సంగతి కనిపెట్టేసింది బుచ్చమ్మ. గుప్పున కొట్టింది జోగమ్మ రాసిన తలనూనె సువాసన ఆమెకి. వెంటనే నీళ్ళపొయ్యిమీద డేగిసాపడేసి అతనికి తలంటు ప్రారంభించిందామె.

అది చూసి "వోసి నీ బుద్ధి బుగ్గయిపోనూ" అని యీసడించుకుంటూ గదిలోకి చక్కాపోయింది జోగమ్మ.

తలమీద నూనె పెడుతూ "రాత్రి తల దువ్వించుకున్నావు, కదూ అబ్బాయీ?" అనడిగింది బుచ్చమ్మ.

"నేను వద్దన్నాను; కాని అదే దువ్విందే."

'నేనెరుగనూ? దానిపనే యిది. అచ్చంగా సానిపాపే మాతల్లి'.

తననికూడా ఏమంటుందో అని భయపడ్డా డతను.

"రాత్రి తలదువ్వుకుంటే సానిజన్మవస్తుంది, ఇంకెప్పుడూ అలా చెయ్యనియ్యకు వెర్రినాయనా?"

రాత్రి జోగమ్మ అన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి.

"మొగవాడి కాడజన్మ యెలా వస్తుందే?" అని మాత్రం అనగలిగాడతను.

"ఏం రాకా? దేవుడికి ఆడా మొగా భేదం వుందనుకున్నావా? వెనుకటి నీ పెళ్ళాం మొగవాడు కాక ఆడదనుకున్నావా యేమిటి బుల్లాడా?"

అతని శరీరం కొంచెం వణికిన ట్టయింది.

"కాకపోయినా, సానికొంపలో మొగవాడ వయి పుట్టి తిత్తివూదే యోగం పడితేనో?"

కొయ్యయి పోయాడు చలపతి.

అది గుర్తించి "తెలిసిం దంటే 'నువ్వయినా చెప్పావు కాదేం?' అని నన్ను తిడతాడు నాన్న" అని అందుకుందామె.

"దువ్విన వాళ్ళు బాగానే వుంటారు, మధ్య, యేమీ యెరగని నాకూ చివాట్లూ చెప్పదెబ్బలూను. పెత్తనం చేసి నేనేమీ బాముకోడం లేదు. కుటుంబ మర్యాద నిలబెట్టడానికి నే నెన్నిపాట్లు పడుతున్నానో ఆ భగవంతుడి కెరుక. అమ్మ చూసుకోవలసిన వివన్నీ. అలో మని యేడుస్తూ మూలపడి వుండకుండా భారం అంతా మొయ్యవలసి వచ్చింది నాకు. అయితే, యినప గజ్జెల తల్లి ఇంటో అడుగుపెట్టింది, అమ్మ ఎలా దక్కుతుందీ మనకి?"

దీనిమీద రాత్రి చర్య అంతా జ్ఞాపకం వచ్చింది చలపతికి. తాంబూలం నోటితో అందించడమూ, వొళ్ళో కూచోడమూ – జోగమ్మ ఈ విలాసా లన్నీ కళ్ళకు కట్టి నట్టయినా యతనికి. పైగా "ఆ యింటో మీ అక్క అడుగుపెట్టింది, మీ బావ చచ్చిపోయా"డని ఆమె అంటున్నట్టున్నూ తోచిందతనికి.

"మీ అక్క దౌర్భాగ్యం తెలుసా నీకు?" అని యెవరో బుగ్గమీద పొడిచినట్టున్నూ అయిం దతనికి.

ఈ మాటలే అనేద్దా మనుకున్నాడు; కాని మాట రాలేదు.

తరవాత కూడా నాలుగైదు మాట లందామె. వాటిలో వొకటి రెండు ప్రశ్నార్థకా లయివుండినా చలపతి బదులు చెప్పకపోడం చూసి "తమ్ముడు సిగ్గుపడుతున్నాడు జరిగిపోయినదానికి. బుద్ధివచ్చింది" అనిన్నీ అనుకుంది. ఆమెకూడా వూరుకుంది, చివరికి.

నోరెప్పు డూరుకుందో అక్కడి నరాల్లో వున్న కదలిక అంతా ఆమె చేతినరాల్లోకి బదిలీ అయింది.

దాంతో, పాళాలు కనిపెట్టే ధోరణి మరిచిపోయి వొకమాటు సలసలాడే

మరుగునీళ్ళు పోసీ, తనచేతులే చురుక్కుమనగా వెంటనే నాలుగుచెంబులు చన్నని చన్నీళ్ళు పోసీ, మెడ బెణికేటట్టు జుట్టు దులిపి, పెంకులు తీసెయ్యకుండా కుంకుడు పిప్పితో నాక్కి వాళ్ళుతోమీ మరో పది నిమిషాలకు తలంటు పూర్తిచేసిందామె.

అక్కడ సద్దుబాట్లన్నీ చేసుకుని ఆమె వాకిట్లోకి వచ్చాటప్పటికి చలపతికి జోగమ్మ తల చిక్కుతీస్తోంది. తలలో వున్న కుంకుడుకాయపిప్పి కూడా తీస్తోంది.

ముందు కొయ్యాయిపోయి తరవాత అగ్గయిపోయింది బుచ్చమ్మ. తాను గోదావరికి వెళ్ళవలసిన సమయం అది. తానొక్కర్తీ వెడితే ఇంటో, తలంటువిషయమై ఎన్నివంకలు పన్నుతుందో? అదంతా చెప్పి చలపతి మనస్సేం విరిచేస్తుందో? ఈ సందేహం కూడా కలగిం దామెకి.

అప్పటికి జోగమ్మ పని పూర్తయింది. వెంటనే బిందెపుచ్చుకుని బయలుదేరి, యెక్కడ లేని ఆపేక్షా కనపరుస్తూ "గోదావరికి వెడదాం రావే మరదలా" అని పిలిచింది, ప్రేమ గుమ్మరిస్తూ.

అది విని "నా తరవాయి వచ్చిందా ఇప్పుడు?" అనుకుంది జోగమ్మ. "గోదావరి కాదు, నీకు తగ్గది కాల్లేరు" అనుకుంటూ పళ్ళుకూడా కొరుక్కుంది, అటు తిరిగి. "మాటలు పెరిగితే ఏమయినా సరే దులిపేస్తా" నన్నిన్నీ నిశ్చయించుకుంది. ఆ నిశ్చయంతో కొంచెం దురుసుగానే వచ్చింది, కొంచెం యెదటికి.

"గోదావరికి వెడదాం రా" అని మళ్ళీ పిలిచింది బుచ్చమ్మ.

బుంగమూతి పెట్టుకుని "నేను – రాను" అని బదులు చెప్పిందందుకు జోగమ్మ.

"అదేమే మాతల్లీ?"

"గోదావరిలో స్నానంచేస్తే నాకు జబ్బుచేస్తుంది బాబూ!"

"ఎంత వులకమే మామ్మా?"

"మీరు వెళ్ళిరండి; ఇంట్లో నాకు పని కూడా వుంది."

బుచ్చమ్మ గతుక్కుమంది. "మా తమ్ముడికి ఉన్నవీ లేనివీ కల్పించి చెబుతావు. అంతకంటే పనేమిటి నీకు?" అనుకుందామె మనస్సులో. ఎలాగయినా ఆమెని వెంటబెట్టుకుని వెళ్ళవలసిందే అనిన్నీ నిశ్చయించుకుంది.

"ఎందుకు చెప్పానో విను"

"నాకంతా తెలుసునండీ"

"అంతా తెలుసునా? అయితే, యివాళ యేకాదశి కదా, సముద్రం అంత గోదావరి వుండగా కాదని బ్రాహ్మణ పుట్టుక ఆమె దెవరయినా నూతినీళ్ళతో స్నానం చేస్తుందా యీ వూళ్ళో?"

ఈ మాటకి బదులుచెప్పలేక జోగమ్మ తెల్లపోతుందనీ, పుచ్చినట్టు తన కూడా వస్తుందనీ అనుకుంది బుచ్చమ్మ. కానీ జోగమ్మ వూరుకోలేదు. "మీరు కనక సరిపోయింది గాని, బ్రాహ్మణ యింట్లో పుట్టిన ఆడది యెవర్తయినా ఏకాదశిపూటా, తన తమ్ముడికి తలంటుతుందా యీ వూళ్ళో?" అని యెదురడిగిందామె, తల యెగరవేసుకుంటూ.

ఈ మాటకి కొయ్యయిపోయింది బుచ్చమ్మ. కత్తివేస్తే నెత్తురుచుక్క లేకుండాపోయింది కూడా ఆమె మొగాన.

నిజంగా ఆమెకి చచ్చినచా వయిపోయింది.

దీనికి సాయం, గాదెసావిట్లో జంధ్యాలు వొడుక్కుంటున్న జగ్గయ్య "అలవాటు లేకపోతే జబ్బు చేస్తుంది. పాపం, బలవంతంపెట్టి దాన్ని గోదావరికి తీసుకువెళ్ళకే అమ్మాయీ" అంటూ కొంచెం గదిమినట్టన్నాడు.

# 13

ఆవేళ మధ్యాహ్నం, తలదువ్వించుకుందామని ముచ్చటపడి సొంతంగా చలపతే బయలుదేరాడు గదిలోకి; కాని అదే సమయాన, పరికరాలతో వచ్చి వొడుపేసి అతణ్ణి పట్టుకుని వాకట్లోనే మండువా అంచున కూచోపెట్టి బుచ్చమ్మే తల దువ్వసాగింది.

అయితే అక్కడ చలపతికి ముచ్చట అయినట్టే "ఈపాటికి పిలుద్దాం" అంటూ యిక్కడ జోగమ్మకీ సంకల్పం కలిగింది. పరికరాలన్నీ వసారాలో పెట్టి వెంటనే ఆమె వాకట్లోకి బయలుదేరింది.

కాని వాకట్లో అడుగుపెట్టాటప్పటికిదీ "బాగోతం."

వొళ్ళు తిరిగి విసిరేసినట్టయి జోగమ్మ, ఆ పక్కనే వున్న స్తంభానికి చేరపడిపోయింది, దాంతో.

ఇది చూసి, బుచ్చమ్మ మరీ మొండికెత్తింది. ఒకమాటు కీగంట జోగమ్మ కేసి చూసీ, వొక్కమాటు కొంచెం ఆలోచన కూడా చేసీ అందుకుని "ఎప్పుడూ లేంది నిక్షేపంవంటి జుట్టు ఇలా పాయలుపాయలుగా వూడిపోతోంది, బజారుకంపు నూనె లేమయినా తగులుతున్నాయా యేమిటి బుల్లోడా" అనడిగింది, ఝాంకారంగా ఆమె.

ఇది విని పెదవులు విరుచుకుంటూనూ, మెడ బిగించుకుంటూనూ జోగమ్మ తల అడ్డంగా తాటించుకుంటూ వుండగా, పిలిచినట్టు పెత్తనాలకు వచ్చింది పక్కయింటి సోదెమ్మ.

ఆ యిద్దరి వాలకమూ చూసి "యేదో వుంది" అనుకోకపోలేదామె; కాని మనకెందుకని వెనక్కి వెళ్ళలేకపోయింది. కాక, – "రావే" అని బుచ్చమ్మా ఆహ్వానించలేదు "రండీ" అని జోగమ్మా స్వాగతం చెప్పలేదు, అయినా ముందుకే వచ్చేసింది కూడా.

కూచుంటూ కూచుంటూ ఆమె జోగమ్మ కేసి చూడగా, జోగమ్మ ఆమెకేసి చూసింది.

ఎవరో చెప్పినట్టు బుచ్చమ్మ కెదురుగా కూచుంది సోదెమ్మ. అవతల యెవరో పిలుస్తున్నట్టు జోగమ్మ కూడా గదిలోకి వెళ్ళిపోయింది.

బుచ్చమ్మలాగ సోదెమ్మా వితంతువే. వారి స్నేహానికది కూడా వొక కారణమే. అయితే సోదెమ్మ హృదయం స్తబ్ధం మాత్రమే అయిపోయింది గాని; శూన్యం అయిపోలేదు. నల్లరాయిన్నీ అయిపోలేదు.

యథారూపంగానే వుందది. నిర్మలంగానూ వుంది, ఆర్ద్రంగానూ వుంది, స్నిగ్ధంగానూ వుంది కూడా. దాని స్పందనం మాత్రం చెల్లెలి హృదయానికి ధారపోసిందామె.

కొడుకులు లేకపోడంవల్ల ఆమె తండ్రి రెండో అల్లుణ్ణిల్లరికం తెచ్చుకున్నాడు. సోదెమ్మ, చెల్లెలే కూతురుగానూ, మరిదే తమ్ముడుగానూ సంసారం దిద్దుతోంది.

సోదెమ్మకీ చలపతికీ వదినామరుదుల వరస. అప్పుడప్పుడు, ఆమె "మెర్రిబాగులవాడు" అనుకుంటూనే చలపతిని పరియాచకం చేస్తూ వుంటుంది.

ఈ చనువుతో "పెళ్ళాంచేత తలదువ్వించుకోడం సిగ్గా యేవిట్రా భావా?" అనడిగిందామె చలపతిని.

పై పెచ్చు, – "కాకపోయినా, చక్కగా పక్కపాపిడి క్రాపింగు పెట్టించుకోక, ఆడపిల్లకి లాగ నీకంత జుట్టేమిట్రా యీరోజుల్లోను? "అనిన్నీ అందామె, చలపతిని పిలిచి."

ఆ సమయాన సోదెమ్మ రావడం బుచ్చమ్మ కిష్టంలేదు. పోనీ అంటే, వచ్చింది వచ్చినట్టుండక అటు జోగమ్మ మొగంకేసి, యిటు బుచ్చమ్మ మొగం కేసి పరీక్షగా చూడసాగింది కూడా.

అయినా వూరుకుంది బుచ్చమ్మ, లోపల యెంత యిష్టం లేకపోయినా; కాని పెళ్ళాం తలదువ్వడం మాటా క్రాపింగు మాటా తెచ్చాటప్పటి కిక సహించలేకపోయిందామె.

చనువూ, స్నేహమూ, మొగమాటమూ దూరంగా పెట్టేసింది ముందు. ధుమధుమలు సాగించింది తరవాత. "ఇంట్లో వున్న ఆడవాళ్ళు భయభక్తులూ సిగ్గుబిడియాలూ వున్నవాళ్ళయితే అంతరమంతరంవాళ్ళు గజ్జెకట్టుకు వచ్చి యిలా భాగోతం ఆడగలరా యేమిటి? సిగ్గుకాకపోతే మాత్రం పెళ్ళాంగారు వచ్చాక తోడబుట్టినవాళ్ళని తీసిపారేసుకోవాలా? తలదువ్వే దిక్కు లేకపోతే మొగముండా కొడుకు క్రాపింగూ పెట్టించుకోక, బోడిగుండూ చేయించుకోక మరేం చేస్తాడూ? గురివిందగింజ తనకున్న నలుపెరగదు. ఒకళ్ళ ఇంటి ముచ్చట్లు మాత్రం ఇంతకంటే బాగా వుండి యేడిచాయా? కాకపోయినా, కొంతమందికి కళ్ళల్లో వుంటుంది విషం" అంటూ విసిరికొట్టింది, చివరికి.

సోదెమ్మ మనస్సు చివుక్కుమంది. చాలా అభిమానపడి పోయిందామె. కళ్ళనీళ్ళ పర్యంతమూ కూడా అయింది మరి కూచోలేకపోయింది.

"యదాలాభంగా అన్నమాట కింత అల్ల రేమిటీ మా తల్లీ" అని పులుకూపులుకూ చూస్తూ వుబ్బెత్తుగా లేచునుంచుంది మొదట ఆమె. "తెల్లవారి యెవరి మొగం చూశానో?" అనుకుంటూ వీధిలోకి వెళ్ళిపోయింది తరవాత. "తీరికూచుని యెంతంతలేసి మాటలు పడవలిసి వచ్చిందీ?" అని మిక్కిలీ పరితపిస్తూ ఇల్లుచేరుకుని "మరద లంటే కళ్ళల్లో అంతగా నిప్పులు పోసుకుంటుందే?" అని గొణుక్కుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

"వెళ్ళిపో, నాకేం దిగడిపోతుందనుకున్నావా? అసలిక్కడికి నిన్నెవరు రమ్మన్నారే బుద్ధిలేనిదానా?" అనుకుంది బుచ్చమ్మ.

"అల్లరిట అల్లరి, చూశావా తమ్ముడూ? గుమ్మంలోకి రానిస్తే ఎంతెంతలయినా పుట్టిస్తుందిది. చెల్లెలికి మాయమాటలూ మంకుపట్లూ నేర్పి మరిదినెంత ఏడిపిస్తోందో యెరుగుదువా నువ్విది? నీ పెళ్ళాన్ని లోపుచేసుకుని మనకొంపకక్కాడా

ముప్పొతెస్తుంది సుమా చివరి కిది, కనుగలిగి వుండాలి నువ్వూ నేనూ కూడా" అని చలపతి చెవిలోనున్నూ వూదిం దామె.

తరవాత జోగమ్మ నుద్దేశించి, ఆ గదికేసి చూస్తూ "ఆ టక్కులాడితో మాట్లాడి చూడు నిన్నేం చేస్తానో?" అంటూ పళ్లున్నూ కొరుక్కుంది, చివరికి.

లోగుమ్మంలో నుంచుని, జోగమ్మ, ఆ చెలికత్తెల మాటలన్నీ వింది. చలపతిని గురించి వారి కిద్దరికీ విరోధం వచ్చినందుకెంతో పొంగిన్నీ పోయిందామె.

## 14

నెల్లాళ్ళగ్గానీ రారనుకున్న జోగమ్మ తల్లీ తండ్రీ పదిహేను రోజులకే వచ్చారు. నిజాని కవి రోజులే గాని; జోగమ్మకి సంవత్సరాలన్నంత భారం అనిపించాయి.

వారయినా, జోగమ్మని విడిచి వుండలేక అయితే నేమి, నెల అఖరున గాని అందదనుకున్న సెలవు పదిహేను రోజులకే రావడంవల్ల నయితే యేమి పిలిచినట్టు వచ్చారు కనక సరిపోయింది గాని, లేకపోతే, ఎంత బిగపట్టుకున్నా ధైర్యం నిలవక బెంబేలుపడిపోయివుండును జోగమ్మ.

అక్కడికీ, పెట్టె తెరిచి మినపసున్నిబుట్టా, మిఠాయిబుట్టా పైకితీస్తూ తలవని తలంపుగా తన మొగంచూసి "అదేమే మామ్మా, అంత కంప అయిపోయావ్?" అంటూ తల్లి చేతులు చాపాటప్పటికి దుఃఖం పొంగుకురాగా తల్లి మీద వాలి బేరుమనిపోయిందామె.

బుచ్చమ్మ వెయ్యి కళ్ళతో కనిపెడుతూనే వుంది; గాని, జోగమ్మ, ఇక్కడి సంగతి అంతా ఆ పూటే తల్లితో చెప్పేసింది.

పూర్ణమ్మ కరికాలి మంట నెత్తికి వచ్చింది. అది విని వేంకటాచలం కూడా చాలా ఆగ్రహపడ్డాడు; కాని అల్లుడి అమాయకత్వం జ్ఞాపకంవచ్చి "తొందరపడకు" అని పూర్ణమ్మని ముందు సముదాయించి "పడ్డన్ని రోజులు పట్టవు, తల్లీ, వోపికపట్టు. మేమిక్కడ పదిరోజు లుందా మని వచ్చాము. ఈ లోపున చలపతిని దిద్దగలుగుతానా సరే, లేకపోతే, తరవాతి సంగతి అప్పుడు చూసుకుందాం" అని జోగమ్మని కూడా వోదార్చి ఆలోచన ప్రారంభించా డతను.

ఇదిలా వుండగా, జోగమ్మనీ, పూర్ణమ్మనీ చలపతినీ వెంటబెట్టుకుని ఆవేళ మధ్యాహ్నమే బజారుకి బయలుదేరా డతను; కాని చలపతి వారితో వెళ్ళడం బుచ్చమ్మకి సుతరామూ ఇష్టంలేదు. అయితే, ఆ మాటా ఈ మాటా చెప్పకుంటూ వాకట్లో కూచున్నవారు కూచున్నట్టుగానే బయలుదేరడంవల్ల వద్దనడాని కామెకి వీలుకాలేదు. కళ్ళతో సన్నచేసి అయినా ఆపుచేద్దా మని యెంతయినా చూసింది గాని; వొట్టు పెట్టుకున్నట్టు చలపతి, ఆమె కేసే చూడలే దాసమయాన.

మళ్ళీ అయిదుగంటలవేళ వచ్చారు వారింటికి. వెండి – కంచు – ఇత్తడి సామానూ, పందిరి మంచమూ, పీచుపరుపూ, దూదిపరుపూ, మార్బిలుమేజా – ఇలాంటి సామాను కొంత పట్టించుకునే వచ్చారు వా రూరికే కాదు.

జగ్గయ్య పొంగిపోయాడు; కాని అదంతా చూసీచూడగానే మూతి ముడుచుకుని వంటింటోకి చక్కాపోయింది బుచ్చమ్మ.

తండ్రి సన్నచెయ్యగా, తల్లి ముందుకి నడిపించగా "మా అమ్మా మా నాన్నారూ మమ్మల్నిద్దరినీ బజారుకి తీసుకువెళ్ళి నాకు సారెవస్తువులు కొని పెట్టారు మామయ్యగారూ?" అంటూ మురిసిపోతూ వెళ్ళి చెప్పింది జోగమ్మ, ముందు జగ్గయ్యకి పాదాభివందనం చేసి. ఆ వస్తుసామగ్రి కంటే కోడలి వినయం చాలా ఆనందం కలిగించిం దతనికి. దాంతో పరవశుడయి పోయి, అతను "జమీందార్లు, మీ వాళ్ళిచ్చారన్నా, పెట్టిపుట్టావు, నువ్వు తెచ్చుకున్నావన్నా వింత యేమి టమ్మా?" అని కోడల్నీ, "మా ఇల్లు పడుతుందా బావగారూ?" అంటూ వియ్యంకుణ్ణీ ప్రశంసించి, కూలీలను వాకిట్లోకి రప్పించి "ఇక్కడ—ఇక్కడ" అని సామానంతా దింపించాడు జగ్గయ్య.

జాబితాప్రకారం సామానంతా సరిచూసుకుని, నూతికివెళ్ళి, కాళ్ళు చేతులూ కడుక్కుని మంచినీళ్ళు స్వయంగా పుచ్చుకున్నారు రెండుజోడాల వారున్నూ.

పాత మంచం విప్పి వాకిట్లోకి చేర్చేదాకా కూడాకూడావుండి జగ్గయ్య, తరవాత బుచ్చమ్మని బలవంతాన తీసుకువచ్చి ఆమె సాయంతో అది పెడమటింటో అమర్చుతూ వుండగా — జోగమ్మ సెలవులందుకుంటూ, పూర్ణమ్మ సాయం పుచ్చుకుంటూ వేంకటాచలమూ చలపతీ పావుగంటలో కొత్తమంచం అమర్చేశారు.

తక్కిన సామాను కూడా గదిలోకి చేరేదాకా సాయపడి, తరవాత "ఇక నావల్ల కాదమ్మోయ్! కాకపోయినా, నేను వియ్యపురాలినైతిని. మీ యింట్లో నేను చాకిరీ చెయ్యడం యేమిటీ? ఎవరయినా చూస్తే నవ్విపోరూ, సిగ్గుసిగ్గు" అంటూ చలపతికేసి వోరచూపులు చూసి, జోగమ్మకి కన్ను గీటి వాకిట్లోకి వచ్చి చతికిలబడి — సామానెక్కడ వుండవలసిందక్కడ సద్దడంలో వొకరికొకరు సలహాలు చెప్పుకుంటూ, వొకరికొకరు సాయం చేసుకుంటూ, మధ్య మధ్య "నీకు తెలియ"దంటే "మీరెరగరండీ" అని వాదించుకుంటూ "నాకు తోచింది చెప్పాను, ఆపైని నీయిష్టం" అంటే, "నేననుకొన్నది చెప్పాను. ఇక మీ యిష్టం సుమండీ" అని మళ్ళీ అంతలో సమాధానపడుతూ జోగమ్మా చలపతీ బుజమూ బుజమూ రాసుకుంటూ తిరగడంచూసి వేంకటాచలంకేసి సాకూతంగా చూసింది పూర్ణమ్మ.

అది చూసి, ముందు ముసిముసినవ్వులు నవ్వుకుని, తరవాత, తువ్వాలు పరుచుకుని కవాచీ బల్లమీద నడుంవాల్చాడు వేంకటాచలం.

## 15

"తెచ్చిన వెంటనే వస్తువులు వాడుకుంటే ముహూర్తం అక్కర్లేదుట" అంది జోగమ్మ.

"అవునుట, చాలామాట్లు చెప్పాడు మా నాన్న" అన్నాడు చలపతి.

"ఇంకేం, మరి, కుర్చీమీద కూచోండి ముందు" అంటూ చెయ్యి పట్టుకుని అతణ్ణి అలా తీసుకువెళ్ళింది జోగమ్మ.

"అది నీకోసం కొన్నారు మీ నాన్నారు. ముందు నువ్వు కూచోవాల కాని నేనాయేమిటి?" అని నసుకుతూనే దర్జాగా కూచున్నా డతను.

"నేను వొట్టి కుర్చీలో కూచుంటానా యేమిటి మీలాగ?" అనడిగింది జోగమ్మ, మీదికివాలి.

"మరెలా కూచుంటావూ?" అనడిగాడు చలపతి.

"ఇదిగో, యిలాగ" అంటూ వెంటనే అతని వొడిలో కూచుందామె, బెల్లించి చూస్తూ.

రెండు చేతులూ అతనిమెడకి చుట్టవేసి, బుగ్గాబుగ్గా అనించి కువకువలాడి "తెలిసిందా? బాగుందా?" అనిన్నీ అడిగిందామె.

దాంతో, తెరపిమరపుల్లో పడిపోయాడు కాస్సేపతను.

తరవాత, అతని మొగాన మొగంవుంచి "రేపు పొద్దున్న మీరు కోరుకున్న కుర్చీ కొంటారుట మా నాన్నారు" అంది జోగమ్మ.

"నీతో చెప్పారా?"

"మా అమ్మ మా నాన్నారూ అనుకున్నారు."

"ఊంహూ"

"ఆ కుర్చీకి తగిన టేబిలు కూడా కొనమంది మా అమ్మ."

అతని మొగం విప్పారింది.

"కొంటా నన్నారు మా నాన్నారు."

"భేష్!"

"ఫౌంటెన్ కలం కూడా కొని ఇమ్మన్నా న్నేను."

"వో" అంటూ యెగిసిపడ్డా డతను, జోగమ్మని పక్కకి తీసి.

"ఇక అస్తమానమూ రాసుకుంటూనే కూచుంటా న్నేను" అని ఆమెని గట్టిగా పొదువుకున్నాడు కూడా.

ఇంతలో "అడగడం ధర్మం కాదుగానీ – అయినా, వూరికే – విందామనీ సంతోషిద్దామనీ సుమండి. మంచం యెంతకి పుచ్చుకున్నారు బావగారూ?" అని జగ్గయ్య అడగడమూ "దాల్లో తప్పేవుంది బావగారూ? వస్తువు కంటికింపుగా వున్నప్పుడు 'వెల యెంత?' అన్న ప్రశ్న సహజంగా తోస్తుం దెవరికయినా. కనక, మీరడగడం ధర్మమే కాదు, మాకు మన్ననాను. అది మా అదృష్టం అనండి, ఈశ్వర కటాక్షం అనండి, మే మనుకున్న చేవకర్ర మంచమే దొరికింది పురమాయించినట్టు. నూటయెనభై ఆరు రూపాయలు పుచ్చుకున్నాడనుకోండి షాపతను; కాని మంచి పనివాడితనంకూడా వుంది. ఇక పరుపులు రెండున్నూ నలభై ఆరు పై చిల్లర అయాయి ఆ రెండూ, దిండ్లు రెండున్నూ" అని వేంకటాచలం బదులు చెప్పడమూ చల్లగా వినపడ్డాయి.

వెంటనే కౌగిలి విడిపించుకుని, వొక్కదూకున మంచం మీదికి వెళ్ళి వాలి "ఎంత మెత్తగా వుందో పరుపు?" అంటూ కిలకిల్లాడింది జోగమ్మ.

"అవును సుమా!" అంటూ వెళ్ళి చలపతి పరుపు తాకాడు.

వెంటనే మెడపట్టుకుని అతని మొగం తన మొగం మీదికి తీసుకుంది జోగమ్మ.

నాలుగు పెదవులూ ప్రీతి నెరుపుకున్నాయి.

ఆ మహాపుణ్యకాలాన రంయి మని వచ్చి, గోదావరి గాలి, గులాబీ పువ్వుల పరిమళం తీసుకువచ్చి వారిని పరవశులను చేసింది.

కాని, మబ్బులేని పిడుగులాగ, దానివెనకనే "తమ్ముడూ, వొకమాటిలా రావాలి" అంటూ కఠోరాహ్వానం కూడా వచ్చింది పడమటింటోనుంచి.

జోగమ్మ కడుపులో రాయి పడ్డట్టయింది. అయినా, వెంటనే తేరుకొని "వెళ్ళకండీ, వెళ్ళకండీ" అంటూ చేతులు గట్టిగానే బిగించిం దామె గాని; ఆ పట్టు బలవంతాన విడిపించుకుని చలపతి యెగిరి చక్కాపోయాడు దూదిపింజెలాగ.

దెబ్బతిన్న ఆడతాచు లాగ నిప్పులు కక్కుతూ లేచివచ్చి, జోగమ్మ తనకేసి సామర్షకరుణం చూడగా "చూశారా" అన్నట్టు పూర్ణమ్మ వేంకటాచలం కేసి చూసింది.

ఇదంతా కనిపెడుతూనే వున్నాడు జగ్గయ్య. వియ్యంకుడు తనకేసి చూస్తూ వుండడమూ, ఆ చూపుల్లో తీవ్రమైన అసంతృప్తి వుండడమున్నూ గమనిస్తూనే వున్నాడతను. అతనిచేత యేదో అనిపించుకోడం యిష్టంలే దతనికి. తనకీ చాలా కోపం వచ్చింది మరి. "ఇప్పుడేం పనే? వాడెందుకు, నాతో చెప్పరాదుటే?" అంటూ వొక్క వురుమురిమా డతను, వంటింటి కేసి చూస్తూ; కాని అప్పటి కప్పుడే ముందు బుచ్చమ్మా, గుడికి మేకపోతులాగ ఆమె వెనక చలపతీ వంటింటి పెరట్లోకి నూతి సమీపానికి వెళ్ళిపోయారు.

"ఇప్పుడే చూశాను ఉప్పయిపోయింది, పట్టుకు రావాలి" అంది, వెనక్కి తిరుగుతూనే బుచ్చమ్మ.

మాట్లాడలేక పోయాడు చలపతి, చెయ్యిమాత్రం చాపాడు.

ఆ చేతిలో పడెయ్యడాని కొక అణాకాసు ఎత్తిపట్టుకుని "వాళ్ళు రమ్మంటే, వెనకా ముందూ చూసుకోకుండా కూడా చక్కాపోతావా?" అని ముందు గదిమే "అయితే, యేమేం కొన్నారేమిటి?" అని తరవాతే అడిగింది లాలనగా.

## 16

"వాళ్ళు బయలుదేరేదాకా యెందు కూరుకోవాలీ?" అనుకుని మర్నాడు పొద్దున్న ముందే మేలుకుంది బుచ్చమ్మ. దీనికి సాయం, ఆవేళ లేచినంత తొందరగా యెప్పుడూ లేవలేదు చలపతి.

దంత ధావనాదికం పూర్తిచేసుకుని అతను షర్టు తొడుక్కుంటూ వుండగా జోగమ్మకి మెళుకువ వచ్చింది. కూనిరాగం తీసుకుంటూ కోడిగుడ్డు లాంపు వెలుగులోనే అద్దం యెదుట నుంచుని అతను బొత్తాములు పెట్టుకుంటున్నాడు. "ఎక్కడికో పంపుతోంది భామ" అనుకుందామె, అది చూసి. అటు కోపమూ, ఇటు ఆత్రమూ ముప్పిరి కాగా వురికివెళ్ళి, రెండు రెక్కలూ పట్టుకుని అతణ్ణి తనవైపు తిప్పుకుని "ఏమిటీ సడసం?" అన్నట్టు చురుగ్గా చూసిందామె, వెంటనే.

ఉలకలేదు పలకలేదు 'మీరంతా వో-ట్టి నిద్రమొగా' లన్నట్టు మొదట చిరునవ్వు నవ్వుతూ చూశాడతను. తరవాత, ఆమె ధోరణి గుర్తించి "చూసుకో, నేను లేచి

అప్పుడే గంటయింది. ఇక మీరు బయలుదేరడమూ, వర్తకులు కొట్లు తెరవడమూ మాత్రమే తరువాయి" అంటూ కనుబొమలూ తలా యెగర వేసుకున్నా డతను.

"వోస్, ఇంతే కదా?" అంటూ స్థిమితపడి జోగమ్మ పెరట్లోకి వెళ్ళిపోయింది. ఆమెని చూసి పూర్ణమ్మా, పూర్ణమ్మని చూసి వేంకటాచలమూ, వాకిట్లో వీరి సందడి విని గాదె సావిట్లో జగ్గయ్యా లేచారు.

వీరినందరిని చూసే పొడుపు కొండమీదికి వచ్చాడు సూర్యుడు.

దొంగలు పడ్డ ఆరుమాసాలకు కుక్కలు మొరిగాయన్నట్టు, ఆ తరవాత, సావకాశంగా అరుకొట్టింది పక్కింటి గడియారం.

చలపతి మనస్సు ఆగిపోయింది.

"వీళ్ళింకా ఎప్పటికి తేలనూ?" అని చిరాకుపడుతూ మొదట రెండుమూడు నిమిషాలసేపు వాకిట్లో తచ్చాడా డతను.

అంతలో జ్ఞాపకం వచ్చి పెళ్ళామో మామగారో "సంయే" అనీ అనడంతోనే పిలిచేద్దా మని వచ్చేపోయే జట్కాలలో కాళీగా వున్నవి చూడ్డానికి వీధిలోకి వెళ్ళి అరుగు చివర కూచున్నాడు.

అత నలా కూచున్నాడు, అంతే. ఇలా వచ్చి బుచ్చమ్మ గుమ్మాన నుంచుంది, అప్పుడే.

దూరాన వొక కాళీజట్కా కనబడింది. సమీపించింది. వచ్చింది. వెళ్ళినీ్నీ పోయింది. అతనది గమనించలేదు, అందుకోసమే కూచుని వుండినీ్నీ. అతని చూపు బుచ్చమ్మ మొగంమీద వుంది. అతని శ్రద్ధఅంతా ఆమె చూపులమీదే వుంది.

చూసిచూసి "ఇలా రా" అన్నట్టామె కళ్ళు చికిలించుకుని బయలుదేరింది. మంత్రముగ్ధ డన్నట్టత నామె వెనకాలే నూతిపెరట్లో దొడ్డిగుమ్మం దాకా వెళ్ళాడు.

ఇలాగా అలాగా వొకమూటు పరకాయించి, బుచ్చమ్మ రెండణాకాసులెత్తి పట్టుకుంది.

వెంటనే అతని కుడిచెయ్యి ముందుకు సాగింది.

"ఈ రెండణాలూ పుచ్చుకో. కాఫీహోటలుకి వెళ్ళి పెసరట్టూ వుప్మాతిని, కాఫీ తాగు. చల్లగా ధవళేశ్వరం వెళ్ళి చక్కారా. జట్కాకి రానూపోనూ రెండణా లెందుకూ ఖర్చుపెట్టడం, తిన్నది జీర్ణం కూడా అవుతుంది. దర్జాగా నడిచివెళ్ళి నడిచే వచ్చెయ్యి"అంటూ ఆ రెండణాలూ అతని చేతిలో విడిచి పెట్టిందామె.

"బజారుకి వెళ్ళవద్దూ?" అనడిగా డతను, దిక్కుమొగం వేసుకుని; గుప్పిడి మాత్రం గట్టిగానే బిగించాడు.

"నువ్వెందుకూ?" అని గదిమిం దామె.

మాట్టాడ లేకపోయాడతను.

"నీ పెళ్ళాం వెడుతోంది చాలదూ దొరసాని లాగ?"

"........"

"దానికి దాని తల్లీతండ్రీ సాయం వున్నారు, నేను లేకుండా నువ్వెలా చెయ్యగలవూ వెళ్ళి?"

"......."

"నిన్ను లోకువ చేసేస్తారు రా"

............

"సొరె అన్నప్పుడు, వాళ్ళు, మన తాహతుకి తగ్గట్టు పట్టుకు రావాలి. సరిగా తెస్తారా, మనం పుచ్చుకుని వూరుకుంటాం. తక్కువ తెస్తే మాత్రం వూరుకోం, అల్లరిచేస్తాం. వాళ్ళు సామాను కొనేటప్పుడు నువ్వు దగ్గిరే వుంటే, పేచీపెట్టడానికి తరవాత నీకు హక్కేం వుంటుందీ?"

"........."

"కాకపోయినా, నీ పెళ్ళాని క్కొంటున్నారు వాళ్ళు, వెనకాలే నువ్వెందుకురా?"

"డబ్బెక్కువ అయినా, అదీ నేనూ కొనమన్నవే కొంటున్నారే."

"....కూతురి మాట వింటున్నారు కామోసు, నీ మాట వింటారా యేమిట్రా వెర్రిమొగమా?"

"వింటూ వుంటేనే"

"అయితే వెళ్ళు."

ఇలా అంటూ చేతులు దులుపుకుని వొక్క అడుగు వెనక్కి వేసిందామె. "నీ కర్మం ..... నాకేం?" అంటూ మూతి బిడాయించుకుని, మొగం కూడా తిప్పేసుకుంది, గుర్రాలక్కలాగ.

అతని కడుపులో రాయిపడింది.

వెడితే యేమిటో, వెళ్ళకపోతే యేమిటో?

పదిరోజుల కిందట అయితే అతనికి తటపటాయింపు లేకపోయి వుండును. ఇప్పుడు ద్వంద్వ ప్రభుత్వం వచ్చిపడింది.

బజారుకి వెళ్ళాలని యెంతయినా వుందతనికి. వెడితే తనూ పెళ్ళామూ యిరుకిరుగ్గా బండిలో కూచుని షికార్లు కొట్టవచ్చు. ఇవాళ, మామగారు తాను కోరుకున్న కుర్చీ, దానికి తగ్గ టేబిలూ, వాటికి అనుగుణమైన ఫౌంటెన్ కలమూ కొంటారు. రాసుకునేటప్పుడు కాగితా లెగిరిపోకుండా వొత్తు పెట్టుకోడానికి రెండుమూడు పెద్దగవ్వలు కూడా కొనమని కోరమందా మనుకుంటున్నాడు. "దాంతో చెబితే అదే కొనిపించేస్తుంది, నోరువిప్పి మనం అడగనే అక్కర్లే"దని కాడా చాలా ధీమాగా వున్నాడు తాను.

మరి, బజారుకి వెళ్ళకపోతే యెలాగా?

అంతా ముజ్జిడ్డుగా కనపడిందతనికి.

"ధవళేశ్వరం వెళ్ళకపోతేనేం?" అనుకున్నాడొకమాటు; కాని ధైర్యం నిలిచేటట్టు కనపడలే దతనికి.

ఒకరికే సొకరు చూసుకున్నారు.

ఒక్కక్షణమే చూసుకున్నారు.

ఉత్తరక్షణంలో అతని దుర్బల హృదయం మీద వొక్క మెరుపు మెరిసింది.

"సరే" అన్నాడు, దొడ్డితెరుచుకుని సందులో పడ్డాడు.

కాని నాలుగడుగులు వేశాడో లేదో చిటికెలు వేసి వెనక్కి రప్పించి "పదిగంటలు దాటాకా.... తెలిసిందా? ఈలోపుగా నువ్వు రావద్దు. వచ్చినా అల్కట్టుతోటకి

అవతలే వుండు, తెలిసిందా? మరి వెళ్ళు" అంటూ తల యెగరవేసుకుంటూ సెలవిచ్చింది, బుచ్చమ్మ.

"సరే" అన్నట్టు తలమాత్రం వూపి కప్పగంతులతో సందు దాటేశాడతను.

## 17

ఖరాగా యెనిమిదిన్నర అయింది.

"ఈపాటికి అంగళ్ళన్నీ తెరిచేసి వుంటా రిక తొరగా తెమలండమ్మాయీ" అంటూ జోగమ్మనీ పూర్ణమ్మనీ తొందరపెట్టి "చలపతీ" అని పిలిచాడు వేంకటాచలం.

జవాబు లేదు.

"ఎక్కడికి వెళ్ళారో సమయానికి" అని చిరాకుపడుతూ కాలుకాలిన పిల్లిలాగ యిల్లంతా వెతికి వచ్చింది జోగమ్మ.

ఉండలేక "మీ తమ్ము డేడమ్మా?" అని ప్రాధేయ పూర్వకంగానే అడిగింది పూర్ణమ్మ; కాని బుచ్చమ్మ "నేనే మెరుగుదునూ?" అని సాగతీసుకుంటూ నూతిపెరట్లోకి వెళ్ళిపోయింది.

వేంకటాచలం పూర్ణమ్మకేసి చూశాడు. జోగమ్మకేసి చూస్తూ "ఎక్కడికో పంపేసింది" అంది పూర్ణమ్మ.

"సందేహం లేదు, ఆ పీనుగు పనే యిది" అంటూ పళ్ళు కొరుక్కుంది జోగమ్మ.

ఉసూరు మంటూ చివరికి ముగ్గురే బయలుదేరారు వారు.

పడమటి వసారాలో నక్కి ఇదంతా కిటికీల్లోనుంచి కనిపెడుతూనే వుంది బుచ్చమ్మ. బయలుదేర లేక బయలుదేర లేక బయలుదేరుతూ జోగమ్మ తండ్రికేసి చూసిన చూపు తలుచుకుని "కొంగున ముడివేసుకుని తిరుగుదామనుకుంటున్నావు కాదూ మా తమ్ముణ్ణి? తొందరపడకు, తిరుగుదువు గాని" అనుకుంటూ గర్వపడింది పడమటింటో నుంచుని. వారు గుమ్మం దిగి నాలుగిళ్ళు దాటివుంటా రన్నప్పుడు ధీమాగా వాకిట్లోకి వచ్చి, మండువా అంచున నుంచుని, వీధి గుమ్మంకేసి చూస్తూ "ఇహగింజుకు చావండి. మహా బాగా చేశాను కాదూ?" అంటూ వురిమినట్టు రాకాసినవ్వు నవ్వింది విరగబడి.

బండి మెయిన్‌రోడ్డెక్కుంతుందనగా "చలపతి యేడండీ బావగారూ?" అనడిగాడు, కూరలసంచితో యెదురు వచ్చి, జగ్గయ్య.

మామగారిని చూసి యేడుపు మొగం పెట్టుకుంది జోగమ్మ, వుడుకు మోత్తనం వచ్చి.

అందుకే జగ్గయ్య కుతకుతలాడి పోసాగాడు.

"ఇప్పటిదాకా యింటోనే వున్నాడు కాని; తీరా బయలుదేరతా మనగా యెక్కడికో వెళ్ళాడు పాపం. ఏం పనులున్నాయో చెడిపోయేవి, చక్కబెట్టుకోకపోతే యెలాగా?" అన్నాడు వేంకటాచలం గంభీరంగా చూస్తూ.

జోగమ్మ అర్థం చేసుకుంది.

తేరి చూడసాగింది పూర్ణమ్మ.

జగ్గయ్య ఈ మాటలు విన్నాడు, అంతే.

పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ యింటిదారి పట్టాడు, బుర్రవంచుకుని.

బండి కూరలబజారులో వెడుతోంది.

వెనకాల నడుస్తూ వేంకటాచలం జోగమ్మ కేమిటో నచ్చ చెబుతున్నాడు.

మధ్య మధ్య యేమిటేమిటో అంటోంది పూర్ణమ్మ కూడా.

ఎక్కణ్ణుంచి వచ్చాడో, ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ చలపతి చక్కా వచ్చా డీసమయాన. "ఎక్కణ్ణుంచోయ్?" అని వేంకటాచలం కొంచెం చురుగ్గా అడిగేదాకా జోగమ్మా పూర్ణమ్మా కూడా చూడలే దతణ్ణి.

మధ్యమధ్య మొగం వంచుకుంటూ అటూ యిటూ చూడసాగాడు చలపతి, అంతే.

"ఎక్కడికి వెళ్ళా రండీ?" అనడిగింది జోగమ్మ, చురు చుర చూస్తూ.

అప్పుడయినా వచ్చినందుకు సంబరపడలేకపోయిందామె.

ఉండుండి యెక్కడికో వెళ్ళిపోయినందు కింకా వుక్రోషం తగ్గలేదామెకి.

"ఎక్కడికయినా నువ్వే వెళ్ళావా, నిన్నెవరయినా పంపారా నాయినా?" అనడిగింది పూర్ణమ్మ, లాలనగా.

"మాట్టాడ రేమండీ?" అని మళ్ళీ అడిగింది జోగమ్మ కొంచెం కరుగ్గానే.

ఎవరికీ బదులుచెప్పలేదు చలపతి, ముసిముసినవ్వులకు మాత్రం వొక అంశ ఎక్కువచేసి వూరుకున్నాడు.

"ఎక్కడికి వెళ్ళాడో వెళ్లాడు, యెవరు పంపారో పంపారు – వూరుకోండిక. వెళ్ళినపని చక్కగా చక్కబెట్టుకునే వచ్చివుంటా డందుకు సంతోషించండి" అంటూ జోగమ్మనీ పూర్ణమ్మనీ ముందు సముదాయించి, "చెప్పివెడితే నన్ను కూడా తీసుకువెళ్ళవలసివస్తుందని రహస్యంగా వెళ్ళివచ్చావు కాఫీ హోటలుకి, అవునా?" అని తరవాతే చలపతిని ముదలకించాడు వేంకటాచలం, కొంటెచూపులు చూస్తూ.

దానికీ బదులు చెప్పలేదు చలపతి.

మొగం వంచేసుకున్నాడు కూడా, సిగ్గుపడి.

దీనిమీద, కాఫీ నోరూరించగా జ్ఞాపకం వచ్చి "నిన్న మరిచిపోయాను. ఇవాళ నాకు కాఫీ ఫిల్టరు కొనియివ్వకపోతే వొప్పుకోను నాన్నారోయ్!" అంటూ గునిసింది జోగమ్మ.

"అవునోయ్! నేను మరిచిపోయాను చూశావా? ఇవాళ తప్పకుండా కొంటాను సరా? దానికి సాయం, చిన్న యిడ్డెన్ల పాత్ర వుంటుంది ముద్దొస్తూ, అదీ రెండుమూత జతల పింగాణీ కప్పులూ సాసర్లూ, వాటికి చెంచాలూ కూడా కొంటాను" అంది పూర్ణమ్మ.

"అయితే, వెండికప్పులూ సాసర్లూ కొనిపించా వెందుకమ్మా? కాఫీ పోసీ పొయ్యడంతోటే వేడెక్కిపోతా యవి. కాఫీవేడికి నాలుక చుర్రుమనా, కప్పువేడికి పెదవులు చురుక్కుమనా – యేమి సుఖమూ? కనక, మధ్యాహ్నం తీసుకు వెళ్ళి

కాస్త నష్టాని కయినా సావుకారికే యిచ్చేస్తేను, బతిమాలి మళ్ళీ. తరవాత మరో రెండు జతలు పింగాణీవే కొనిపెడుతుంది దర్జాగా మీ అమ్మ నీకు" అన్నాడు వేంకటాచలం, చిరునవ్వు అదిమిపెట్టుకుంటూ.

"వల్లకాదండీ" అంది జోగమ్మ, ముందు, తండ్రితో.

"చూ—శావుటే అమ్మా?" అంటూ తల్లికేసి తిరిగి గారాంకుడిచింది తరువాత.

ఈ సంభాషణ తన హృదయవీణకు శ్రుతి కలపగా "బాబయ్యగారు వూరికే అంటా రండమ్మాయిగారూ! కూతుళ్ళ కిచ్చిన వస్తువులు తల్లితండ్రులు మళ్ళీపుచ్చుకోడం యెక్కడయినా వుందాండి, భూమ్మీద?" అన్నాడు, కొత్త పెళ్ళికొడుకు, బండిమనిషి.

"మరే" అంది జోగమ్మ. "విన్నావా? మాట్లాడవేం? వద్దని నాన్నారితో చెప్పవేం?" అంటూ తల్లి రెక్కమీద పొడిచిందామె.

"మీ మాటలు విని అల్లుడు నవ్వుకుంటున్నాడు తెలుసా?" అనడిగాడు, దానిమీద వేంకటాచలం.

"తప్పేం?" అనడిగింది పూర్ణమ్మ. "నాయనా, నీ నవ్వే మాకు పదికోట్లు" అని అల్లుణ్ణి బుజ్జగించి "రా, కూచో నాయనా" అని అతణ్ణి పిలుస్తూ కొంచెం ముందుకి జరిగింది కూడా ఆమె.

జోగమ్మ కూడా కాస్త జరిగింది కళ్ళతో పిలుస్తూ.

"అయితే, మామగారు నడుస్తూ వుండగా తాను బండెక్కడమా, మానడమా?" అని అతని బుద్ధి చర్చలోపడగా, అతని శరీరం మాత్రం యెగిరి అలా బండిలో పడింది.

## 18

అనుకున్నదీ, కనపడగా బుద్ధిపుట్టినదీ, జ్ఞాపకంరాగా "అవునవు" ననుకున్నదీ సామానంతా కొనేటప్పటికీ పదకొండు కావచ్చింది.

అనుకోని వాటిలో కాఫీసామగ్రి వుంచుకోడానికి జోగమ్మ ముచ్చటపడ్డది చిన్న బీరువా వొకటి.

జోగమ్మా, చలపతీ, పూర్ణమ్మా వొకబండిలో కూచోగా చిల్లర సామానంతా తన దగ్గిర పెట్టుకుని వేంకటాచలం మరో బండిలో కూచున్నాడు.

చేవచెక్కల బట్టలబీరువా, చక్కని టేబిలూ, దానికి తగ్గ కుర్చీ, కూలీలు పట్టుకువస్తున్నారు, బళ్ళవెనకనే.

పింగాణీసామానుబుట్ట తన వొడిలో పెట్టుక్కూచుంది జోగమ్మ. మధ్య మధ్య అవి చూసి మురిసిపోతోందామె, వొక్కొక్కటే పైకి తీసి తిరగా మరగా చూస్తూ. కాఫీ కూడా కమ్మని సువాసనతో జ్ఞాపకంవస్తోందామెకి.

ఉండుండి జ్ఞాపకం రాగా స్ఫురిత అయి "నువ్విచ్చిన కాఫీ గింజలు వీసెడూ—మా యిద్దరికి రెండుమాసాలు సరిపోతాయే అమ్మా" అంటూ ప్రారంభించింది జోగమ్మ.

"అదేమిటే, నీ మామగారి కివ్వవుటే పాపం?" అనడిగింది పూర్ణమ్మ, చలపతి కేసి చూస్తూ.

"ఏమండీ, మీ నాన్నారు కాఫీ పుచ్చుకోడం వుందా యెప్పుడైనా?" అంది జోగమ్మ. చలపతినే చూస్తూ.

"ఎప్పుడయినా వుంది. అలవాటు లేదు. నిషేధం అంతకంటే లేదు" అని బదులు చెప్పాడు చలపతి.

"అయితే, మాకు నెల్లాళ్ళు వస్తాయే, మరి"

"మరి, తరవాత?" అన్న ప్రశ్నతోచింది చలపతికి. నాలుక చివరికే వచ్చింది కూడా మాట; కాని, పెదవులడ్డేశాయి.

పూర్ణమ్మ మాత్రం అందుకుంది "నన్నడగడం యెందుకే?" అని ముదలకిస్తూ. "మీ సంగతి నాకేం తెలుస్తుంది, నాకెందుకసలు? రెండునెలల్లో కాదు, వొక్క నెలలో కాదు, చివరికి వొక్క వారందినాల్లో కానిచ్చేసుకోండి, మాకేం? కాదంటే, మేమిక్కడ వున్నన్నాళ్ళూ మాకోసం ఖర్చయేవి కొని ముదరా యిచ్చేస్తారు మీ నాన్నారు నీకు. వొట్టి కాఫీ ఫిల్టరూ అవీ యివ్వకూడదని వీసెడు కాఫీగింజలూ రెండు వీసెల చక్కెరా యిచ్చాం, వాటికోసం మూడు రూపాయలు పైగా అయింది, మాటలా?" అని కూడా అడిగింది, కళ్ళు తిప్పుకుంటూనూ, తల యెగరవేసుకుంటూనూ.

"పోనీ, ఆ వీసెడు కాఫీగింజలకు ఆ రెండువీశల చక్కెరా సరిపోతుందేమో నువ్వే చెప్పు మరి, లెక్కలువేసి"

"చక్కెర అయిపోతే మీ వంటింటో పొయ్యిమీద రెండు బెల్లబ్బుట్టలుండనే వున్నాయి లోటేం?"

అత్తగారిలా అనగా చలపతి వులిక్కిపడ్డాడు. జోగమ్మ కూడా మాట్టాడలేకపోయింది మొదట కాని; "యాక్కురారీ, బెల్లంకాఫీటే నేను పుచ్చుకోడం?" అనడిగింది మొదట.

"పోనీ, అవి కూడా అయిపోయాకా?" అనడిగింది చివరికి.

"ఏమో, మీరేం చేసుకుంటారో చేసుకోండి. నాకు తెలియదు, నన్నడక్కు" అంటూ బుంగమూతి పెట్టుకుని మొగం పక్కకి తిప్పుకుంది పూర్ణమ్మ.

"కానిపెట్టకపోతే మానె, ఉపాయం చెప్పడాని కేమే అమ్మా?" అని మళ్ళీ అడిగింది జోగమ్మ.

దానికి బదులు చెప్పలేదు పూర్ణమ్మ. ఇటున్నూ చూడలేదు.

"పోనీ, వొక పనిచేస్తానే" అంటూ జోగమ్మే అందుకుంది, చూసిచూసి.

"తెల్లగానే వుంటుంది కనక, తొమ్మిది కాసులు పెడితే రెండు శేర్లు కూడా వస్తుంది కనక, మెత్తగా కొట్టుకుని యింత వుప్పు వేసుకుంటామే, ఏమే అమ్మా?" అనిన్నీ అడిగిం దామె. కొంటెచూపులు చూస్తూ.

పకాలు మని విరగబడి నవ్వుకున్నారు, ముగ్గురూ.

బళ్ళప్పటికి వైగ్రాంరోడ్డు మొగకి వచ్చాయి.

"తప్పుకో, తప్పుకో" అంటూ వొక కావటివాణ్ణి అదలిస్తున్నాడు బండి మనిషి.

"ఆ నవ్వెందుకు చప్మా?" అనుకుంటున్నాడు వేంకటాచలం తొంగిచూస్తూ.

ఈ సమయాన – "అదేమండీ? దిగుతా రేమండీ?" అని జోగమ్మ అడుగుతూనే వుండగా, బదులు చెప్పకుండా గభీమని కింది కురికి, నాళంవారి సత్రం కేసి లఘువులు వేశాడు, చలపతి.

## |19|

వివరాలు చెబుతూ, పూర్ణమ్మ, సామానంతా చూపించగా పరమానంద భరితుడయిపోయాడు జగ్గయ్య.

తరవాత జోగమ్మ అందుకుంది.

ఒక్కొక్కటే కాఫీపరికరాలు తెచ్చి యెదట వుంచి, వాటికోసం కొన్న చిన్న బీరువా కూడా చేతికందేటట్టాక పక్కగా నిలబెట్టి, ఫిల్టరు విభాగానికాభాగం విడమర్చి బోధిస్తూ చూపించి, చివరికి "మనయింట్లో పదకొండుదాకా భోజనాలు కావు కనక పొద్దున్నా, తరవాత రాత్రి చీకటిపడేదాకా వుండడం కష్టం కనక మధ్యాహ్నం మూడుగంటలవేళా కాఫీచేస్తూ వుంటాన్నేను. రెండు పూట్లా మీరు కూడా పుచ్చుకోవాలి మామయ్యగారూ! మీరు కనక పుచ్చుకోక పోతే నేనూ మీ అబ్బాయీ కూడా మానేస్తాం సుమండీ?" అని చాలా చనువుగా చెప్పింది, తండ్రితో చెప్పినట్టు.

మరీ పొంగిపోయాడు జగ్గయ్య, దీనికి.

"అలాగే పుచ్చుకుంటాను తల్లీ" అన్నాడు ముందతను చాలా ప్రేమగా. "మీరేమీ మానుకోవద్దు" అన్నాడు, తరవాత. "నీచేత్తో పచ్చిమంచినీళ్ళే యిచ్చినా అవే కాఫీ అని సంతోషిస్తాను గదా నేను, మరి, కాఫీయే ఇస్తే ఎంత సంతోషిస్తానో వేరే చెప్పాలా? కాఫీ పుచ్చుకోక మనకేమమ్మా? కొత్తది సంపాదించకపోయినా వున్నది వుంచి నా కప్పచెప్పారు మా నాయనగారు. నేనూ సంపాదించలేదు కొత్తది. అయితే, పాతదీ పాడుచెయ్యలేదు. మా నాయన నాకిచ్చింది నేను చలపతి కిస్తున్నాను. ఇది వృద్ధిచేసుకుంటూ ఇప్పుడు చక్కగా అనుభవించవలసినవాళ్ళు మీరు. ఇక నేనా? మీ అభ్యుదయం చూసుకోవలసిన వాణ్ణి. మీ సుఖమూ మీ ఆనందమూ చూసుకోవలసివాణ్ణి. మీ చేతిలో వెళ్ళిపోవలసినవాణ్ణి. ఇది గుర్తించి నువ్వు నన్నితంగా సుఖపెడతానంటే అంతకంటే కావలసిందేమిటమ్మా నాకు – నా అదృష్టంకొద్దీ దొరికావు నువ్వు నాకు. మీ నాన్నా రొకటీ నేనొకటీ కాదమ్మా నీకు" అంటూ ఆ సామా నొక్కొక్కటే పుచ్చుకుని చూసి మెల్లిగా వుంచి "జాగ్రత్త చేసుకోమ్మా" అంటూ తన ప్రీతి అంతా వెల్లడించాడు చివరికి.

ఇవి విని జోగమ్మ అదృష్టానికీ, జగ్గయ్య నిండు హృదయానికీ పూర్ణమ్మా వేంకటాచలమూ చాలా ఆనందించారు.

ఈ సమయాన మెల్లిగా యింటికి వచ్చాడు చలపతి, నాళం వారి సత్రం తిరగవేసుకుని.

"ఏం నాయనా, బజారుకి వెళ్ళలేదూ?" అనడిగాడు జగ్గయ్య.

"ధవళేశ్వరం వెళ్ళాను నాన్నా!"

జోగమ్మా, పూర్ణమ్మా, వేంకటాచలమూ మొగమొగాలు చూసుకున్నారులిక్కిపడి.

"పనేమిటి నాయనా?" అనడిగాడు జగ్గయ్య.

చలపతి బదులు చెప్పలేదు.

"నీకు నువ్వే వెళ్ళావా?"

దీనికీ బదులు చెప్పలేదతను.

"పోనీ, ఎవరు పంపారూ?"

"అక్కయ్య"

జోగమ్మా, పూర్ణమ్మా, వేంకటాచలమూ మళ్ళీ చూసుకున్నారు "మనం అనుకున్నదే కాదూ?" అనుకుంటూ.

"ఏమి చెయ్యమంది వెళ్ళి, అక్కయ్య?" అని మళ్ళీ అడిగాడు జగ్గయ్య.

చలపతి దిక్కులు చూడసాగాడు. ఇది గుర్తించి గభీమని అందుకుని వేంకటాచలం "సంసారం అన్న తరవాత లక్షపనులుంటాయి, వివరాలెందుకు బావగారూ?" అన్నాడు, సద్దుబాటు చేస్తూ.

కాని "నేనింట్లోనే వున్నాను గదా, వెళ్ళేటప్పుడు నాతో యెందుకు చెప్పావు కాదూ?" అని మళ్ళీ అడిగాడు జగ్గయ్య.

గభీమని అందుకుని "బుచ్చమ్మా మీరు కూడా సమానమే కదా బావగారూ, చలపతికి?" అని మళ్ళీ సద్ది చెప్పాడు వేంకటాచలం.

పడమటింట్లో, తలుపుచాటున నక్కి వున్న బుచ్చమ్మ, ఇదంతా విని కొట్టినంత బాధపడి వెళ్ళి వంటింటి పెరట్లో కూలబడింది, "మతిపోయింది ముసలాడికి" అనుకుంటూ.

## 20

"మీ అమ్మా మీ నాన్నారూ వెళ్ళారా వున్నారా చెల్లాయీ?"

నూతిపళ్ళెంలో వెండికంచం కడుగుతూ వుండగా యీ మాట వినపడింది; కాని యెటుచూసినా యెవరూ కనపడలేదు, జోగమ్మకి.

"ఇక్కడున్నాన్నేను" అంటూ మళ్ళీ వచ్చింది మాట.

పక్కని వున్న డాబాకేసి చూసింది; కాని దానిమీదా యెవరూ కనపడలేదు.

"ఇక్కడమ్మా వెర్రితల్లీ"

వెనక్కి తిరిగి చూడగా, గోడ అవతల, కరివేపచెట్టు కొమ్మల్లో నక్కి వుండి మాట్లాడుతోంది సోదెమ్మ.

ఆమె కనపడగానే మొగం యింతయింది జోగమ్మకి.

"ఇంకా వెళ్ళలేదండీ, బజారునుంచి వచ్చాము, భోజనం చేశామిప్పుడే"

"ఇవ్వదలుచుకున్న సామానంతా కొనడం అయిందా?"

"అయింది, వచ్చి చూడరూ అక్కయ్యగారూ?"

"ఇంతకంటేనా అమ్మా? అయితే, నువ్వు రమ్మన్నప్పుడు వస్తాను"

"ఇది కాదూ రమ్మనడం?"

"ఇలా కాదు చెల్లీ"

"మరెలాగ అక్కయ్యగారూ?"

సోదెమ్మ చెప్పలేదు; కాని అంతా బోధపడింది జోగమ్మకి.

"ఈ జన్మలో నాకంత అదృష్టం పడుతుందా అక్కయ్యగారూ?" అనడిగిందామె.

"అదేమి తల్లీ, అలా బేలపోతావూ! ఇదంతా నీదే కాదూ? తక్కినవాళ్ళు గుప్పెడు మెతుకులకోసం చేరిన వాళ్ళే కాదూ?"

"ఇప్పుడు నేనే అలా వున్నానండీ"

"తప్పు, తప్పు, అలా అనుకోకమ్మా"

వంటింట్లో యేదో చప్పుడయింది.

"ఉపాయం చెప్పరూ అక్కయ్యగారూ?" అనడిగింది జోగమ్మ. దానికి జవాబు రాలేదు. చూడగా సోదెమ్మ కనపడలేదు. కరివేపచెట్టు మాత్రం వూగిపోతోంది.

## 21

"ఇంకో రెండేళ్ళుపోతే నీ యింటిపేరయినా పైకి రానియ్యదు. పెళ్ళయి ఆరుమాసాలయినా తిరక్కుండా ఇల్లుపట్టింది, తన యిల్లని చెబుతోంది భామ, నడివీధిలో నుంచుని"

"ఇందుకే కామోసునే సోదెమ్మ అక్కయ్యగా రలా అన్నారు!"

"అందంటే అనదూ ఆవిడ, దీని గుణాలు మొదణ్ణుంచీ యెరగనివా మనకంటే కొత్తగానీ? నీ మామగా రేమనుకుంటారో అని చూస్తున్నాను. లేకపోతే – వొక్క క్షణంలో దిగ్గుంజెయ్యనూ రాకాసిని?"

"ఏమి"టనడిగాడు వేంకటాచలం.

"ఎవరో ముసిలి పరదేశి బ్రాహ్మ డడగ్గా, బుచ్చమ్మ ఈ యిల్లు తనదన్నట్టు చెప్పింది.' 'కందుకూరివారి దనకపోడం యేమీ?' అంటుందమ్మాయి"

"ఆ మాట నేనూ విన్నాను. 'మాది' అంటే బాధ లేకపోవును. 'నాది' అంది, వెన్ను పీరుచుకుంటూ. అయితే మన బంగారమే మంచిది కాదు"

"అతనికి చేతకాకపోతే అమ్మాయి చేసుకుంటుంది పెత్తనం, మధ్య యీ భూతం యెవరండీ?"

"కొంచెం వోపిక పట్టాలి. వీలుకానప్పుడు పడివుండాలి."

"ఎన్నాళ్ళూ?"

"వో – హో – హో, చలపతికి జ్ఞానం వచ్చేదాకాను, చెప్పడం యెందుకూ?"

"సముద్రంలో కెరటాలు తగ్గడమూ, చలపతికి –"

"నాకంత నిరాశలేదు"

"ఇక నేను లేననుకోండి నాన్నారూ"

ఇలా అంటూ తల్లిమీదికి వాలిపోయింది జోగమ్మ.

అది చూశాటప్పటికి వేంకటాచలం కళ్ళు చెమ్మగిల్లాయి.

పూర్ణమ్మ కూడా అలాగే అయింది; కాని కూతురు తన పాదిగిట వుండడంవల్ల బాధ్యతగుర్తించి "నీకేం తల్లీ? ఆ మనోవర్తిమనిషి నిన్నేం చెయ్యగలదమ్మా?" అంటూ వోదార్చి "ఇంకో పదిహేనురోజులు సెలవు పొడిగించుకోండి. ఆ రెండువారాలూ కూడా చూసి అమ్మాయినీ అల్లుణ్ణీ మన యింటికే తీసుకువెడదాం వీలులేపోతే" అంది, వేంకటాచలంతో.

"అవి రానిస్తుందిటే అమ్మా?"

"అవునేవ్! మీరే మంటా రండీ?"

"రానిస్తుందే అనుకో. అతను మన యింటికి వస్తే యిక్కడ యేది యేమయి పోతుందో–"

"అదీ నిజమే, గండకత్తెర వచ్చి పడిందండీ, మనకి"

"సరే, ముందు సెలవుమాట చూసుకుని వస్తాను. తరవాత అట్నుంచి నరుక్కువద్దాం."

ఇలా చెప్పి, సూపర్నెంటు ఆఫీసుకి బయలుదేరాడు వేంకటాచలం.

## 22

"ముందుముం దింతకంటే సయ్యోధ్యలుండి యేడుస్తాయా యేమిటి? ఏమయినా సరే – వోమాటు సోదెమ్మగారి యింటికి వెళ్ళి వస్తానే అమ్మాయీ"

జోగమ్మ నిలువుటద్దం యెదట నుంచును వుండగా, ఆమె జడకి మీదుగా గులాబీబంతి సద్దుతూ ఇలా అంది పూర్ణమ్మ.

"నేనూ రావద్దూ?"

"కళ్ళల్లో నిప్పులు పోసుకోదూ?"

"ఎలాగే మరీ–?"

ఇలా గూనుస్తూ యెదటికి తిరిగి తల్లి జబ్బలు పట్టుకుని వేళ్లాడింది జోగమ్మ.

"ముందొకమాటు నన్ను వెళ్ళి రానియ్యి?"

"పోనీ. రేపు తీసుకువెడతావా నన్ను?"

ఈ సమయాన గుమ్మంలోకి వచ్చి "అమ్మాయీ, వంటిల్లు సవరించాలిట కాస్త చూడమ్మా" అని చెప్పి చక్కాపోయాడు జగ్గయ్య.

ఉత్కటానందంతో తల్లీ కూతురూ వొక్క క్షణం మాట్టాడలేక పోయారు.

"బతికాం" అంది జోగమ్మ, వొక్క క్షణానికి.

"నువ్వు కూచో నేను సవరిస్తా నదంతా" అంటూ పూర్ణమ్మ బయలుదేరింది.

జోగమ్మ మళ్ళీ నిలువుటద్దం కేసి తిరిగింది.

రేగిన కనుబొమలు సవరించుకుని, లోలకుల సీమకమలాల జిగజిగలతో ధగధగ లాడుతున్న ఆ బుగ్గ వొకమాటూ యీ బుగ్గ వొకమాటూ చూసుకునే టప్పటి కామె కేదో వూహ తట్టింది.

చిటికెలు వేసుకుంటూ వెంటనే ముందు పడమటింటోకీ, అక్కణ్నుంచి పెరట్లోకీ వురికి, సరిహద్దుగోడ దగ్గిరగా నుంచుని "అక్కయ్యగారూ" అని పిలిచింది కంఠం వొక్కుకుంటూ.

బదులు రాలేదు.

కాని; అవతల బిందెలో చెంబుముంచిన చప్పుడు.

"ఆ భూతానికి వినపడుతుందేమోనే" అంది పూర్ణమ్మ.

"ఎక్కడో–ఫర్లాంగుదూరాన వీధిగదిలో వుంది, వినపడదే!........ అక్కయ్యగారూ!"

అప్పుడూ బదులు లేదు.

"పని పూర్తిచేసుకుని వాకిట్లోకి వెళ్ళిపోయారేమోనే అమ్మడూ"

"వెళ్ళిపోలే దింకా వంటింటోనే వున్నా రమ్మా!....... సోదెమ్మక్కయ్యగారూ!"

"చెల్లీ!"

"పిలిచావా అమ్మా?"

"అవునండి"

ఏమమ్మా?

"ఏం చేస్తున్నారూ?"

"ఇక వాకిట్లోకి వెళ్ళిపోదా మనుకుంటున్నాను. పిలిచావు నువ్వు?"

"మూణ్ణాళ్ళ పండుగు వచ్చిందండీ నాకు"

"వచ్చిందా తల్లీ! వెయ్యిమంది దేవుళ్ళకు మొక్కుకుంటున్నా నేను, మీ అమ్మా నాన్నా వుండగా ఇలా జరిగాలని. పిన్నిగా రేం చేస్తున్నారూ?"

"ఇక్కడే వుందండీ, తరువాత ఏం జరిగినా సరే అని మా అమ్మ మీ ఇంటికి రావా లనుకుంటూ వుండగా ఇల్లు సవరించా లని చెప్పారు మామగారు వచ్చి."

"వెర్రిబ్రాహ్మడు. మాయామర్మమూ యెరగడు పాపం. సత్యరుషి అంచేతనే ఆడుతోం దాట..... పిన్నిగారూ!"

"వింటున్నా" నంది పూర్ణమ్మ.

"నూతి పెరట్లోకి రండి."

"వస్తున్నా.......... తల్లీ, వంటిల్లు నువ్వు సద్దుకో."

ఇలా అంటూ ఎక్కడ పని అక్కడ విడిచి పెట్టేసి పూర్ణమ్మ వెళ్ళిపోగా "ఇంటో వుండకుండా ఎక్కడికి పంపిందో! ఈ మూడు రోజులూ కంటపడనివ్వను" అనుకుంటూ, జోగమ్మ వంటింటి పని అందుకునే టప్పటికి "ఎక్కడికిరా యిట్టేట్టే వెడుతూ వుంటావూ? కుదురు నేర్చుకో నాయినా యీ పాటికి" అని వాకిట్లోనుంచి జగ్గయ్య మాట వినవచ్చింది.

# 23

గదిలో కూచోపెట్టుకుని ఫలహారం చేయిస్తూ, తాను కూడా చేస్తూ, జోగమ్మ, చలపతికి జ్ఞానస్నానం చేయిస్తూ వుండగా, జగ్గయ్యకీ వేంకటాచలానికీ వంటింటి వసారాలో వడ్డించింది పూర్ణమ్మ.

అది చూశాటప్పటికి ప్రాణాలు లేచిరాగా "ఇదేమిటండోయి భావగారూ, మీకూ మేము చెయ్యవలసిన మర్యాదలు మా యింటో మీరే మాకు మొదలు పెట్టా రేమిటండోయ్?" అనడుగుతూనే జగ్గయ్య వొక పళ్ళెం దగ్గిర కూచున్నాడు.

"మా ఇంటోనూ మీ ఇంటోనూ కూడా మేమే చెయ్యాలి మీకు. ఆడపిల్లని కనుక్కున్నవాళ్ళం కాదుటండీ మేము?" అని బదులు చెప్పాడు దానికి వేంకటాచలం.

"నీ కూతురి వాలకం యేమయినా బోధపడుతోందా నీకు?" అన్న ప్రశ్న స్ఫురించిం దిందులో జగ్గయ్యకి.

మూడో మనిషితో సహవాసం తటస్థపడలేదు, తమ కింతవరకూ.

కోడలు కాపరానికి వచ్చేదాకా "సర్దుకోడం" అవశ్యకమే రాలేదు తమకి.

రుచిభేదమూ, భావవైవిధ్యమూ, భిన్నదృక్పథమూ, ప్రత్యేక వ్యక్తిత్వమూ, విభిన్న సంప్రదాయమూ – ఇన్నింటితో సంఘర్షణ ఏర్పడింది తమ కిప్పుడు.

"సామరస్యం" అనే సంగతి ఇప్పుడే ఆలోచించవలసి వచ్చింది దతని కిన్నాళ్ళకి.

ఇరవైదినాలుగా ఆ కుటుంబం ధోరణి చూస్తున్నాడు తాను.

మరి, ఆ సంస్కారం కనపడుతోందా తన కుటుంబంలో?

కోరి తనతో బంధుత్వం చేసుకున్నవారు పర్వతశిఖరాన వుండడమూ తాము లోయలో వుండడమూ బాగా అవగాహన అయింది అతనికి, దీంతో.

దీనికే తను సిగ్గుపడవలసివుండగా, "మా అదృష్టం అంతా మీ దయా దాక్షిణ్యాలను పట్టివుంది మరి" అని కూడా అన్నాడు వేంకటాచలం.

"అదేమిటి చాలా కొత్తమాటలు సెలవిస్తున్నారు మీరు. మీ అనుగ్రహమే కావాలి మాకు. చలపతి భారం అంతా మీమీద ఉంది."

"మీరు చల్లగానే వుండగా అది మేము అందుకోడం ధర్మమా? మీ రిలా సెలవిప్పించవచ్చా?"

"నా ధోరణి మీరు గుర్తించే వుంటారు. నా పక్షంగా చూస్తే నేనన్నదే ధర్మం."

"మీకంటే చాలా చిన్నవాణ్ణి నేను"

"వయస్సులో చాలా పెద్దే నేను. మరి, తక్కిన సంగతులు..?"

"............"

"వ్యవహారం యింతవరకూ వచ్చాక యిక లౌక్యాలు చూపించడం శ్రేయస్కరం కాదు. నాకు వ్యవహారజ్ఞానం లేశమూ లేదు. మీ వియ్యపురాలయినా నాలాగే శుద్ధ అమాయకురాలు. మా యిద్దరిలో యెవరు కాస్త శ్రద్ధ పట్టినా మా ఆస్తి యింతకి రెట్టింపయి వుండకపోవునా? మీరు బాగా చదువుకున్నవారు. అన్నీ తెలిసినవారు. అంతా చేతనయినవారు. ఒక బాధ్యత స్తుతిపాత్రంగా నిర్వహించుకుంటున్నవారు. ఇక్కడి బాధ్యత కూడా మీమీదే వుంది. అంచేతే నేనిలా అంటున్నాను."

"చలపతి మీకు కుమారుడు, మాకు అల్లుడున్నూ. పైగా, చిట్టితల్లి తప్ప మాకు కడుపున పుట్టినవాళ్ళు మరెవరూ లేరు. ఆమె అభ్యుదయమే మాకు తారకం. అది సంపాదించుకోవాలంటే మా అమ్మాయికంటే చలపతే మా కెక్కువ. అతనికి శ్రేయస్సు కలగాలంటే మీతోబాటు మేమున్నూ –"

"అదే నేను మనవి చేసేది. నేను చెయ్యలేని పని మీరు చెయ్యాలిక్కడ"

ఈ మాటమీద అందుకుని "ఈ కాలపు మొగపిల్లల కొకళ్ళు చెప్పవలసిన పనే లేదు. ఆపైని, ఏమీ దిగడి పోకుండా అన్నివిధాలా మీ అమ్మాయి దిద్దుతూనే వుంది చలపతిని" అంటూ సన్నాయి నొక్కులు నొక్కి భర్తకి కన్నుగీటింది పూర్ణమ్మ.

"అవు నవు" నన్నాడు, వేంకటాచలం. అది గుర్తించి. ఉలిక్కిపడ్డాడు జగ్గయ్య.

జోగమ్మ వచ్చినప్పణ్ణుంచీ బుచ్చమ్మ చేస్తున్న కుట్ర అంతా కాకపోతే కొంతయినా

తెలుస్తూనే వుంది కాని; కజ్జా అంటే వెనక్కితీసే వేంకటాచలమే యిలా అనడంతో అది దుర్భరమే అయివుంటుందని తోంచిందతనికి. దాంతో మొగం చిన్నపుచ్చుకున్నాడతను.

ఇది గ్రహించి ప్రసంగం మార్చడానికి చూశాడు వేంకటాచలం; కాని పూర్ణమ్మ అది సాగనియ్యలేదు.

"ఇంతకీ పాపం, బుచ్చమ్మకి మాత్రం యింకెవరున్నారు గనకా? చలపతి బాగుపడ్డంకంటే మరోకోరిక యేమి వుంటుందామెకి? మా అమ్మాయి కత్తగారయినా ఆడబడుచయినా – చలపతికిన్నీ తల్లి అయినా, అక్క అయినా సర్వమూ –"

కాఫీ పుచ్చుకుంటున్న జగ్గయ్య, గ్లాసు చేత్తో పట్టుకుని మాట కడ్డం వచ్చి "అక్కయ్యగారూ, మీరనవలసినమాటే అన్నారు మీరు; కాని చల్లకి వచ్చి ముంత దాచడం నావల్లకాదు. బావగారూ, మీరు బాగా వినండి. ఇక్కడి గొడవలు నాకు బొత్తిగా తెలియకపోలేదు. నేను ఆందోళనపడకపోనూ లేదు. అయితే, నిజానికి మీకిదంతా పూర్తిగా తెలుసు. మీ అమ్మాయేకాదు, మీరున్నూ అనుభవిస్తున్నారిదంతా. కనుక, నా బాధకంటే మీ బాధ యెక్కువది. ఇది సవరణ చెయ్యడం నావల్ల కాదు. నా ప్రవృత్తే అలాంటిది కాదసలు. కాక, – మాటమీద మాట వస్తూనే వుంటుంది. కనక, వాగ్వాదం వద్దు. నా మాట వినండి. వెంటనే మీరు ఈ వూరు బదిలీ చేయించుకోండి" అన్నాడు, దృఢస్వరంతో.

వేంకటాచలం "యిదంతా నీ మాట మహిమ" అన్నట్టు చూడగా "వొప్పుకోండి" అన్నభావం పూర్ణమ్మచూపుల్లో వేంకటాచలాని క్కనబడింది.

"మీరు వినోదంకోసం యిలా అంటున్నారని కాదు కానీ, మీ అమ్మాయితో –"

"అవసరంలే" దన్నాడు జగ్గయ్య, కచ్చితంగా.

"మీరు నేను చెప్పినట్టు చేస్తే, మీరు మీ యేక పుత్రికను విడిచిపెట్టకుండా వుండినవారూ అవుతారు, చలపతిని బాగుచేసినవారూ అవుతారు" అన్నాడు మళ్ళీ ఆయనే.

"తప్పదారి, చిక్కు లేమయినా–"

"మనం ద్వంద్వాతీతులం కాము. నాక్కావలసింది నాకొడుకు బాగుపడడమూ, నా వంశం వృద్ధికావడమూ – ఇంతే. కనక, మీరు తప్పకుండా – వెంటనే బదిలీ చేయించుకోండి"

ఎటూ చెప్పలేక ఆలోచనలో పడ్డాడు వేంకటాచలం.

"ఊ అనండి" అన్నాడు జగ్గయ్య, వొత్తి.

"మీ సెలవు"

"మీ సెలవా, మీ విధా? ఇది నేను వివరించి చెప్పలేను"

"అయితే, తప్పకుండా బదిలీ చేయించుకుంటాను."

"చాలా సంతోషం, మీ దయవల్ల నాకిప్పటి కొక బెంగతీరింది" అన్నాడు జగ్గయ్య.

తరవాత పూర్ణమ్మకి కూడా కొన్ని సంగతులు చెప్పి వాకిట్లోకి బయలుదేరా డతను.

కూతురు సిద్ధంచేసి వుంచిన తాంబూలం జగ్గయ్య కిచ్చి తానున్నూ వేసుకుని, "వెళ్ళండి, వెళ్ళండి" అని తొందరగపెడుతూ, పూర్ణమ్మ తెచ్చియిచ్చిన కోటు తొడుక్కునీ, పాగా పెట్టుకునీ సూపర్నెంటు అఫీసుకి వెళ్ళిపోయాడు వేంకటాచలం, వుపాయం ఆలోచించుకుంటూ.

"ఇప్పటి కొక్కబెంగ తీరిందా? ఇంకా ఆ వుండిపోయిన బెంగలేమిటి చెప్మా?" అనుకుంటూ నిమిషంలో స్థలశుద్ధి చేసేసి, ఈ సంగతి జోగమ్మతో చెబుదామని తూనీగలాగ బయలుదేరింది పూర్ణమ్మ.

అప్పటికి, ఇక్కడ గదిలో "కాఫీ తరవాత ఏమిటో?" అంటున్నాడు చలపతి. "తాంబూలం తరవాత ఏమిటో?" అంటోంది జోగమ్మ.

## 24

ఆవేళా, మర్నాడూ, ఆ మర్నాడూ కూడా, జోగమ్మ వీధి గుమ్మం తొక్కి చూడలేదు.

జగ్గయ్య, ఎప్పుడో – ఎందుకో – ఎక్కడికో వెడతాడు వస్తాడు, అంతే.

ఎప్పుడు చూసినా వాకిట్లో పేముకుర్చీలో కూచునో, గుడ్డకుర్చీలో ఏదో ఆలోచించుకుంటూ పడుకునో, వీధి గుమ్మం దగ్గిరనుంచి పడమటింటి గుమ్మం దగ్గిరకీ, పడమటింటి గుమ్మందగ్గిర నుంచి వీధి గుమ్మందగ్గిరకీ పచారుచేస్తూనే కనపడతాడు వేంకటాచలం.

పూర్ణమ్మ మాట వినపడ్డమే కాని మనిషి కనపడదు.

ఒకటి రెండుమాట్లు బజారుకి వెళ్ళవలసి వచ్చింది. అయితే, బుచ్చమ్మ వీధిగదిలో తలుపు వేసుకుని వుంటే సింహద్వారం నుంచీ, తలుపు తెరుచుకుని వుంటే దొడ్డిగుమ్మం నుంచీ వెడుతూ వస్తూ వచ్చాడు చలపతి.

దీంతో, ఏకాంత వాసశిక్ష అనుభవిస్తున్నట్టు బాధపడిపోయింది బుచ్చమ్మ.

అయినా, చలపతిని పిలవాలన్న సంకల్పం మొదటినాడు బలవంతాన అణిచిపెట్టుకుందామె. రెండోనాడు కూడా మధ్యాహ్నం దాకా చాలా బెట్టుగానే వుండిపోయింది.

మధ్యాహ్నం కాఫీ లయినాక, సింహద్వారాన పూర్ణమ్మ లోగుమ్మంలో నుంచుని వున్నట్టయిందామెకి.

ఇక వుండలేకపోయింది.

కూచోనే లేకపోయింది.

చరచరా గుమ్మందాకా వచ్చి "మా తమ్ము డేంచేస్తున్నాడండీ అత్తయ్యగారూ?" అంటూ మృదువుగానూ, చాలా వినయంగానూ, మహా మర్యాదగానూ అడిగింది, కొండంత ఆశతో.

ఒక్క భోజనం పెట్టాటప్పుడు తప్ప పూర్ణమ్మ కూడా యెదటపడ్డం లేదు బుచ్చమ్మకి.

ఇది పట్టుదలగా జరుపుకుంటోందామె.

కాగా, – బుచ్చమ్మ కనపడ్డంతోనే ముందు తలుపు చాటుకి జరిగేసిందామె.

తరవాత, బుచ్చమ్మ నేర్పినపాఠం బాగా వల్లించుకుని వుందేమో "ఏమో, నే నే మెరుగుదునూ?" అంటూ తిరగవేసికొట్టి, వచ్చిన పనికూడా విడిచిపెట్టేసి, గిరుక్కున మళ్ళీ లోపలికి వెళ్ళిపోయింది.

బుచ్చమ్మ మొగం గూక్కుపోయింది, దీంతో.

"భాగోతం ఆడేస్తా రీమూడు రోజులూ వీళ్ళు" అంటూ వొళ్ళు రవల బెట్టుకుందామె. అయినా, వూరుకోదలచుకో లేదు.

"ఇప్పుడు మూడయివుంటుంది" అని వూహించుకుంది. "కనక యిది ఫలహార సమయం" అని దృఢపరుచుకుంది. "పడకగదిలోనే వున్నాడు చలపతిగాడు" అని నిశ్చయించుకుంది. "పలికేదాకా వూదరకొడితే కళ్ళబడకుండా వుండగలడా?" అని ఆలోచించింది. "అటో యిటో తేలిపోవా లివాళ?" అని నిరుకుచేసుకుంది.

చప్పుడు కాకుండా తలుపులు తెరుచుకుని అరుగుమీదికి వచ్చింది ముందామె.

మెల్లిగా వీధిలోకి దిగజారి, యెవరయినా వస్తున్నారేమో అని వొకమాటలాగా ఇలాగ చూసి, యేడెనిమిది మాసాలనుంచి వీధిలోపడివున్న గుట్టలో నుంచి పట్టెడు కంకరరాయి సంగ్రహించింది, తరవాత.

వెంటనే వుత్తరపు అరుగెక్కి "చలపతీ, వొరేయ్ తమ్ముడూ" అంటూ పిలుపుమీద పిలుపు మొదలుపెట్టింది, టక్కు టక్కు కిటికీ తలుపుమీద కొడుతూ, చివరికి.

ఫలహారం పూర్తయి తాంబూల చర్వణం జరుగుతోం దప్పటికి గదిలో.

చలపతి "సొంత" కుర్చీలో కూచుని వున్నాడు.

ఎదట నుంచుని, చేతులు కుర్చీచేతులమీద ఆనుకుని, అతనిమీదికి వాలి, మొగంమీద మొగంపెట్టి కువకువలాడుతోంది జోగమ్మ.

ఎడమచెయ్యి ఆమె నడుముకి చుట్టవేసి తెరపి మరపుల్లో వున్నాడు, చలపతి కూడా.

ఎలాంటి అలికిడిలేని అర్ధరాత్రివేళ యువతల గాఢనిద్రలో వుండగా, దొంగపోటుగా వచ్చి అవతల కోటమీద ఫిరంగులు మోర్జాయించిన ట్టయింది, దీంతో.

ఉలిక్కిపడ్డారు దంపతు లిద్దరూ.

కంగారుపడుతూ వెంటనే లేవబోయాడు చలపతి.

కాని, అది సాగనివ్వలేదు జోగమ్మ.

ఇంకా యింకా మీదికి వాలిందామె.

రెండుచేతులూ మెడకి చుట్టవేసి గభీమని వొళ్ళోకూచుంది.

మాటరాకుండా పెదవులతో పెదవులు నొక్కేసింది.

ఇక అత నులకడు పలకడన్న ధైర్యం కలిగిందామెకి.

మెల్లిగా లేచింది, చురుగ్గా చూస్తూ.

ఔడు కరుచుకుని "పలికినా లేచినా బాగా జరగదు సుమండీ" అన్నట్లు తర్జనితో వొకాయించింది.

"ఆ, అదీ పద్ధతి. అదీ మందు దానికి"

"లేవబోయారు, పాపం! కాని కదలనివ్వలేదు నేను"

"నీకా మాత్రం శక్తి వుంటే యిక లేని దేమిటి?"

"..........."

"జీర్ణంజీర్ణం వాతాపిజీర్ణం. ఏమన్నా పడ్డం—ఏమిచేసినా చడీచప్పుడూ కాకుండా బదులుచేసి వూరుకోడం—ఇదే చెయ్యవలసింది"

"అవునే అమ్మాయీ! మనమాట పైకి వినబడగూడదు. మనం కోపంగా వున్నామని కూడా యెవరూ అనుకోగూడదు" అంది పూర్ణమ్మ.

"అమ్మా" అని పిలిచాడు వేంకటాచలం మళ్ళీ.

"అందరికీ ఆధారం చలపతి. అతణ్ణి విడిచిపెడితే యెవరికీ యేమీలేదు. కాక, తన పెత్తనానికి నువ్వడ్డువస్తావన్నయేడుపేగాని, తన హద్దు ఎక్కడికో, నీ హక్కెంతటిదో గుర్తించుకోడం లేదామె. ఇది మనం తెలుసుకుంటే చాలదు, ముఖ్యంగా నీ మామగా- రంగీకరించాలి. లోకం కూడా హర్షించాలి. అంటే, నువ్వెంత జాగ్రత్తగా మనులుకోవాలో తెలుసా?" అనిన్నీ అడిగాడతను.

తన బాధ్యత గుర్తించి జోగమ్మ నీరవ అయిపోగా, పాదివి పట్టుకుని గదిలోకి తీసుకువెళ్ళిందామెని, పూర్ణమ్మ.

పడమటింటి వసారాలోనుంచి వాకిట్లోకి వచ్చాడు వేంకటాచలం.

కవాచీబల్లమీద కూచుని వున్నాడు చలపతి.

బుచ్చమ్మ చేసిన అల్లరికి కంగారూ, ఏమి జరుగుతుందో అని బెదురూనూ, అతనికి.

ఇద్దరి చూపులూ కలిశాయి.

వొణికినట్టయి చలపతి జరిగి కూచోగా "ఏమిటి ఆలోచిస్తున్నా" వనడుగుతూ వెళ్ళి పక్కని కూచున్నాడు, వేంకటాచలం.

"ఏమీ లేదండి" అన్నాడు చలపతి.

"అబద్ధం. నువ్వేదో ఆలోచిస్తున్నావు. పోనీ, రహస్యం కామోసు, నాతో చెప్పవద్దులే"

"ఆలోచనా లేదండి, రహస్యమూ లేదండి, వూరికెనే కూచుని వున్నానండ

"అయితే అయింది గాని బజారుకి వెడదాం వస్తావా?"

"వస్తానండి"

ఇలా అంటూనే లేచినుంచున్నాడు చలపతి.

"తమలపాకు లయిపోయాయి నాన్నారోయ్" అంటూ వచ్చింది జోగమ్మ యివతలికి.

"మీ నాన్నారితో చెబుతావేం, కావలిస్తే నీ మొగుడితో చెప్పుకో" మంటూ పూర్ణమ్మ వచ్చింది వెనకాలే.

ముగ్గురూ సరాగా లాడుకున్నా రొక్క క్షణం.

"సోఫా కావాలంటోంది అమ్మాయి, కొనుక్కొద్దాంరా" అంటూ మామగారు బయలుదేరగా, చంకలు గుద్దుకుంటూ అతని వెనకాలే వెళ్ళాడు చలపతి.

"ఆ, అదీ పద్ధతి. అదీ మందు దానికి"

"లేవబోయారు, పాపం! కాని కదలనివ్వలేదు నేను"

"నీకా మాత్రం శక్తి వుంటే యిక లేని దేమిటి?"

"........."

"జీర్ణంజీర్ణం వాతాపిజీర్ణం. ఏమన్నా పడ్డం–ఏమిచేసినా చడీచప్పుడూ కాకుండా బదులుచేసి వూరుకోడం–ఇదే చెయ్యవలసింది"

"అవునే అమ్మాయీ! మనమాట పైకి వినబడగూడదు. మనం కోపంగా వున్నామని కూడా యెవరూ అనుకోగూడదు" అంది పూర్ణమ్మ.

"అమ్మా" అని పిలిచాడు వేంకటాచలం మళ్ళీ.

"అందరికీ ఆధారం చలపతి. అతణ్ణి విడిచిపెడితే యెవరికీ యేమీలేదు. కాక, తన పెత్తనానికి నువ్వడ్డువస్తావన్నయేడుపేగాని, తన హద్దు ఎక్కడికో, నీ హక్కెంతటిదో గుర్తించుకోడం లేదామె. ఇది మనం తెలుసుకుంటే చాలదు, ముఖ్యంగా నీ మామగాః రంగీకరించాలి. లోకం కూడా హర్షించాలి. అంటే, నువ్వెంత జాగ్రత్తగా మనులుకోవాలో తెలుసా?" అనిన్నీ అడిగాడతను.

తన బాధ్యత గుర్తించి జోగమ్మ నీరవ అయిపోగా, పొదివి పట్టుకుని గదిలోకి తీసుకువెళ్ళిందామెని, పూర్ణమ్మ.

పడమటింటి వసారాలోనుంచి వాకిట్లోకి వచ్చాడు వేంకటాచలం,

కవాచీబల్లమీద కూచుని వున్నాడు చలపతి.

బుచ్చమ్మ చేసిన అల్లరికి కంగారూ, ఏమి జరుగుతుందో అని బెదురూనూ, అతనికి.

ఇద్దరి చూపులూ కలిశాయి.

వొణికినట్టయి చలపతి జరిగి కూచోగా "ఏమిటి ఆలోచిస్తున్నా" వనడుగుతూ వెళ్ళి పక్కని కూచున్నాడు, వేంకటాచలం.

"ఏమీ లేదండి" అన్నాడు చలపతి.

"అబద్ధం. నువ్వేదో ఆలోచిస్తున్నావు. పోనీ, రహస్యం కామోసు, నాతో చెప్పవద్దులే"

"ఆలోచనా లేదండి, రహస్యమూ లేదండి, వూరికెనే కూచుని వున్నానండి"

"అయితే అయింది గాని బజారుకి వెడదాం వస్తావా?"

"వస్తానండి"

ఇలా అంటూనే లేచినుంచున్నాడు చలపతి.

"తమలపాకు లయిపోయాయి నాన్నారోయ్" అంటూ వచ్చింది జోగమ్మ, యివతలికి.

"మీ నాన్నారితో చెబుతావేం, కావలిస్తే నీ మొగుడితో చెప్పకో" మంటూ పూర్ణమ్మ వచ్చింది వెనకాలే.

ముగ్గురూ సరాగా లాడుకున్నా రొక్క క్షణం.

"సోఫా కావాలంటోంది అమ్మాయి, కొనుక్కొద్దాంరా" అంటూ మామగారు బయలుదేరగా, చంకలు గుద్దుకుంటూ అతని వెనకాలే వెళ్ళాడు చలపతి.

ఆ వెళ్ళడం, తలుపోరచేసుకుని చూస్తోన్న, బుచ్చమ్మ కళ్ళబడింది.

తానెంత పిలిచినా పలకని చలపతి, సంబరపడుతూ మామగారితో కలిసి వెళ్ళడంచూసి కొట్టినంత బాధపడిపోయింది, ఆమె.

"సోదీ వాళ్ళూ లాలోచీ అయినా రేమో" అనుకుందామె. "పూర్ణమ్మే దాన్ని వీధిలోకి పంపి వుంటుం"దనిన్నీ వూహించుకుంది.

దీంతో అభిమానం ముంచుకురాగా, ముసుగు తన్నుకుని కడుపులో కాళ్ళు పెట్టుకుని పడుకుంది.

ఆ రాత్రి తిండితిన లేదామె.

ముందు జోగమ్మ పిలిచింది. తరవాత పూర్ణమ్మా పిలిచింది. ఇదేమీ యెరగని జగ్గయ్యా చాలా బలవంతం చేశాడు కాని; యెవరిమాటా వినలేదామె.

# 26

తెల్లవారితే బుచ్చమ్మకి స్నానం.

"ఇంట్లోకి వెళ్ళాటప్పటి కేమి గందరగోళం పుడుతుందో" అనీ "వాళ్ళూ వాళ్ళూ కలిసి యేమేమి తలుచుకుని వున్నారో" అనీ చాలా బెదురుపట్టుకుందామెకి.

మనస్సంతా చికాకుపడిపోయింది.

కాని "సోదినీ చెల్లెల్నీ విడదీసి దాన్ని అల్లరిపెట్టకపోతే నాపేరు బుచ్చికా"దనుకుందామె యెన్నోమాట్లు.

"తల్లినీ తండ్రినీ చూసుకుని యెగిసిపడుతోంది, తరవాత నేలబెట్టి రాసెయ్యకపోతే నేను బ్రాహ్మణజన్మ యెత్తలే" దనుకుందెన్నో మాట్లు, జోగమ్మని తలుచుకుని.

"ఆ సానిపాపతో కులకనిస్తానేమో చూసుకో నిన్ను" అని చలపతిని తలుచుకుని పళ్ళు కొరుక్కుందామె.

"మాయకాఫీలుపోసి లోబరుచుకున్నారు వాళ్ళు, అన్నం అయినా సరిగా పెడతానేమో చూసుకో తరవాత నీకు" అని తండ్రిని తలుచుకునిన్నీ అగ్గయిపోతూ వచ్చిందామె, యెన్నోమాట్లు.

ఆ కంగారులో యీ వూహలు కొంత నిలవబెట్టగలిగాయామెని.

అయినా, పొద్దస్తమానూ తలుపులు బిగించుకుని కూచునీ పడుకునీ గడపటంలో కాళ్ళు గుదులుపట్టగా, మతిన్నీ పోయినట్టు కాగా, నాలుగ్గంటలవేళ గోదావరిగట్టుకి బయలుదేరిందామె.

వెళ్ళి చూడగా, ఇలాంటిదే వొకామె గట్టుకింది రావిచెట్టు వేళ్ళమీద కూచునివుంది.

"నువ్వెప్పా"డంటే "నువ్వెప్పా"డని వివరాలు చెప్పాకుని లోకాభిరామాయణంలో పడిపోయారు, క్షణంలో వాళ్ళిద్దరూ.

సాగతీసుకోడాలూ, బుగ్గలు నొక్కుకోడాలూ, శాబాసులూ అవ్యాహతంగా వెళ్ళిపోసాగాయి.

నాలుగురోజులకిందట (ఫలానా) ప్రౌఢదంపతులు మసక చీకట్లో గోదావరిలో

చాలాసేపు స్నానం చేశారు. అప్పుడామొగుడు, ఆ పెళ్ళానికి సబ్బుతో వీపు తోమాడుట.

"కొత్తగా వచ్చాడుటే చదువుకోడానికి. వారా లింకా పూర్తిగా కుదరలేదుటే పాపం. ఇవాళ రెండుపూట్లా కాస్త అన్నంపెట్టవే" అని ముసలి మొగుడు ఎంత బతిమాలినా "ససేమిరా" అని, మరో నాలుగురోజుల కామొగుడు వూరికి వెళ్ళగా పిలిచి ఆ పిల్లాడికే భోజనంపెట్టి, నాలుగు గంటలవేళ ఆ పిల్లాడిచేతే బజారు నుంచి తినుబండరాలు తెప్పించుకుని వాడికింతపెట్టి, తానింత తిని "ఆకల్లేదు కాదూ?"అంటూ రాత్రి పదిగంటలుదాకా కూచోపెట్టి, అప్పుడు భోజనం పెట్టి పంపేసిందట ఒకతె!

ఒక మొగుడూ పెళ్ళామూ బజారుకి వెళ్ళారుట. ఒక గజం జాకెట్టుగుడ్డ కోసం ఆమే, ఒక తువ్వాలకోసం అతనూ కలిసివెళ్ళారుట జట్కాయెక్కి. వచ్చక పది షాపులు తిరిగారు. బేరాలు కుదరక పది కొట్లు తిరిగారుట. అప్పటి కావిడకు నీరసం వచ్చిందట. "రేపు వచ్చి కొనుక్కుందాం, రా, జట్కాయెక్కు" అని మొగుడుట. "ముందు కాఫీహోటలుకి వెడితేగాని జట్కాయెక్కలే"నని ఆవిడట. చివరికి చెయ్యీ చెయ్యీ కలుపుకొని వొకరిలా లాగనూ, వొకరలా లాగనూట. బజారంతా విరగబడిపోయిందిట. ఎక్కడ మనుషులక్కడ ఆగిపోయారుట, ఎక్కడి బళ్ళక్కడ నిలిచి పోయాయిట. "మా బేరాలు చెడిపోతున్నా"యని వర్తకులు పోలీసులకు కబురుచేశారుట. చివరికావిడ, వొక చెయ్యి విసురుతూ దారిచేసుకుంటూ, వొకచేత్తో మొగుణ్ణి గోదావరిస్టేషను దాకా బరబరా లాక్కుపోయిందిట, పెద్ద కాఫీహోటలుకి.

ఇలాగ సర్గమీద సర్గా, కాండమీద కాండా తిరిగిపోయి చివరికి, పుట్టింటివారు వచ్చి జోగమ్మకి సారెసామాను కొనడం దగ్గిర నిలిచిపోయిందా రామాయణం.

"కూతురంటే యెంతముద్దో వారికి" అనడిగింది చెలికత్తె.

"ముద్దుముద్దని అంత అబ్బురం యెందుకూ? అవతల మరెవరయినా వుంటేనా వారికి?" అంటూ గింజుకుంది బుచ్చమ్మ.

"అలాకాదే. నిజంగా, మరెవరూ లేరే అనుకో. డబ్బూ కావలసినంతవుందనుకో. అయినా, అందచందాలు తెలియవద్దూ, ముద్దుమురిపా లుండవద్దూ? సాహసమున్నూ వుండవద్దూ?"

"పెళ్ళిలో చూశాను, వాళ్లమాటే చెప్పాలి నువ్వు."

"నేను చూశానా చేశానా మీవాడి పెళ్ళి? నీ మరదలు కావాలన్నవన్నీ కొన్నారు. ముద్దినుసు వస్తువులూ కొన్నారు. ఎంత డబ్బయినా కొనమన్నవన్నీ కొన్నారు."

"నోరు మూసుకోవే. కూతురికివ్వడం కూడా గొప్పే అంటావేమిటి నువ్వు?"

"కూతురేకాదు, మీ చలపతి కూడా కోరుకున్న కుర్చీ–"

"ఏమిటీ?" అంటూ తెల్లపోయింది బుచ్చమ్మ.

"మా చలపతా, కోరుకున్నాడా కుర్చీ?" అనిన్నీ అడిగింది.

"అవును"

"మా చలపతికే"

"మీ చలపతికే!"

"మా తమ్ముడికే?"

"మీ తమ్ముడికే, ఏం, అలా వింతపడతావేం? ఆ కుర్చీకి తగ్గ టేబిలూ కొన్నారు."

"టేబిలూ కుర్చీనా?"

"అవును, ఏం, అలా అంటావేం?"

చలపతిని తాను ధవళేశ్వరం పంపిన పూటే కొన్నారు వారా కుర్చీ, ఆ టేబిలూను. బాగా జ్ఞాపకం వుంది బుచ్చమ్మకి.

"అబ్బే, ఏమన్నానూ? ఎందు కంటాను? అయినా, తనకి లేకా మావాడు వాళ్ళని దేవురించడం?"

"అదేమిటే నీ మొగం యీడ్చా! అత్తవా రివ్వడమూ; అల్లుడు పుచ్చుకోడమూ; అడిగి, కోరి, అలిగి కూడా అవీ యివీ రాబట్టుకోడమూ అదో అందం కాదుటే మనలోనూ?"

"నీ అందం అడుక్కు తిన్నట్టే వుంది లే."

ఇలా అంటూనే యెగసి నుంచుంది బుచ్చమ్మ.

"లేస్తా వేం?" అనడిగింది జతకత్తె, ఆత్రంగా.

"పోతా."

"అదేమిటే?"

"ఏమిటే అంటే, నీకేం? వచ్చినవారు వియ్యాలవారాయె, ఏవుందో ఏమి లేదో – మా కెన్ని వంకలు పన్నుతున్నారో వారు–"

మాట పూర్తి చెయ్యకుండానే బయలుదేరింది బుచ్చమ్మ.

"ఇంటికి వెళ్ళి వండాలా వార్చాలా నువ్వు? వాళ్ళకి తోచింది వాళ్ళు చేసుకోకుండా, అదనీ ఇదనీ, రమ్మనీ పొమ్మనీ – ఇంతేకాదూ వీధిగదిలో కూచుని నువ్వు చేసేదీ? ఇంటిదగ్గర వూసిపోక వచ్చానే. కాస్సేపు కూచోవే మామ్మా."

ఇలా అంటూ లేచివచ్చి బతిమాలింది జతకత్తె.

అడ్డంగా నుంచుంది.

అయినా బుచ్చమ్మ వినిపించుకోలేదు.

విసురుగా బయలుదేరిందామె.

"అయినా రెండణాలూ పుచ్చుకుని ఇంతపని చేశాడా చలపతిగాడు? ఇంకా ఏం చేస్తాడో ముందుముందు? వాళ్ళేమి చేయిస్తారో?"

అని ఇలా రవిలిపోతూ – మండిపోతూ ఎగిరిపోయిందామె.

## 27

బుచ్చమ్మ ఇలా గోదావరిగట్టుకి బయలుదేరింది, కోవా బిళ్ళలు తెమ్మని డబ్బు లిచ్చి జోగమ్మ అలా బజారుకి పంపించింది, చలపతిని.

చిటికలు వేస్తూ "..... రావాలి, తెలుసా?" అని చాలా చురుగ్గానే చెప్పిందామె. త్వరగా రావాలని; కాని గోదావరి స్టేషనుదాకా వెడితేగాని మంచిరకం దొరకలే దతనికి.

అక్కడికీ, జోగమ్మ ఎందుకు చెప్పిందో అందుకు – బుచ్చమ్మ కళ్ళబడకుండా వుండడానికి వాయువేగ మనోవేగాలమీదే వచ్చేస్తున్నా డతను; కాని జాపూడివారి కొట్ల దగ్గిర మళుపు తిరిగేటప్పుడు దొరికిపోయా డతనామెకి.

ఆమె కూడా చెలికత్తె చెప్పినదానిమీద వొళ్ళు రవల బెట్టుకుంటూ అంతకంటే ఎక్కువ వాయువేగ మనోవేగాల మీదే వచ్చేస్తోంది, మరి.

అక్కడ తారసపడ్డందు కత నెంత పరితపించాడో, ఆమె అంత మురిసిపోతోంది.

నిర్ఘాంతపడిపోయా డతను. అగ్గయిపోయిందామె. ఇద్దరూ నిలిచిపోయా రప్రయత్నంగా, ఒక్కక్షణం మిడుతూ మిడుతూను, పులుకూ పులుకూనూ చూసుకుంటే గాని ప్రకృతిలో పడలేకపోయారు వారు.

"అనుగ్రహం తప్పిన ట్టుందే" అనందుకుందామె.

"..............."

"ఇక నేను కనపడను కామోసు..........అవునా?"

"............."

"అక్కయ్య చచ్చిపోయిందనీ, శని విరగ డయిపోయిందనీ అనుకుంటున్నావు, కదూ?"

"మాట్లాడవేం?"

"..............."

"పోనీ, చూడవేంరా?"

".............."

"వాళ్ళు వద్దన్నారా?"

"............"

"మొగం పైకెత్తూ"

"............."

"వినపడ్డం లేదుట్రా?"

"ఏం?"

"ఏమి జరుగుతోం దేమిటి."

"............"

"అయిపోయిం దయ్యే పని."

"..........."

"వాళ్ళేదో మందు రాశారు పెద్దమ్మవారికి, నేననుకుంటూనే వున్నాను. మాయలమారి ముండలు వాళ్ళెందుకైనా తగుదురు. కాకపోయినా, వాళ్ళక్కడ వుండగానే ఈ గ్రహచారం తటస్థించాలా నాకు?"

".........."

"పండువంటి సంసారం ఇక కుక్కలికీ నక్కలికీ అయిపోతుంది కామోసు."

"............."

"వోరి చెవలవాజమ్మా, ఇప్పటికైనా కళ్ళుతెరుచుకో."

"పెళ్ళాం చెప్పినట్టల్లా వింటావుట్రా"

"అన్నట్టు మొన్నపొద్దున్న నువ్వెక్కడికి వెళ్ళావూ?"
"ధవళేశ్వరం వెళ్ళ మన్నావు కాదూ నువ్వు?"
"వెళ్ళావా?"
"ఆ"
"ఛీఛీ నీ బతుకుబండ లయిపోనూ, పెళ్ళాం కొంగుపట్టుకుని బజారుకి పోయి – ఎంత పొగరుపట్టావురా?"
"............"
"ఎంతలో మారిపోయావురా?"
"ఎవరు చెప్పా రమ్మా నీకు?"
"బుకాయిస్తావా యింకా?"
"నే నక్కడికే వెళ్ళాను"
ఈ మాటలో "నీకు దిక్కున్నచోట చెప్పుకో యిక" అన్న అర్థం స్ఫురించిందామెకి. దాంతో రోషం పెరిగిపోయింది.
"నోరు ముయ్యి" అంటూ వురిమింది. పళ్ళు కొరుక్కుంటూ ఆమె.
"ధవళేశ్వరం వెళ్ళమన్నావు నువ్వు. వెళ్ళాను. అక్కడ నేను చెయ్యవలసిందేమీ చెప్పలేదు నువ్వు. వెళ్ళడం అయిపోయింది. వెళ్ళి రమ్మన్నావు, వచ్చేశాను, తప్పేం?"

"ఎవళ్ళే నేను ధవళేశ్వరం వెళ్ళలేదని చెప్పినవాళ్ళు?"
"అయితే, పుల్లయ్య వేంవారం అనిపించుకొమ్మనా నిన్ను పంపుత?"

"పోనీ, పది దాటితే గాని యింటికి రావద్దన్నాను కదా నేను?"
"పదకొండు కావచ్చింది నేనింటికి వచ్చాటప్పటికి. నీకు తెలియకపోతే యెవళ్ళ నయినా అడుగు."
తెల్లపోయింది బుచ్చమ్మ.
తనదే పైచెయ్యి అయినట్టు కనపడిం దతనికి.
పులుకూ పులుకూ చూశాడు.
"సరే, నీయిష్టం వచ్చినట్టేడ్చుకో" అంటూ చెండుకుందామె. అంతకంటే పులుకూ పులుకూ చూస్తూ.
"..............."
"చేతకాని పెద్దమ్మల కెంతచేసినా బూడిదలో పోసిన పన్నీరే అయిపోతుంది."
"..............."
"ఎంతకష్టపడ్డానురా నీకోసం!"
"............"
"ఎంతెంత ఆలోచనలు చేశానురా, నిన్నుద్ధరిద్దా మని?"

"చివరి కెంత గొంతుకోశావురా నువ్వు?"

తనమీద కారాలూ మిరియాలూ నూరడం కంటే, ఆమె పరితపించడం యెక్కువగా ధ్వనించిం దతని కిందులో.

మెల్లిగా బయలుదేరాడు, మాట్లాడకుండా.

"వెళ్ళిపోతావుట్రా?"

"..............."

"ఇలారావూ?.........నుంచోవ్వూ?"

ఆగి, మొగం వెనక్కితిప్పి "ఏం?" అన్నట్లు పెంకితనంగా తల యెగరవేసుకున్నాడతను. నాలుగడుగులు అతనికేసి తానే వేసి "మించిపోలేదిప్పుడయినా బుద్ధి తెచ్చుకో" అందామె.

"..............."

"నా మాట విను........... నే నెందుకు చెబుతున్నానో ఆలోచించుకో"

"..............."

".... ఇదిగో .... వాళ్ళ సంప్రదాయం మంచిది కాదు."

"..............."

"ఆ సాని పాప నిన్నెలాగా ససిపెట్టదు. దానివల్ల పెద్ద తప్పు కనపడేదాకా వోపికపట్టి, తరువాత, రెండో పెళ్ళి చేసేస్తా న్నీకు, మూడోనాటికి"

"ఎరక్క వూరికే చేసుకున్నాం మనం దాన్ని. బోలెడు కట్నం వస్తుంది నీకిప్పుడు."

గుండెలు కొట్టుకున్నా యతనికి. కాళ్ళు వొణికాయి.

"ఆ పెద్దమ్మ వారిని సాగనంపేశానంటే, రంభల్లాంటి పిల్లల్ని తెచ్చి లక్షమంది నీ కాళ్ళమీద పడేస్తారు, క్షణంలో."

"సమర్తాడిన పిల్లలే దొరుకుతున్నారిప్పుడు, చూస్తున్నావా?"

వొళ్ళు రణకంపరం యెత్తిపోయిందతనికి. దురుసుగా బయలుదేరాడు.

"వెళ్ళిపోతావేంరా?"

కంగారు పడిపోయిందామె.

వడి యెక్కువయిందతనికి.

"ఇదిగో ........"

"..............."

వెంటనే, నడకా కాకుండా పరుగూ కాకుండా రొప్పుకుంటూ వెళ్ళి, బుచ్చమ్మ, కంఠం నొక్కుకుంటూ "వాళ్ళతో గానీ, నాన్నతో గానీ చెప్పావు సుమా యీ మాట? ఏం .... వినపడిందా?.... వొరేయ్, చలపతిగా – వోరి నీ యిల్లు – వొరేయ్ –"

మాట సగాన కంఠం బిగుసుకుపోయిం దామెకి.

## 28

కంభంపాటి వేంకటచయనులుగారి మేడమీద, వారి చిన్న కోడలితో వసారాగదిలో కూచుని గవ్వలాడుతున్న సోదెమ్మ యిదంతా చూసింది.

బుచ్చమ్మ మాట వినపడగానే లేచి, కిటికీ రెక్కచాటున నక్కి, మాట్లాడవద్దనీ, యెదటికిన్నీ వెళ్ళవద్దని స్నేహితురాలికిన్నీ సన్నచేసి గొడవ అంతా బాగా వింది కూడా.

"అదేం పోయేకాలమండీ?"

"యెంత ఘోరం తలపెట్టిందో చూశావా?" అంటూ బుగ్గలు నొక్కుకున్నారిద్దరూ.

సోదెమ్మ, వెంటనే వెనకవీధి నింటి కెగిరిపోయి, కరివేపచెట్టెక్కి, పిలిచినట్టు నూతికి వచ్చివున్న పూర్ణమ్మని దగ్గిరగా రమ్మని "తెలిస్తే పీకేస్తుంది సుమండీ పిన్నిగారూ, నన్ను" అంటూ అందుకుంది.

"ఏమిటో, చూసుకున్న వేళావిశేషం అలాంటిది. ఒక్క కడుపున పుట్టకపోయినా, జోగమ్మ నాకు రెండో చెల్లెలే అనుకుంటున్నాను."

"ఇంతకంటేనా? మా అమ్మా యదృష్టవంతురాలు. ఇంతకీ, – ఏదో చెప్పవచ్చారు"

"విన్నప్పట్నుంచీ వొక్క విధంగానే తరుక్కుపోతోంది నా కడుపు. మీతో యెలా చెప్పనూ? ఇదేం శుభవార్త కనకనా?"

"అదేమిటి తల్లీ? ఇప్పుడేం వచ్చింది మామ్మా?"

కంగారుపడుతూ నూతిగోడకి చేరపడింది పూర్ణమ్మ. ఏకపుత్రుడు చనిపోగా, ఏకపుత్రిక జోగమ్మే తమకు సర్వమూ అని నమ్ముకుని వుందామె. జోగమ్మ విషయమే ఇప్పుడేదో అశుభం అనేటప్పటికి ఆమె నవనాడులూ కుంగిపోయాయి.

ఇది చూశాటప్పటికీ సోదెమ్మకీ పట్టుకుంది కంగారు.

"కొంపతీసి యెవరితోనయినా అన్నారు సుమండీ. నా మాట పైకి వచ్చిందంటే యిక బతకడాని కాస్కారం వుండదు సుమండీ యీ వూళ్ళో" అని అడుగడుక్కీ బెదురుతూనే, తాను చూసిందీ, విన్నదీ, పూసగుచ్చినట్టంతా చెప్పేసి "ఏంచేస్తారో మరి. మీ జాగ్రత్తమీద మీరుండండి. అమాయిక బ్రాహ్మణుడు, ఈ సంగతి తెలిస్తే గోల పెట్టేస్తాడు, జగ్గయ్య మామ. బెంబేలు పడిపోతుంది, చెల్లాయి కూడా తెలియనివ్వకండేం" అంటూ ముక్తాయించి, ఇదంతా చెల్లెలికీ తండ్రికీ మరిదికీ చెప్పడానికింట్లోకి చక్కాపోయింది.

"ఎంత ఘోరం తలపెట్టావు బుచ్చమ్మతల్లీ? మేము నీ కేం విషం పెట్టాము మామ్మా" అని గుండెలు బాదుకుంటూ, ఇంటోకి వెళ్ళిపోయింది, పూర్ణమ్మ కూడా.

"ఆస్తి తక్కువని నాకేమీ బెంగ లేదు. విచారం అసలే లేదు. చదువు చూసుకున్నా న్నేను. శ్రద్ధా, దీక్షా, ముందుచూపూ వుంటే చాలనుకున్నాను."

"ఉన్నాయా పోనీ?"

"స్పష్టంగా కనపడ్డంలేదు. మనస్సు మాత్రం మంచిది కాని; కొత్త సమస్య ఎదురయింది నాకు."

"ఏమి టదీ?" అనడిగింది రాధమ్మ ఆత్రంగా.

యాజులు కూడా చకితుడయి చూశాడు.

"ఇంటి యాజమాన్యం వారిదా, మా అడబడుచుదా? ఇది తేల్చుకోవాలి నేను."

"రాజమ్మ గండ్ర అని అప్పుడే అనుకున్నా న్నేను."

"నువ్వే కాదు, నేనూ అనుకున్నాను, నిశ్చయమున్నూ అదే. అయితే, ఆవిడ బాగా మాటకారి,..చాలా చురుకయింది. అంతేనా, పెత్తనమే ఆవిడదా? ఇదీ నా సమస్య."

"ఇంతలో తేలేటట్టు లేదా?" అనడిగాడు యాజులు.

"పగలు స్కూలు పనితోనే సరిపోతోంది నాకు, నే నక్కడున్న దేదీ నాన్నారూ?"

"అవునవు"నన్నాడు యాజులు.

కాని "అదేమంత కష్టమే తెలుసుకోడం?" అనడిగింది, రాధమ్మ.

"ఉద్దేశం వుంటే క్షణం చాలు" అంది కృష్ణవేణి.

"ఆ వుద్దేశం ఎందుకు పెట్టుకున్నావు కాదూ?" అనబోయింది రాధమ్మ.

మాట నాలుక చివరికే వచ్చేసింది కాని; తమాయించుకుంది కష్టంమీద.

దాంపత్యం ఎంత కొత్తదో పగలంత వ్యాప్రుత్తి యిద్దరికీ కూడా మరి.

చూసి చూసి కృష్ణవేణి అందుకుంది.

"సంసారం నిష్పేచీగా జరిగిపోయినంత కాలమూ ఏ యిబ్బందీ లేదు. మావారూ నేనూ మేడలో వుండి సుఖపడాలని లేదనుకోకు నాకు. దేనికయినా ఒక పద్ధతీ ఒక నియమమూ వుండాలి. నేను చేసిన పని విషమిస్తే నాన్నారు బాధపడతారు. నేనది చూడలేను."

"మాకది శ్రేయస్కరమూ కాదు"

ఇది విని యాజు లానంద పరవశుడయిపోయాడు.

"దానివల్ల నాకు జయంకూడా కలగదు"

"అదంతా యెవరు కాదన్నారే?"

"కాదన్నారని కాదమ్మా! అలాటిదేమీ తటస్థించ కూడదంటే మా యింటి సంగతి అంతా నా కవగాహన కావాలి. అందుకోసమే నేను సంవత్సరం గడువు పెట్టుకున్నాను."

"మరి, మీ అత్తగారు –"

"ఆవిడ అత్తగారు కారు నాకు, నువ్వే ఆవిడ"

రాధమ్మ సంబరపడుతూ చూసింది యాజులుకేసి.

"మనుషులు చిత్తవృత్తి పరిశీలించడానికొక్క సంవత్సరంకంటే ఎక్కువ అక్కర్లేదు. ఇంతలో చిన్న ఎత్తున బతకడమూ చేతనవుతుంది నాకు"

"ఈలోపున వారెన్ని గుంజాటనలు పడతారో?"

"పడతారో అనుభవిస్తారో"

"సెబాస్" అన్నాడు యాజులు.

మిడుతూ మిడుతూ చూసింది రాధమ్మ.

"ఒకరిసొత్తు మరొకరికి స్వాధీనం కావాలంటే మాటల్లో పనికాదు. నీ ఐశ్వర్యం తక్కువదిన్నీ కాదు"

"కనకనే నాకీబాధ"

"నాన్నా రెంత కష్టపడితే నువ్వింత ఐశ్వర్యవంతురాలవయినావో ఎప్పుడయినా ఆలోచించుకున్నావా?"

కృష్ణవేణి యిలా అడిగాటప్పటి కావృద్ధదంపతులకు తమ ప్రారంభ జీవితం అంతా నెమరుకి వచ్చింది.

అందులో వొక ఘట్టం ఠక్కున జ్ఞాపకం వచ్చింది రాధమ్మకి.

# 11

యాజులు నెల్లూరి జిల్లాకోర్టులో గుమాస్తాగా వుండినప్పటి సంగతి.

ఇక నెలా పదిహేనురోజు లుందనగా, సంకురాత్రికి, రాధమ్మని పుట్టింటివారు తీసుకువెళ్ళరని నిశ్చయం అయింది.

అప్పటి కామె పద్దెనిమిదేళ్ళపిల్ల.

పండుగ లనీ పబ్బా లనీ అచ్చట్లనీ ముచ్చట్లనీ కిందా మీదా పడిపోతూ వుండే వయస్సు.

దగ్గరగా వున్నంత కాలమూ పుట్టింటివా రామెకి బాగానే తీర్చేవారు ముచ్చట్లు; కాని పిఠాపురానికీ నెల్లూరికీ రానూ పోనూ కూతురికీ అల్లుడికీ కావలసిన రెయిలుఖర్చులు ఎవరు పెట్టుకున్నా ఆ మొత్తం తేలాటప్పటికి వారికి గుండె లాగిపోయాయి.

ఇది ఆలోచించి రాధమ్మ కూడా సరిపెట్టుకుంది చివరికి.

మొదట మాత్రం తండ్రి రాసిన వుత్తరంచూసి నిర్ఘాంతపడిపోయిందామె.

ఆమె ఈ రూపం యాజులు కళ్ళల్లో నిలిచిపోయింది.

అతని హృదయం కొట్టుకుంది; కాని వొక్క క్షణంలో తేరుకుని ఆమె కళ్ళల్లోకి చూసి తన వెచ్చని పెదవులతో తాకి ఆమె పెదవులకు చలనం కలిగించుకున్నాడు.

"మడికట్టుకోండి" అంటూ ఆమె వంటింటిలోకి వెళ్ళిపోయింది, తరవాత.

అతను తాపీతా కట్టుకున్నాడు.

కుచ్చెళ్ళు పోసుకునేటప్పుడు "రెండేళ్ళకిందట విజయదశమినాడు నీ అత్తవారిచ్చిన సాదా తాపీతా ఇది. జ్ఞాపకం వుందా? ప్రతీ సంవత్సరమూ పెద్ద పండుగలకు నీ అత్తవారిచ్చిన బహుమతులు కట్టుకుంటూనే వున్నావు కాని; 'పుట్టింటివారిస్తూనే

వున్నారు గదా, లోటులేదు గదా' అని అనుకుంటున్నావేగాని రాధకి నువ్వొక్క చీర అయినా కొనిపెట్టావా పాపం? చిలకవంటి పెళ్ళానికి మొగుడు చూపించవలసిన మురిపెం యింతేనా? పోనీ, వొక్క మంచి రైక అయినా కుట్టించావా నువ్వు? నీ కిది బాగుం దనిపించిందా?" అంటూ ఎవరో నిలవతీస్తున్న ట్టనిపించింది.

వల్లమాలిన సిగ్గు వచ్చి వూాదరగొట్టేసింది, దీంతో అతణ్ణి.

దానిమీద "ఇప్పుడయినా రాధ కొక మంచి చీర కొని యివ్వా"లనుకున్నాడు.

"ఇచ్చి తీరాలి. ఈ పండుక్కి కొత్తచీర లేని లోటు రానివ్వకూడదు" అని దృఢపరుచుకున్నాడు.

కాని డబ్బేదీ?

ఏ నెలజీతం ఆ నెలకే చాలీచాలకుండా వుంది.

అక్కడికీ నెల్లూరిలో యిళ్ళ అద్దెలు చౌక కనక సరిపోయింది, లేకపోతే యెన్ని వడిదుడుకులు పడవలసివచ్చేదో దినమ్మా?

రాధమ్మ కూడా బాగా పొదుపుచేసే మనిషి కనక అట సాగుతోంది గాని యెన్ని అరువులూ - యెన్ని అప్పులూ పెరిగిపోయేవో. నెల నెలా.

ఏమయినా, చీర కొనితీరాలని శపథం చేసుకున్నాడు.

మరి డబ్బు?

ఖర్చులు తగ్గించుకోడం తప్ప మరో మార్గాంతరం కనపడలేదు.

ఆలోచించగా, రాధమ్మ చేసే ఖర్చుల్లో దూబరా యేమీలేదు.

దూబరా కాకపోయినా, తాను చేసే ఖర్చుల్లోనే వుంది తగ్గించుకోడానికేమాత్రమో వీలు.

అదే తగ్గించుకోవా లనుకున్నాడు.

అది మొదలు.

నాటకాలకు వెళ్ళడం మానేశా డతను.

పుస్తకాలు కొనడం మానేసి, భాండాగారానికి వెళ్ళడం మొదలుపెట్టాడు.

వినోదయాత్రలు కట్టిపెట్టేశాడు.

"ఖర్చులు మేమే పెట్టుకుంటా" మన్నారు చనువుగల స్నేహితులు; కాని "ఛా, ఛా, అదేంమాట? నాకంటే ఉదారులు కామోసు మీరు మహా! వెళ్ళండి వెళ్ళండి." అంటూ గదిమి పంపేశాడు వాళ్ళని.

కోర్టుకి వెళ్ళేటప్పుడూ వచ్చాటప్పుడూ నడక ప్రారంభించాడు, ఎంత యెండయినా.

మధ్యాహ్నం కోర్టులో, ఫలహారం వొక్కటే కాదు - కాఫీ కూడా మానుకున్నాడు.

ఆ బాపతుల కోసం ఖర్చు పెట్టే డబ్బెప్పటి కప్పుడు సేవింగ్సు బాంకిలో వెయ్యసాగాడు, రూపాయకు తక్కువ కాకుండా.

ఇంకా యేమిటేమిటో చేశాడు గాని; పొద్దుటి పూట ఇంటి దగ్గర కాఫీ పుచ్చుకోడం మాత్రం మానుకోలే దతను.

## |12|

ఆవేళ పెద్దపండుగ.

తెల్లవారాటప్పటికి వీధంతా రకరకాల ముగ్గులతో నింపేసింది రాధమ్మ.

తరవాత, ప్రొద్దుపొడిచాటప్పటికి యాజులు కిచ్చి తాను కాఫీ పుచ్చుకోడం – తొమ్మిదిన్నర అయ్యేటప్పటికి వంట పూర్తిచెయ్యడం – ఆ చెయ్యడం లోనూ చక్కెర పొంగలీ, వంకాయబజ్జీ కూడా చెయ్యడం – మామూలుగా కాక కొసిరి కొసిరి ముందతనికి వడ్డించడం – తరవాత తానున్నూ భోజనం చెయ్యడం – ఇల్లంతా సద్దుకోడం – పనిమనిషికిన్నీ అవీ యివీ పెట్టడం – కాస్సేపు విశ్రమించడం – అగరునూనె రాసి ముందతనికి దువ్వి తానూ తలదువ్వుకోడం – బొట్టూ కాటుకా పెట్టుకోడం – మూడయ్యేటప్పటి ముందతనికిచ్చి తానున్నూ మళ్ళీ కాఫీ పుచ్చుకోడం – అతని నోటికి తమలపు చిలక లందిస్తూ తాను గూడా తాంబూలం వేసుకోడం – ఈ అడావుడిలో మునిగిపోయి ప్రపంచం మరిచిపోయిందామె.

కాఫీలు పుచ్చుకోడమూ, భోజనం చెయ్యడమూ తప్పించి తనకి మరేమీ పని లేకపోయినా యాజులూ మరిచి పోయాడప్పటిదాకా ప్రపంచం.

అయితే, ఆమె వ్యాపృత్తి వేరూ, అతని వ్యాపృత్తి వేరూనూ.

ఖర్చులు తగ్గించుకోడమూ, తద్వారా తన వుబలాటం తీరే సన్నివేశం కల్పించుకోడమూ – ఇవి అనన్యసాధ్యాలు అతని దృష్టిలో.

ఏమంటే?

అంతమంది కోర్టు గుమాస్తాగాళ్ళున్నారు మరి, వొక్కడయినా చెయ్యగలిగాడా యిలాంటి ఘనకార్యం?

కనక, యిదంతా రాధమ్మకి తెలియాలి.

తెలియాలంటే చూసి గ్రహించుకోగలిగేటంత ప్రతిభావంతురాలు కాదామె, తానే విప్పి చెప్పాలి.

చెదితే మాత్రం డంగయిపోతుంది, సందేహం లేదు.

కాని, వెంటనే చెప్పేస్తే గాంభీర్యం చెడుతుంది.

తనక్కూడా ఉత్సాహం పోతుంది.

కనక?

పనంతా పూర్తి చేసుకుని కట్టుకోడాని క్కొత్తచీర లేనందుకు చాలా చిన్న బుచ్చుకుంటుందామె.

పుట్టింటివారిమీద అసంతృప్తి కనబరుస్తుంది.

ఇంటో కూచుంటుంది, వీధి మొగం చూడకుండా.

కొత్తచీరలు కట్టుకున్న ఆడపిల్లలు కనబడితే తాళుకోలేదు మరి.

అయితే, ఆ స్థితి యెంతోసేపుండనివ్వగూడదు.

ఉండనిస్తే వ్యవహారం యెదురుతిరుగుతుంది.

"మావాళ్లు తీసుకు వెళ్ళకపోతే పోయింది, వారయినా వొక చీర కొనగూడదూ?" అనుకుంటుంది.

"ఇప్పుడు కొనలేదనుకోడానికి వొకప్పుడు మాత్రం కొనివుంటేనా అసలు" అనుకుంటుంది.

"మీరయినా కొనగూడదు టండీ?" అంటూ అడిగివేస్తే అడిగి వెయ్యవచ్చు కూడా, తనని.

కనక అలాంటి ఆరాటం ప్రారంభం కాకుండానే గమ్మత్తు చెయ్యాలి తాను.

దాంతో, కొండంత ఆశ్చర్యపడిపోవా లామె.

ఉక్కిరిబిక్కి రయిపోవాలి.

అమాంతంగా వచ్చి తనమీద పడిపోవాలి, ఆనందం పట్టలేక.

కంఠం పెనవేసుకోవాలి.

వొళ్ళోకూచోవాలి, బుగ్గకి బుగ్గ ఆనించి.

"చాలా మంచివారండీ మీరు. పండుగు ముచ్చట బాగా తీర్చారండీ నాకు. మావాళ్ళకంటే మీరే నయమండీ. మహామంచి చీర తెచ్చారండీ. రైక కూడా – కుట్టించి మరీనీ. అయితే నన్నడిగి మచ్చు పట్టుకు వెళ్ళలేదు గదా, కొలత లెలా వచ్చాయండీ మీకు? అబ్బో! ఎంత బాగుందో? తొడుక్కుంటే పూసినట్టెలా సరిపోయిందో? చీరకి తగిన రైక తెచ్చారండీ మీరు, రెండింటికీ మహా బాగా కలిసిందండీ కవ. పాము మీసంలాగ ఎంత నాజూగ్గా వుందో చీర? కట్టుకుంటే, నాకెంత నిండు వచ్చిందో?" అంటూ యిలాగ వుబ్బితబ్బిబ్బయి పోవాలామె.

"ఈమాటు పిఠాపురం వెళ్ళినప్పుడు మావాళ్ళింత మంచిచీర పెట్టకపోతే వూరుకోను" అనుకోవాలి.

అంతటితో ముగియకూడదు.

ఇరుగు పొరుగు వాటాల్లోకీ యిళ్ళకూ వెళ్ళి, తన చీరా రైకా అక్కడి యువతులకు చూపించాలి.

"మావారు కొన్నా" రని చెప్పాలి వాళ్ళకి.

ఆమె చుట్టూ మూగాలి వాళ్ళు.

ఆ చీరా ఆ రైకా చూసి వాళ్ళు గుటకలు మింగాలి.

తమ భర్తలు తమకలాటివి తెచ్చి యివ్వనందుకు చిన్నబుచ్చుకోవాలి వాళ్లు.

"యాజులుగా రెంత మంచివారో?" అనుకోవాలి వాళ్ళు.

"అందచందా లాయనకు తెలిసినట్టెవరికి తెలుసునూ?" అనిన్నీ అనుకోవాలి వాళ్ళు.

"బట్టలు నాణ్యమూ, ఎవర్తికేరంగు నప్పుతుందో అదీ ఆయనకి బాగా తెలుసు" ననికూడా అనుకోవాలి వాళ్ళు.

"మావారి నడిగి డబ్బు పుచ్చుకుని యాజులుగారి చేత తెప్పించుకోవాలీ మాటు" అని నిశ్చయించుకోవాలి వాళ్ళు.

కోడళ్ళు కొందరు పుట్టిళ్ళకు వెళ్ళివుంటారు.

ఉన్నవాళ్ళకే చూపించాలి రాధ.

కోడళ్ళు కొందరు వెళ్ళినా ఆడబడుచులు కొందరు వచ్చి వుంటారు, మొగుళ్ళతో, వాళ్ళకీ, చూపించాలి.

తన అదృష్టం మెచ్చుకోవా లామె.

తననీ మెచ్చుకోవాలి బాగా.

బాగా అంటే చాలదు "మీవంటి మొగుడీచుట్టుపట్ల యెవర్తి కున్నాడూ?" అనాలి.

"మీ రుణం తీర్చుకోలేనండీ" అనికూడా అని మళ్ళీమళ్ళీ కౌగిలించుకోవాలి, తనని.

ఇల్లంతా గందరగోళం చేసెయ్యాలి, చివరికి.

సమయం కాకుండా యిప్పుడే చెప్పేస్తే యింత అందం వస్తుందా?

ఈ సుఖం కలుగుతుందా?

ఈ దర్జా కనపడుతుందా?

కనక, మహోగుట్టుగా వుండా లనుకున్నా డతను.

ఉన్నాడు కూడా.

కాని వుండలేకపోయాడు.

ఉరకలు వేసుకు వచ్చేసిం దుత్సాహం.

కడుపుబ్బి పోయింది.

కాళ్ళు తేలిపోయాయి.

వెతుక్కుంటూ ఆమె వున్నచోటికి వెళ్ళాడు వెంటనే.

"ఏమి కావాలండీ?" అందామె.

"అబ్బే, ఏమీ లేదు" అని వెనక్కి వచ్చేశా డతను.

కుర్చీలో చతికిలబడ్డాడు.

పుస్తకం చూదా మనుకున్నాడు, చూడలేకపోయాడు.

ఎప్పుడూ లేంది, నల్లి కుట్టినట్టయింది.

పైగా "అలాంటి పెళ్ళాం దగ్గిర యింత రహస్యమూ?" అని యెవరో నిలవతీసి నట్టయింది.

"నువ్వు చెయ్యవలసిన పనే చేశావు. ఇందులో నీ ఔదార్యం యేమీ లేదు" అన్నట్టూన్నూ అయింది.

గభీ మని లేచి మళ్ళీ వంటింటిలోకి వెళ్ళాడు.

మజ్జిగ వడ్డించుకుంటోం దామె.

"ఎందుకండీ?" అంది.

కాని మనస్కరించలే దతనికి.

"తమాషా చేస్తే తప్పా?" అనుకున్నాడు.

ఊరికే వెనక్కి మళ్ళడానికి వీలులేక "మంచినీళ్ళు కావా" లన్నాడు.

ఆమె లేవబోయింది.

కాని "వద్దువద్దు, నేనే పుచ్చుకుంటానులే" అంటూ వెళ్ళి గ్లాసు బిందెలో ముంచుకుని తెచ్చుకున్నాడు.

మరి పుచ్చుకున్నాడా?

గ్లాసు నోటిదగ్గిర మాత్రం పెట్టుకుని, తొణక్కుండా మెల్లిగా నడిచి వచ్చి, వోమాటు వెనక్కి చూసి, గ్లాసెడు నీళ్ళూ పారబోశాడు వీధిలోకి వెళ్ళి.

ఏమయినా సరే, యిక గుట్టుగా పడివుండవలసిందే అనుకుని కూనిరాగం తీసుకుంటూ వెళ్ళి మంచాన వాలాడు.

కాని పడుకోలేకపోయాడు.

ఇంటో వున్నంతసేపూ మంచంకోసం పాకులాడతారు చాలామంది.

మంచం నడానే కూచుంటారు కొందరు, పోసుకోలు కబుర్లు చెబుతూ కూడా.

శ్రమపడినప్పుడు మాతృక్రోడం అవుతుంది మంచం.

యోగిలాగ నిశ్చలంగా వుండాలంటే మంచం వొక్కటే తగిన ఆధారం.

ముఖ్యంగా తెలుగువాడికి ఏమి లేకపోయినా మంచం వుండాలి.

పైగా నెల్లూరి కవాచీమంచం అది.

మెత్తని పరుపు.

తెల్లని దుప్పట్టీ.

పక్కన, మనిషి పొడూగునా రగ్గు.

దోమతెర.

అయినా పడుకోలేక పోయాడతను.

చీమలూ జెర్రెలూ పాకినట్టుంది వొళ్ళంతా.

"ఏమిటీ వేషం" అని ఎవరో అడిగినట్టయింది.

"అంత చాకిరీ చేస్తోంది నీకోసం. నీలాగ, నువ్వు తనని మెచ్చుకోవాలనుకుంటోందా? ప్రేమ అంటే ఏమిటో ఎరుగదువా నువ్వు? ఇంగ్లీషు చదువుకున్నావే, మరి, దొర లిలాగే చూస్తారా దొరసానులను? నేర్చుకుపోయావు, లే లే, యీదురోమంటూ చేసుకుంటోంది పని, వెళ్ళి చెప్పు, సంబరపడి ఉల్లాసంగా చేసుకుంటుంది పాపం" అనిన్నీ మందలించినట్టయింది.

దిగాలంటే లేచి కూచోవాలి, చివరికి రావాలి, దిగాలి – ఇంత యెందుకని గభీమని దిగజారేశాడు కిందికి.

మళ్ళీ బయలుదేరాడు.

కాని కూటంలోకే కనపడుతోంది, యిల్లుకడుగుతూ ఆమె.

ఇప్పుడెలాగా చెప్పడం?

ఏమంత మునిగిపోయిందనీ యిప్పుడు చెప్పడం?

"ఇన్నాళ్ళ కోచీర కొన్నారే, ఎలాగయితే?" అనేస్తుందేమో ఆమె?

గిరిక్కున మళ్ళాడతను.

చురుక్కున వూహా తట్టింది. "ఎక్కడికయినా వెళ్ళి వస్తేనో?" అని.

బాగానే వుంటుంది, ఈ తహతహా తప్పుతుంది కాని; తీరా వెడితే సమయానికి రాలేకపోతే?

ఇలా అనుకుని కూటంలోనే పచారు మొదలుపెట్టాడు.

పచారంటే "మందపాదవిన్యాసం" గీర్వాణంగా చెప్పాలంటే.

కాని గబగబా అడుగువెయ్యసాగాడతను.

ఎంతకీ పని తెమల్చుకోలేకపోతోంది మరి, రాధమ్మ లోపల.

అంత మందకొడి అయితే యెలాగా?

ఈ చిరాకుతో ఆమె క్కలగవలసిన తొందర అతని క్కలిగింది.

కాని, వొక్క క్షణంలో గుర్తించుకున్నాడది.

లోపల్లోపల నవ్వుకున్నాడు.

"హు! ఏమిటీ తిప్పలు?" అనుకున్నాడు, వెంటనే.

"పని యేమట్టుకయిం"దని అడిగితే కొంచెమయినా తొందర పుడుతుందేమో ఆమెకి అనుకున్నాడు.

సాచివేశాడడుగు.

కాని, "అలా అడిగితే కనిపెట్టేస్తుంది" అనుకున్నాడు.

"ఇక్కడ కా" దనుకుంటూ వీధి అరుగుమీదికి వెళ్ళిపోయాడు.

వెళ్ళాడు, "కనకాంబరా"లంటూ కేక వినవచ్చింది.

చూడగా, పూలబుట్ట వీపుమీద పెట్టుకుని వొక ముసలమ్మ వస్తోంది, కర్రమీద ఆనుకుని వంగి నడుస్తూ.

"ఛీ" అనుకున్నాడతను, పైకే.

"ముసలివగ్గులా కనకాంబరాలమ్మడం?" అనుకుని అసహ్యించుకున్నాడు.

బజారునుంచి వస్తోంది, ఆచారివీధికి వెళ్ళిపోతోందామె.

గుమ్మం దాటేసింది కూడా.

"పువ్వులు కొనుక్కుందో లేదో రాధ?" అనుకున్నాడు.

"అప్పుడు కొనబోతే వస్తాయా పువ్వులు?" అనుకున్నాడు.

"మనం కొత్తచీర తెచ్చాంగదా మరి, పువ్వుల్లేక పోతే యెలాగా?" అనిన్నీ అనుకున్నాడు.

"మనిషి ముసలిదయితే పువ్వులు ముసలివవుతాయా?" అని సద్దిచెప్పుకున్నాడు.

"ఏయ్" అన్నాడు ఆమె సందుమళ్లకుండా.

"ఓ పువ్వుల ముసలమ్మా, నిన్నే" అన్నాడు.

"పువ్వులు కావాలటనా అయ్యా?" అందామె, అక్కడే వుండి యిటు చూస్తూ.

"అమ్ముకోవా?"

"నువ్వు కొనుక్కోవా?"

"మరి, అక్కడే వుంటావేం?"

"మరి, ఇక్కడికి వచ్చేదాకా చూస్తూ వూరుకున్నావేం?" తెల్లపోయాడు దాంతో.

"చింత చచ్చినా పులుసు విరగలేదన్నట్టు, ముసలితనం వచ్చినా వెల్లూరి వెరజాణతనంపోలే"దనుకున్నాడు.

చూడగా "ఏందయ్యా, గమ్మున వుండిపోయావూ?" అనడుగుతున్నట్టు చూస్తోందా పూవుబోడి.

ఏమిటీ చెయ్యడం?

చీరకి సాయం పువ్వులు కూడా తానే కొంటే మురిసిపోదూ రాధ?

కాని, యెవరయినా చూస్తారేమో?

అనుమానిస్తూనే పిలిచా డామెని.

చూడగా పువ్వులు బాగానే వున్నాయి.

రెండణాల విమ్మన్నాడు, అణావే అయితే చాలవేమో అని.

నూరయినా వుంటాయో లేదో నాలుగుమాట్లు చేతిలో పెట్టిందామె, కొసిరికొసిరి.

"ఇంతేనా రెండణాలకూ?"

"ఎన్నిరెట్లున్నాయో చూసుకోవయ్యా"

"............."

"రాజాపువ్వులు కాదంటయ్యా, రోజాపువ్వు లెందుకు పనికివస్తాయీ వీటిముందు?"

"..............."

"ఆడవాళ్ళు బేరంచేస్తే అన్నిస్తా నంటయ్యా, అసలు?"

తెల్లపోయా డత నాధోరణి చూసి.

అది గుర్తించి "ఇదే కొనడమా ఏందయ్యా పువ్వులు?" అని సాగదీసుకుంటూనే వెళ్ళిపోయిందామె, టక్కూ టక్కూ కర్ర అనుకుంటూ.

అతనిలా వీధిలోనుంచి వెళ్ళాటప్పటికి వంటింటోనుంచి అలా రాధమ్మ వచ్చింది పని పూర్తిచేసుకుని, కూటంలోకి.

"అదేమి"టంది వస్తూనే.

"కనకాంబరాలు."

"కొన్నారా?"

"అవును."

"ఎంత వవి?"

"బేడవి."

"............. అయ్యో"

"ఏం?"

"ఎన్నండీ?"

"లెక్కపెట్టలేదు. నూరింటికి తక్కువ వుండవు."

"ఎవరి దగ్గిర –"

"నడుంవంగిపోయిన ముసలిపండు –"

"అణాకే మూరిచ్చిందే పొద్దున్న నాకది?"

నిర్విణ్ణు డయిపోయా డతను.

"అయితే లెండి, అణా నష్టానికి బాధపడకండి, వంద రూపాయల లాభం!"

"అదేమిటి?"

"ఇప్పుడిప్పుడే యెర్రగులాబీ పువ్వు లిచ్చి వెళ్ళింది వాళ్ళ రమణ, కనకాంబరాలు దొరకలేదని బాధపడుతూ."

"అయితే."

"దాని కిచ్చేస్తాను మనం బదులు తీర్చినట్టూ అవుతుంది, దాని ముచ్చటా తీరుతుంది."

ఇలా అంటూనే అతనిచేతిలో వున్న పువ్వులు నొల్లుకుని పెరట్లోకి చక్కాపోయింది రాధమ్మ.

"అణే కాదు బేడా నష్టమే" అనుకుంటూ పడకటింటి వసారాలోకి వెళ్ళిపోయాడు యాజులు.

# 13

ఉన్న చీరల్లో మంచివి నాలుగుపట్టుకువచ్చి "వీటిలో ఏది కట్టుకోను చెప్పండీ" అంటూ వచ్చి యాజులు పక్కన కూచుంది రాధమ్మ.

"నన్నడగడం ఎందుకూ?"

"మంచిచీర కట్టుకోడం మీ కోసమా నా కోసమా?"

"నిజమే అనుకో. అందులో వొక్కటీ కూడా నేను కొన్నది కాదు. మీ వాళ్ళిచ్చినవీ, ఏరి నువ్వు కొనుపించుకున్నవీనీ."

"అయితే?"

"వాటిలో కొన్ని బాగున్నాయనీ, కొన్ని బాగా లేవనీ చెప్పడానికి నా కేమి అధికారం వుందీ?"

"అదేమిటండీ"

"ఏం?"

"మీ రుచి ఏమిటో చెప్పడానికేం?"

"చెబితే?"

"మీరేది కట్టుకోమంటే అది–"

"నాకేదీ నచ్చకపోతే?"

"చెప్పండీ పెడర్థాలు తియ్యక."

ఇలా గునుస్తూ తన ఎడమచెయ్యి అతని కంఠానికి చుట్టవేసి, కుడిచేత్తో గెడ్డం పట్టుకుంది, తల అడ్డంగా వూపుకుంటూ.

వొళ్ళు జల్లుమం దతనికి దాంతో.

ఆనందం వుక్కిరిబిక్కిరి చేసింది.

మాటరాక గంభీరంగా మాత్రం చూశాడు.

"చెప్పరూ?" అందామె, మొగంమీద మొగంబెట్టి.

ఇక ఆగలేకపోయాడు.

"నేను మానెయ్యమన్నవి మానేసి, కట్టుకోమన్నది –"

"కట్టుకుంటానండీ"

"నిజంగా?"

"హొట్టండీ."

"అయితే, అవన్నీ పెట్టెలో పెట్టేసి రా."

ఆమె కేమీ అర్థంకాలేదు.

అయినా, ఏదో కారణం లేకుండా అతనలా అనడని యెరుగును కనక, – అతని మాటకి అడ్డుకూడా చెప్పలేదు కనక, అవి పెట్టెలో పెట్టేసి వచ్చి మళ్ళీ పక్కని కూచుని "మరి చెప్పండి" అంది.

అతనికి నవ్వు వచ్చింది.

అపుకున్నాడు.

ఉద్వేగం హెచ్చింది.

అణుచుకున్నాడు.

తొందర పుట్టింది.

నిగ్రహించుకున్నాడు.

గంభీరంగా చూశాడు.

తాపీగా లేచాడు.

దర్జాగా గదిలోకి వెళ్ళాడు.

లాఘవంగా టేబిలు సొరగు లాగాడు.

మెల్లిగా వొక పొట్లం తీశాడు.

బెల్లించి చూస్తూ పక్కన కూచుని ఆ పొట్లం చేతిలో పెట్టాడు.

ఆమె చేతులు గబగబాలాడిపోయాయి.

విప్పి చూడగా, అల్లనేరేడుపండు చాయలో నిగనిగలాడుతూ పుల్లంపేట జరీచీర.

చకిత అయిపోయిందామె.

"ఏమిటండీ యిది? ఎక్కడి దండీ? ఎలా వచ్చిందండీ"అంటూ ఆగి ఆగి అడిగిందామె, డగ్గుత్తిక పట్టుకోగా ధారాళంగా మాట్లాడలేక.

బదులు చెప్ప లే దతను.

ఆమె ముంగురులు నిమిరాడు, "చెప్పనుకో" అన్నట్టు పెదవులు బిగించుకుని, తల యెగరవేసుకుంటూ.

"చూశారా"

"నువ్వు చూస్తేగదా చీర?"

మడత విప్పిం దామె, అతనికి బదులు చెప్పలేక.

మైజారు చూసి పరవశ అయిపోయింది.

"చూశాను, మరి, చెప్పండి"

"చెబుతాను వెళ్ళి కట్టుకురా"

"కట్టుకోనా యేమిటి, చెప్పండీ"

"చెప్పనా యేమిటి, కట్టుకురా"

గదిలోకి వెళ్ళి ఆమె మడత అంతా విప్పగా యేదో కిందపడింది.

"ఇందులో పట్టుజాకెట్టు కూడా వుందండీ"

"తొడుక్కురా"

యాజి లక్కడ మాట్లాడకుండానే కూచున్నాడు కాని; "మామిడిపిందె లెంచక్కున్నాయో;" "బాబోయ్! పద్దెనిమిది మూళ్ళ పొడుగున్న ట్టుంది" "ఇలాంటివి వొక్కటీ పెట్టలేకపోయారు మావాళ్ళు" "ఎన్నాళ్ళనుంచో మనసు పడుతున్నా నీరంగుకోసం. పాపం, చెప్పినట్టు తెచ్చి పెట్టారు" "గూడకట్టుకి లొంగకపోతే, నెల్లూరికట్టే కట్టుకుంటాను, నాకేం చేతకాదా, యిష్టంలేదా?" అంటూ యిలాగ రాధమ్మ అక్కడ మాటమీద మాట అనేసింది.

అదంతా విని చాలా సంతోషించా డతను.

తరవాత, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ వచ్చి అతని పాదా లంటి కళ్ళ కద్దుకుని, వొళ్ళో కూచుంది, "యిదెలా వచ్చింది చెప్పరూ?" అనడుగుతూ.

"పుల్లంపేటలో వొక దేవాంగి నేశాడు"

"అలాగా"

"అది తెప్పించి, నాతా సుదర్శనశెట్టి నెల్లూరి బజారులో పెట్టి అమ్మాడు"

"సరే"

"నేను కొన్నాను"

"బాగుంది"

"నువ్వు కట్టుకున్నావు"

"ఎలా వచ్చిందన్నాను"

"మళ్ళీ మొదలా?"

"మరి, నా ప్రశ్న అలాగే వుండిపోయింది కదూ?"

"లేదు, బాగా ఆలోచించుకో"

"పోనీ, యిది చెప్పండి, డబ్బెక్కడిదీ?"

"మన యింటోదే"

"నాకు తెలియకుండా –"

"రహస్యంగా మిగిలిస్తే –"

"ఎవరూ"

"నేను"

"ఎలా మిగిల్చారూ?"

రెప్పవెయ్యకుండా చూశా డతను.

"చెప్పరు కాదూ? అయితే నన్ను –"

"అగు అగు. ఇవాళ అలాంటి మాటలు రాకూడదు."

"అయితే చెప్పండి మరి"

యాజులు జరిగిం దంతా చెప్పాడు.

"నిజంగా?" అనడుగుతూ చెయ్యి చాపిందామె.

"అక్షరాలా నిజం. ముమ్మాటికీ నిజం" అంటూ అతనా చెయ్యి గిల్లాడు.

ఆమె మనస్సు గుబగుబ లాడిపోయింది.

హృదయం నీరయిపోయింది.

కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

"చూశారా? నా చీరకోసం కారెండలో నడచివెళ్ళారా?" కడుపు మాడ్చుకుని వుసూరుమంటూ పనిచేశారా అక్కడ? చీర లేకపోతే నాకు పండుగు వెళ్ళదనుకున్నారా? నేను రాకాసినా?"

ఇక మాట్లాడలేక, అతని మెడపట్టుకుని దుఃఖించసాగిందామె.

అది చూసి మొదట కొయ్యయిపోయా డతను.

తా ననుకున్నది లేకపోగా, పైగా, యీ వులకం.

దీంతో, ఆమె హృదయం బహుచక్కగా అవగాహన అయిందతనికి.

ఆమె ప్రణయసరణీన్నీ సుగమం అయింది.

కాగా, అంతలో తేరుకుని "ఏడుస్తావా? నేనేది వద్దనుకున్నానో అదే చేస్తావా? ఇలా చూడూ. అబ్బే! అయితే నీకూ నాకూ మాటల్లేవు. నాకూ నీకూ జత లేదు" అంటూ మూతి బిడాయించుకుని ఆమె మొగం పైకెత్తి కొంటె చూపులు చూశాడతను.

ఏడు పల్లా నవ్వయిపోయిం దామెకి.

"మరి నాతో యెందుకు చెప్పారు కారూ? నేను మాత్రం తగ్గించుకోక పోదునా? కాఫీ మానుకోకపోదునా? అలా చేస్తే మీక్కూడా జామారు రాకపోవునా?"

"ఇప్పుడు రాకపోతేనా?"

"ఏదీ చూపించరూ?"

ఒకరి నొకరు పొదువుకుని లేచా రిద్దరూ.

అలాగే వుండి ముందుకిన్నీ నడిచారు.

సొరుగు లాగి యాజులు వేంకటగిరి సరిగంచుల చాపుపైకి తీశాడు.

అది వులాక్కుని, తిరగేసీ చూసి, సంతోష విహ్వల అయి "మరి తొరగా కట్టేసుకోండి" అంటూ బుజాలు పట్టుకుని వూపేసిందతణ్ణామె.

ముప్ఫయిసంవత్సరాలనాటి యీ సంగతి మళ్ళీ అప్పుడు జరిగినట్టూకాగా, వొక్కక్షణం పరవశ అయి వుండిపోయింది రాధమ్మ.

తరువాత ప్రకృతిలో పడి "ముసలివాళ్ళం మేము కోటలాంటి మేడలో కాపరమూ, మా అమ్మవు నువ్వు పందిరిలాంటి అద్దెకొంపలో కాపురమూనా? చూడలేను తల్లీ! నా కడుపు చెరువయిపోతోందే అమ్మా?" అని గోలపెడుతూ కృష్ణవేణి రెండుచేతులూ పట్టుకుందామె.

ఆ మాతృవాత్సల్యం చూసి పసిబిడ్డ అయిపోయి కృష్ణవేణి తల్లిమీదికి వాలిపోయింది.

యాజులు వచ్చి రాధమ్మ కళ్ళుతుడిచాడు.

కాని, ఎంత చెప్పీ, యేమి చేసీ, కూడా రాధమ్మ కృష్ణవేణి నిశ్చయం మళ్ళించలేకపోయింది.

పైగా, ఆమె వ్రతం కొనసాగించడానికే పూనుకుంది.

## 14

కృష్ణవేణీ, కోటీశ్వరశాస్త్రీ, రాధమ్మా, యాజులూ బెంగుళూరినుంచి వస్తూ సపరివారంగా మద్రాసు మెయిలు దిగారు.

వేసవి సెలవలు అనంతరం ఆవేళే తెరిచారు మునిసిపల్ హైస్కూలు.

ఆదరాబాదరా స్నానంచేసి, నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని టెన్నిస్‌బాటు హాండిల్‌బారుకి తగిలించుకుని దర్జాగా సైకిలెక్కి బయలు దేరాడు శాస్త్రి.

కాని స్కూల్లో అడుగుపెట్టాటప్పటి కతనికి నవనాడులూ కుంగిపోయాయి.

ఎవరి స్థానంలో అత నాక్టింగుగా పని చేస్తున్నాడో ఆ పెద్ద మనిషి, తనకి సెలవు అవసరం లేదన్నట్టు రాసుకుని, చైర్మను సెలవుపొంది, క్లాసులో నుంచునివున్నాడు.

గొప్పవారి పిల్లని పెళ్ళిచేసుకుని తనకి బహుమతీ యివ్వనందుకు ఆ స్థితిలో శాస్త్రికేసి వోరకంట చూస్తూ స్కూలు నౌకరు విషపునవ్వు నవ్వాడు.

విద్యార్థుల మొగాలమీద కూడా శాస్త్రికి వెటకారమే కనపడింది.

హెడ్మాష్టరు దగ్గిరికి వెళ్ళగా "నేనేమి చెయ్యగలనూ?" అన్నాడు.

తోటి వుపాధ్యాయు డొకడు "ఏదో కుంభకోణం జరిగింది. వివరాలు మాత్రం చెప్పలేను" అన్నాడు.

రైటరు దగ్గిరికి వెళ్ళగా "ఏమి జరిగిందో చెప్పలేను. జరగడం మాత్రం సిసలు. అయితే, అది యీ స్కూలు ఆవరణలో మాత్రం జరగలేదు" అంటూ ఖండితంగా చెప్పాడు.

కమీషనరు దగ్గిరికి వెళ్ళగా "మీరు బెంగుళూరిలో వున్నారు, నే నిక్కడున్నాను. ఇంతే భేదం. ఫలితం – మీ కెంత తెలుసునో నాకూ అంతే తెలుసు. ఆ సంబంధమైన కాగితాలు కావాలంటే మాత్రం చూపించగలను" అని చెబుతూ చాలా జాలి కనబరిచాడు.

శాస్త్రి కాగితాలు చూశాడు; కాని కిటుకు తెలియలేదు లేశమున్నూ.

చివరికి "ఇక్కడ మీరెంత తంటాలుపడ్డా లాభంలేదు. కార్యమే కాదు, కారణాలూ తెలియవు" అని ఆఫీసు మానేజరు సలహాకూడా చెప్పగా కాళ్ళీడ్చుకుంటూ – సైకిలు గెంటుకుంటూ చెయిర్మను ఇంటికి వెళ్ళాడు; గాని దర్శనం కాలేదు.

నిరాశ చేసుకోలేక శాస్త్రి పడిగాపులు పడివుండగా సంగతి తెలుసుకుని "యీ విషయమై మాట్లాడవలసిందేమీలే" దని కూడా నిక్కచ్చిగా వర్తమానించాడు చైర్మను.

కళ్ళ నీళ్ళు పర్యంతరమూ అయి శాస్త్రి యింటికి వచ్చాడు.

ఆ సమయాన యింటికి తిరిగిరావడం చూసి తెల్లబోయింది రాజమ్మ.

జరిగింది కూతురు చెప్పగా "అయ్యో" అంటూ చతికిల బడిపోయింది మహాలక్ష్మమ్మ.

## 15

"కానయితే, నువ్వు మహా పొంగిపోతున్నావు కాని నీ కోడలి పాదం మంచిది కాదమ్మా!"

కొడుకు ఉద్యోగం పోయినందుకే విచారిస్తున్న తల్లిని యెత్తి పొడుస్తూ యిలా అంది రాజమ్మ.

"దాన్నలా అనకే, ఎన్నివేల సంవత్సరాలు తపస్సు చేస్తే మనకలాంటి పిల్ల దొరుకుతుందే?"

"తపస్సు కూడా చెయ్యాలి, ఇనపగజ్జెల తల్లికోసం"

ఇలా అంటూ తల్లిబుగ్గలు పొడిచినంతపని చేసి, నిప్పులు కక్కి, పళ్ళుకొరికి మళ్ళీ అందుకుంది రాజమ్మ:

'ఇనప్పెట్టెలో రెండు లక్షల కరుకులున్న తండ్రిచేత నిక్షేపం వంటి మొగుడికి వొక్కదమ్మిడీ అయినా కట్నం యిప్పించలేకపోయింది. మొగుడికి కట్నం వస్తేనే తనకి గొప్పో, తండ్రి వ్రతమే తనకి గొప్పో గ్రహించుకోలేకపోయింది నీ విద్వాంసురాలు. దానిమూలకంగా యేదో చిక్కు వస్తుందని నే నప్పుడే అనుకున్నాను, సరి, రానే వచ్చింది.'

"ఆరునెల్లయి అది వస్తే–"

"ఆరేమిటి తొంభయ్యారేమిటి, నువ్వెన్ని చెప్పినా, యెంత చెప్పినా, నీ కోడలు నా తమ్ముడికి శనిదేవతగాని మరొకటి కాదు. పండుగులకు యేమో జామారుగుడ్డలు తప్ప, వొక్క గవ్వ యెరుగునా తమ్ముడు? తమకి మూడు మేడలున్నాయిగదా కాపరం వుండమని మన కొకటి యిస్తే యేం? ఏమిచ్చినా తమ కూతురికే వుంటుంది గాని మనమేమీ మింగెయ్యంగదా? అగరువత్తులు – సెంట్లు – పన్నీరు తాంబూలానికి తుని ఆకులేగాని పనికిరావు –"

"తన సరదాకొద్దీ అవన్నీ అబ్బాయే తెస్తున్నాడు గాని; తెమ్మని పురమాయించిందా యేమిటే అదీ?"

"ఇంకా పురమాయించాలి సిగ్గులేక, పురమాయిస్తుందేం? పురమాయిస్తే నే నూరుకుందునేం?"

"మన కింత యిల్లైందు కనిగూడా–"

"అలా యెందుకందో నువ్వెరుగుదువు పాపం?"

"లైట్లుకూడా వొద్దంది; కాని అబ్బాయే–"

"ఊరుకో వూరుకో, నేర్చుకుపోయావ్? లైటు లేక చీకటి కొట్టులో దేవుళ్ళాడుతున్నా నని యాగీ చెయ్యడానిక్కాదూ ఆ యెత్తు?"

"అయ్యో, అయ్యో?"

"నీ మాటలు వింటే నాకు మహా మండుకుపోతోంది, చాలించీ పాటికే"

ఆ వుద్ధృతం చూడలేక మొగం పక్కకి తిప్పేసుకుంది మహాలక్ష్మమ్మ.

"పోనీ, అదలా వుంచు. ఇప్పుడేమిటి దారి?" అంటూ నిలవతీసింది రాజమ్మ.

"నేనేం చెప్పగలనే?" అంటూ నెత్తీ నోరూ బాదుకుంది మహాలక్ష్మమ్మ.

తల్లికేసి వురిమి చూస్తూ వొక్కనిమిషం బుస్సలుకొట్టి మళ్ళీ అందుకుంది రాజమ్మ:

"సంవత్సరానికి నాకు రెండువందలు వస్తాయి కనక –"

"ఆ రెండువందలూ భూములమీద తనకి వస్తాయని రాశాడు వారికబ్బాయి. వారు పరీక్ష చేసుకుంటే–"

"చేస్తారేం పరీక్ష? చేసి నిజం తెలుసుకోగలరేం?"

"           "

"నాదన్న పేరే, నా అనంతరం తమ్ముడిదేగా అదంతా?"

"..........."

"ఈ క్షణంలో రాసిచ్చేస్తాను తమ్ముడికి నేను, లోటు చేస్తానేం?"

"           "

"జిల్లాజడ్జిగారి కూతురు. బి.ఏ. చదివిన ప్రయోజకురాలు. ఆడపిల్లల నుద్ధరించేస్తోందిట మహా! ఇవాళ ఆడబడుచు దయతలిస్తే గాని మింగమెతుకు లేదు మళ్ళీ"

"అబ్బాయికి మాత్రం గౌరవమా అది?"

"అబ్బో!"

పెళ్ళాం తెచ్చిన డబ్బు తినడం మాత్రం గౌరవమా అనడగుతావు కామోసునిక"

"కట్నం అంటేనే మేము పుచ్చుకుంటాం గాని, దానం అయితే మాకక్కర్రే లేదు, కోటి రూపాయలిచ్చినా!"

"..............."

"గూబలు పేలగొట్టి కట్నం గుంజుకుంటాంగాని వూరికే పోనిస్తామా యేమిటి వీళ్ళనసలు?"

"..............."

"తొందరపడకు, తొందరపడకు"

ఇలా అంటూనే తమ్ముడి దగ్గిరికి వెళ్ళిపోయింది రాజమ్మ.

ముసలమ్మకి దిక్కు తోచలేదు.

"దాన్నంటే పుట్టగతులుండ"వని వొకవైపున–"

"ఏమో, అమ్మాయి చెప్పినట్లు దాని పాదం మంచిదికాదేమో?" అని మరోవైపున–

కడుపులో దేవేసినట్టు కాగా కళ్ళు తిరిగిపోయాయి మహాలక్ష్మమ్మకి.

## 16

ఆవేళ సాయంత్రం, ఆరుగంటల వేళ, మహాలక్ష్మమ్మ యెదటింటివారి పిల్లతో వీధి అరుగుమీద కూచుని వుంది. కృష్ణవేణి వచ్చింది.

గుమ్మంలో కా రాగాటప్పటికి మహాలక్ష్మమ్మ లేచి నుంచుంది. చంటిపిల్ల నెత్తుకుని ఆ పిల్ల వెళ్ళిపోయింది.

కారు దిగి వచ్చి కాళ్ళు పట్టుకుని కళ్ళ కద్దుకుని "కులాసాగా వున్నారా అత్తా?" అని కోడలడగడమూ "కులాసాగానే వున్నామమ్మా! మీరంతా కులాసాగా వచ్చారా?" అంటూ అత్తగారు మారడగడమూ సక్రమంగా జరిగిపోయాయి.

నట్టివాకట్లో తులసికోట దగ్గిర కూచుని వుంది, రాజమ్మ.

మడిగా వుండడం గుర్తించి దూరంగా వుండి ఆమెకిన్నీ పాదాభివందనం చేసి క్షేమమున్నూ అడిగింది కృష్ణవేణి

"ఆ" అని మాత్రమే బదులు చెప్పింది రాజమ్మ.

ఎడంయెడంగా పొయిగడ్డల్లా కూచున్నారు ముగ్గురూ.

ఇంతలో, ఆపిలుపళ్ళబుట్టా, ద్రాక్షపళ్ళబుట్టాతెచ్చి కృష్ణవేణికి దగ్గిరగా వుంచి, సెలవున్నూ పొంది వెళ్ళిపోయింది డ్రైవరు.

అవి చూశాటప్పటికి మహాలక్ష్మమ్మకి నోరూరింది.

"బజారంతా తిరిగి, ఏరి, మీకోసం మంచి ఆపిలుపళ్ళు తెచ్చానత్తా! రోజుకొక ఆపులూ, వొకగుత్తి ద్రాక్షపళ్ళు పుచ్చుకుంటే మీకు పుష్టి చేస్తుందండీ ......... ఇది కాబూలు ద్రాక్ష వదినా! పులుపేకోశానా వుండవు" అని చెబుతూ కృష్ణవేణి ఇద్దరిదగ్గరా చెరో ద్రాక్షగుత్తీ వుంచి ఆపిలుపళ్ళ బుట్టలో చెయ్యి పెట్టింది గాని; "పులుపూ తీపు ఏమీ లెక్కగానీ, పళ్ళు బుట్టలో వుండనియ్యి" అంటూ ఆ గుత్తికి దూరంగా జరిగింది రాజమ్మ.

మహాలక్ష్మమ్మ కడుపులో రాయిపడింది.

"ఏం వదినా?" అంటూ చకిత అయింది. కృష్ణవేణి.

"అవి మేము పుచ్చుకోగూడదు."

"ఏం?"

"సీమనుంచి వచ్చినవి బ్రాహ్మలు తినవచ్చా మరి?"

"ఇవి సీమనుంచి వచ్చినవి కావండీ, బెంగుళూరిలోనే కాపిస్తున్నారు"

"విత్తనం సీమదే కాదూ?"

"మా అమ్మమ్మ పుచ్చుకుంటుందండీ! చయనం కూడా చేశారు, మా పెద్దనాన్నగారున్నూ పుచ్చుకుంటారండీ!"

"వారు బంగాళాదుంపలు తింటారా?"

"ఆ"

"ఇంకేం? మీది వుద్యోగస్థుల సంప్రదాయం, మాది కోనసీమ అయె. తెలిస్తే గుడ్లు పీకెయ్యరూ మావాళ్లు?"

మహాలక్ష్మమ్మకి మండుకుపోయింది.

"ఏమిటే, నీ బడాయీ" అందామనుకుని, మాట నాలుక చివరి క్కూడా తెచ్చుకుంది; కాని ధైర్యం చాలలేదు.

ఇదంతా చూసి, రాజమ్మ దగ్గిరి పెట్టిన గుత్తితీసి బుట్టలో పడేసింది కృష్ణవేణి.

దీనంగా చూస్తూ మహాలక్ష్మమ్మ కూడా తన గుత్తి కృష్ణవేణి కందించింది.

కృష్ణవేణి వెంటనే ఆ బుట్టలు గదిలో పెట్టేసి, గుడ్డ కుర్చీ వాల్చుకుని వసారాలో నడుం వాల్చింది.

తల్లికేసి వొక్కమాటు తీక్షణంగా చూసి రాజమ్మ, విజయగర్వంతో వంటింట్లోకి చక్కాపోయింది.

మహాలక్ష్మమ్మ కేడుపు వచ్చింది.

ఆ ఏడుపులోనే శాస్త్రి వుద్యోగం పోయిన సంగతి కోడలితో చెప్పాలనుకుంది.

కాని, రాజమ్మ కోరచూపు లామెని దిగతీశాయి.

దాంతో, అక్కడే నేలమీదే పడుకుని, మొగం కప్పుకుని "మేనత్తల పోలిక పుణికి పుచ్చుకున్నావుగదే, నీ బతుక్కాల్చా" అనుకుంటూ లోపల్లోపలే కుమిలిపోసాగింది మహాలక్ష్మమ్మ, రాజమ్మని తలుచుకుని.

ఏడున్నర అయాక, రాజమ్మ, తల్లిని స్నానం చెయ్యమని, మరదలిని భోజనానికి రమ్మంది.

"వారేరీ వదినా?"

"వీరభద్రపురం వెళ్ళాడు, పదయితే గాని రాడు"

"భోజనం–"

"చేసే వస్తాడు"

ఇలా అంటూనే రాజమ్మ వెళ్ళిపోగా, కృష్ణవేణి మొగుడు బంతిలో లేకపోవడంవల్ల సగంసగమే తిని లేచివచ్చింది.

తరవాత, తమలపాకులు చిలకలు చుట్టి వొక గాజుబరిణిలోనూ, రెండు ఆపిలుపళ్ళు ముక్కలు కోసి మరో గాజుబరిణెలోనూ వుంచి కృష్ణవేణి, రెండు ఏలకిపళ్ళు వొలిచి, నోట వేసుకుని పుస్తకం పుచ్చుక్కూచుంది కాని; నిద్ర ముంచుకు రాగా వెళ్ళిపడుకుంది.

తొమ్మిదయాక వచ్చాడు శాస్త్రి.

పట్టుపంచె కట్టుకుని భోజనానికి కూర్చున్నాడు.

"నువ్వు వీరభద్రపురంలోనే భోజనం చేస్తావని చెప్పాను" అంది రాజమ్మ.

"భోజనం చేసిందా?"

"ఆ, కాని అన్నం సగమే తిని లేచింది."

"ఏమో?"

అక్కడ ఫలహారా లేమేమి చేసి వచ్చిందో. పూటుగా!"

."

"అన్నట్లు – ఆపిలు పళ్ళూ ద్రాక్షపళ్ళూ తెచ్చిందా?"

"రెండూ రెండు బుట్టలు తెచ్చింది ...... నాకు పెట్టింది కాని, వద్దనేశాను."

"ఏం?"

"తరవాత చెబుతాను. దాని ఫలితమే కనపరుస్తాన్నీకు మొత్తంగా"

"నా వుద్యోగం సంగతి –"

"ఇక్కడ యెవరమూ చెప్పలేదు, తెలిసినట్టు కూడా లేదు"

"సరేగాని,–"

"ఏమిటి, సందేహిస్తున్నావూ?"

"ముందుమాట?"

"బెట్టుగా వుండడమే"

"............"

"కొంపతీసి దాని వల్లో పడ్డావు సుమా, నువ్వు"

# |17|

మునిసిపల్ హైస్కూల్లోనే పనిచేస్తున్న స్నేహితు డొకడు బజారులో కనపడి "నువ్వు ఆక్టింగుచేసిన పోస్టు మళ్ళీ కాళీ అయిందోయ్" అన్నాడు.

"నాతో, మరి సెలవు పెట్టనన్నాడు?"

"నిజమే"

"అంటే?"

"ఈ పని నాకక్కర్లేదని కాగితం రాసి–"

"ఆ!"

"నేను జరిగింది జరిగినట్టు చెప్పాను"

"మరి ముందుమాట?"

"ఏ విషయమ్మై?"

"ఆ పోస్టు –"

"ఎవరికో మరొకడికి దక్కుతుంది."

"ఎవడి కంటావ్?"

"ఆ మనిషి కిప్పటివరకూ నామరూపా లేర్పడలేదు"

ఇది విని పైకి చూస్తూ హొకమా టేదో ఆలోచించి "మరి, అంతదూరం నుంచి పనికట్టుకు వచ్చి పనిలో చేరడానికిక్కారణం?"

"నాకు తోచింది–"

"చెప్పవోయ్"

"నిన్ను తప్పించడమే"

"అతనికే పుట్టిం దంటావా దుర్బుద్ధి?"

"నే నలా అనుకోను. ఎవరో నిర్బంధించి వుంటారు"

"ఎవరంటావ్?"

"నిర్దేశంలేని అధికారి యెవడో చేసివుంటాడిది."

బ్రహ్మభేద్యంగా వుంది వ్యవహారం. హెడ్మాష్టరున్నూ గజిబిజిపడిపోతున్నాడు."

ఇది శాశ్వతంగా విడిచిపెట్టాడు, మరి, యేమి చేస్తాడంటా వతను?"

ఇన్సూరెన్సులో నెలకి రెండువందలకు పైగా–"

"రెట్టింపు–"

"రెండు రెట్లను"

"అయితే, యిందులో యేదో కుట్ర–"

"ఉందన్నమాటే"

"ఎలాంటి స్వార్థపరు లయినా వున్నారు లోకంలో"

ఈ మాట అన్నప్పుడు "అలాగటోయ్?" అని తన్నెవరో డెకారించి నట్టయింది శాస్త్రికి.

"ఈమాటు నువ్వు చాలా గట్టి ప్రయత్నం చెయ్యాలి, నీ మామగారిని చెన్నపట్నం పంపి, మంత్రి దగ్గరనుంచి ఘాటైన వుత్తరం తెప్పించవోయ్!"

"మంత్రి దగ్గిరనుంచే కాదు, వాడిపై వాడినుంచే–"

"పోనీ, నువ్వు కూడా యేదయినా యేజన్సీ చూసుకోరాదుటోయ్?"

"వెధవ యేజన్సీలు, పోనిద్దూ" అంటూ చెండుకున్నాడు ముందు శాస్త్రి.

"తిండీ తిప్పలూ లేకుండా రాత్రీపగలూ అనకుండా నానా అపస్మారం మనుష్యులనూ ఆశ్రయించుకు తిరగాలి. ఆత్మగౌరవం పూర్తిగా విడిచిపెట్టేసుకోవాలి. అయినా, పని జరుగుందన్న నిశ్చయం వుండదు. జీతం తక్కువే అయినా టీచరుగా వుంటే కడుపులో చల్ల కదలకుండా కూచోవచ్చు. కుర్రకుంకలకు చదువంటనీ మాననీ మనకక్కరలేదుగదా? పరిగెత్తి పాలు తాగడంకంటే, నుంచుని నీళ్ళు తాగడం మంచిదన్నారు పెద్దలు. ఇంతకీ – టెన్నిస్ ఆడకపోతే నాకు నిద్రాహారాలు సయించవు. ఇన్సూరెన్సు ఏజన్సీ పుచ్చుకుంటే దర్జా అయిన టెన్నిస్‌బాటు విడిచిపెట్టి వె–ధవ కాగితాలు మొయ్యాలి–గ్గాడిదలాగ"

"గుడ్‌బై–" అంటే "గుడ్‌బై" అనుకుంటూ యెవరిదారిని వారు వెళ్ళిపోయారు.

సాయంత్రం అరుగంటలవేళ యిందుకోసం వెడుతున్నానని రాజమ్మతో మాత్రం చెప్పి శాస్త్రి చెయిర్మను దగ్గిరికి బయలుదేరాడు, తనలో తిట్టుకుంటూనే.

వీధిగుమ్మంలోకి వచ్చాటప్పటికి నిండుబిందె బుజానపెట్టుకుని పద్దెనిమిదేళ్ళ బంగారుబొమ్మ ఎదురుపడింది.

"మంచి శకునం, తొరగా అడుగు వెయ్యి" అంది రాజమ్మ, కంగారుపెడుతూ.

నాళంవారి సత్రం దగ్గిర మలుపులో వుండగా పొద్దుటి స్నేహితుడే ఎదురుపడి సైకిలు దిగాడు.

"ఎక్కడికోయ్?"

"అక్కడికే"

"అప్పుడు దర్శనమే యివ్వనివాడు–"

"బలవంతాన ఎదుటపడి–"

"లాభంలేదు, వెనక్కి మళ్ళు"

"అంటే?"

"ఆ పోస్టు ముందొకటి కిచ్చే తరవాత సెలవు మంజూరు చేశాడు"

"ఏమిటోయ్, నువ్వు చెప్పేది?"

ఇలా అడుగుతూ శాస్త్రి తూలినట్టయిపోయాడు.

"తన మేనమామ అల్లుడికిచ్చాడు"

"వాడి మొఘం–"

"కలకల్లాడిపోతోంది, దానికేం?"

"

"మరి పోతా"

"నాకు సలహా చెప్పు"

"ఆలోచించు నువ్వే. నేను చెప్పవలసిందొకటే. ఈ చెయిర్మ నుండగా మునిసిపల్ హైస్కూల్లో నీకు ఏ పోస్టూ దొరకదు."

"తాహతు లేనిపీనుగు, కాగితాలొక రాక్షసుడి దగ్గిరికి మోసుకుపోయి, తన అంతరాత్మకే వ్యతిరేకంగా సంతకం–"

"నేనొప్పుకోను"

"ఏం?"

"ఆ మనిషికీ అసలు అంతరాత్మ వుందనా నీ నమ్మకం?"

"అదంతా శుద్ధకల్ల. వాడికి పదవి కావాలి, గడ్డి తినడానికి"

"........... అవునవును. పూటకి టికాణా లేనివాడివాళ సొంత –"

"నువ్వు లక్ష అను, ప్రయోజనం లేదు. సింహాసనంమీద కుక్కే వుందనుకో, దాని తోకకే చెలామణీ"

గంట గణగణలాడించి స్నేహితుడు తుర్రుమన్నాడు.

## 18

శాస్త్రి పదిహేనురోజుల కిందట బియ్యబ్బస్తా అరువు తెచ్చాడు.

బజారులో కనపడి వర్తకుడు కొంచెం నిష్ఠూరాలాడాడు.

భోజనం చేసి లేచాటప్పటికి "రెండుమాట్లు వచ్చాను మీకోసం, దర్శనం కావడమూన్నూ కష్టం అవుతోంది" అంటూ గుమ్మం ఎక్కాడు, ఇంటియజమాని.

"మా మాట మరిచేపోయారు. రెండుమాసాల అద్దె బకాయిపడితే, తడిసి మోపెడయి – బరువెక్కువ కాదూ?"

"................"

"అన్నట్టు మీ వుద్యోగం పోయినట్టు తెలిసింది?"

ఆ మనిషిని చాలా కష్టంమీద విడిపించుకున్నాడు శాస్త్రి.

దీనికి సాయంక్లబ్బులో ఎంత కసిగా ఆడినా ఎదటివారి బంతి తియ్యలేకపోయాడతను.

అతని మనస్సు పూర్తిగా చెదిరిపోయింది.

లక్ష ఆలోచనలతోటే కోటి విఘాతాలతోటే అతనింటికి బయలుదేరాడు.

గుమ్మంలో అడుగు పెట్టాటప్పటిక్కోటూ బాటూ అందుకోడానికి చేతులు చాపుకుని కృష్ణవేణి ఎదురు వెళ్ళింది కాని; "అక్కర్లే"దంటూ దురుసుగా గదిలోకి చక్కాపోయాడతను.

కృష్ణవేణి నిర్విణ్ణ అయిపోయింది.

పది నిమిషాల సేపు దిక్కులు తెలియలేదామెకి.

దీంతో, రాజమ్మేకాక భర్తకూడా తన విషయమై మారుదారి తొక్కుతున్నాడని ఆమె నిశ్చయించుకుంది.

"ఇదేదో ముదరకుండా సరిదిద్దుకోవా"లనుకుంది వెంటనే.

గదిలో పడకకుర్చీలో వాలి ఏదో ఆలోచించుకుంటున్న శాస్త్రి ఆమెని చూసి గభీమని లేచి యివతలికి బయలుదేరాడు.

"మాట" అందామె.

గుమ్మంలోనే వుండ, మొగం మాత్రం అటు పి\ "ఏమిటి సంగతి?" అనడిగాడతను.

ఇందులోకూడా నిర్లక్ష్యం కనపడిందామెకి.

అయినా సర్దుకొని "మీతో మాట్లాడాలి"అంది.

కృష్ణవేణి మంచానికి తల్లింపున నుంచుని వుంది.

రెండోవైపున నుంచుని "అదేమిటో చెప్పు" అన్నాడతను కొంచెం విసుగ్గా.

"కూచోండి"

"కూచో నక్కరలేదు."

"..........మీరు చిరాగ్గా కనపడుతున్నారు"

"అవును"

"ఏం?"

"మనస్సేమీ బాగా లేదు"

"కారణం?"

ఆమెకి అతని మొగాన "ఏమయితే నీకేం?" అన్న వాలకం కనపడింది మొదట. మాసి చూసి "ఉద్యోగం పోయింది. మళ్ళీ ఏదీ దొరకలేదు" అన్నాడతను.

"ఎన్నాళ్ళయిందీ?"

"మనం బెంగుళూరినుంచి వచ్చిన్నాడే"

నిర్విణ్ణే అయిపోయిందామె.

"మరి నాతో చెప్పారు కారేం?" అనడిగింది, తేరుకుని.

ఆ మాటలో గద్గదిక వుంది.

"నువ్వేమయినా ఆరుస్తావా తీరుస్తావా?" అనేశా డతను వెనకాముందూ చూడకుండా.

కృష్ణవేణి చాలా బాధపడిం దందుకు.

"దాపరికాలు నాకిష్టంలేదు. మనస్సులోనే కుమిలిపోడం నా పద్ధతికాదు. నా సంగతి మొదటే చెప్పాను స్పష్టంగా మీకు"

"అయితే?"

"నాతో మీ రేమీ చెప్పనక్కర్లేదూ?"

అతను మాట్లాడలేదు.

మొగం మాత్రం ధుమధుమలాడుతోంది.

"మీ కష్టాలు మీ అక్క తీరుస్తారా? ఈ యింటి యాజమాన్యంతో ఆవిడ కేమి పని?"

"ఈ యింటి యజమానురాలవు నువ్వే, సందేహం లేదు కాని; నా సంసారం యిప్పుడామె పోషిస్తోంది. ఏ సంగతీ ఆవిడతో చెప్పకతప్పదు. ఆవిడతో ఆలోచించక

వీల్లేదు. ఆవిడ సలహా పుచ్చుకోకా వల్లకాదు, ఆవిడ చెప్పినట్టు నడుచుకోడం కూడా తప్పదు."

ఈ మాటల్లో శాస్త్రి వుద్రేకం కనబరిచాడు.

బుద్ధిపూర్వకంగా ఆమెయెడల తిరస్కారబావం కూడా చూపించాడు.

ఆమెకి చాలా కోపం వచ్చింది కాని; వొకమాటు ఎగరొప్పడంతో అది సమాళించుకుని "నన్నిప్పుడు పోషిస్తున్నది నా భర్తగారు కాదూ?" అనడిగింది చురుగ్గా చూస్తూ.

"కా"దనేశా డతను, నిర్లజ్జగా.

ఇది వినలేకపోయిం దామె.

ఒక్కనిమిషం రెప్పవెయ్యకుండా చూసి "కుదిరిందా రోగం?" అన్నట్టు విషపు మందపోసమున్నూ చేసి, తలకూడా పంకించుకుని శాస్త్రి రివ్వున ఇవతలికి వచ్చేశాడు.

కృష్ణవేణి మంచంమీదికి వాలిపోయింది.

ఏమిటేమిటో మథనపడి వొక్కగంట కామె మొగం యెత్తి చూసింది.

అప్పటికి గది అంతా అంధకార బంధురం అయివుంది.

వంటింటోకి తొంగిచూడగా శాస్త్రి భోజనం చేస్తున్నాడు, రాజమ్మతో యేదో రహస్యంగా మాట్లాడుతూ.

విస్తుపోయి కృష్ణవేణి పడమటింటి అరుగుమీద చతికిలబడిపోయింది.

కొంతసేపటికి మహాలక్ష్మమ్మ ఏదో అనడమూ, రాజమ్మ కసురుకోడమూ, శాస్త్రి "కొన్నాళ్ళదాకా నువ్వేమీ మాట్లాడకమ్మా!" అంటూ విసుక్కోడమూ వినిపించాయి.

కైజారుతో పొడిచిన ట్టనిపించింది. కృష్ణవేణికి.

## 19

"ఒరేయ్, శాస్త్రీ" అని పిలుస్తూ శాస్త్రి చిన్నమేనమామ లోపలికి వచ్చాడు, వీధితలుపులు తోసుకుని.

"ఇలా రావయ్యా. బుల్లిమామయ్య" అంటూ భోజనం చేస్తూనే శాస్త్రి స్వాగతం చెప్పాడు.

అతను పడమటింటోకి వెళ్ళేదాకా లేచినుంచుని మళ్ళీ అక్కడే కూచుంది కృష్ణవేణి.

"ఒక్క నిమిషం దాటిపోయింది. అయితే, నియమాలేవీ లేవు కాదూ నీకు? మడికట్టుకో" అంటూ రాజమ్మ కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళిచ్చింది.

"నీ దయవల్ల నాకు నియమాలేవీ లేకపోవడం నిజమే కాని; నేను భోజనంచేసే–"

మాట సగంలోనే అందుకుని "చూశావా?" అనడిగింది తమ్ముణ్ణే రాజమ్మ.

శాస్త్రి మిడుతూ మిడుతూ చూశాడు సంగతి బోధపడక.

నువ్వు కులాసాగా వున్నావా పెద్దక్కా? అంటూ ముసలమ్మని కుశలప్రశ్న.

"ఆ! పిల్లలూ మరదలూ క్షేమమేనా?" ముసలమ్మ మారుప్రశ్న.

ఉభయకుశలోపరి "ఏమిరా, ఎవరినీ పిలవకుండా పెళ్ళి చేసుకున్నావూ?" అనడిగాడు మేనమామ.

"తొందరయిపోయింది మామయ్యా!"

"కాకపోయినా, యింతోటి పెళ్ళికీ బంధువులను కూడా పిలవాలి సిగ్గులేక, కట్నాలా కానుకలా?"

ఝుమాయించి రాజమ్మ యిలా అడగ్గా ముసలమ్మ కొయ్యయిపోయింది.

కనుబొమ్మలు ముడుచుకుంటూ శాస్త్రీ, నాలుక కరుచుకుంటూ మేనమామా మొగమొగాలు చూసుకున్నారు గాని; రాజమ్మ కళ్ళల్లో "నాకేం భయమా?" అన్న భావం మెరిసింది.

"బొత్తిగా కట్నం లేకుండా చేసుకున్నా వేమిరా?"

"అప్పటి కలా తోచిందయ్యా!"

"అదో తెలివితక్కువ మాట" అంటూ దురుసుగా అందుకుంది రాజమ్మ.

"వాణ్ణడిగే దేమిటి, నేను చెబుతాను వినవయ్యా, బుల్లిమామయ్యా! కట్నం యివ్వగూడదని వారికి గట్టివ్రతం – ఠ. అంటే, పీటలమీద చదివించరనుకున్నాం గాని తరవాత యేదోవిధంగా ముట్టజెప్ప రనుకున్నామా యేమిటి? ఎనిమిదో నెల వెళ్ళవస్తోంది–"

"ఆహో, చాలా మంచిమాట విన్నాం" అన్నాడు మేనమామ.

శాస్త్రి లోపల్లోపల నవ్వుకున్నాడు.

ముసలమ్మ "ఇంకా లేదురా నాయనా" అంది మొగం వేల వేసుకుని.

"సడే" అని చెయ్యి జాడించి మళ్ళీ అందుకుంది రాజమ్మ.

"ఇదిగో పులి అంటే, నువ్విదిగో తోక అంటావు. అంత అదృష్టం కూడానా మాకు? ఏదో శాస్త్రం చెప్పినట్టు – దానికేం, తరవాత సంగతి వినవయ్యా! ఈక్షణందాకా వొక్క దమ్మిడీ అయినా యెరగం; కాని రజస్వల అయిన పిల్లని చేసుకున్నందుకు వెలిమాత్రం చుట్టబెట్టుకుంది మమ్మల్ని. కాకపోతే, ఈ వూరు వచ్చి అక్కడా అక్కడా భోజనం చెయ్యడం వుందా నువ్వెన్నడయినా?"

"వెలి అంటే యేమిటి గానీ – నా భోజనం మాటకున్నూ యేవిటి గానీ పోనీ, వుద్యోగం ఖాయం అయినట్టా?"

"అసలుంటేనా?"

"అదేమిటి?"

"మా తమ్ముడికి వెప్పుడు మళ్ళీ పెళ్ళి అయిందో అప్పణ్ణుంచీ కష్టాలే వస్తున్నాయి మాకు. తమ్ముడికి వుద్యోగం అఖరయింది. మరోచోట మళ్ళీ దొరకలేదింకా, ఆ సూచన కూడా లే దెక్కడా. ఏదో వచ్చి పడిపోతుందని యెనిమిది రూపాయల యిల్లు విడిచిపెట్టి పదిహేనురూపాయల కీయింటో పడ్డాం. రెండుమాసాల అద్దెబాకీ. చేతిలోనా – దమ్మిడీ లేదు."

శాస్త్రి భోజనం అయింది.

చల్లగాలికోసమూ, కబుర్లకోసమూ మేనల్లుడూ మేనమామా వీధి అరుగుమీది. వెళ్ళిపోయారు.

తరవాత "మరి వడ్డిస్తున్నాను, నీ కోడల్ని పిలుచుకోవమ్మా" అంది రాజమ్మ.

జరిగిందంతా వినేవుంది కృష్ణవేణి.

తలతిరిగిపోతోం దామెకి.

మహాలక్ష్మమ్మకీ అప్పటికే నడుం విరిగిపోయి వుంది.

కూతురి ధోరణి చూడగా ఆమెకి "ఏదో మూడుతుం"దని కంగారుగానే వుంది; కాని, అస్వతంత్రురా లామె.

అది యేమయినా, యిప్పుడు వెళ్ళి కోడల్ని పిలవకపోతే, రాజమ్మ చీపురుతిరగవేసినంత పనిచేస్తుంది.

జడుస్తూ జడుస్తూ బయలుదేరిందామె.

"అమ్మా, కృష్ణవేణీ" అని పిలిచింది, ప్రీతిగా.

"అమ్మకాదు, బొమ్మ" అంటూ లోపల రాజమ్మ సణుక్కుంది.

"ఎందుకండీ అత్తా?" అనడుగుతూ కృష్ణవేణి లేచి నుంచుంది. ఆ మాటలో ఆదర గౌరవా లుట్టిపడ్డాయి.

"వోస్, అదంతా భక్తే కామోసు" నంది లోపల రాజమ్మ, కంఠం నొక్కుకుని.

"భోజనానికి రా తల్లీ" అని ముసలమ్మ మాత్రం లాలిస్తూ పిలిచింది.

"నేను భోజనం చెయ్యను. వెళ్లి మీరు ఫలహారం చెయ్యండత్తా!"

"ఏమమ్మా?"

"మీకే తెలుసు, ఇక నాకు భోజనంమాట చెప్పకండత్తా!"

"బతిమాలడానికి నీ అబ్బ సొమ్మాలేదు, నీకు భయపడేవాళ్ళూ లేరిక్కడ" అంటూ పళ్ళుకొరుక్కుంది రాజమ్మ, లోపల.

ముసలమ్మ కంతా అర్థం అయింది.

కళ్ళలో నీళ్ళు కుక్కుకుంటూనూ తూలిపోతూనూ లోపలికి వెళ్ళి, కంఠం రుద్ధం అయిపోగా, మాట చెప్పలేక బెదురుతూ బెదురుతూ చూసిందామె కూతురి కేసి.

"చెప్పనక్కరలేదు, నువ్వు కూచో" అంటూ తల్లిని గదిమి, తల్లి విస్తరిలోనూ తన విస్తరిలోనూ ఉప్పిపిండీ వంకాయపులుసు పచ్చడీ వడ్డించి, చెయ్యి ఆడక తల్లి కుసిల్లిపోతూ వుండగా, నిర్విచారంగా తాను ఫలహారం ప్రారంభించింది రాజమ్మ.

తొమ్మిది మ్మువ్వావయాక మేనమామని సాగనంపేసి వచ్చి రాజమ్మతో యేదో మాట్లాడి, గోడవైపు తిరిగి గదిలో మంచంమీద పడుకున్నాడు శాస్త్రి.

మరో పావుగంట తరవాత తానున్నూ గదిలోకి వెళ్ళి, దీపం తగ్గించి, తుంగచాప పరుచుకుని యిటు తిరిగి పడుకుంది కృష్ణవేణి.

ఆ రాత్రి తెల్లవార్లూ వొకటే కుమిలిపోడం ముసలమ్మ.

రాజమ్మ కూడా చాలాసేపు నిద్రపోలేదు.

గది తలుపులు తెరిచే వుండడం గమనించిందామె.

అందుకే సంబరపడుతూ, వూరుమాటుమణిగాక, మెల్లిగా వెళ్ళి గదిలో వాలకం అంతా తొంగిచూసి "కావాలి" అని తల తాటించుకుంటూ వెళ్లి తృప్తిగా పడుకుంది, చివరికి.

## 20

ఆవేళ పౌర్ణమి.

పాఠశాలకి సెలవు.

అయినా, కృష్ణవేణి స్నానంచేసి బట్టలు కట్టుకునేటప్పటికి మామూలుగా కారు వచ్చింది.

"కాఫీచేసుకుని పుచ్చుకోకపోతుందా" అని వోరకంట చూస్తూనే వుంది రాజమ్మ.

కృష్ణవేణి మాత్రం ఆ మాటే అనుకోలేదు.

కూతురు నూతికేసి వెళ్ళడం చూసి, గబగబా కోడలి దగ్గిరికి వెళ్ళి "ఏమమ్మా, కాఫీ పెట్టుకున్నావు కావేం?" అనడుగుతూ రెండుచేతులూ పట్టుకుంది ముసలమ్మ.

"పుచ్చుకోతలుచుకోలే దండీ అత్తా!"

"ఏం తల్లీ?"

"నిన్నరాత్రి భోజనం కంటే యెక్కువదా అత్తా, యీ పూట కాఫీ?"

ముసలమ్మ వొణికిపోయింది.

"మా అమ్మవు కాదూ? మా తల్లివి కాదూ? నీరసం చేస్తుందమ్మా! నేను కుంపటి అంటిస్తాను తొరగా నువ్వు కాఫీ చేసుకోమ్మా!"

"వద్దండీ!"

"చేసుకోకపోతే నన్ను చంపుకుని తిన్నట్టే మరి"

ఇలా అని, మహాలక్ష్మమ్మ, చేతులు విడిచిపెట్టి ఎడమచేత్తో పాదివి పట్టుకుని కుడిచేత్తో గడ్డంపట్టుకుని బతిమాలింది కాని; కృష్ణవేణి దణ్ణం పెట్టి వూరుకుంది.

దంతధావనం చేసుకుని, మొగం తుడుచుకుంటూ శాస్త్రి ఆ సమయంలో వచ్చాడు.

అతని రాక చూసి గబగబా వెళ్ళి కృష్ణవేణి కారెక్కింది.

కొడుకు పెడసరంగా మాట్టాడతా డని యెరిగే వుండిన్నీ వూరుకోలేక "కాఫీ పుచ్చుకోకుండా వెడుతోందిరా" అంది ముసలమ్మ, ఆత్రంగా.

"ప్రపంచం తలకిందు లయిపోదులే" అన్నాడు శాస్త్రి, తల యెగరవేసుకుంటూ.

"కొంప ముంచుకుంటావుట్రా?"

"ఇంతమాత్రానికే?"

"నిన్నరాత్రి అన్నంకూడా–"

"ఏమిటీ?"

ఇలా అంటూ కొయ్యయిపోయాడు శాస్త్రి.

"నీ యింటో నీ అక్క పెత్తనం యేమిటి నాయనా?"

"మూడు లక్షల రూపాయల ఆస్తి చేతికి వచ్చేచోట పాదుకట్నం కోసం కయ్యం పెంచుకుంటావా నాయనా?"

అప్పుడు వారికి నువ్వేమని వుత్తరం రాశావు, ఇప్పుడేమి చేస్తున్నావు నాయనా?"

"బి.ఏ, చదువుకున్న ఆడది మొగుణ్ణి దేవుడన్నట్టు చూసుకోడమా? బి.ఏ. చదువుకున్న మొగవాడు పెళ్ళాన్ని మోసం చెయ్యడమా?"

శాస్త్రి వీధికేసి చూశాడు ఆత్రంగా.

కారు స్వయంగా నడుపుకుంటూ కృష్ణవేణి వెళ్ళిపోతోంది.

అతని కళ్ళు చెదిరిపోయాయి.

కాళ్ళు వొణికాయి.

పెదవు లెండిపోయాయి.

"నిక్షేపం వంటి పిల్లరా నాయనా! తగువులు పెంచుకోకురా బాబూ! మాట పడే మనిషి కాదురా అది. భాగ్యవంతుల పిల్లకావడం అలావుండగా, నీకంటే ప్రయోజకురా లనిపించుకుంటోందిరా! అయినా, తెగనీలుగులెరగదురా –"

మాట కడ్డువచ్చి "అక్కయేదీ?" అనడిగాడు శాస్త్రి, మాట తెమల్చుకుని.

మహాలక్ష్మమ్మ నూతిపెరటికేసి చూసింది.

రాజమ్మ వస్తోంది

"నిన్నరాత్రి కృష్ణవేణి భోజనం చేసిందిటే అక్కా?"

"లేదు."

"ఏం?"

"ఆకల్లేకపోయింది కామోసు!"

"అయ్యో, అయ్యో" అంటూ నోరు నొక్కుకుంది మహాలక్ష్మమ్మ.

"ఏమిటా వేషం?" అంటూ తల్లిమీద రుంజుకుంది రాజమ్మ, తల తాటించుకుంటూ.

"నాతో చెప్పవద్దుటే?"

"చెప్పడాని కిందులో యేమి వుందిరా?"

"............"

"అది యేమి చేస్తోందో ఎందుకు చేస్తోందో కనిపెడుతూ కూచోడమే నా పనిట్రా?"

"ఇంతకీ – ఏం వచ్చిందిప్పుడూ?"

"ఇప్పుడు కాఫీ అయినా పుచ్చుకోకుండా–"

"అమ్మ చెప్పిందా?"

"పోనీ, మానేస్తుందనుకున్నావా?"

"........."

"అక్కడ యెన్ని శేర్లు తాగుతుందో–"

"అయ్యో, అయ్యో" అని లోపలే అనుకుంటూ గుండెలమీద చెయ్యి వేసుకుంది, ముసలమ్మ.

అందుకున్నా మళ్ళీ చ(ర్రు)మంది రాజమ్మ.

శా(స్త్రి) కిది అమానుషంగా కనపడింది.

"తెగేదాకా లాగుతావే నువ్వు" అని మా(త్రం) అని చివాట్లకి తలవొగ్గాడతను.

"ఈమా(త్రం) భాగ్యానికే కంగారుపడిపోతున్నవా. యేవి(ట్రా) నువ్వు? దిట్టమైనవాడవే. ఇలా అయితే, నీకు లొంగుతుందా అదీ?"

ఇలా అడిగి సాగదీసుకుంది రాజమ్మ.

"నువ్వు లొంగావా, మనోవర్తిపీనుగువి?" అనుకుంది మహాలక్ష్మమ్మ.

"చాలా దూరం వెడుతుంది, వ్యవహారం"

"తెగతెంపులు చేసుకుని వెళ్లిపోతుందనుకుంటున్నావా?"

"............"

"వొక్కనాటికీ అలా చెయ్యదు. పాతికయేళ్ళు నిండితేగాని పెళ్ళి కాలేదు. బి.ఏ. అమ్మగారికి. మొగుడికోసం మొగంవాచిపోయి–"

ఇలా అని "తెలుసా?" అన్నట్టు చురుగ్గా చూసి మళ్ళీ అందుకుంది రాజమ్మ.

"నాలుగురోజులుంటుందీ బెట్టుసరీ. తరవాత తనకి తానే వచ్చి అది నీ కాళ్ళమీద పడకపోతే నన్ను ఛీ అను"

"............"

"ఇదే సమయమూ, ఇదే సందూనూ, ఏమనుకున్నావో?"

"............"

"కథ యిలా తిరుగుతుందా తిరగదా అని నేనెన్నాళ్ళనుంచో ఆదుర్దాపడిపోతున్నాను. వ్యవహారం ముచిక్కాడిచి వచ్చింది, నువ్విప్పుడు బి(ర్రు)గా వుండకపోతే యె(ర్ర)ని యేగాని వూడిపడదు."

శా(స్త్రి) వంచిన తల యెత్తలేదు.

"నా నాన్నా, ఎవరిక్కోపం వచ్చినా సరే, నేనొకటి చెబుతాను విను" అని మొదలు పెట్టింది ముసలమ్మ, ఇక వుండలేక.

"నీ రోజులు బాగా లేవు. అంచేతే నీ వుద్యోగం పోయింది. ఈ సమయంలో కుటుంబంలో కూడా కల్లోలం తెచ్చిపెట్టుకుంటివా – నీకు మతిపోతుంది. కోడలి దగ్గిర నువ్వు తప్పు చూపించలేవు. వీధికి వెడితే నలుగురూ నిన్నే అంటారు. నీ మంచిచెడ్డలు తెలియకుండానూ, తమ పిల్లని నువ్వెలా చూస్తావో చూసుకోకుండానూ, నువ్వు స్వతం(త్రు)డవో అస్వతం(త్రు)డవో బోధపరుచుకోకుండానూ అంత ఆస్తి నీ చేతిలో పెడతారు(ట్రా) వారు – వె(ర్రి)నాయనా? ఇంతవూళ్ళో మళ్ళీ నౌకరీ సంపాదించుకోలేకపోయావు. అది చేతగానితనం అనిపించుకోదు(ట్రా)? మెరుపు దీపం వద్దందా? సెంట్లూ, అగరువత్తులూ మానుకుందా? ఎక్కడికక్కడికే సద్దుకుపోయే మనిషి కాని, చిన్నప్పణ్ణుంచీ అంత వైభవం అనుభవించివుండీన్నీ దేనికయినా నిన్నిబ్బంది పెడుతోంది(ట్రా) పాపం? కాలికి జోడుకూడా అక్కడ పనిమనిషిచేత తొడిగించుకునే మనిషి, ఇక్కడ నువ్వూ తానూ తిన్న కంచాలు కడుగుతోంది.

స్థలశుద్ధి చేస్తోంది, దాని అంతస్థు నీకేమయినా అర్థం అయిందా? ప్రతిరోజూ పేరు పెట్టి నీ బంతికి పిలుస్తూ హఠాత్తుగా మానేస్తే దానికి చిన్నతనం కాదుట్రా? నిన్నరాత్రి భోజనాలవేళ చిన్నమామయ్యతో జరిగిన సంభాషణ అది విని వుంటే ఎంత తప్పురా? ఎంత విషమిస్తుందో ఎరుగుదువుట్రా?"

ఇది విని "మునిగిపోయే దేమీ లేదు – ఈపాటికి చాలించు నువ్వు" అంటూ తల్లిమీద కళ్ళెర్రజేసి మళ్ళీ అందుకుంది రాజమ్మ.

"ఒరేయ్, తమ్ముడూ, నీకు వచ్చిన అపత్తేమీ లేదిప్పుడు, నాదీపూచీ. కాస్సేపటికో కూస్సేపటికో నీ అత్తగారూ మామగారూ వస్తారు, నువ్వు మాత్రం బేలపోకు. ఖండితంగా మాట్లాడేసెయ్యి. కాపరం చెడిపోతే దానికే చిక్కు, నీకేమీ యిబ్బంది లేదు" అని మిక్కిలి ఝూంకారంగా చెప్పిందామె.

మాట్లాడలేక గదిలోకి వెళ్ళిపోయాడు శాస్త్రి.

నూతిపెరట్లోకి వెళ్ళి మహాలక్ష్మమ్మ నెత్తీనోరూ బాదుకుంది.

"ఈ దెబ్బతో పదివేలయినా కరుకులు తెస్తేనే గాని – 'వొక మేడకూడా యిచ్చాము తల్లీ' అని కూడా అనిపించుకువస్తేగాని గుమ్మంలో అడుగుపెట్టనివ్వను రాణీగారిని. అలా జరగదూ? నిమిషంలో మళ్ళీ పెళ్ళిచేసేస్తాను ఎమ్మేని తీసుకువచ్చీ నాలుగువేలు కట్నం పుచ్చుకునీ. అప్పుడు తెలుస్తుంది నా విలవ తమ్ముడికి" అని వెన్నువిరుచుకుంటూ రాజమ్మ గోదావరికి బయలుదేరింది బిందె బుజాన వేసుకుని.

## 21

తల్లినీ తండ్రిని చూశాటప్పటికి దుఃఖం ముంచుకువచ్చింది కృష్ణవేణికి; కాని మానవతి కనక అణిచేసుకుంది.

అయినా, మొగం డీల్లపోయివుంది.

కూతుర్ని చూశాటప్పటికి రాధమ్మకి మనస్సు చెయ్యిపెట్టి కలిచేసినట్టయిపోయింది.

వెంటనే దగ్గిరికి వెళ్ళి "అలా వున్నావేం తల్లీ?" అంటూ పొదివి పట్టుకుందామెని.

"ఏం, ఎలావుంది?" అని ఆదుర్దాపడుతూ దగ్గిరికి వచ్చాడు యాజులు.

పొదివి పట్టుకునే సోఫాదగ్గిరికి తీసుకువెళ్ళి, వొళ్ళో కూచో పెట్టుకుని "కళ్ళు గుంటలు కట్టాయేమమ్మా" అని మొగం నిమురుతూ రాధమ్మ అడగ్గా "అవును, మాట్లాడవేమమ్మా" అనడిగాడు యాజులు, పక్కని కూచుని.

వేడినిట్టూర్పు ఆపుకోలేకపోయింది కృష్ణవేణి.

అక్కడికీ ఆ వేగం అణుచుకునే ప్రయత్నంలోనే వుందామె.

"ఏదో బాధపడుతున్నావు. బుద్ధిపూర్వకంగా దాస్తున్నావు. మొగం దిగాలుపడిపోయి వుంది. కళ్ళకి నిద్రలేనట్టు స్పష్టంగా కనబడుతోంది. ఎంచేతో చెప్పవూ తల్లీ?"

"తెల్లవారి లేచి కాఫీ పుచ్చుకోలేదు, నాన్నారూ!"

తల్లీ తండ్రీ వొకమాటే అడిగా "రెంచేతా?" అని.

"నిన్న రాత్రి భోజనం కూడా చెయ్యలేదండీ!"

అప్పటి కామె పెదవులు వొణికాయి.

కళ్ళు చెమ్మగిల్లాయి.

నిటాగ్గా కూచున్న మనిషి తల్లిమీదికి వాలిపోయింది.

రాధమ్మా యాజులూ కూడా గడగడలాడిపోయారు.

"నీ ఆడబడుచేమయినా అందా ఏమిటి తల్లీ?" అని రాధమ్మ అడగ్గా, "అనే వుంటుంది. కోనసీమజట్టు, మొదటే అనుకున్నాన్నాను. ఏమి జరిగింది తల్లీ, చెప్పవూ?"అంటూ యాజులు కంగారుపడ్డాడు.

సరిగా యీ సమయాన సుభద్రమ్మ వచ్చిందక్కడికి.

"కాఫీ చేసి తొరగా తీసుకురావమ్మా" అని తొందర పెట్టాడు యాజులు.

సంగతి బోధపడక, వాలకం చూసి కంగారుపడిపోయి బదులు చెప్పకుండా వంటింటోకి పరుగెత్తింది, సుభద్రమ్మ.

తనమీద వొట్టుపెట్టుకుని రాధమ్మ అనేకవిధాల అడగ్గా "చెబుతానుండు" అంటూ కళ్ళు మూసుకుంది, కృష్ణవేణి.

"చెబుతుంది చెబుతుంది, కంఠంలో కాస్త కాఫీ పడనియ్యి" అని రాధమ్మతో అని, "ఏం, సుభద్రమ్మా, ఇంకా కాలేదూ?" అంటూ వంటింటోకి పరుగెత్తాడు, యాజులు,

"ఒక్క కప్పు కాఫీ వుంది, ఇది పుచ్చుకునేటప్పటికి మళ్ళీచేస్తా" నంటూ ఫ్లాస్కు యాజులుచేతి కిచ్చి, మళ్లీ వెనక్కి పరుగెత్తింది సుభద్రమ్మ.

కప్పులో పోసి యాజులు రాధమ్మచేతి కిచ్చాడు.

రాధమ్మ నోటి కందించింది.

కాస్త కాస్త చొప్పున రెండు పీల్పులు పీల్చి, కప్పు తానే అందుకుని వున్నదంతా రెండు గుక్కల్లో పుచ్చేసుకుంది కృష్ణవేణి.

రాధమ్మ, కప్పందుకుని కింద పెట్టేసి, తన పైటకొంగుతో కృష్ణవేణి మూతితుడిచి కంఠమున్నూ రాసింది.

కృష్ణవేణి జరిగిందంతా చెప్పింది మెల్లిగా.

రాధమ్మ కొయ్యయిపోయింది.

యాజులు అగ్గయిపోయాడు.

## 22

యాజులు గంటలకొద్దీ ఆలోచించాడు కాని; కర్తవ్యం తేల్చుకోలేకపోయాడు.

రాధమ్మ యేమి టేమిటో చెప్పింది కాని; యెటూ నిర్ధారణ చెయ్యలేక పోయింది.

"లోకానికి విపరీతంగానే వుంటుంది కాని; ఆడబడుచు పీనుగు నవతలికి గెంటెయ్యగలిగితే అమ్మాయి కిక చిక్కు లుండవండీ అన్నయ్యగారూ!" అని సుభద్రమ్మ చెప్పగా, "అవునండీ"అంది రాధమ్మ.

"సాధ్యమా?" అన్నాడు యాజులు.

"ఈ పుట్టిమునక కంతకీ ఆవిడే కారణం అని యెవరయినా గుర్తించగలరు. అతను స్వతంత్రుడయితే ఆమె అలా చెయ్యగలుగునా?" అని కూడా అన్నాడతను.

కొంతసేపెవరూ మాట్లాడలేదు.

"నే నొక్కటి చెబుతాను వింటారూ?" అంటూ మెల్లిగా అందుకుంది రాధమ్మ.

"ఏమిటది?" అన్నాడు యాజులు.

కృష్ణవేణి తల్లికేసి చూసింది, యేమి చెబుతుందో అని.

"పోనీ, పదివేలు–" అంటూ మాట నాన్చేసింది రాధమ్మ.

"బుద్ధిలేనిదానా?" అంటూ యాజులు మొగం తిప్పేసుకున్నాడు.

ఉగ్రురాలయిపోయింది కృష్ణవేణి; కాని తల్లి కనక యేమీ అనలేక వూరుకుంది.

"అలాచేస్తే లోకువ అయిపోతాం వదినా! నిజాని కీకుఱ్ఱ అంతా డబ్బుకోసమే, సందేహం లేదు; కాని పదివేలు కాదు, దమ్మిడీ యిచ్చినా, చివరి కావిడ, ఈ యింటో కూడా పెత్తనం తనదే అన్నంతవరకూ వెళ్ళిపోతుంది"

అని సుభద్రమ్మ నచ్చచెప్పగా "అదీ నిజమేలా కనబడుతోందమ్మా" అంది రాధమ్మ.

"ఇంకెందుకూ ఆ మాటా?"

"బిడ్డని చూడలేక – శని విరగడ అయిపోతుందేమో అని! నా బిడ్డ కెన్నిపాట్లు వచ్చాయో చూశావా?" అనడుగుతూనే బొరుమంది రాధమ్మ.

"అదేమిటమ్మా?" అంటూ కృష్ణవేణి తల్లిని కౌగిలించుకుంది.

యాజులామె కళ్ళు తుడిచాడు.

"అయ్యో, వదినా! ఇంత పామరత్వం అయితే యెలాగా?" అనడుగుతూ సుభద్రమ్మ, భుజంమీద చెయ్యివేసి రాధమ్మ దగ్గిర నుంచుంది.

## 23

"ఇప్పుడే వస్తామ తల్లీ" అంటూ యాజులు యెదటింటి వకీలు దగ్గిరికి బయలుదేరాడు.

ఇద్దరికీ మంచి స్నేహం.

ఇద్దరూ రిటైరయే వున్నారు.

ఇద్దరూ గ్రంథకాలక్షేపమే చేస్తారు తరుచు.

వకీలు సంపాదన పది–పదిహేను లక్షలకు మించివుంది

యాజులుకి న్యాయందగ్గిర స్వపరభేదం లేదు.

న్యాయం వున్న కేసులే పట్టేవాడు వకీలు.

న్యాయం తప్పి యెప్పుడూ డిక్రీ లివ్వలేదు యాజులు.

న్యాయశాస్త్రంలో తెలియని విషయం లేదు వకీలుకి.

ఎలాంటివకీలునీ పాయింటు దగ్గిర నిలవబెట్టేసేవాడు యాజులు.

ఎదటివకీలు గంటలకొద్దీ వాదనచేస్తే నిమిషాల్లో ముగించి కూచునేవాడు వకీలు.

యురపియన్ ఆఫీసర్లు, అంచేత, ఆ యిద్దరి యెడలా చాలా ఆదర గౌరవాలు చూపించేవారు.

యాజులకీ వకీలుకీ గాఢస్నేహం కలగడాని కివన్నీ ముఖ్య హేతువులు

పైగా, యిద్దరిదీ వయస్సొకటి.

ఇద్దరి మేడలూ వొకదాని కొక ఎదురు.

వకీలుకి ముగ్గురు కొడుకులు.

వారికి కృష్ణవేణే చెల్లెలు.

యాజులకి కృష్ణవేణి వొక్కత్తే సంతానం.

ఆమెకి వకీలు కొడుకులే అన్నదమ్ములు.

వకీలు "కొన్నాళ్ళపాటు అమ్మాయి అక్కడికి వెళ్ళకుండా వుండడం మంచి"దని తేల్చాడు.

"అయినా, ముందొకమాటు అల్లుడితో మాట్టాడ్డం కూడా అగత్యం" అని చెప్పి, వెళ్ళిరావడానికిన్నీ అంగీకరించాడు.

పన్నెండు గంటలు దాటాక కృష్ణవేణీ వకీలు బయలుదేరారు.

"కృష్ణవేణి మాకెలాంటిబిడ్డో, మీకూ అలాంటిబిడ్డే. కనక, వ్యవహారం ఎలా పరిష్కరించుకురావడానికయినా మీరు స్వతంత్రించవచ్చు. అమ్మాయి వొక గడువు పెట్టుకుని వుంది. ఇది పరీక్షా సమయం, కనక మీరు ఆస్తి సంగతి ఏవిధంగానూ రానివ్వవద్దు. లౌక్యాలున్నూ సాగనియ్యవద్దు."

స్వయంగా మోటారు తలుపు వేస్తూ యాజు లిలా చెప్పాడు వకీలుకి.

ఇంటోకి వచ్చాక, "ఏమవుతుందంటారూ?" అనడిగింది రాధమ్మ.

"రాజమ్మ బయటికి వెళ్ళిపోడం సంభవించకపోతే మన అమ్మాయి మన యింటికి వచ్చేస్తుంది."

"కాపరం వుండదంటారా?"

"అలాగే పురుగులా పడివుండమంటావా అక్కడ?"

"రామరామా"

"ఇంకేమీ?"

"ఎక్కడో రాకాసిపీనుగు దొరికిందండీ ఆడబడుచు"

"అల్లుడికి బుద్ధిలేదు కనక"

" "

"ఒక్కటి చెబుతా వింటావా? కోటేశ్వరశాస్త్రి, ఇటు అమ్మాయి చేతిలోనో అటు రాజమ్మ చేతిలోనో వుండవలసిన మనిషి కాని, స్వతంత్రుడుకాడు. అయితే, అమ్మాయి వొకళ్ళమీద పెత్తనం చేద్దామన్న మనిషి కాదు. దీనికి సాయం రాజమ్మది దురాక్రమణ స్వభావం. పైగా, ఆమెకి స్థానబలం వుంది"

"మూడుమాసాలకంటే ఎక్కువ ఎరగదుట మొగుడి మొగం. పుట్టిల్లు విడిచిపెట్టిన దేదీ?"

"కనక, అమ్మాయి క్కాపరం లేకపోతుందేమో అన్న బెంగవద్దు నీకు"

"పోనీ, అల్లుణ్ణే యిల్లరికం –"

"అతని కిల్లరికమూ, అమ్మాయి క్కోడరికమూ అన్న భేదమేముందీ?"

"............"

"ఇంతకీ రాజమ్మ అతణ్ణిక్కడికి రానిస్తుందా?"

"......."

"పోనీ, అమ్మాయి నక్కడ వుండనిచ్చేట్టయినా వుందా?"

రాధమ్మ మాట్టాడలేకపోయింది.

## 24

శాస్త్రీ, మేనమామా, రాజమ్మా వాకట్లో కూచుని కభుర్లు చెప్పుకుంటున్నారు.

వాళ్ళ మాటలు విని సహించలేక మహాలక్ష్మమ్మ ఎదటింటికి పెత్తనాలకు వెళ్ళిపోయింది.

కృష్ణవేణితో వకీలు కూడా రావడం చూసి శాస్త్రి విభ్రాంతుడయిపోయాడు.

రాజమ్మ గోడచాటుకి తప్పుకుంది.

మేనమామ, శాస్త్రిని విడచి వకీలునీ, వకీలుని విడిచి శాస్త్రినీ చూడసాగాడు.

తుంగచాప పరిచి "దయచెయ్యండి" అని వకీలుకి స్వాగతం నివేదించుకున్నాడు శాస్త్రి.

కృష్ణవేణి వెళ్ళి గది గుమ్మంలో నుంచుంది.

"ఏమి సెలవు? ఎప్పుడూ రానివారు దయచేశారు"

"ఎప్పుడూ రానివాణ్ణే; కాని రాగూడనివాణ్ణి కాను. అయితే, వీరెవరూ?"

"మా బుర్లి మేనమామగారండి"

"నన్ను యాజులుగారు పంపించారు, అమ్మాయి పనిమీద వచ్చాను."

"చిత్తం."

"నన్ను మీరెరుగుదురనుకుంటాను"

"దివాన్ బహద్దరు నోరి పతంజలిశాస్త్రిగారంటే దిశలు తెల్లవారతాయి. తమ కళ్ళయెదట పెరిగినవాణ్ణి, యెరక్కపోడం ఎలా వస్తుందీ?"

"మరి, వచ్చిన పని కానిద్దాం."

"చిత్తం చిత్తం"

"దాంపత్యధర్మాలు చర్చకి రానివ్వడం విద్యాధికులైన మీవంటి యువకులకు మంచిది కాదు."

"ఇప్పుడలాంటిదేమీ రాలేదు మహాశయా!"

"వచ్చింది చిరంజీవీ!"

"తమకున్నూ అలా తోచడం–"

"కాదని మీ నిశ్చయమయితే నా సందేహాలు తీర్చండీ"

"తప్పకుండాను"

"కాస్సేపటికో కూస్సేపటికో నీ అత్తగారూ మామగారూ వస్తారు, నువ్వు మాత్రం బేలపోకు, ఖండితంగా మాట్లాడేసెయ్యి" అని పొద్దున్న రాజమ్మ చెప్పినమాట నెమరుకి వచ్చిందతనికి.

"మరి అడగండి" అన్నట్టు నిటార్గా కూచున్నాడతను.

"పెళ్ళినాటికి అమ్మాయి కృష్ణవేణి రజస్వల అయి చాలారోజులయిందని మీకందరికీ బాగా తెలుసు."

"చిత్తం"

"చిత్తం అంటే చాలదు. సూటిగాను స్పష్టంగానూ చెప్పాలి నాకు"

"అయితే, తెలుసునండి. మేమందరమూ అంగీకరించాం"

"యాజులుగారు కట్నం యివ్వమనీ, లాంఛనాలు కూడా ఏమి ఇవ్వమనీ, తమ ఆస్తి ఏవిధంగానూ, ఏమాత్రమూ కూడా మీకు స్వాధీనం చెయ్యమనీ మొదట, కచ్చితంగా చెప్పారు."

"చెప్పారు, అందుకూ అంగీకరించాం."

"నిన్నరాత్రి భోజనాలవేళ, మీ తోడబుట్టిన ఆమె మీ మేనమామగారితో మీ రెండోపెళ్ళిమాట ప్రస్తావిస్తూ 'కట్నం యేమీ యిచ్చారు కారనీ, తరవాత ఏదోవిధంగా ముట్టజెబుతా రనుకుంటే గుడ్డిగవ్వ కూడా రాల్చలేదనీ, పైగా వెలిమాత్రం చుట్టబెట్టుకుందనీ' చాలా దురుసుగా చెప్పారు."

"నేనేమీ అనలేదే?"

"మీరు వినేవున్నారే అది?"

"అవును."

"మీ వుద్దేశం కూడా –"

"నాకిప్పటికీ లేదలాంటి వుద్దేశం."

"చాలా సంతోషం. ఆత్మగౌరవం తెలిసినచోట ఎప్పుడూ వుండదలాంటి వుద్దేశం. అసలు, మీకు కట్నం అక్కరేలేదని రాశారు మీరు యాజులుగారికి. కనకనే మీ యెదట ఆమె అలాంటి మాట అనడం–"

"అవునండి."

"అవునని మీరే అంగీకరించాటప్పుడు మీ రావిణ్ణి మందలించివుండాలి కదా?"

"అయ్యా" అంటూ మేనమామ అందుకున్నాడు.

"అది చిన్న పిల్ల. వీడూ చిన్నపిల్లవాడే. ఏదో పొరపాటు వచ్చింది."

"అవునవును. ఇటు కృష్ణవేణీ చిన్నపిల్లే. చిన్నపిల్లల్లో ఏవో పొరబాట్లు వచ్చాయి. మన దృష్టిలో అవి పొరపాట్లే కాని; మనం వూరుకుంటే అవి తగువుకి మూలా లవుతాయి."

"నిజమేనండి."

"మరి, పెద్దలుగదా, మీరయినా మందలించారా?"

"నాకెందుకు బాబూ వొకళ్ళ గొడవలూ?" అని చేతులు దులుపుకుంటూ గోడకి చేరబడ్డాడు మేనమామ, దిగ్భ్రాంతుడయి.

"కనక మీరూరుకోండి. ఏమంటారు శాస్త్రిగారూ?"

"మందలించలేదు."

"ఏం?"

"మందలించలేదు, అంతే"

"ఎనిమిది రూపాయల ఇల్లు పనికిరాదనీ, పదిహేను రూపాయ లయినా సరే ఈ యింటో ప్రవేశించవలసిందే అనీ అమ్మాయి మిమ్మల్ని—"

"పెళ్ళికి పూర్వమే మేమీ యింటో ప్రవేశించాము."

"సరే, మరి కారణం?"

"మాకు మేమే విడిచిపెట్టాం అది, కారణం ఏమయితేం?"

"పెళ్ళయింది మొదలు ప్రతీ రాత్రీ మీ ఇంటో అమ్మాయీ మీరూ ఏక బంతిని భోజనం చేస్తున్నారు."

"నిజమే కాని; ఎప్పుడయినా అలా జరక్కపోతే అది తగునా."

"కారణం వుంటే—"

"నిన్న అలాంటి ఏర్పాటు లేకపోవడమే కారణం."

"బాగుంది. అలాంటి ఏర్పాటు లేకపోడానిక్కారణం?"

శాస్త్రికి మాటతోచలేదు.

మేనమామ ఏమయినా అందిస్తాడేమో అని అలా చూశాడు; కాని అతని మొగం ఇంకా వాలిపోయే వుంది. చితికిపోయిన అతని గుండెకాయ ఇంకా అతుక్కోలేదు.

"చెప్పండి" అని రెట్టించాడు వకీలు.

"చెబుతాను కానివ్వండి" అంటూ నాన్చేశాడు శాస్త్రి.

"ప్రతీరోజూ మీ అమ్మగారో మీ అక్కగారో పిలిస్తేనే మీ బంతికి వస్తోందమ్మాయి. తనకితానే కాదు."

"పిలిస్తేనే."

"మరి, నిన్నరాత్రి పిలవకపోడాని క్కారణం?"

"నా యిష్టం, నన్ను ఆజ్ఞాపించడాని కెవరి కధికారం వుందీ? అసలు, నేను వండి వడ్డించకపోతే మాత్రం ఎవ రేమిచెయ్యగలరూ?" అంటూ సణిగింది, గోడచాటున రాజమ్మ.

అదందుకుని "మా అక్క స్వతంత్రురాలు, ఆవిణ్ణి ఆజ్ఞాపించడానికి నాకేం హక్కుందీ?"

"మీ ఇంటో వుంటడానికి మీ అక్కగారికేం హక్కుందీ? అన్న ప్రశ్న వస్తుంది మీమాటమీద. ఒకటికాదు, ఎన్నో వస్తాయి. కనక, హక్కుల ప్రస్తావన—"

"సరే సరే."

"మీ అమ్మగారు వంటింటోనే వున్నా రప్పుడు."

"ఉంది. అయితే, వార్ధక్యం కావడంవల్ల లేవలేక —"

"పిలవ్వచ్చునే?"

"నిజమే, పిలవ్వచ్చు. పిలవలేదు."

చూసిచూసి "పోనీ, మీరు–" అని ఏదో అనబోగా, మాట సగంలో అడ్డువచ్చి "అయ్యో, ఆడదాన్ని మొగాడు భోజనానికి పిలవడం ఏమిటండీ?" అనడిగాడు మేనమామ.

"మరే నండోయ్" అన్నట్టు చూశాడు. శాస్త్రి.

"ఊరుకుంటా వేమిరా?" అంటూ పళ్లు కొరుక్కుంది రాజమ్మ.

కృష్ణవేణి "మేనమామ"ని మూడోకంటితో చూసింది.

"మీరూరుకోండి" అంటూ మేనమామని కసిరి, వకీలందుకున్నాడు.

"ఏమంటారు శాస్త్రిగారూ?"

"బొట్టుపెట్టి పిలవ్వలసిందేనా భోజనానికి?"

"ఎనిమిదిమాసాల నుంచీ పొక్కనాడైనా మానకుండా మరెందుకు పిలుస్తున్నారూ?"

"..............."

"నిన్ననే మానవలసిన అగత్యం ఏమి వచ్చిందీ?"

"అయ్యో, సద్దుకోవాలి గాని ప్రతీదానికీ ఆరాతీస్తే యెలాగండీ సంసారంలో?"

"సద్దుకోడం అనే దందరికీ అగత్యమేనా?"

"ఆ"

"అయితే, అమ్మాయి రాత్రి భోజనం చెయ్యలేదని మీకు తెలుసు"

"తెలియదు"

"ఏమిటీ?"

"నే నడగలేదు."

"అడక్కపోడమే మీ పక్షంగా సద్దుకోడమా?"

"..............."

"తెలియనప్పు డడగడం మాత్రం యెలా వస్తుందీ అసలు?"

"..............."

"పోనీ! తరవాత నైనా–"

"ఇవాళ పొద్దున్న అది పుట్టింటికి వెళ్ళాక తెలిసింది."

"పొద్దున్న కాఫీ కూడా పుచ్చుకోలేదని–"

"అదీ తరవాతే తెలిసింది".

రాత్రి భోజనం మాట తెల్లవారాక తెలియడమూ, తెల్లవారి కాఫీమాట వెళ్ళిపోయాక తెలియడమూ – ఇది ఒక పద్ధతిలోనే వుంది. సరే, గాని, రాత్రి అమ్మాయి తుంగచాప పరుచుకుని పడుకుంది."

"అవును"

"ఏమని అడిగారా మీరు"

"బతిమాలుకోవా లంటారా మీరు?"

"బతిమాలుకోడమూ, కాళ్ళు కూడా పట్టుకోడమూ – ఇలాంటివి, మొగుడికీ పెళ్ళానికీ గూడా అగత్యం అవుతూనే వుంటాయి తరుచు. శాస్త్రంలో కూడా వాటికి ఆజ్ఞవుంది. అయితే, మొగుడూ పెళ్ళాల్లో జరిగితేనే సొగసు."

ఇది విని గుమ్మంలో వున్న కృష్ణవేణి కొంచెం వెనక్కి జరిగి తనలో నవ్వుకుంది, సవ్రీడంగా.

శాస్త్రి మిడుతూ మిడుతూ చూసి వూరుకున్నాడు.

అది గుర్తించి "ఏ–మ–ని–అ–డి–గా–రా–మీ–రు?" అని ప్రతీ అక్షరమూ వొత్తి అడిగాడు వకీలు మళ్ళీ.

"అడగలేదండీ" అని బదులు చెప్పాడు కొంచెం దురుసుగా శాస్త్రి.

అది గుర్తించాడు వకీలు,

ఇలాంటి పరిస్థితులు వచ్చినప్పుడు తమ ప్రాగల్భ్యం బాగా చూపించుకుంటారు వకీళ్ళు కోర్టుల్లో.

"అంటే, మీరు సద్దుకున్నా రన్నమాట"

ఇలా అని గంభీరంగా చూశాడు వకీలు.

అర్థంకాక శాస్త్రి మేనమామకేసి చూశాడు.

అదేమిటో యిదెందుకో బోధపడక మేనమామ మొగం వంచుకున్నాడు.

కృష్ణవేణి చిరునవ్వు నవ్వుకుంది.

చూసి చూసి "మీ వుద్యోగం పోయిందని అమ్మాయితో చెప్పారా మీరు?" అనడిగాడు, వకీలు.

"లేదు"

"మీ అక్కతో చెప్పారు"

"చెప్పాను – ఏమిటి చెబితే?"

"ప్చ్" అంటూ చప్పరించేసి "అమ్మాయి మీ కష్టసుఖాలు తెలుసుకోగూడనిదా?"

"సెలవిప్పించండి"

"తెలుసుకో తగ్గదే"

"మరెందుకు చెప్పారు కారూ?"

"అది నా యిష్టం"

"లక్షల విలవచేసే మాట .. చూడండీ, శాస్త్రి గారూ, ఇష్టం అన్నది ప్రతివారికీ జన్మహక్కే కాదూ?"

మొగం వంచుకుని కళ్ళు కూడా మూసుకున్నాడు శాస్త్రి.

నోరెత్తడానికి మేనమామకి దమ్ములు చాలలేదు.

రాజమ్మకూడా తమ్ముణ్ణి వెనక వేసుకురావాలని చూసింది గాని, గుక్క తిరగలేదు.

వకీ లందుకున్నాడు, బెల్లించి చూస్తూ;

"ఇప్పుడు మీ సంసారం మీ అక్క పోషిస్తున్నారు. అంతేనా శాస్త్రి గారూ?"

"అంతే"

"సాయం చెయ్య మని మీరు కోరారు"

"లేదు. నా పరిస్థితులు గుర్తించి ఆవిడే స్వయంగా పోషిస్తోంది"

"మీ వుద్యోగం పోయిందని మీరు చెప్పడంవల్ల మీ పరిస్థితు లామెకి తెలిశాయి"

"అవునండీ"

"ఆవిడతో చెప్పినట్టే అమ్మాయితో కూడా—"

"దేహీ అని యాచించనా?"

"నే నడిగిన మాటకి—"

"అది చూడ్డం లేదూ?"

"మీ అక్క మాత్రం చూడ్డం లేదూ! ఆవిడకు మాత్రం—"

"ప్రాణాంతకంగా వున్నాయే ఈ ప్రశ్నలు" అని రుస రుస లాడుతూ అందుకుని "వీటి కిక అంతం అంటూ లేదా యేమిటి? బాగానే వుంది ధోరణి" అన్నాడు మేనమామ.

ఈ పునాదిమీద రాజమ్మ కూడా పురెక్కి "అడిగినక్కడ్డ వాజమ్మలాగ జవాబులు చెప్పడమేట్రా? సిగ్గూ బిడియమూ వుండవద్దూ? కాస్తయినా బుద్ధిలేకపోతే యెలాగా?" అంటూ కసిరింది, చాటునే వుండి.

శాస్త్రికి నవశక్తి వచ్చింది.

"అయ్యా, మీరు పెద్దమనుష్యులే కాని; అనవసరప్రస్తావన చేస్తున్నారు. నేను మీకిక జవాబు చెప్పను" అంటూ మూతి బిడాయించుకున్నా డతను.

"ఇంకెందుకూ? ఎందుకోసం నేనింత సేపు ప్రయత్నించవలసివచ్చిందో అది యిప్పుడిప్పుడే తెలిసిపోయింది నాకు. ఇక నేనడగనూ అక్కర్లేదు, మీరు చెప్పనూ అక్కర్లే"దన్నాడు వకీలు.

అదేమిటో బోధపడలేదు శాస్త్రికి.

మేనమామ మాత్రం తెల్లపోయాడు "ఇదంతా రాజమ్మ చేస్తోం దన్న రహస్యం బయటపడిపోయిం" దని.

"ఏం, నోరు మూతపడిందా?" అనుకుంటూ వెన్ను విరుచుకుంది రాజమ్మ, గోడచాటున.

## 25

"మీరుండండి బాబయ్యా" అంటూ కృష్ణవేణి అందుకుంది, కొంచెం ముందుకి వచ్చి.

"ఏమండీ, భార్య అంటే బానిస కాదనీ, సమాన భాగస్వామిని అనీ మొదట్లో చెప్పాను కాదూ?"

"అయితే?" అనడిగాడు శాస్త్రి, నిర్లక్ష్యంగా.

"అవసరం వచ్చిందని తోచినప్పుడు గృహిణికి వుండవలసిన అధికారాలన్నీ నేను స్వాధీనపరుచుకుంటా నని కూడా మీతో చెప్పాను కాదూ అప్పుడూ?"

"చెబితే?"

"ఇప్పుడలాంటి అవసరం వచ్చింది కనక, చెబుతున్నాను. ఈ క్షణం మొదలు, మీరూ, నేనూ, మీ అమ్మా తప్ప మన యింట్లో మరోమనిషి వుండడానికి వల్లకాదు."

మేనమామ కొయ్యయిపోయాడు, మళ్ళీ.

"నన్ను పొమ్మనడానికి నువ్వెవర్తివే? నువ్వెక్కణ్ణుంచివచ్చావే?" అంటూ పళ్ళుకొరికింది రాజమ్మ, మొగం యివతల పెట్టి.

నాలుక కొరుక్కున్నాడు మేనమామ.

కాని, శాస్త్రి యెగిసిపడి అందుకున్నాడు,

"మా అక్క–"

"పనికిరాదు" అంది కృష్ణవేణి, చెయ్యి జాడిస్తూనూ, తల తాటించుకుంటూనూ.

"మా అక్క యింటోనే వున్నా న్నేనిప్పుడు తెలుసా?"

మొగాన చెయ్యి అడ్డంపెట్టుకున్నాడు మేనమామ. మరింత పరితపిస్తూ.

"అయితే, మీరూ నేనూ మీ అమ్మా మన యింటికి వెళ్ళిపోదాం రండి" అంది కృష్ణవేణి, దారిచూపిస్తూ.

"అది బాగుందిరా" అన్నాడు మేనమామ అవ్యవధానంగా, "ఇంకా చూస్తావేం?" అన్నట్టు చూస్తూ.

కాని "నీ కెందుకూ మా గొడవలూ? బుద్ధిలేదూ"అంటూ మేనమామమీద నిప్పులు కురిసింది రాజమ్మ.

"నువ్వుండవోయ్" అన్నాడు శాస్త్రి కూడా, దాంతో దిటవు తెచ్చుకుని, మేనమామని.

"నేను రాను నీ పుట్టింటికి" అని కూడా అన్నాడత నిటుచూస్తూ.

"సరే, అయితే" అంది కృష్ణవేణి.

అని "డ్రైవర్!" అని పిలిచింది వీధికేసి చూస్తూ.

"వచ్చానమ్మా!" అంటూ క్షణంలో వకీలు డ్రైవరు ప్రత్యక్షమైనా డక్కడ.

మేనమామ వెర్రిచూపులు చూశాడు.

శాస్త్రికళ్ళు చీకట్లు కమ్మాయి.

ఆత్రపడుతూ తొంగిచూసింది రాజమ్మ.

కృష్ణవేణి "కారులో పెట్టు" అంది డ్రైవర్ని, కమాండరులాగ నుంచుని, గదిలో వున్న తన సామాను చూపిస్తూ.

రెండు సబురులు తిరిగి "ఇంకేమి సెలవు" అంటున్నట్టు నుంచున్నాడు, మళ్ళీ వచ్చి డ్రైవరు.

"ఇక లేవండి బాబయ్యా" అంది కృష్ణవేణి, తరవాత వకీలుని.

"అబ్బాయీ, మరి వెడతా" అంటూ లేచి నుంచున్నాడు వకీలు.

"వెర్రిమొగమా! వెళ్ళిపోతూ వుంటే ఆడదానిలాగచూస్తూ వూరుకుంటావా?" అంటూ బారలు చాపింది తమ్ముడి మొగం మీదికి, గభీమని యివతలికి వచ్చి రాజమ్మ.

"ఎక్కడికి వెడతావ్?" అంటూ వురిమాడు శాస్త్రి, దీంతో.

ఉరుముతూనే లేచినుంచున్నాడు, కచ్చబిగిస్తూ.

"ఆ" అన్నాడు వకీలు, పడగెత్తిన తాచులాగ, విరగబడి చూస్తూ.

"ఓ–హో, నీకా సరదా కూడా వుందా?" అంటూ అందుకుంది, కృష్ణవేణి, పళ్ళు పటపట్లాడిస్తూనూ, తల పంకించుకుంటూనూ, కాల్చేసేటట్టు చూస్తూనూ.

"అయితే రా. నేను నేర్చుకున్న జపాన్‌కుస్తీ కింతవరకూ వినియోగమే లేకపోయింది" అంటూ పంజాకూడా చాపిందామె.

చొక్కాచేతులు పైకి తోసుకుంటూ డ్రైవరు కూడా ముందుకి వచ్చాడు.

అది చూసి కూచునివున్న మేనమామ కూచుని వున్నట్టుగానే వొక పిల్లిమంతరం వేసి వంటింటిగుమ్మం దగ్గిర నుంచున్నాడు వెళ్ళి.

"ఒరేయ్, ఇంటోకి పోరా. కదలవేమిరా?" అంది కంఠం నొక్కుకుని రాజమ్మ, తాను వసారాస్తంభం చాటుకి వెళ్ళి.

"ఛీ" అంది కృష్ణవేణి.

"నువ్వింత అనాథ వనుకోలేదు మే మెవరమూ. సాటి ఆడదాన్ని పెళ్ళి చేసుకున్నందుకు నేను చాలా సిగ్గుపడుతున్నాను. చిక్కులు పెడితే కాపరం వొదులుకుంటుందా అనీ, డబ్బు పట్టుకురాకపోతుందా అనీ ఎత్తు వేశావు కదూ మీ అక్కమాట విని? నీవంటి వాజమ్మతోనా కాపరం? బి.ఏ. అయి వుండీన్నీ వున్నతాశయాలు లేక, ఆత్మగౌరవం ఎరక్క, ఆత్మవిశ్వాసం లేక, గుడ్డిగవ్వకి మారని నీకా డబ్బివ్వడం? హిందూ'లా'లో విడాకులసూత్రం లేనందుకు మురుస్తున్నావేమో, లక్షమార్గాలున్నాయి నాకు మొగుడే కావాలంటే, తెలుసా? జాగ్రత్త! డబ్బుకోసం గడ్డితింటావా? నమ్మిన భార్యకి ద్రోహం చేస్తావా? నీచుడా, చేసుకున్న పెళ్ళామా నీతో కాపరం చేసేది, తోడబుట్టిన అక్కా? ఛీ, పురుగా!" అని శాస్త్రిని విసిరికొట్టి, "రండి బాబయ్యా!" అంటూ క్రుద్ధకేసరిలా ముందు బయలుదేరిందామె.

వకీలు తరవాత అడుగువేశాడు.

తిరిగి తిరిగి వెనక్కి చిర్రుగా చూస్తూ చివర వెళ్ళాడు డ్రైవరు.

ఎదరింటికి పెత్తనాలకు వెళ్ళివుండి మామూలుగానే యింటికి వస్తూ మహాలక్ష్మమ్మ ఎదురుపడగా, స్లిప్పర్లు దూరంగా విడిచి "అమ్మా, ఇక మీరెవరో నేనెవరో" అంటూ ఆమె పాదాలు పట్టుకుని కళ్ళకద్దుకుని, మళ్ళీ జోడు తొడుక్కుని వెళ్ళి కారులో కూచుంది, కృష్ణవేణి.

జయభేరీలాగ ఒర్‌ర్‌ర్‌రు మంది హారన్.

*1937 జనవరి భారతి నుంచి*
*(సవరణలతో)*

★ ★ ★

# కలుపు మొక్కలు

"చి-త్తం చి-త్తం. ఒక్క కలంపోటుతో తమరొక బ్రాహ్మణ కుటుంబానికి యావజ్జీవమూ అన్నం పెట్టించగలరు"

"అన్నం పెట్టినా సున్నం పెట్టినా జిల్లాబోర్డు ప్రెసిడెంటుగాని, నావల్ల ఏమవుతుందీ?"

"పేరుమట్టుకి వారిదే. అంటే, మనవి చేసుకుంటాను. ఒక సత్రం వుందంటే అది ప్రతిష్ఠించిన దాత పేరు, కనిపెట్టుకుని వుండి అక్కడ సద్దుబాట్లు చేసే గుమాస్తా పేరూనూ. అయితే, ఆ దాత ఆజ్ఞ శిరసావహించడమే ఆ గుమాస్తా విధి కూడా మహాప్రభూ!"

"నేను దాతను కానే? ప్రెసిడెంటు అంటే గుమాస్తా కూడా కాడే?"

"తమరలా సెలవిప్పిస్తే నేనేం మనవి చేసుకోగలనూ? సబ్ కలెక్టరు దొరవారి శిఫారసు తోసేసి ఏ ప్రెసిడెంటు బతగ్గలడూ?"

"నిజమే కాని అది పూర్వకాలం మాట. ఇప్పుడలాంటి పద్ధతులేవీ సాగవు. వెనకటి రోజుల్లో యే ముస్సద్దీప్లీడరో జిల్లాబోర్డు ప్రెసిడెంటు అయేవాడు. అధికార్ల దగ్గిర ఎంత భయభక్తులతో మసులుకోవాలో వాళ్ళకి బాగా తెలిసీ వుండేది. ఇప్పటివాళ్ళు – చాలా మంది మాట సుమా – స్కూల్ ఫైనల్ కూడా కానక్కర్లేదు. ఓటు – ఇప్పుడంతా వోటుతో వుంది మహిమ. ఆపైని గుజరాతీ కోమట్లకి మంగళప్రదమైన పచ్చపెట్టి. ఇక చెప్పడానికేం వుందీ? పెద్ద సంతకమా చిన్నసంతకమా అని డఫేదారు నడిగిగాని–"

"తమరే వుపక్రమించారు కనక విన్నవించుకుంటాను. మన ప్రెసిడెంటు గారు – చిత్తగించారూ? తక్కిన అవగుణాలు అలా వుండగానున్ను – రాత్రీ పగలూ కూడా – కేవలమూ వేశ్యావాటికలో–"

"పాటి బ్రాహ్మణ్ణి పట్టుకుని అలా అంటా వేమిటయ్యా?"

"పాటి వాడు కనకనే మా కీ తిప్పలు. బ్రాహ్మడు కనకనే మాఘస్నానాలూ దొమ్మరిగుడిసెలూనూ. అలాకాక, ఏ రెడ్డిగారో, ఏ నాయుడుగారో, ఏ చౌదరిగారో అయితే –"

"వా! బ్రాహ్మణయుక్తి అంతా కురిపించేస్తున్నావే?"

"ఇందులో కడుపు మాడిన దుఃఖమే గాని యుక్తేం వుంది మహాప్రభూ?"

"అయితే, సంగతంతా తెలిసేవుంది కదా, ఏ నాయకురాలినో పట్టుకో రాదుటయ్యా?"

"తమవల్ల కాకపోతేగదా?"

"అయినా సులభంగా పని జరిగే మార్గా లున్నప్పుడీ అవస్థ లన్నీ ఎందుకూ?"

"భోగందాన్నో, కులటనో ఆశ్రయించడం కంటే అవస్థ ఏం వుంది? కాక; ఇంటిల్లిపాదిమీ వొక నెలదినాలు వస్తుండి అయినా–"

"అలా దారికిరావయ్యా! జిల్లా బోర్డు ప్రెసిడెంటుకయితే సప్లయిలు మహా బాగే చేస్తారు నీవంటివాళ్ళు."

"చిత్తం చిత్తం. నాది పొరబాటే. 'రిక్తహస్తేన నోపేయా'త్తని కారిక కూడా వుంది. చిత్తగించారూ? కనక రేపీపాటికి–"

"ఏదో మాటవరసకంటే ఇలా మొదలుపెట్టా వేమిటయ్యోయ్? కాస్త శిఫారసు భాగ్యానికి నేను లంచం పుచ్చుకుంటాను టయ్యా?"

"లంచమా? ఎంతమాటా? ధర్మరాజు వంటి తమ సన్నిధిలో అలాంటి మాట అనడాని కెన్నివేల గుండె లుండాలి? పోని అంటే తమవంటివారికి లంచ మివ్వడానికి నాకు మాత్రం తాహతు ఎక్కడిదీ?.......ఇంతకి, మాకందరికీ అధారం చూపించబోతున్నందుకు తమకొక్క మణుగు నెయ్యి. ఏ పులుసులో కయినా పనికివస్తుంది వొక బుట్టెడు బెల్లం. ఏ రొట్టి ముక్కలో కయినా వాడుకోడాని కొక డబ్బా తేనె పానకం –"

"ఇవీ, ఇంకా ఇలాంటివీ నాకు సప్లయి చేస్తా నంటావా ఏమిటి? దిట్టమైన వాడవేనే?"

"తమ రాగ్రహించ రని ధైర్యం కలగబట్టి–"

"వెర్రిబ్రాహ్మడవు నీమీద ఆగ్రహం ఏమిటి కానీ – రెండు రోజుల్లో మా పెద్దమ్మాయీ అల్లుడూ పిల్లలూ వస్తున్నారు, నేనే కొంటాను గానీ–"

"వద్దు మహాప్రభూ, వద్దు. తెల్లవారాటప్పటికి నేను దాఖలు చేసుకుంటాను. నేను ఆడపిల్లలు గలవాణ్ణి. ఆడపిల్లలికి పుట్టింటి ఆశ ఎంత వుంటుందో, తల్లిదండ్రులు వాళ్ళ నెలా సంతోషపెట్టాలో నాకూ కొంచెం తెలుసు. పైగా నా కొడుక్కి తమరన్నం పెట్టించా టప్పుడు, నేను, తమ అమ్మాయిగారికి కాస్త వుపమా, కాస్త కాఫీ –"

"అవునవును, బెల్లం మాట కేం గాని – వెధవ బెల్లం మా యింటో యీగలు కూడా దానిమీద వాలవు గాని – నువ్వు కాఫీ అంటే జ్ఞాపకం వచ్చింది, నీ దగ్గిర యీ మధ్యనే యీనిన ఆవుందిట కాదూ?"

"ఉంది మహారాజా, వుంది నాకు జ్ఞాపకం వచ్చింది కాదు. ఇంకెందుకూ? తెల్లవారాటప్పటికి స్వయంగా తోలుకు వస్తాను నేను."

"గోదానం చేసుకున్న ట్టనుకుంటావు కామోసునేం?"

"రామరామా! దానం పట్టేదాకా తమకేం?"

"బ్రాహ్మల కిస్తే ఏ పేరు పెట్టినా దానమే అవుతుంది గాని; మాకిచ్చింది – విన్నావూ? సప్లయి... ఇనాము... నజరానా... నేమాను."

"చిత్తమండి."

"అసలు, వొకళ్ళ కివ్వడానికే గాని, మేము పుచ్చుకోడాని కధికారం లేకుండా చేశారు కాదూ మీ బ్రాహ్మలు?"

"అనకూడదు కానండీ - పూర్వపువాళ్ళు ముక్కుమూసుక్కూచోడంతప్ప మరేమీ యెరగరండి."

"ముక్కు మూసుక్కూచోలేదు మీ బ్రాహ్మలు, ముక్కుదాళ్ళు పోసి జాతి నంతనూ నిర్వీర్యం చేసేశారు."

"అంటే-"

"అంటేనా? మనిషినీ మనిషినీ విడదీసి, దూరంచేసి, అసూయ పెంచి - అదంతా పెద్దగొడవ, దాని కేం గాని - తెల్లవారితే ద్వారపూడి సంతకి జవాన్లని పంపుదా మనుకుంటున్నాను మానెయ్యమంటావా?"

"ఇంకెందుకూ మహాప్రభూ?"

"నిజమే కదా?"

"ఇంకా-సందేహం-గాయత్రీసాక్షి!"

"మాకులేని జంధ్యాలంటే మాకేం నమ్మకం గాని - మా అమ్మాయిగా రిక్కడ వున్నంత కాలమే - కాదంటే వొంటిపూట పడేదాకానూ. తరవాత మీ అవు మాకక్కర్లేదూ సుమా?"

"ఏదో శాస్త్రం చెప్పిన తరవాయిగా - వొట్టిపోయాక కూడా గుదిబండలాగ - తరవాత నేను వచ్చి తోలుకుపోతాను కాదూ అన్నదాతా!"

"సరే అయితేను. నువ్వు మాకు ఆవుని తోలిపెడితే యీ కారణంవల్ల కూడా అది గోదానంలో చేరదు సుమా!"

"అసలు, తమకి సందేహం -"

"సందేహాని కేమీ లేదు గానీ - అసలు సందేహం అంటే ఏమిటి గానీ - యింకోటి కూడా వుంది, గుర్తించావో లేదో?"

"ఏమిటండీ?"

"అప్పటికీ అది దానమే అంటే, మళ్ళీ నువ్వు తోలుకుపోడం దత్తాపహారం అయిపోతుంది. నీకు ఆ పాపం చుట్టబెట్టకుండా వుండడానిక్కూడా అది దానంలో చేర్చడానికి వల్లకాదు. తెలిసిందా?"

"అవునండి"

"సరే వెళ్ళండి. రేపు పొద్దున్న కనపడతారు కాదూ అవధానులుగారూ?"

"పొద్దున్న దాకానా, కాకులు కూశాటప్పుడు వచ్చి తమర్ని లేపనూ?"

"అదీతెలివంటే. ఏమంటే? వెలుగువచ్చాకఅయితే దిక్కుమాలినప్రజలు-"

"పోనీ వొక పనిచేస్తే?"

"ఏమిటదీ?"

"రాత్రి పన్నెండయ్యాటప్పటికి-"

"భేష్! చాలా బాగుంది. మేము సినీమాకి వెళ్ళి వచ్చాటప్పటికి తోలుకువస్తావన్నమాట!"

"చిత్తం"

"అలా చెయ్యి. నే నీరాత్రే ప్రెసిడెంటుకి ఘాటయిన వుత్తరం రాసి వుంచుతాను; పట్టుకు వెడుదువుగాని"

"అలాగే మహాప్రభూ!"
"మరివెళ్ళు"
"అన్నదాతా సు

"మణుగునెయ్యే?"
"మరి తప్పదు"
"ఒప్పుకునే వచ్చారా ఏమిటి?"
"లేకపోతే చావనా?"
"ఇన్నాళ్ళనుంచి కాపరం చేస్తున్నాను, ఇంతమందిని కన్నాను గాని, పండుగరోజున అయినా మిల్లిగరిటెడుకంటే ఎరగం—"
"ఈ వుద్యోగాలు లేనప్పుడు ఆ నిర్భాగ్యుడు మాత్రం ఎరుగునా? వాడిరోజిది"
"ఇంకేమీ లేదుకదా?"
"ఆ—వు—కూ—డా—"
"ఏమిటీ?"
"ఇంటో కూచుని అలా రంకెవెయ్యడం కాదు ప్రజ్ఞ. మన ఆవుని కూడా తోలిపెట్టాలి."
"కొంపముంచారు."
"ఎలాగో సమాధానం చెప్పుకోవాలి. లేకపోతే వుద్యోగం అంటే మాటలతో వుందా?"

"ఇంతకీ; అబ్బాయికది అత్తవారిచ్చిందే కాదూ?"
"మీకేమయినా మంచీ చెడ్డా తెలవాలా అక్కర్లేదా?"
"తెలవక ఏంతక్కువయిందీ యిప్పుడూ?"
"మనమరాలికి పాలకోసం కదా వియ్యాలవారు దాన్ని తోలిపెట్టారు?"
"దాని తండ్రికి వుద్యోగం కోసం మనం తోలిపెట్టాలి"
"నలుగురూ గడ్డిపెట్టరూ?"
"నలుగురూ పెట్టే గడ్డెక్కువా, ఆయన పెట్టే అన్నం ఎక్కువా?"
"..........నాకేం? కోడలి యిష్టమూ, అబ్బాయి మనస్సూ, ఆపైని మీ అవసరమూనూ. మీయిష్టం వచ్చినట్టు చేసుకోండి"
"అబ్బాయే తోలుకువెడతాడు, నా యిష్టం ఏమిటి మధ్యన?"
"చంటిపిల్ల నోటి దగ్గిరి పాలు పడగొట్టి— పిల్లలున్నారా ఆ కలకటేరుకి?"
"రెండురోజుల్లో పెద్దకూతురూ, అల్లుడూ, మనుమలూ వస్తున్నారు — వాళ్ళకి కాఫీ—"
"కూతుళ్ళ తండ్రేనా? నోరెలా వచ్చిందో?"
"అధికారం — అధికారం — అది గలవాళ్ళ నోటి కిక అడ్డేమిటి?"

"చంటిపిల్ల – మూడు మాసాల గుడ్డు – దాని వుసురు తగలదూ ఆ యముడికీ?"

"మాట్టాడవద్దు. గప్‌చిప్! నిప్పన్నక్కర్ర తగులడక మానదు. ఇప్పుడు దీపాలు పెట్టాటప్పటికి 'మాధవ కవళం' అంటూ వచ్చేవాళ్ళంతా పూర్వజన్మలో ఎవరో ఎరుగుదువా? ఈ బాపతే. ఇక వూరుకో. పింఛను పుచ్చుకున్నాక యిక వీళ్ళమొగం చూసేవారెవరు?"

"అనక ఆయన గతి ఏమిటో కాని యిప్పుడు పిల్లకడుపు మాడుతుంది. ఇక డబ్బాపాలు పొయ్యాలి."

"ఒక్క–నెల– ఒక్కనెల వోపికపట్టు. ఆ పూచీ అంతా అబ్బాయిదే కాని – అయినా కష్టసుఖాలు నువ్వు కూడా కోడలికి బాగా బోధించు. నెల తిరిగేటప్పటికి యాభైరూపాయలు గళ్ళున చేతిలో పడతాయి. మొదటినెల జీతం పెట్టి మాంచి కామధేనువుని కొనేస్తాను. అప్పుడింటిల్లిపాదికీ పెరుగే. రెండోనెల జీతంపెట్టి వొక్క బనారసు చీర – చూశావూ? కోడలు పా–చ్ఛని మనిషి కనక వూదారంగుది, జరీపువ్వులది కొని కట్టబెట్టామంటే దాని మొగం యింతవుతుంది. మూడోనెల జీతంలో బుల్లెమ్మకి బాలతొడుగు. దాంతో దాని కడుపుకొట్టిన దోషం పోతుంది. తరవాత సంసారం పూటుగా –"

"ఆఘోరింటినట్టే వుంది మీ కల్పన. చాల్లెండి, నేర్చుకుపోయా రికవూరుకోండి. ఇదో గొప్పగా చెప్పకోకండి – నలుగురూ తాటాకులు కడతారు."

"వాళ్ళ మొఘం. అబ్బాయికి ఉద్యోగం అయాక నే నిక ఆ వాజమ్మలతో మాట్లాడుతానూ?"

"తమ రలా అంటే –"

"నేనన్న దేం వుందీ యిందులోను? ఉన్న సంగతి చెప్పాను. ఆపైని మీయిష్టం"

"అలా కాదు. తమరు కోప్పడితే నే నాగలేను. నేను బ్రాహ్మణ్ణి. బీదవాణ్ణి. కుటుంబీకుణ్ణి. నేను చెప్పకోవడం కాదు గాని, ఘనాపాఠీని. తమరు కాస్త అనుగ్రహించాలి"

"ఇప్ప డనుగ్రహానికేం తక్కువ వచ్చిందీ? వారు ఇంటికి రాగానే దర్శనం చేయిస్తాను. మీరు సావకాశంగా చెప్పకోడానికి కావలసినంత అవకాశం కలిగిస్తారు, ఏం?"

"తమరు నాలుక చివరనుంచి మాట్టాడితే –"

"మరి నువ్వు?"

నువ్వు చేస్తూవున్న దేమిటయ్యా?"

"వంగతోట దగ్గిర బావ కాదేం?"

"..............కటాక్షించండి"

"ఏమిటిది?.........వోస్"

"స్వీకరించండి"

"లింగూ – లింగూ అయిదురూపాయల కాగితం చేతిలో పెట్టి పే–ద్ద మేరుపర్వతం లాక్కుపోదామనా, వేషగాడవే"

"మహారాజులు కాదూ? ఇవి చేతులు కావు, కాళ్ళు. రుద్రాక్షతావళం తాకట్టుపెట్టి తెచ్చానీ అయిదు రూపాయలూను. ఇక నన్ను కోసినా తేలేను, రక్షించండి"

"......అలా అన్నావా? సరే అయితే. అత్యాశ మీ బ్రాహ్మలికి చెల్లింది, కాని మాకు కాదు. ఇక రేపు – ఇవాళకి మించిపోయింది. తెలిసిందా? ఉదయం యెనిమిదిన్నరకి వస్తే, కాఫీ పుచ్చుకునేటప్పుడు వారి దర్శనం చేయిస్తాను. అప్పుడు జవానుకి మాత్రం వొక రూపాయ తప్పదుసుమా!"

"అదోటా"

"మరి తప్పదు. అంతా వాడితోనే వుంది."

"అయితే, యిక తల వొక్కటే మిగిలివుంది, ఆ రూపాయకోసమూ అది తాకట్టు పెడతాను."

"ఏదో సర్దుబాటు చేసుకోవాలి మరి"

"ఏపూట కాపూట అవస్థపడేవాళ్ళం, మేమేమి యివ్వగలం మహానుభావా?"

"నాకో కాగితం యిచ్చినందుకూ, జవానుకో రూపాయ యివ్వబోతున్నందుకూ పూచీ అంతా మాదే అనుకోవద్దూ సుమా!"

"ఎంతమాటా? మరి యీ వుత్తరం –"

"ఉత్తరం?"

"ఏం, అలా పెదవి విరుస్తా రేం?"

"ఉలిక్కిపడవద్దు. ఉన్నసంగతి చెబుతున్నాను. అబద్ధాలు చెప్పడమూ, మొగం యెదట పొగడడమూ, దగా చెయ్యడమూ నా చేత కాదు. నువ్విన్ని విధాల ప్రాధేయపడుతున్నావు కనక, నా మనస్సు వెన్నలాగ కరిగిపోతోంది – కరిగేపోయింది కూడానూ"

"చిత్తం"

"ఈ పరిస్థితుల్లో నావల్ల నీకు జరిగే వుపకారం వారితో సావకాశంగా మనవిచేసుకోడానికి వీలు చిక్కడమే. పనంతా ఆ వుత్తరంవల్లనే కావాలి. కాని –"

".......నిజం చెప్పండి"

"అదే చెబుతున్నాను. ప్రెసిడెంటుగారికి సబ్ కలెక్టరంటే యిష్టం లేదు."

"చచ్చాను. ఏం?"

"ఏమయితే యేం? అది అలాగా"

"అయ్యో!"

"ఆ వుత్తరం నాలుక గీసుకోడానికి కైనా పనికిరాదు."

"కొంపగుల్ల–"

"అద్దదీ, అద్దదీ. రంగు తేలుతోంది. అక్కడ యేమాత్రం"

"రామరామా! బ్రాహ్మణ పక్షపాతులండీ కలెక్టరుదొరవారు. వెళ్ళి ఆశ్రయించాను, అనుగ్రహించారు"

"అలాగేం? అబ్బా!............... సరే, యేం జరిగిందో జరిగింది కుంభకోణం. అదంతా నాకెందుక్కానీ – చెప్పాను కాదూ? ఆ వృత్తరానికీ తెల్లకాగితానికీ వొక్కటే విలవ"

"మరి గతేమిటీ?"

"అపాయం లేని వుపాయం, దివ్య మైన దొకటుంది. కావలిస్తే చెబుతాను"

"సెలవ్వండి"

"ఆ వుపాయం అవలంబించారంటే మీరు వారిని చూడనే అక్కర్లేదు, తెల్లవారేటప్పటికి ఆర్డరు మీ చేతిలో పడుతుంది"

"అనుగ్రహించమన్నాను కాదూ?"

"చెబుదా మనే కాదూ యీ ప్రయత్నం? అయితే, పని అయేక మాత్రం నా కింకో కాగితం – తెలిసిందా?"

"ఇంకానా?"

"........బాగుంది. అయితే రేపుదయం రావయ్యా, ప్రెసిడెంటుగారి దర్శనం చేయిస్తాను. మీ డబ్బు తిన్నాను కనక ద్రోహం చెయ్యను"

"ధర్మమా?"

"పోనీ, కష్టంగా వుంటే మీ కాగితం మీరు పట్టుకుపొండి ........"

"ఉపాయం చెప్పండి"

"చెప్పనూ? మరి ముందు నువ్వు 'ఊ' అనాలి."

"ఎక్కడ తేనూ?"

"మళ్ళీ మొదలా? ఎక్కడ తేవాలో, ఎలా తేవాలో నేను చెప్పాలా? సరే కాసుకో, మణుగునెయ్యీ–"

"..........."

"ఏం, తెల్లపోతావేం?"

"తమ రేమిటో సెల విస్తున్నారు. నా తల విలవ తెలుసుకుని తమ రేమన్నా–"

"నీ తల విలవ అవే చెబుతుంది."

"............"

"నాలుక కరుచుకుంటావేం?"

".............."

"మాట్టాడ వేమయ్యా?"

".............."

"నా దగ్గిరా వేషాలు?"

"ఆ వుపాయం చెప్పండి"

"అలా దారికి రా. తప్పకుండా ఇస్తావు కాదూ?"

"ఇచ్చుకుంటాను."

"

"    "

"ఆ! చాలు, మరి విను. బాగా జ్ఞాపకం వుంచుకో."

"చిత్తం."

"మెరకవీధి – దుగ్గిరాల శేషాచలం – ఎప్పుడయినా విన్నావా?"

"లేదు, ఎవరండీ ఆయన?"

"ఆయన కాదు, ఆవిడ. వేశ్య!"

"............"

"ఏం మైలపడ్డావా? సచేలస్నానం చెయ్యాలా?"

"ఏమయితేం, సెలవివ్వండి."

"అది చాలా అందకత్తె, బంగారబ్బొమ్మ. మాంచి ముమ్మరంలో వుంది. చూస్తే విడిచిపెట్టడం కష్టం. అప్పుడే నలుగురైదుగురు పకీరు లయిపోయారు."

"వర్ణన అక్కర్లేదు. చెప్పండి"

"అది శిఫారసు చేస్తే –"

"శిఫారసా?"

"అవును. అంటే, సరసానికి వొప్పుకుంటే అన్నమాట."

"..............."

"మరి నీ తెలివితేటలూ, నీ పాండిత్యమూ యిందులో తెలుస్తాయి"

"వేదం చెప్పుకున్నవాణ్ణి –"

"మరి నీ కొడుక్కి కూడా ఆ వేదమే చెప్పుకుంటే యీ తిప్పలు లేకపోవును కాదూ?"

"వేదాలూ శాస్త్రాలూ మీకే వుండాలి. ఉద్యోగాలు కూడా మీరే కొట్టెయ్యాలి. అవునా?"

"..........."

"మీ పూర్వులు మాకు సర్వనాశనం పెట్టినా చివరికి దాస్యం అయినా విధించారు. మీరు బయలుదేరి అది కూడా లేకుండా చేస్తున్నారు. కాదూ–"

"...........ఇక యీ వుత్తరం–"

"అముదం అన్నమాట. అందులోనూ వొకటో నెంబరు అంబాజీపేట సరుకు. పేగులు మహా బాగా శుద్ధి చేసేస్తుంది. చేసేవేసింది కూడానూ."

"పుండుమీద కారం చల్లుతున్నారు మీరు"

"చీము పట్టకుండా తొరగా మానిపోతుంది – నయమే కాదుటయ్యా?"

"...................."

"వెళ్ళవయ్యా బ్రాహ్మడా! తెల్లబోయి నుంచుంటే అవుతాయిటయ్యా యీ రోజుల్లో పనులు?"

"ఆ పని చెయ్యక తప్పదంటారా?"

"తప్పకేం? నిర్బంధమా ఏమిటి? మానెయ్యడమే నా సలహా. అదే బహూవుత్తమమైన పని; కాని దానికి ముందు, ఉద్యోగవాంఛ వుందే? దానమ్మ కడుపు కాల, అది చేస్తోంది యిదంతాను. కనుక దాన్ని వదిలించుకో గలిగితివా – ఇక వేశ్యాదర్శనమే కాదు, దేవతాదర్శనం కూడా అక్కర్లేదు. నిశ్చింతగా కూచుని జంధ్యాలు మెలిపెట్టుకుంటూ వేదాలూ, వేదంగాలూ – బోలెడు పనుంది మరి దయచెయ్యం డీపాటికి"

"...........శివశివా"

"ఎవరు మీరు?"

"మేం బ్రాహ్మలం?"

"దండాలు. అలా దయచెయ్యండి."

"శ్రీకృష్ణార్పణం .........."

"ఏంపనిమీద దయచేశారూ?"

"పెద్ద పనిమీదే వచ్చాను"

"మేళం కావాలా, కచేరీ చెయ్యాలా?"

"నాకంత తాహతూ లేదు, ప్రస్తుతం అవసరమూ లేదు. నేను వేదం వల్లించాను. ఆ విద్యలో, యీ జిల్లాలో నా అంతటివాడు మరిలేడు; కాని బహుకుటుంబీకుణ్ణి. పైగా, రెక్కలే అధారం. అన్నం పెడతావని వచ్చాను."

"ఏ వూరు తమదీ?"

"అసలు దుప్పలపూడి కాని; నాలుగేళ్ళనుంచి ఈ వూళ్ళోనే వున్నాము."

"....వస్తాను, దయచెయ్యండి."

".......తమవంటివారిని సత్కరించడానికి శక్తిలేదు. యోగ్యతా కూడా లేదు. అయినా 'పత్రం పుష్పం ఫలం తోయం – శ్రీకృష్ణులవారు సెలవిచ్చారు కాదూ?........స్వీకరించి........దీవించండి.'

"సకల సౌభాగ్యాలూ వున్నదానవు – నిన్నేమని దీవించనూ? కాక: పది రూపాయలు చేతిలో పెట్టి శక్తి లేదనీ, యోగ్యత చాలదనీ –"

"ఒక్క నెలగ్రాస మయినా ఇవ్వలేకపోయాను, సిగ్గుగా వుంది. అయితే, ఇది వార్షికంగా భావించి, ఏటా వొకమాటు, ఇలాగే వుదయం పూజచేసుకుని ఇవతలికి వచ్చేటప్పటికి దర్శనం దయచేయిస్తూవుండండి."

"అమ్మా, ఆనందపారవశ్యం కలుగుతోంది. మాటలు రావడం లేదు. నీ యోగ్యత విన్నాను. విన్నంతా నిదర్శనం కనపడుతోంది. చాలా సంతోషం. అయితే, నువ్వొక్క సంగతి ఆలోచించాలి. నేను నీ దగ్గిరికి డబ్బుకోసం రాలేదు. కనక, ముందు ఈ రూపాయలు నీ దగ్గిర వుంచు......"

"......తమదగ్గిరే వుంచి తమరే వినియోగించండి. ఇచ్చేసింది మరి నేను పుచ్చుకోను. ఇక నావల్ల తీరవలసిన ప్రయోజనం ఏమిటో సెలవిప్పించండి."

"చెప్పమంటావా?"

"సందేహం ఎందుకూ?"

"లేదు, చాలా ఆశపడి వచ్చాను."

"కానివ్వండి, చెయ్యతగిందీ, చెయ్యగలిగిందీ అయితే నేను కాదనను."

"అనుగ్రహం వచ్చిందంటే నువ్వు మమ్మల్ని ఎల్లకాలమూ పోషించేస్తావు. అంచేతే నిన్ను వెతుక్కుంటూ వచ్చాను."

"సరే."

"వేశ్యావాటికలో అడుగుపెట్టడానికి నాకిదే మొదలు. సగం చచ్చివచ్చాను; కాని నీ యోగ్యత చూడగా సిగ్గుపడవలసిన అవశ్యకం ఎంతమాత్రమూ కనబడదు."

"తమ కోరిక సెలవిప్పించండి."

"చేస్తానని నువ్వు ముందు వాగ్దానం చేస్తేగాని నేను చెప్పలేను."

"అలాగ నే నెప్పుడూ వాగ్దానం చెయ్యను. వేశ్యలద్వారా నెరవేరే రాచకార్యాలేమీ వుండవు. ఉన్నా మనవి చేశాను కాదూ? ఆ పనేమిటో ముందు తెలవాలి."

".... అలా అన్నావా? .... అయితే విను. నాకు అరుగురు కూతుళ్ళు. ముగ్గురు కాపరాలు చేసుకుంటున్నారు. ముగ్గురూ బిడ్డల తల్లులు. పెద్దకూతురు మనమలనే ఎత్తింది. ఇంకా యిద్దరు ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు చెయ్యాలి. ప్రస్తుతం నాలుగో అమ్మాయికి కార్యం చెయ్యాలి. ఇదిలా వుండగా; నాకొక్కడే కొడుకు. ఆ కొడుక్కి మూడు మాసాల కూతురు–"

"తమ కుటుంబం, పొద్దుటిపూట లేవగానే చూసేవాళ్ళ పాపాలు పోగొడుతుందండీ!"

"నీకలా తోచడం నా అదృష్టమే. మరి ప్రకృతం, కొడుకుని కష్టపడి యె.ఫ్పే. చదివించాను. అదేదీ అదీ? ... యల్టీ – అది కూడా అయిపోయింది. ఉద్యోగం – అంటే యిప్పుడు మేష్టరీకోసం తిప్పలు పడుతున్నాను."

".........అలాగా?"

"అది నువ్వు శిఫారసు చేస్తే–"

"నేనా?"

"అవును తల్లీ! అలాగే తెలిసిందమ్మా! ఈ పుణ్యం కట్టుకోవూ?"

"ఇదేదో అగ్నిహోత్రప్పంతలా కనపడుతోంది. ఇదేదో కుట్రగా తోస్తోంది. అయినా అది యిచ్చేవా రెవరూ?"

"జిల్లాబోర్డు–"

"ఆ!"

"ప్రెసిడెంటుగారుట!"

"......."

"ఏం తల్లీ? ఏం మామ్మా? ఏమిటో వొణికిపోతున్నట్టు కనపడుతున్నా వేమిటమ్మా? ముచ్చెమటలూ పోస్తున్నట్టున్నా కనపడుతోం దేంతల్లీ?"

"మాటాడవేం మామ్మా?"

"అదంతా తరవాత చూసుకుందాం. బాబయ్యా, నేను శిఫారసు చేస్తే యిస్తారని యెవరు చెప్పారు? "

"ఎప్పుడూ వారి దగ్గిర వుండే గుమాస్తా –"

"శ్రీహరీ .........శ్రీహరీ"

"అదేమమ్మా?"

"..........."

"నీ వాలకం చూస్తే నాకేమో దిగులు పుడుతోంది, చెప్పవేమిటమ్మా?"

"తమ రేమీ భయపడవద్దు. నా కివాళ కఠినపరీక్ష కామోసు! లేకపోతే ఇది ఇలా సంభవించదు. అయితే, బక్కపలచగా – విషపుచూపులూ – వంగి వంగి మాటలూ – ఆ ఛండాలు డేనా తమ కీ సంగతి చెప్పింది?"

"అవును, ఆ బోసినోటిపులే."

"......దేవు డున్నాడా అవధానులుగారూ!"

"అదేం తల్లీ?"

"అదేమంటే? దేవుడు లేడు, దెయ్యాలు మాత్రం వున్నాయి. ధర్మం లేదు, అధర్మం అంతటా నిండిపోయివుంది. మంచి మందులోకయినా లేదు, దౌర్జన్యం మాత్రం పెరిగిపోతోంది. నీతి మాలోనే కాదు, మన దేశంలోనే లేదు. ఎవరేం చెప్పినా శుద్ధ అబద్ధం తప్ప సత్యం లేనే లేదు. ఎటు చూసినా హింస. ఎక్కడ పట్టినా రక్తం. దేవుడు లేనేలేడండీ!"

"దేవుడి విషయమై ఇంతగా అపనమ్మకం కలిగించే సంఘటన నీకేమి సంభవించింది తల్లీ?"

"....కోప్పడవద్దు. నన్ను నిందించనూ వద్దు. బ్రాహ్మల్లో కటికిఛండాలురున్నా రంటారా లేరంటారా?"

"లే–ర–ని–చె–ప్ప–లే–ను"

"అయితే ఆ ఛండాలురకు తమరు చెప్పిన ప్రెసిడెంటు మొనగాడు, కులపెద్ద"

"............."

"ఏం, కష్టంగా వుందా తమకి?"

"లేదులేదు; కాని పాకీవాళ్ళ స్వాధీనంలో కూడా కొన్ని పనులున్నాయి"

"నిజమే కాని; పాకీవాళ్ళని ఏమీ అనకూడదు. ఏమంటే? పాకీపని వాళ్ళకి వృత్తి. వృత్తికీ ప్రవృత్తికీ సంబంధం ఏమిటీ"?

"నిజాని కేమీ లేదు"

"కనక, పాకీవాడు పాకీపని చెయ్యాలి. లేకపోతే అంతకంటే ఎక్కువ యోగ్యత కనపరచాలి."

"అవును"

"మరి బ్రాహ్మడు?"

"దెవికాంశ కనపరచాలి"

"మన ప్రెసిడెంటు దగ్గిర ఆ దైవికాంశ దాకా ఎందుకూ – మానవాంశ కూడా లేదు సరికదా, రాక్షసుల అంశమాత్రం పూర్తిగా వుంది"

"కొన్ని అవగుణాలున్నాయని విన్నాను. పరమదుర్మార్గుడని తెలవదు"

"దుర్మార్గుడే కాదు పశువు .... పశువుకంటే అధముడు"

"నీకేమి అపకారం చేశాడు తల్లీ, ఆయన?"

"నాకేమీ చెయ్యలేదు అపకారం; తన ఆటవికత మాత్రం బయటపెట్టుకున్నాడు."

"అంటే?"

"నాట్యసంప్రదాయాలను కోయవాళ్ళు కూడా శిరసావహిస్తారు. మన ప్రెసిడెంటు ఆమాత్రమూ కాలేకపోయాడు"

"బోధపడలేదు"

"నేనొక బ్రాహ్మణ యింటో పెళ్ళికి మేళం వెళ్ళాను"

"సరే"

"మొగపెళ్ళివారికి మన ప్రెసిడెంటు చుట్టం"

"పెళ్ళికి వచ్చారన్నమాట"

"అవును..... ఒకరాత్రి బసకి రమ్మని నాకు కబురు. తమకి నా సంగతి చెప్పిన ఆ వూరకుక్కే రాయబారి"

"తెలవక అడుగుతున్నాను, అమ్మా! నీకూ ఆయనకీ యిదివరకి సంబంధం లేదూ?"

"లేదు, కబుర్లు వచ్చాయి. నే నంగీకరించలేదు"

"అ–లా–గా?"

"మా పింతల్లి కూతురుకీ ఆయనకీ సంబంధం వుంది. దానికీ నాకూ వున్న అనుబంధం పురస్కరించుకుని నేను వల్లకాదన్నాను. ఒకమాటు ఈ సంగతి దానితో చెప్పగా, దీనిమీద వాళ్ళిద్దరూ తగువులాడుకున్నారు. మరో రెండునెల్లకి వాళ్ళకి చెడిపోయింది."

"చాలా గొడవ వుందే?"

"నేనెప్పుడూ, ఎక్కడా, ఎవరి బసకీ వెళ్ళను. పైగా మేళం వెళ్ళినచోట బ్రహ్మచర్యం ఆచరిస్తాను .... వల్ల కాదని కచ్చితంగా చెప్పేశాను. "

"మంచి పని చేశావు తల్లీ!"

"నూరు రూపాయల కాగితం మీద పడేశాడు. పుల్లాకు చూచినట్టు చూసి నేను దూరంగా వెళ్ళిపోయాను."

"అగ్రజాతుల్లో పుట్టవలసినదానవమ్మా నువ్వు"

"అదేమన్నమాట బాబయ్యా? ఇప్పు డగ్రజాతుల విశేషం ఏమిటి? అగ్రజాతుల్లో మాత్రం స్త్రీలకి ఆదర గౌరవాలున్నాయా? అగ్రజాతుల్లో కూడా స్త్రీ అంటే బానిసే కాదూ? ఆటబొమ్మే కాదూ?"

"..........."

"ఏం, కష్టంగా వుందా బాబయ్యా? అయితే, నేనన్నమాట మరచిపొండి. కరుణించి నన్ను క్షమించండి...."

"అక్కర్లేదు తల్లీ, అక్కర్లేదమ్మా! నువ్వు లోకవృత్తం చెప్పావు. కనక క్షమించనక్కర్లేదు....... అయితే, తరవాత ఏం జరిగిందీ?"

"ఆ వూరకుక్కగా డేం చెప్పాడో, మతిపోయిందో, అసలంతేనో, మన్నాడు సాయంత్రం సభలో నేను గజ్జె కట్టివుండగా విప్పించి సత్రకాయచేత కట్టించాడు. రాత్రి వూరేగింపులో నన్ను కట్టమన్నాడు."

"నీమీద పగపట్టాడన్నమాట"

"పశుత్వం కాని, యిది పగా బాబయ్యా? సభలో నాయకురాలిని గజ్జె విప్పించినవాడూ, వూరేగింపులో నాయకురాలిని గజ్జె కట్టమన్నవాడూ మనిషేనా?"

"ఇప్పటివాళ్ళకి మన విద్యలూ, మన సంప్రదాయాలూ, మన మర్యాదలూ, ఏం తెలుసును తల్లీ?"

"విద్యలు అక్కర్లేదు కాని, ఆ విద్యలు నేర్చిన స్త్రీలు కావాలి. అంచేతే పశువులనడం ..... అదలా వుండనివ్వండి... తరవాత వాకబు చేసాను. మన ప్రెసిడెంటుకి రూపతృష్ణ తప్ప మరేమీ లేదు. ఈ కుట్ర అంతా ఆ వూరకుక్కది"

"మెహర్బానీకోసమా?"

"కీలుబొమ్మను చేసి చాటునా మాటునా గడ్డి కరవడానికి"

"............"

"ఎంత కల్పనో ఇప్పుడు బోధపడిందా? సాధారణంగా మేము డబ్బు తెచ్చినవాడినల్లా చేరనిస్తాము. అయితే, వాళ్ళలో రసికులు కాదగ్గవాళ్ళు నూటికొకడో ఇద్దరో వుంటారు. తతిమ్మా అంతా—"

"బ్రాహ్మడు, పెద్దింటివాడు, మన ప్రెసిడెంటే ఇలా అయినప్పుడిక తక్కినవాళ్ళ మాటెందుకూ?"

"నేను శిఫారసు చెయ్యడం అంటే ఏమిటో తమకిప్పుడు బోధపడిందా?"

"తెలిసిందమ్మా!"

"నే నంగీకరిస్తా ననుకోండి. అయితే, అబ్బాయిగారికి ఉద్యోగం ఇవ్వడం నిరుకా?"

"అలాగే చెప్పాడు గుమాస్తా."

"అంటే నా ఆత్మద్రోహమూ, మన ప్రెసిడెంటు పశుత్వమూ కలిస్తే వొక బ్రాహ్మణ కుటుంబానికి భుక్తి ఏర్పరుస్తా యన్నమాట – కదుటండీ?"

"........."

"కనక బాబయ్యా, ఈ రాత్రి ప్రెసిడెంటుని తీసుకురమ్మని ఆ వూరకుక్కతో చెప్పండి."

"అమ్మా—"

"ఒక్క దమ్మిడీ అయినా పుచ్చుకో దనిన్నీ చెప్పండి."

"అమ్మా—"

"కూచోండి బాబయ్యా, అప్పుడే లేస్తారేం?"

"ఏమీ లేదు. నేను వచ్చినదారినే వెళ్ళిపోతాను. నువ్వు ఆత్మద్రోహానికి సిద్ధపడవద్దు."

"అదేమీ?"

"ఇంత కుట్రా? ఇంత ద్రోహమా? తనేలాగా తార్పుడుకాడే. నన్ను కూడా తనలాగ తయారుచేస్తాడా యీ నీచుడు? నీకూ ప్రెసిడెంటుకీ ఇదివరకే సంబంధం వుందనీ, ప్రాధేయపడితే నువ్వు శిఫారసు చేసి పని యిప్పిస్తావనీ వచ్చాను. పైగా, నువ్వింత యోగ్యురాలవని ఎరగనే ఎరగను. నేను బ్రాహ్మణ్ణి. వేదం వల్లించాను. యాచన చేస్తూ కుటుంబపోషణ చేసుకుంటున్నాను. ఇకముందు మరో నలుగుర్ని ఆశ్రయిస్తూ వుంటాను కాని, వేశ్య అయినా కులాంగనలాగ అభిజాత్యం కల వొక కళావతిని తార్చడానికి – స్వార్థంకోసం వొక భీతహరిణాన్ని పులివాత కంచ చెయ్యడానికి నేను సాహసించలేను. కనక తల్లీ, నన్ను క్షమించు. నా కోరిక మరిచిపో, నాకు సెలవియ్యి."

"వల్లకాదు, బాబయ్యా! తమరు వెళ్ళడానికి వల్లకాదు. నా మూలంగా వొక వేదమూర్తి కుటుంబానికి జీవనాధారం ఏర్పడడం నా అదృష్టం. నా జీవితంలో ఇదెంతో పవిత్రమైన సంఘటన. ఇలాంటిది మళ్ళీ లభించదు. ఇంతకీ నేను పతివ్రత నెలాగా కాను. మగనాలి నంతకంటే గాను. కనక దీనివల్ల నాకిప్పుడు కొత్తగా సంభవించే పాతిత్యం కూడా ఏమీ లేదు. నాకు విచారం లేదు. తమరూ విచారించవద్దు."

"తల్లీ–"

"ఇక నేను వినను. తమ రేమీ సెలవివ్వద్దు. ఇది ఇలా జరిగి తీరవలసిందే. మనవిచేసుకున్నానుకాదూ? పశువులతో సాహచర్యం మాకు పరిపాటే. బాబయ్యా, తమరు బెంగపెట్టుకోవద్దు. ఇందాకా నేను చెప్పినమాట ఆ వూరకుక్కతో చెప్పండి."

"నన్ను–"

"మరేమీ చెప్పనివ్వను. మరోలాగ చేశారంటే, నేర్చిన వేదానికి తమరు ద్రోహం చేసినవారవుతారు."

"నా కంఠాని కురి బిగించావమ్మా!"

"తమరలా సెలవివ్వవద్దు. ఇక దయచెయ్యండి. ఎప్పుడేనా దర్శనం దయచేయిస్తూ వుండండి. అమ్మగారికి నా దండాలు మనవి చెయ్యండి."

"అమ్మా! నోరు కుట్టేశావు. కాళ్ళూ చేతులూ కట్టేశావు. నన్ను జీవచ్ఛవాన్ని చేసి–"

"అంతమాట అనవద్దు బాబయ్యా!"

"ఏం సత్తా తల్లీ, నీది? ఎంత యోగ్యురాలవమ్మా నువ్వు? ఏంజన్మ కన్నా నీది? వేశ్యాకులంలో నువ్వు తప్పపుట్టావమ్మా."

"ఏం, వేశ్యాకులం అంత చెడిపోయిందా బాబయ్యా? అగ్రజాతి గృహిణులందరూ మచ్చలేనివారేనా నాయనగారూ? మాలో నన్ను తల తన్నే ఇల్లాళ్ళు– సానులయి వుండిన్నీ పాతివ్రత్యానికి వరవడి పెట్టేవారు వేలున్నారు. కాని లోకం గుడ్డిది, పురుషులు మత్తులు.... ఇప్పు డిదంతా అప్రస్తుత ప్రశంస. దయచెయ్యండి. ఒక్క మాటు పాదాలు...."

"శ్రీకృష్ణార్పణం...... ఎన్ని తిప్పలు పెట్టాడూ నాకూ? దేవుడు లేడూ? గాయత్రీదేవి ఇదంతా చూడ్డం లేదూ? ఈ ద్రోహి – ఈ అప్రాచ్యుడు ముందుకి వస్తాడా?..."

"..........పద్‌హోరు, పద్‌హేడు, పద్దెనిమిది, పంధొమ్మిది, ఇర్వయ్."
"ఏం, రెండువందలూ వున్నాయా?"
"  ఉన్నాయి కాని; కడిగేసినట్టు వొట్టి రూపాయలా తేవడం?"
"  "
"మర్యాదలు తెలవ్వండీ మీ బ్రాహ్మలికి. బజారంతా బత్తాయి పళ్ళలా దొర్లిపోతున్నాయికదా, వొక్క వంద  పట్టించుకువస్తేం? ....పోనీ, నాలుగు చక్రకేళీ గెలలు, వొక్క డజను ఆపిలుపళ్ళు, నాలుగుశేర్లు ద్రాక్షపళ్ళు –"
"తోచింది కాదు. ఆగ్రహపడకండి. మొదటినెల జీతం–"
"సంవత్సరాని కారువందలండీ. రెండేళ్ళకీ పన్నెండు వందలు–"
"ఇంకెందుకూ, తెస్తా నన్నానూ కాదూ?"
"అయితే, యింకోటికూడా మరిచిపోకండి"
"ఇంకా యేమిటి?"
"ఒక్క పరికిణీగుడ్డ. నాలుగ్గజా లయితే చాలు. గజం రెండూ రెండుబావులా – రొక్కం నా చేతిలో పడేస్తురూ నేను  తంటాలుపడతానూ"
"........."
"ఏం, మాట రాదేం?"

"నాకొక్క కూతురండీ. లేక లేక నలుగురు కొడుకులవెనక పుట్టిందండీ! మొన్ననే తొమ్మిదేళ్ళు నిండాయండీ! మా అత్తగారి పేరు పెట్టుకున్నామండీ? వెన్నప్పంలా పెంచుకుంచున్నామండీ! అదంటే నాకు ప్రాణమండీ!"
"తెస్తాలెండి"
"రైటో! అదీ మాట. అదీ దర్జా, ఇక వెళ్ళండి. తెల్లవారేటప్పటికి మా యింటికి రండి"
"అలాగే..........అయితే, రెండు సంవత్సరాలకీ వొక్క మాటే అర్డరు పడిపోవాలి సుమండీ"
"........నాలుకా తాటిపట్టా యిది? దీనికి తిరుగుందనుకున్నారుటండీ?"
"మరి సెలవు"
"సెలవు"
"........చూడండీ! 'మాలపిల్ల'ఫిలింట, వెడదామా?"
"నేను బయలుదేరితే మావాళ్ళు కూడా బయలుదేరతారు తెలుసా?"
"అంతట్లో యేం మునిగిపోయిందీ, జట్కా పంపిస్తాను బయలుదేరతియ్యండీ"
"సెబాస్! మాంచి తెగువకల బ్రాహ్మడవయ్యా! చూడండీ, జిల్లాబోర్డు మనకి స్వార్జితం అనుకోండి. ప్రెసిడెంటు  బతుకు మన గుప్పిట్లో వుందనుకోండి. కనక, నన్ను మీరు మరిచిపోకండి, మిమ్మల్ని నేనూ మరిచిపోను"
"సంయే"

"ఈ రెండేళ్లూ అయిపోయాక మిమ్మల్ని వంద రూపాయల గ్రేడుకి లాగేస్తాను, చూసుకోండి"

".........గుడ్ బా–య్, గుడ్ బా–య్!"

".........."

"............ప్రెసిడెంటుగారు–"

"వస్తున్నారా, రమ్మన్నారా?"

"వస్తారుట"

"తీసుకువచ్చి నువ్వవతలికిపో. ముందివిగో యీ.........అయిదు రూపాయలూ రోడ్డు కంట్రాక్టు బాపతు. ఈ రెండూ స్కూల్ మాష్టరీల బాపతు. పట్టుకుపో"

"థాంక్సు, థాంక్సు........"

".............."

"...........కంట్రాక్టర్లెవరేనా కనపడ్డారా?"

"లేదండి"

"దరఖాస్తుదార్లో?"

"లేదన్నమాటే"

"నుంచున్న పాళంగా డబ్బు కావాలే, మరెలాగా?"

"రేపయితే సప్లయి కావ....చ్....ఉ"

"రేపటిదాకా ఆగదు. అధమం నూరు రూపాయలయినా పట్టుకు వెడితేగాని యివాళ అమ్మాణ్ణి గుమ్మం యెక్కనివ్వదు."

"ఏం, మొగం ముడిచిందా?"

"నిన్న రాత్రి వుత్సాహం అంతా చచ్చిపోయింది"

"అదంతా యివాళ కూడతీస్తాను. అమ్మాణ్ణి మాట మరిచిపోండి"

"మరిచిపోయి"

"దానబ్బసాని దగ్గిరికి వెడదాం యివాళ"

"ఏమిటీ?"

"ఇవాళ మీ తపస్సు ఫలించింది"

"ఎవరోయ్?"

"చెబుతా కాదూ"

"రాజామణా?"

"చా"

"నీలం –"

"ఛీ"

"వీరభద్రం –"

"ఛేస్"

"మరెవరోయ్"

"చూస్తారు కాదూ? భోజనం చేసి, యిక రెండుగంటల్లో – బయలుదేరడమే కాదూ?"

"భోజనమూ వద్దు వల్లకాడూ వద్దు? ఇప్పుడే–"

"ముక్కుమీద వేలు తీసెయ్, పిలూ డ్రైవర్ని."

"అలాకాదు. పోనీ, చెబుతా కూచోండి"

"తొరగా"

"శేషాచలం"

"దుగ్గిరాల–"

"అవునదే"

"హో–య్యేస్స్! గుమాస్తా అంటే నువ్వేనోయ్! చక్రవర్తులదగ్గిర ప్రయివేటు శక్రటరీగా........"

"మాటలే కాదూ? పొట్టి షేక్‌హేండులే కాదూ?"

"ఇక అలా కాదు. విసిరికొట్టిన సానిని లొంగతీశావు నువ్వు. ఏంచేసినా నీ రుణం తీరదు. నీకేం కావాలో చెప్పు – ఈ క్షణంలో చేసేస్తాను"

"అయితే, దీనిమీద సంతకం పెట్టండి......."

"ఏమిటిదీ?..........రోడ్డు మెటలింగు కంట్రాక్టా? ఏమయినా రాల్చుకున్నావా?"

"రామరామా! అయన మా అత్తవారి చుట్టమండీ!"

"వెంకటయ్య టెండరుకంటె యెక్కువరేటుదే?"

"దిద్దించేస్తాలెండి"

"గప్‌చిప్! తొరగా అయిపోవాలి......"

"....దీనిమీద కూడా కాస్త బరికెయ్యండి"

"అదేమిటి?"

"హైస్కూల్లో కాళీ."

"రెండున్నాయి కదా? ......... ఓహో, యాభై రూపాయలదా? ఇందులోనయినా యేమయినా –"

"పరమదరిద్రుడు. పైగా మా అత్తవారి పురోహితుల వారి ఏకైక అల్లుడు. వద్దు వద్దంటూ వుంటే మా అమ్మాయికి దక్షిణాది పరికిణీగుడ్డ –"

"ఛూ........పోనీ నాకేం?........"

"............."

"ఇదేమిటి?"

"రెండుమాసాల కాళీ"

"పాతిక రూపాయలదా?"

"అవును"

"ఇందులో నయినా –"

"దీనివిషయం శిఫారసు చెయ్యడానికే శేషాచలం"

"ఆ!"

"అవధానులుగారిని దానిమీదికి వుసికొల్పాను."

"అసాధ్యుడే, దానియెదటే ఆర్డరు వెయ్యకూడదూ?"

"కులాసాగా కాలం గడుపుకోకుండా అంతఃపురంలో కూడా మీకీ పాడు వ్యవహారాలేమిటండీ?"

"సెబాస్! నీవంటి హంగుదారు మరి లేడోయ్!"

"మీరు నన్ను కాస్త కనిపెడుతూ వుంటే నా జీవితం మీకోసం దారపోసెయ్యనూ?"

"ఇకముందు నువ్వు సంతకం పెట్టమన్నచోట 'యేమి' టని అడక్కుండా—చూడకుండా సంతకం పెడతాను, సరా? వీలయినంతవరకూ బోర్డుసొమ్ము కూడా—"

"మీ పేరుగా వొక కొంప –"

"కొంపేమిటి మళ్ళీ. 'మేడ' అను. దానికి పునాది వెయ్యడానికి ప్రధానమంత్రిని లాక్కువస్తాను – చూసుకో"

"అయితే, ఇక నేను పోయి, అంతా సద్దుబాటు చేసి, కాస్త భోంచేసి వస్తాను, యెనిమిదన్నరకి సిద్ధంగా వుండండి"

"అల్ రైట్ మైడియర్ ప్రీమియర్!"

*1935 ఏప్రియల్ ప్రబుద్ధాంధ్ర*
*(సవరణలతో)*

★ ★ ★

# గూడు మారిన కొత్తరికం

నరసమ్మ అదే తొలిమాటు కాపరానికి వెళ్ళడం.

వెళ్ళడం క్షణంలోనే జరిగిపోయింది, బయలుదేరడమే వోపట్టాన తెమలలేదు.

అసలు, బయలుదేరడం జరుగుతుందా అని కూడా అనిపించింది కొంతసేపు.

"వేసవిలో రాజమహేంద్రవరం వేడిమంగలం లాగ మిటమిట లాడి పోతూ వుంటుంది గదా, ఇన్నాళ్ళూ, చుట్టూ అరటిబోదెలు నిండివున్న ఇంటో మసిలిన మా చిట్టితల్లి వొక్కమాటుగా అంతమార్పు సహించ గలదా?" అనడిగాడు సోమసుందరం, జాలిగా.

"ఈ వొక్కమాటూ నా మాట వినవోయ్! నా తండ్రివి కాదూ? తొలకరించే దాకా వోపికపట్టు, చాలు. కాదంటే, మండుటెండల్లో నీకు మాత్రం యేమిసుఖమూ? కనక, యీ చైత్రవైశాఖాలూ రెండూ నువ్వుకూడా ఇక్కడే వుండిపో. మాయజీతం పోతే పోయింది" అంది రాజమ్మ కూడా, ప్రాధేయపడుతూ.

రామారా వయినా మొదట కాదనలేకపోయాడు.

అత్తమామల ఆందోళన చూసీ, నరసమ్మ దిక్కు మొగం చూసీ "పోనీ కళ్ళుమూసుకుని మరో రెండు మాసాలు గడిపెయ్యలేకపోతామా?" అనుకున్నాడతను; కాని తీరా పంచాంగం చూశాటప్పటికీ, వైశాఖంలో చుక్క మూఢాన పడుతున్నట్టు కనపడింది.

మళ్ళీ కార్తీకం వెడితేగాని వీలుపడదు మరి.

ఈ సంగతి బయటపడాటప్పటికి "ఏమో బాబూ" అంటూ వుబెత్తుగా లేచినుంచుంది, తండ్రి చాటున కూచుని వుండిన నరసమ్మ, అప్పుడే బయలు దేరుతున్నట్టు.

దీంతో కొయ్యయిపోయింది రాజమ్మ.

"ఇంకెందుకూ?" అంటూ చప్పరించేశాడు సోమసుందరం, ఎంతో భక్తిగా చూచుకుంటున్న పంచాంగం నేలను వేసి కొడుతూ.

"నన్నేం చెయ్యమంటారండీ, మరీ?" అన్నట్టు చూశాడు రామారావు, అత్తగారి కేసి.

కాచిపొయ్యడాని కటయినా యిటయినా యే ముసలమ్మయినా వుంటే, యిప్పుడయినా అతని నింత ససేమిరా అనక పోవును.

భోజనం దాకా యెందుకూ, శీతాకాలంలో స్నానానికి కసిన్ని వేన్నీళ్ళు కావాలన్నా, వేసవిలో రవంత మంచిగంధం కావా లన్నా, వర్షాకాలంలో తేరిన గోదావరి నీళ్లు కావాలన్నా స్వప్నఫలంగా వున్నా యతనికి.

కాకపోయినా, కార్యం అయి సంవత్సరం గడిచాక గూడా యేమిటేమిటో వంకలుపన్నుతూ కూచుంటే యెలగా?

"పోనీ, నరసమ్మ చిన్నపిల్ల యేమో అంటే పదహారోయేడు వెడుతుందో వెళ్ళిపోయిందో కూడాను!

ఏమయితే యేం, వేసవి దొర్లబడ్డ వెంటనే రాజమహేంద్రవరం వెళ్ళక తప్పింది కా దామెకి.

తప్పకపోతే మాత్రం చేదు మేస్తోందా యేమి టక్కడ? నెత్తిమీద పెట్టుకుంటున్నాడు మొగుడు.

ఇక్కడ తల్లికీ తండ్రికినే యే బెంగ అయినా.

ముప్ఫయ్యో యేట మొదటి పెళ్లాం కాలంచెయ్యగా, అప్పటికే కట్టుతప్పి వుండిన రాజమ్మని మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు, కల్లూరి సోమసుందరం.

మొదటి పెళ్ళాని కిద్దరు కొడుకులు, గవర్నమెంటు సర్వీసులో చెరో వూళ్ళోనూ వున్నారు వారు, దోసిళ్ళకొద్దీ సంపాదించుకుంటూ.

అంచేత, సోమసుందరాని కయినా, రాజమ్మ కయినా, ప్రస్తుతానికి కొడుకయినా నరసమ్మే, కూతురయినా నరసమ్మే.

రెండోపెళ్ళి పెళ్ళాం యేక సంతానం కావడంతోపాటు యిద్దరు మొగపిల్లల తరవాతి ఆడపిల్ల కావడంవల్ల సోమసుందరానికి పంచప్రాణాలూ నరసమ్మమీదే.

ఏ యిరుగుపొరుగు అమ్మలక్కలయినా వచ్చి మాటల్లోకి దింపుతూ వుంటారు కనక రాజమ్మే నయం. యెక్కడికయినా వెళ్ళి యింటికి వచ్చేటప్పటికి నరసమ్మ కంటపడకపోతే మందుతిన్నట్టయిపోతాడు సోమసుందరం.

అయితే మాత్రం?

ఆడపిల్ల అయి పుట్టాక యెల్లకాలమూ పుట్టింట వుండిపోతుంది కనకనా?

కనక అమావాస్య వెళ్ళిన విదియనా డామె రాజమహేంద్రవరం వెళ్ళింది.

"చుక్క మూర్ధాన పడితే యింకేమన్నా వుందా?" అనుకుంటూ సంబరపడుతూనే వెళ్ళిందామె.

ఆమె వెళ్ళిన అయిదోనాడు బజారుపనిమీద వెళ్ళి అవీ యివీ కొనియిచ్చి ఆమె కాఫీచేసి యివ్వగా పుచ్చుకునే వచ్చాడు సోమసుందరం కాని; పున్నమి వెళ్ళాటప్పటి కాదంపతులకు ఆమెని చూసి వంద సంవత్సరాలయిన ట్టనిపించింది.

"అమ్మాయి లేకపోతే కాలం గడవడం కష్టమే" అంటాడతను.

"పిల్ల లేకపోవడంవల్ల పొయిదగ్గిరకే అడుగుపడ్డంలే" దంటుందావిడ.

"నా చిట్టితల్లి నిన్నరాత్రి కలలోకి గూడా వచ్చిందండీ" అనిన్నీ అంటూ వుంటుందామె అప్పుడప్పుడు.

ఈ స్థితిలో, వొకనాడు పనసపండొకటీ, అనాసపళ్ళు రెండూ, బంగినపల్లి మామిడిపళ్ళు పాతికా, కుంచెడు తేనె పానకమూ తెచ్చి వాకట్లో వుంచా డొక రయితు.

అవి చూశాటప్పటికి కూతురు జ్ఞాపకం వచ్చింది వారికి.

ఇద్దరూ చూశారవి కాని; మంచిమాటలు చెప్పి రయితుని సంతోషపెట్టి పంపే ప్రయత్నంలో వుండిపోయారు వారు. నరసమ్మే వుంటేనా, మాట తోచకుండా ఎంత అడావుడి చేసివుండునో.

తల్లీ తండ్రీ కూడా తాను తినగా మిగిలినవే – మిగిలితేనే తింటారు. గాని "ఇవి నావి" అంటూ విడమర్చి వాటిలో యెన్ని దాచుకున్నో ఆమె!

"అలా యెన్నిమాట్లు జరిగిన్నీ వుందో?"

రయితు గుమ్మందిగాడు "అమ్మాయీ–" అంటూ అతనేదో అనబోయాడు కాని; మాట కడ్డం వచ్చి "నోటికి పోవు" అంటూ వాటిదగ్గర చతికిలపడే పోయిందావిడ.

"రామం యింతకంటే మంచివే కొంటూ వుంటాడు, అయినా– "అంటూ గోడకి చేరబడిపోయా డతను, వూసూరుమంటూ.

అవి చూస్తూ చూస్తూ అప్రయత్నంగా చూసుకున్నా రిద్దరూ.

"పోనీ, పాలికాపుచేత యివన్నీ వాళ్ళకి పంపేద్దామా?" అంటూ యెగిసినుం చుందామె.

"అయితే, పన్నెండు గంటల బండికే పంపేద్దాం" అంటూ అతనున్నూ లేచి నుంచున్నాడు.

దీనిమీద యేదో అనుకుందామె.

అనబోయింది కూడా కాని; యేదో వెతుక్కుంటున్నట్టటూ యిటూ చూడసాగింది, మాటమరిచి.

అది గుర్తించి "యింకేమిటీ?" అనడిగా డతను, ఆలస్యం చెయ్యి కన్నట్టు చూస్తూ.

"ఇట్టే మరుపు వచ్చిందండీ!"

"జ్ఞాపకం చేసుకో."

"నోట్లో ఆడుతోం దండీ."

పులుకూ పులుకూ చూశా డతను, తన కయినా స్ఫురిస్తుందేమో అని.

అటు చూసిందామె, ఇటున్నూ చూసింది, చురుగ్గా.

కళ్ళు మూసుకుంది.

తల అడ్డంగా వూపుకుంది.

"ఆ, మరే" అంటూ తుళ్ళిపడి "మన మాటకేం, ఇవాళ సద్దుకుంటే రేపటికి కావలసినంత. కనక, ఇంటోవున్న వెన్నపూస మానెడు – మూడు తవ్వల నెయ్యి అవుతుంది కాచేస్తానండీ" అంది దృఢస్వరంతో.

అంది, వూచలాగ వెళ్ళిన్నీ పోయింది, వంటింటోకి.

వెళ్ళడం తడువుగా పొయ్యిమీద యెసరూ, కుంపటి మీద వెన్నపిడతా పడేసి గబగబలాడిపోయింది.

"ఇంకేమున్నాయీ పంపవలసినవీ?" అంటూ ఆలోచిస్తూ అలాగే కూచుండి పోయాడు సోమసుందరం.

ఒక్క కునుకుతీసి, లేచి మొగం కడుక్కుని, టేబులు మీద వుండిన తాంబూలం అందుకుని సేవిస్తూ వచ్చి, అతను వాకట్లో కవాచీబల్లమీద రెడ్డికం వేసుక్కూచునేటప్పటికి "సూరిగా డీ పాటి కమ్మాయిగా రింటికి వెళ్ళి వుండడుటండీ" అనడుగుతూ వచ్చి అతని పక్కని ఇరికి కూచుంది రాజమ్మ, అప్పుడే వంటింటిపనీ ముగించుకుని.

గోడమీది గడియారం చూసి "వొంటిగంట దాటిందిప్పుడు" అన్నాడతను, రెడ్డికం పాళంగానే జరిగి ఆమెకి చోటిస్తూ.

"అయితే?" అందామె, చురచురచూస్తూ.

"రెయిలీ పాటికి కడియం స్టేషను చేరి వుంటుంది"

"ఇంకా కడియమేటండీ?"

"నడవాలా మరీ?"

"అదేమిటండీ, జర్రున పాకిపోతుందా, వొంటెద్దు బండిలాగ నడుస్తుందా రెయిలుబండి ఎక్కడయినా?"

"పాకుతుందే అను, తెమలాలా అదయినా?"

రెయిలంత మందకొడిగా నడవడానికి, సోమసుందరానికి తొందర లేకపోడమే కారణం అన్నట్టనిపించిందామె కామాటమీద.

"పోనీ, కడియం చేరి వుంటుంది, తరవాతా?" అనడిగింది దాంతో చిరాకువచ్చి.

"రాజమహేంద్రవరం చేరడానికింకో పావుగంట—"

"బాబోయ్!"

"........."

"ఇంకా పావుగంటే?"

ఇలా అడుగుతూ పక్కకి చూసిందామె.

రెయిలు కడియం ప్లాటుఫారంమీద ఆగివుండడం స్పష్టంగా కనపడిందామెకి.

నల్లనిగార్డు స్టేషనులోకి వెడుతున్నాడెందుకో, యూరేపియ ననిపించుకోవాలన్నట్టు నడుస్తూ

మామిడిపళ్ళబుట్ట కామోసు అందుకుంటున్నాడు డ్రైవరు, అటూ ఇటూ బెదిరిబెదిరి చూస్తూ.

"మా పెట్టెలో ఎవడో మొగా డెక్కా"డంటూ ఆడవాళ్ళెంత గోలచేస్తూ వుండినా "దింపెయ్యం" డంటూ ముందు సాగిపోతున్నాడు రెయిల్వేపోలీసు, గుప్పుగుప్పున బీడీపొగ విడుస్తూ.

బాటసారులున్నూ చాలామంది పచారుచేస్తున్నారు ప్లాటుఫారంమీద, పండువెన్నెల్లో లాగ.

"ఏయ్, కూలీ" అంటూ గొంతెత్తి పిలుస్తున్నాడొక బాటసారి, బండెడు సామాను తానే దింపుకుని.

స్థితి చూస్తే బండి యింకా కదిలేటట్టు లేదు.

కొంపతీసి యే గుద్దుబండి అయినా ఎదురు వస్తోందేమో కూడా.

దీంతో రాజమ్మకి చీమలూ జెర్రెలూ పాకుతున్నట్టనిపించింది.

కాళ్ళల్లో వొణకున్నూ పుట్టింది.

అవును మరి, పుట్టిందంటే పుట్టదూ?

రెండుగంటల కింటికి వస్తాడు రామారావు, కాఫీకోసం. అనాసపండు మాట ఏమయినా, మామిడిపండు కోసీ, పనసతొనలు తీసి నరసమ్మ అప్పటికి సిద్ధంగా వుంచాలి గదా! రెయిలింకా కడియం స్టేషనులోనేవుంటే యిదంతా ఎప్పుడూ మరీ?

వల్లమాలిన కోపం వచ్చింది రాజమ్మకి.

అది కళ్ళల్లో ప్రవేశించగా చూపు చెదిరిపోయింది.

దాంతో ఆ దృశ్యం అదృశ్యం అయిపోయింది కాని; కళ్ళు జేవురించిపోయాయి.

దీనికి సాయం కంగారున్నూ పట్టుకుని, రెయిలు వేగం తన కాళ్ళకి సంక్రమించినట్టు కాగా "యీ రెయిలువాళ్ళకి బుద్ధి లేదండీ, ఒక్కొక్కప్పుడు మరీ పెళ్ళినడకలు నడిపిస్తా రదేం పోయేకాలమోగాని!" అంటూ దిగ్గున లేచి చఱ్ఱున వంటింటోకి చక్కాపోయిందామె.

దానా దీనా మన స్సలాగో అయిపోగా, అలాగే వుండిపోయారు సోమసుందరం, అటూఇటూ అభావదృష్టులు పరుపుతూ.

గడియారం టంగున కొట్టింది, అతణ్ణి మేలుకొలుపుతున్నట్టు.

"వొకటిన్నర" అనుకున్నా డతను.

"చూడూ –" అని పిలిచాడు కూడా లోపలికి వంగి చూస్తూ.

పైటకొంగు నోటిమీదికి తీసుకుని వితంతు వొకామె లోపలికి వచ్చిం దీస్థితిలో.

లోపలికిన్నీ దారితీసిందామె "రాజా" అని పిలుస్తూ.

"వంటింటో వుంది" అని చెప్పబోతున్నాడు సోమసుందరం; కాని "రండి లచ్చమ్మ వదినా" అంటూ మందువా హాల్లోకే యెదురువచ్చి ఆమె రెక్కపట్టుకుంది రాజమ్మ.

ఇలాగ రాజమ్మకి వ్యాపృత్తి దొరకడంతో తా నేకాకి అయిపోయి, వీధిలోకి వెళ్ళిపోయాడు సోమసుందరం, తలుపు వేసుకోమని చెబుతూ.

అది చూసి రాజమ్మా లచ్చమ్మా అతను విడిచిన కవాచీ బల్లమీదే తిష్ఠవేశారు, పీరియడ్డు ముగిస్తే మరో వుపాధ్యాయుడు తరగతిలోకి వచ్చినట్టు.

మాటమీద మాట ప్రారంభం అయింది.

అనిర్దిష్టంగా మొదలయి, ప్రసక్తానుప్రసక్తంగా యెన్నో స్ఫురించి, వుపనదులు వచ్చి పడ్డ నిండుగోదావరి అయిపోయింది క్షణంలో అది.

మెళుకువగా, నరసమ్మ మీదికి మళ్ళించిం దది, మెల్లగా రాజమ్మ.

"అయితేనేమా –" అంటూ ఆవేగాన పడిపోయింది లచ్చమ్మ, వెంటనే.

"కోడలుపిల్ల మాట యేమయినా –"

"రాత్రికి తెలుస్తుంది, వదినా!"

"అల్లుడు వస్తాడా?"

"అబ్బే. పాలికాపుని పంపించానండీ, వుండలేక"

"వొట్టిచేతులతోనా?"

"మీరు గడ్డిపెట్టరూ అలాచేస్తే"

"అవునవును. చిన్నతనం అయినా నువ్వన్నీ యెరుగుదువు. అయితే యేమి టేమిటి–"

రాజమ్మ వివరాలు చెప్పింది.

"మిఠాయో మినపసున్నో–"

"ఏదండీ, రయితు యిలా తెచ్చాడు, మరో పది నిమిషాలకి సూరిగాణ్ణలా పంపేశాను, వ్యవధి యేదీ చెయ్యడానికి?"

"అవయినా తక్కువకాదు గానీ – మినపసున్ని లేకపోతే మీ అన్నగారికి క్షణం గడిచేది కాదు, తెలుసా?"

కళ్ళు పెద్దవి చేసుకుని, రాజమ్మ మొగాన మొగం పెట్టి అడిగింది లచ్చమ్మ, యీ మాట.

"అలాగ టండీ?"

"రెండుగంటల వేళ నిద్రలేవగానే మినపసున్ని ఫలహారమూ, రాత్రి మీగడపెరుగుతో భోజనమూ, మళ్ళీ పడుకో బోయేటప్పుడు తవ్వెడు పాలు–"

"శాబాసూ!"

"ఉండడం కాదమ్మా ప్రధానం, తినాలి. తినడమూ కాదు. ఏది యేమిటో – ఎందుకో తెలియాలి."

లచ్చమ్మ మళ్ళీ కళ్ళల్లోకి చూసింది, ఇలా అని.

రాజమ్మ తల యెగరవేసుకుంది, అంతా విని.

"ఏం, మినపసున్ని యిష్టం లేదా అల్లుడికీ."

"లేకేం, మునుగుడుపుల్లో అరిసె లవతల పెట్టేసి అదే తినే వాడండీ."

"చూశావా? ఇష్టం అనయినా గుర్తించలేకపోయావు."

లచ్చమ్మ ధోరణి యేమిటో గుర్తించలేకపోయింది రాజమ్మ కాని; "యేమిటో విశేషం వుంది" అని మాత్రం అనుకుంది.

పొరపాటుకి పశ్చాత్తాపం కలిగిం దామెకి; కలిగినందుకు తొందరా పుట్టేసింది.

"రేపు పొద్దున్న అవి సిద్ధంచేసే వంటల్లోకి వెడతాను. మధ్యాహ్నం బండికే వెడతారు మీ తమ్ముడుగారు. ఏం వదినా"?

"అలాగే చెయ్యి; కాని పంచదార వేశేవు సుమా! బంగారుతీగల బెల్లమే పడాలి, అందులో."

"చూశారా?" అనడుగుతూ తర్జనితో నిర్దేశించింది రాజమ్మ పడమటింటోకి చూస్తూ.

చిట్టి అటకమీద నాలుగు బెల్లబ్బుట్టలు కనపడుతున్నా యక్కడికే.

"బాగుందమ్మా, బాగుంది. అయితే, కొడుకులు–"

"అమ్మాయి వెళ్ళినప్పుడు చేయించిన మిఠాయి వాళ్ళకీ పంపించాను తండ్రిచేత; కాని పోలవరంలో పెద్దబ్బాయీ, బెంగుళూరులో చిన్నబ్బాయీ – ఇద్దరూ చెరోవైపునా పడిపోయారండీ!"

"అయితేం, కన్నతల్లికంటే ఎక్కువగా చూస్తున్నావు, నువ్వు. మరి అత్తవారేమయినా–"

"పెద్దబ్బాయికి పంపుతూనే వుంటారు వారం వారమూ ముద్దినుసు పిండి వంటలూను. చిన్నబ్బాయికే–"

"ఏం, సరదా లెరగనిదా అత్తగారు?"

"సడే! బువ్వే బూరి ఆవిడికి. కోడలి పెత్తనమండీ వారి యింటోను."

"చిక్కే."

"అంచేతే చిన్నకోడ లిక్కడికివస్తే 'మా అమ్మకంటే మీరే యెక్కువ' అని నన్ను పట్టుకు పాకులాడుతుంది"

"అవునవును, వారం దినాలుందామని వచ్చి రెండు వారాలకయినా కదల్లే దిక్కణ్ణుంచి, యెరుగుదు నెరుగుదును; మొదణ్ణుంచీ"

"మనవణ్ణి చూశారు కాదూ?"

"మనమడన్న మనమడా, పనసపండు కాదుటే? చేసుకుందమ్మా అది, అయితే కోడలికే యింకా–"

మాట నాన్చేసింది లచ్చమ్మ; కాని "ఏదీ, కార్యం అయి సంవత్సరం అయినా, మొన్ననేగా వెళ్ళిందీ నా చిట్టి తల్లి!" అంటూ సాగదీసుకుంది. దానిమీద, రాజమ్మ.

"మొన్ననే వెడితే యేంలే; మళ్ళీ యీ రోజుల నాటికి నీకు దౌహిత్రుడు పుట్టుకువస్తాడు, చూసుకో నేనన్నాను."

"మీ వాక్యాన అలా కావాలి"

లచ్చమ్మ మాట యేమయినా, గంట మాత్రం రెండయింది, మూడయింది, నాలు గయింది.

అయిదున్నూ అయిపోయింది, చరచర.

హోల్లో వెలుగు తగ్గడం చూసి "అయ్యో, పోయి పిండి విసురుకోవాలే" అంటూ వుద్రేత్తుగా లేచి బయలుదేరింది, లచ్చమ్మ.

రాజమ్మా లేచింది; కాని "యీ వొక్కమాటే" అంటూ గుమ్మం దగ్గిర నిలేసిం దామెని.

గృహ కృత్యాల విషయమై యిద్దరికీ వొకటే తొందర, అయినా, వొక్కమాటే అన్న రాజమ్మ, ఆ వొక్కమాటతోనూ ఆగలేకపోయింది.

పోనీ అంటే లచ్చమ్మయినా మాట తుంచెయ్యలేక పోయింది, అక్కడికక్కడ.

పైపెచ్చు, రాజమ్మ టూకీగా చెబితే తాను వివరా లడిగీ, వూహాలు పన్నీ, అర్థాలు తీసీ, సిద్ధాంతాలున్నూ చేసీ, గొడవ పెంచేసిం దామె సాగదీసుకుంటూనూ, బుగ్గలు నొక్కుకుంటూనూ.

కాని, తానంటే వారికి లక్ష్యం లేకపోవడం చూసి, వారంటే తానూ లెక్కచేయకుండా ముందుకి సాగిపోయింది, కాలం.

దాంతో, చూస్తూనే వుండగా చీకట్లు కమ్మాయి.

అమావాస్యనాటి రాత్రి 'కనుసైగ లయిపోయాయి' వారి చూపులు.

"అయ్యో, అయ్యో! చీకటే పడింది, యింకేం చేతునే మా తల్లీ?" అంటూ పురకలు వేసుకుంటూ చక్కాపోయింది లచ్చమ్మ, మాట వినిపించుకోకుండా.

ఆమె వీధిలో పరుగులు పెడితే, రాజమ్మ యింటో పరుగులు పెట్టింది, అంతకంటే యెక్కువగా.

ఇటు చీకటికి సాయం, అటు ఎందుకో తొందర, ఏమిటో ఆత్రం – దాంతో వొక్కపనీ అందుకోలేకపోయిందామె.

దీనికి తోడు, "అమ్మగారూ!" అంటూ గుమ్మా లెక్కాడు, రాజమహేంద్రవరం వెళ్ళిన సూరిగాడు, సరిగా ఆ సమయాన.

"ఏమిరా, అనపర్తిలో రెయిలు దిగి రావడాని కింత ఆలస్యం చేశావ్రా?" అంటూ వంటింటోనే మాట అందుకుని, వొక్క దూకున హాల్లో వచ్చివాలింది, రాజమ్మ.

వాడేదో చెప్పబోయాడు గాని; అందు కడ్డంవచ్చి "నువ్వు వెళ్ళేటప్పటి కమ్మాయిగా రేం చేస్తూన్నారు అనడిగిందామె."

"వాకట్లో–"

"నిన్ను చూసి యే మన్నారు?"

"అన్నిపళ్ళు–"

"పళ్ళూ అవీ యెవరు పెట్టా రింట్లో?"

"మరండీ – అమ్మాయిగా రండీ–"

"అన్నట్టు, పంతులుగా రింటో వున్నారా, యింకా రానే లేదా?"

"............"

"వెంటనే యేమయినా తిన్నాదా లేదా?"

"............"

"మాట్లాడవేమిరా బెల్లంకొట్టిన రాయిలాగా?"

"నన్ను మాట్లాడనిచ్చిం దేదండీ మీరు?"

"వోరి చెవల వాజమ్మా –"

ఇలా విసుక్కుని, వేసిన ప్రశ్న లన్నీ, మళ్ళీ వేసిందామె గుక్కతిప్పుకోకుండా.

ఒక్కొక్కటే జ్ఞాపకం చేసుకోడంలో వాడు తడబడుతూ వుండగా మరికొన్ని ప్రశ్న లడిగింది.

వాటి జవాబులమీద వాటికవే మరికొన్ని ప్రశ్నలు పుట్టుకువచ్చాయి.

అడగడాని కావిడకు తొందరా, చెప్పడానికి వాడికి తడబాటూ అయి, యిద్దరూ వుక్కిరిబిక్కి రయిపోయారు.

దాంతో, ఆమె అడిగినవాటి కన్నటికీ బదులుచెప్పి "ఇక వెళ్ళు" అనిపించుకునేటప్పటికి తాతలు దిగివచ్చారు వాడికి.

అయితే అయిందని బుర్ర వంచుకుని చక్కాపోవలసింది కాని; గుమ్మం దిగుతూ దిగుతూ "మిమ్మల్నీ బాబయ్య గారినీ చూడాలని వుందిటండి అమ్మాయి గారికి" అన్నాడు యదాలాభంగా, వాడు.

"ఏమిటీ?" అందామె అడవెమలి కేక వేసినట్టు.

"చిక్కిపోలేదు గదా నా చిట్టితల్లి?" అంటూ అత్రపడిపోయింది.

"ఏమందీ, మళ్ళీచెప్పు" అంది, కంగారుపడుతూ.

"మమ్మల్ని రమ్మందా, వూరికే చూడాలని వుందందా?" అంటూ గద్గదికతో అడిగింది.

"మరండీ" అంటూ వాడు మళ్ళీ గుమ్మా లెక్కాడు గాని; యింతలో సోమసుందరం వచ్చాడు.

రాజమ్మ అడిగేది అడుగుతూ వుండగానే సోమసుందరమున్నూ ఏమిటేమిటో అడగసాగాడు.

మధ్య మధ్య "మీ రుండండీ!" అంటూ రాజమ్మా, "వాణ్ణి చెప్పనియ్యవేం?" అంటూ సోమసుందరమూ విసుక్కుంటూ వచ్చారు, తమలో తాము.

దీంతో సూరిగాడికి నవ్వు వచ్చింది.

గుక్క తిరిగింది.

"ఆ మాట యిందాకా అడిగారు కాదండీ?"

"దానికి బదులు చెప్పాను కాదండీ?"

"అది అడగడం మరిచిపోయా నన్నాను కాదండీ?"

"ఆ మాట మీరు చెప్పలేదు కాదండీ?" అంటూ ఎదురువాదం ప్రారంభించాడు, దాంతో వాడు.

అయినా, రాజమ్మ వూరుకోలేదు.

"అది చెప్పాలిట్రా వాజమ్మా?"

"అసలు సంగతి మరిచేపోయావు, నువ్వు వెళ్ళిన లాభం ఏమిట్రా బుద్ధిహీనుడా?"

"కాకపోయినా, నీకామాత్రం తోచవద్దుట్రా అప్రాచ్యుడా?"

"సరేలే, నువ్వింతకంటే హొరగబెట్టావా యేమిటి, యెప్పుడయినా?"

అంటూ చేతులూపుకుంటూ సాగదీసుకుందామె.

తాను రాజమహేంద్రవరం యెప్పుడు వెళ్ళినా ఆమె యిలా ముక్తాయించడం వాడికి తెలిసిందే.

అంచేత, వాడందుకు సరిపెట్టుకుని వూరుకున్నాడు.

అయినా, ఆమె ధోరణి అలాగే వుంది.

అది చూసి, వంట కాలస్యం అయిపోయిందని గుర్తించి, "సరే సరే, వెళ్ళి భోజనం చేసిరా" అంటూ రెక్కగూటి మీద చెయ్యివేసి వీధిలోకి నడిపించాడు, సోమసుందరం వాణ్ణి.

"అదేమిటండీ?" అంటూ కస్సుమంది రాజమ్మ.

"నువ్విక్కడే అన్నం తిందువుగాని వుండిపోరా" అంది, ఆ ధోరణిలోనే వాణ్ణి.

"అవునవును, నీ భోజనం యిక్కడే" అన్నాడు సోమసుందరం కూడా; కాని "నీకోసం యెదురుచూస్తూ వుంటుంది, మీ అమ్మకి కనపడి చక్కా రారా" అన్నాడు, నవ్వాపుకుంటూ.

"సరేనండి. సరేనండి" అంటూ యెగిరిపోయాడు, సూరిగాడు.

సోమసుందరమున్నూ వూపిరితీసుకున్నాడు గాని; "మీరు మరీనండీ" అంది, రాజమ్మ నిష్టురంగా.

"ఏం?" అన్నాడతను, అమాయికత్వం నటిస్తూ.

"ఇప్పుడా యింటికి పంపడం వాణ్ణి?"

"క్షణంలో రాడూ?"

"ఆ, వస్తాడు"

"అన్నం పెడతానన్నావుగా నువ్వు?"

"పెట్టేలాగే చేశారు పాపం, మీరు"

"చూడూ, సూరిగాడింకా రాలేదనుకో. త్వరగా వంట చేసేసి, నాకు పెట్టి నువ్వు కూడా తిను. దగ్గిర కూచుని మళ్ళీ వొక్కొక్కటే అడుగుతూ అప్పుడు వడ్డించు వాడికి. భోజనం చేశాకయినా వెంటనే యింటికి పోనిస్తానా, నువ్వు మరిచిపోయినవి నేనడగనూ, వెధవనీ?"

రాజమ్మ మాట్టాడలేకపోయింది.

చురచుర చూస్తూనే వంటింటికేసి మళ్లిందామె.

"ముందు దీపం వెలిగించు" అంటూ తడుముకుంటూ కవాచీబల్లకేసి మళ్ళాడు సోమసుందరమున్నూ.

సూరిగాడింటికి వెళ్ళడం సుతరామూ యిష్టంలేదామెకి.

ఉన్నట్టుండగా వాణ్ణి పంపేసినందుకు భర్తమీద కూడా కోపంగానే వుందామెకి.

కాని, లాంతరు వెలిగించి వాకట్లో వుంచాటప్పటికి, నరసమ్మా రామారావూ మధుపర్కాలతో తీయించుకున్న ఫోటో ఎన్‌లార్జిమెంటు కనపడింది.

వెంటనే నరసమ్మ మీదికి మళ్ళిపోయిందామె చూపు.

"ఏం చేస్తోందో వెర్రిపిల్ల! మమ్మల్ని చూడాలని వుందిట. చిక్కిపోయిందో యేమిటో నా చిట్టితల్లి. అన్నం సయిస్తోందో లేదో? అదేమిటో వెళ్ళిచూసుకోవాలి గాని, సూరిగాడివల్ల యేమి తెలుస్తుందీ?" అనుకుంది వెంటనే.

తొందరపుట్టింది.

"త్వరగా వంట చేసి అయనకి పెట్టేసి, తరువాత అదేదో చూసుకోవా" లనుకుంది, దాంతో.

వంటింటోకి వెళ్ళి నిప్పు రాజేశాటప్పటి కేదో తోచి వాక్కు వురుకున వాకట్లోకి వచ్చి అది భర్తతో చెప్పింది.

అది ముగిసి, ఇంటోకి వెళ్ళి బియ్యం కొలిచాటప్పటి కింకోటి తోచింది.

మడికట్టుకుంటూ వుండగా మరొకటి తట్టింది.

ఎసట్లో సగం బియ్యం పోశాటప్పటి కింకోటేమిటో తోచి, అదరాబాదరా తక్కిన బియ్యం గుమ్మరించేసి వాకట్లోకి వురికింది.

ఇలాగ వంట అయి, మడి కట్టుకుని, సోమసుందరం వచ్చి పీటమీద కూచునే దాకా లక్షమాట్లయినా కిందా మీదా పడిపోయిందామె.

అతనయినా నిశ్చింతంగా కూచుని వుండలేకపోయాడు వాకట్లో.

సూరిగాడు చెప్పిందే సగంసగం, అదయినా విన నిచ్చింది కాదు, రాజమ్మ.

"ఉత్తరం రాసి, యిచ్చి, జవాబు తెప్పించుకోవలసింది" అంటూ విసుక్కున్నాడు కొంతసేపు.

మళ్ళీ కోర్టుపని యెప్పుడో జ్ఞాపకం చేసుకుని దినాలు లెక్క పెట్టుకున్నాడు, కొంతసేపు.

అలాగ అయినా అతని మానాన అతణ్ణుండనిచ్చిందా రాజమ్మ, మాటిమాటికీ యేదో మించిపోతున్నట్టు వచ్చి కంగారు పెట్టేసిందిగాని?

ఇంతకీ—

"వంట చేస్తోందో లేదో?"

వెళ్ళి తొందరపెడదా మనుకున్నాడు గాని; యేమిటో కదల్లేకపోయాడు.

"పోనీ, పది రూపాయలు పారేసి రామచంద్రపురం బదిలీ చేయించుకుంటే, రామాన్ని?" అనుకున్నా డొకమాటు.

"రామచంద్రపురం అయితే యేడు మైళ్ళేగా, తోచిందంటే గంటలో వెళ్ళి చూసి రావచ్చు చిట్టితల్లిని, సైకిలుమీద" అనుకున్నాడు.

అవిడకైనా, రెండుగంటల పనీ, సొంతబండి కట్టేస్తాడు సూరిగాడు, మనం కదలనక్కర్లేకుండా" అనిన్నీ అనుకున్నాడు.

అతనిలా గుంపుదంపులు పడగా పడగా "మడి కట్టుకోవచ్చు"నని కేక వేసిందామె.

భోజనం చేశాటప్పుడు బహు మితంగా మాట్లాడతా డతను, బంతిలో ఎందరున్నా.

ముక్కాలిపీటమీద దగ్గిరసా కూచుని వడ్డిస్తుంది కనక, అతను తనకే సయినా చూడకపోయినా, ఏమిటేమిటో అడుగుతూనూ, చెబుతూనే వుంటుందామె.

ఏ పూటా తప్పనిదీ యిది

ఆ పూటా తప్పింది కాదు.

తప్పలేదంటే, వస తాగిన పిట్టలాగ వూరికే మాట్లాడేది అదివరకి — "అమ్మాయిని చూడాలని — ఏమిటో — వురకలు వేసుకువస్తోందండీ" అంది, కూచుని మీగడ పెరుగు వడ్డించబోతున్నదల్లా ఉబ్బెత్తుగా లేచి నుంచుని, ఆ పూట.

"ఏమిటి?" అన్నట్టు చూశా డతను, చెయ్యి చాపే వుంచి.

"అదేమిటో చెప్పలేనండి! వుబలాటమో మరొకటో తగ్గడం లేదు. అబ్బా, నుంచోలేను కూడాను" అంటూ అతనికి . దగ్గిరగా చతకలబడింది, పీట దూరంగా తోసేసి.

అతనికీ కలిగింది భావోద్వేగం, దాంతో.

తక్కిన మాటలు రాజమ్మ వినపడనివ్వకపోయినా "మిమ్మల్నీ బాబయ్యగారినీ చూడా లని వుందిటండి, అమ్మాయిగారికి" అని సూరిగా డన్నమాట గుమ్మా లెక్కుతూ వుండగా అతని చెవిలో పడింది, మరి.

అప్పణ్ణుంచీ ఆ విషయమ్మై ఆలోచించుకుంటూనే వున్నాడతను.

లక్ష తోచాయి. లక్షా కాదనుకున్నా డతను కాని; అదే సుడితిరుగుతోం దతనికి, మనస్సులో.

అంచేత, రాజమ్మస్థితి చూశాటప్పటికి కాగలేకపోయా డతనుకూడా.

వెంటనే అప్రయత్నంగా గోడపీటకి చేరబడిపోయి "నువ్వన్నదాల్లో తేడాలేదు, గానీ – ఇలా అయితే యెలాగో తోచడం లేదు గానీ – ముందు ముందు విడిచి వుండడం కష్టం అవుతుం దనుకుంటూనే మన మీ మమకారం పెంచుకున్నాం, నిజమే గాని, – ఇది వింటే పైవాళ్ళు నవ్వుకుంటారు తెలుసు గానీ, – ఇవాళ పళ్ళూ అవీ పంపి రేపు మనం వెడితే – పాపం, రామం అలాంటివాడు కాదు గానీ, – అయినా పొద్దుటి బండికే వెడదాం" అంటూ ఆమె పెరుగు వడ్డించకుండానే పట్టి అన్నమే కలుపుకోసాగా డతను.

దీంతో ప్రాణాలు కుదుటపడ్డా యామెకి.

వొణుకు తగ్గింది.

నుంచోనూ గలిగింది, వొక చేత పెరుగు తప్పేలా, వొక చేత గరిటె పుచ్చుకుని–

"లోకు లేమనుకుంటారో అని యెవళ్ళపని యెవళ్ళు మానుకుంటారండీ? కాకపోయినా, యెవళ్ళ మమకారం వాళ్ళదీ, యెవళ్ళ అదుర్దా వాళ్ళదీనీ. మన అమ్మాయికి తగ్గవాడు నూరిళ్ళ బ్రాహ్మణ్యంలో వొక్కడూ లేకపోయె ఈ వూళ్ళో. వుంటే మనకీ తిప్పలేమీ? కొడుకులూ యిక్కడలేక, వొక్కగానొక్క కూతురు పొరు గూళ్ళో వుంటే, మనకేం వుందండీ, యిక యిక్కడ? కనక, మనం కూడా రాజమహేంద్రవరం ప్రవేశిస్తేనే బాగుంటుం దనిపిస్తూ వుంటుం దప్పుడప్పుడు. ఒక్క సంవత్సరం అయినా అలవాటయితే ఇంత వులకం వుండదు గానీ – అయినా రేపు పొద్దున్న ప్రయాణం తప్పదు. ఏం?" అంటూ చురుగ్గా చూస్తూనే పెరుగు వడ్డించిం దామె.

"రేపు పొద్దున్న" అని ఆమె కూడా అనాటప్పటికి తొందర పుట్టుకు వచ్చిందతనికి.

అవతల రెయిలు మించిపోతోం దన్నంత కంగారు పెట్టేసింది.

ఉప్పు కలుపుకోకుండానే సగం అన్నం తినేశాడు.

"మాగాయ టెంకని ఇంకా గుంజున్నట్టుంది, కసింత పెరుగు వడ్డిస్తానండీ" అంటూ ఆమె గరిటె యెత్తాటప్పటికి ఉత్తరాపోశనమే పట్టేశాడు కూడా.

## 6

పొద్దున్న యేడున్నరకి అనపర్తిలో రెయి లెక్కి, యెనిమిదిన్నరకి రాజమహేంద్రవరం పెద్దస్టేషనులో దిగి, సామానంతా బండిలో వేయించుకుని, తొమ్మిది కొడుతూవుండగా వైగ్రాం రోడ్డున వున్న కూతురిగారి బసకి చేరుకున్నారు వారు.

తర్జనితో నిర్దేశిస్తూ "అదిగో, అదే" అన్నాడు సోమసుందరం.

తొరగా నడపలేదని దారిపొడుగునా రెయిలువాళ్ళని తిట్టుకుంటూనే వున్న రాజమ్మ "అదిగో అదిగో – కుడివైపున – అరుగుమీద పొట్టిపిచికి వాలి వుంది చూడూ, అ, అ, పోనివ్వకు, పోనివ్వకు – అయ్యో, ఆపమంటూవుంటే అదేమిటబ్బీ, చెముడా ఏమిటి నీకు?" అంటూ బండివాడిమీద కస్సుమంది.

వాకట్లో పచారుచేస్తున్న రామారావు "ఎవరు చెప్మా?" అనుకుంటూ ద్వారబంధాలు పట్టుకుని ముందుకు వంగి తొంగిచూశాడు.

"ఎవరండీ? మన యింటికా, పక్కవారి యింటికా?" అనడుగుతూ అప్పుడే వాకట్లోకి వచ్చి వుండిన నరసమ్మకూడా తొంగిచూసింది, అతని చేతిమీదుగా వాలి.

అప్పటికి రాజమ్మ బండి దిగింది, పైట సవరించుకుంటూ.

చూసీచూడ్డంతోనే "మా అమ్మ" అంటూ పెనిమిటిని రాసుకుంటూనే నడివీధిలోకి వెళ్ళి తల్లిమీద వాలింది, నరసమ్మ.

"మా అమ్మ, మా అమ్మ, నింపాదిగా వున్నావా చిట్టితల్లీ?" అనడుగుతూ వూర్ధ్వశ్వాసతో కూతుర్ని పొదువుకుంది రాజమ్మ కూడా.

అత్తగారిని చూచి బండి దగ్గిరికి చేరాడు రామం.

ఆమెని పాలికాపు తీసుకువచ్చి వుంటాడనుకున్నా డతను కాని; "విశేషాలు లేవు గదా?" అనడుగుతూ సోమసుందరం కూడా బండి దిగాడు, చిరునవ్వు నవ్వుకుంటూ.

రామం మాట్టాడలేకపోయాడు.

ఇక్కడి విశేషాల మాటకేం, వారి రాక యేమిటో యెందుకో అర్థం కాలేదతనికి.

చక్రకేళీగెలలు, కొబ్బరికాయలు, బెల్లం బుట్ట, చెరుకు ముక్కలు, పెరుగుబుడ్లీ, చిన్నట్రంకు, బస్తామూట – బండిలో యివన్నీ కనబడేటప్పటికి మరీ గహనం అయిపోయింది సమస్య, అతనికి.

అది గుర్తించాడు సోమసుందరం. "ప్రయాణమూ యెక్కడికో కాదు, కారణమూ యేమీ లేదు. మిమ్మల్ని చూడాలని బుద్ధి పుట్టింది, మరి వుండలేకపోయాం" అని వివరాలు చెప్పేడు, చిరునవ్వు నవ్వుకుంటూ.

దానికి రామం బదులు చెప్పకముందే "రండి నాన్నారూ" అంటూ తండ్రి చెయ్యిపట్టుకుని యింటోకి బయలుదేరింది నరసమ్మ.

సామా నంతా బండిలోనే తన కప్పగింత పెట్టినట్టు కాగా బండివాడిచేత రామమే యింటో పెట్టించా డంతా.

తండ్రిని కాళ్ళు కడుక్కోమంటూ వాకట్లో నీళ్ళుంచి, వంటింటి వసారాలో పీటవేసి తల్లిని కూచోపెట్టి, ఆ యింటోనే చిన్న చిన్న వాటాలలో కాపరం వున్న

వెంకటమ్మనీ, సుబ్బమ్మనీ, సూరమ్మనీ, పార్వతమ్మనీ, సావిత్రమ్మనీ, చిట్టెమ్మనీ, ఇందిరాకుమారినీ, కుమారీశ్యామలనూ, శకుంతలా ముత్తుస్వామినీ పిలిచి, తల్లిని చూపించి అడావుడి చేసేసింది నరసమ్మ.

మెల్లిమెల్లిగా అందుకుని వాళ్ళంతా సంతగోల చేశాటప్పటికి "యేమిటి సంగతి?" అనుకుంటూ వొకరిద్దరు పురుషులు తొంగిచూశారు పక్కవాటాలవారు, అరుగుమీదికి వచ్చి.

అప్పటి కప్పుడే పులుసు తరవాయిగా వంట అంతా అయిపోయింది.

పులుసయినా పొగచడం తరవాయి.

బంగాళాదుంప ముక్కలు వేగి, కమ్మని వాసన కొడుతున్నాయి.

తమ కిద్దరికే కనక, తలగొట్టి తవ్వెడు బియ్యమే పోసి వొండింది, నరసమ్మ.

అంచేత, మరో తవ్వెడు బియ్యానికి మళ్ళీ యెసరు పడేసి తండ్రిని స్నానానికి తొందరపెట్టిం దామె.

భోజనం కావడం తడువుగా కచేరీకి వెళ్ళిపోయాడు రామం.

మొత్తానికి రాత్రి తెల్లవార్లూ నిద్ర లేకపోడమూ, పొద్దున్న రెయిలు ప్రయాణమూ – దీంతో అన్నరసం వంట బట్టాటప్పటికి నిద్రముంచుకురాగా సోమసుందరం పడుకున్నాడు.

తాంబూలం యిచ్చి నరసమ్మ రామాన్ని కచేరీకి పంపడమూ, సోమసుందరానికి పక్కసద్ది రాజమ్మ మడి కట్టుకోడమూ అయేటప్పటికి పదిన్నర అయింది.

అన్నీ వడ్డించుకునీ, కావలసినవన్నీ దగ్గిర పెట్టుకునీ తల్లీ కూతుళ్ళిద్దరూ భోజనానికూచునేటప్పటికి ఖరాగా పదకొండూ అయింది.

"అన్నట్టు మరిచిపోయా" నంటూ లేచి, మామిడి పళ్ళబుట్ట తెచ్చి తమ కిద్దరికీ మధ్యగా వుంచి, మళ్ళీ కూచుంది నరసమ్మ.

కభూర్లూ భోజనమూ ఏకకాలంలో ప్రారంభించారు.

రయితు పనసపండూ అవీ తెచ్చింది మొదలు తామిక్కడికి వచ్చేదాకా మహేంద్రవాడలో జరిగినవన్నీ అడక్కుండానే చెప్పేసింది, రాజమ్మ.

ఇక అల్లుడి సంపాదనా ఆదరమూ యెలా వున్నయో అడుగుదామనుకుంటూ వుండగా నరసమ్మ అందుకుంది:

"లాం – జముండ నన్ను చూస్తే యెగిసిపడేది, చిక్కి పోకుండావుందిటే అమ్మా, అవుదూడ? పది యీత లీని ముసలిదయిపోయినా బుడిగావు మహా మంచిది. చాలినంతా పచ్చగడ్డి తెస్తున్నాడా దానికి సూరిగాడు? దబ్బన్న గారి సుందరమ్మ ఆరేళ్ళపిల్లే గాని, యించక్కని కంఠమూ అదీ – పెరుక్కోసం వచ్చినప్పుడు పాటలు పాడుతోందా నీ దగ్గిర కూచుని? నిమ్మన్నగారి సీతమ్మ కనపడుతోందా? యాజులు గారి గున్నమ్మ సమర్తాడిందా? పేరిశాస్తుర్లు గారి నీలమ్మ నీల్లాడిందా? యజ్ఞన్న మామగారి రత్తికి పెళ్ళి కుదిరిందట కాదూ? సూరావధానులు తాతయ్యగారి

సుభద్రమ్మకి పెళ్ళి అయిపోయిందిట కాదూ ద్రాక్షారామ గుళ్ళోనూ? బంగారమ్మ అత్తగారి అన్నపూర్ణకి కొడుకా?

వొసే అమ్మా, వాళ్ళ రామసోదెమ్మ నా మాట అడుగుతొందా లేదా యెప్పుడయినా? వేంకట లక్ష్మిగారి రామలక్ష్మిని మహేంద్రవాడలో దిగబెట్టేసి, వుద్యోగం సంపాదించుకునిగాని మళ్ళీ కనబడనంటూ బొంబాయి వెళ్ళిపోయాడుట, నిజమేటే దాని మొగుడు? మునసబూ కరణమూ వియ్యం అందుతారుట, యెలా కలిసిందే మళ్ళీ వాళ్ళకి? పిలకజుట్టుకి సాయం పొడుము కూడా పీలుస్తున్నాడుట మొగుడు. పాపం, యెలా సహిస్తోందే వాళ్ళ కృష్ణవేణి? లచ్చమ్మత్తగారు మన యింటికి వస్తున్నారా దినమ్మూ? ఆ వీధి రామ సోమయాజులుగారి రత్తమ్మ అత్తవారి యింటికి వెళ్ళిందా, యిక్కడే వుందా యింకాను? తన మొగుడు ప్లీడరయి పోతాడని మహా మిడిసిపడేది చంద్రమ్మ, పరీక్ష పోయిందిట కాదు అతనిదీ? గులాబీచెట్లకీ మల్లెపొదుకీ బాగా నీళ్ళు పోస్తోందా పైడి? చామంతి చచ్చిపోకుండా చూస్తున్నావా? అన్నట్టడగడం మరిచిపోయాను, వెంకప్పచయనులుగారి లచ్చబ్బాయికి వొడుగయిందా? అవునుగానీ, వాళ్ళ సుబ్బలక్ష్మి మొగుడు సీమ వెళ్ళాడుట గదా, యింటోకి రానిస్తారుటే వచ్చాకా?"

వీటికి బదులు చెబూతూనే ఎదురు ప్రశ్నలు వేశింది రాజమ్మ. అర్థాంతరన్యాసంగా.

మొత్తానికి, నాలుగు మాటల కొక ముద్ద-పదిమాటల కొకముద్ద-ఇలాగ భోజనం పూర్తిచేసి పన్నెండయాటప్పటికి పీటలమీది నుంచి లేచారిద్దరూ.

స్థలశుద్ధిచేసీ, అంట్లు దొడ్లో పడేసీ, నూతికి వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కునీ వారిద్దరూ వాకట్లోకి వచ్చాటప్పటికి మరో అరగంట అయింది.

ఇంతవరకూ వంటింటోనే సరిపోవడంవల్ల, రాజమ్మ, అప్పుడు ప్రతీగదికీ బయలుదేరింది, అల్లుడి ప్రయోజకత్వమూ, కూతురి పొక్తూ యెలా వుందో కనిపెట్టడానికి.

అది గుర్తించి, తానున్నూ వెంట బయలుదేరి, వివరాలు మొదలు పెట్టింది నరసమ్మ:

"ఇది పడకగది. పందిరిమంచానికీ దోమతెర మొన్నమొన్ననే కుట్టించారు. నా బట్టలకోసం నిలువుటద్దంతో బీరువా మొన్ననే పురమాయించా రీవూళ్ళోనే. దాని ఖరీదు మీరిచ్చుకోవాలిట. రంగూన్ పెట్టెయిస్తే చాలదుట. యీ కాలానికి తగిన విద్వాలిట, నాన్నగారితో చెప్పడం మరిచిపోకు. ఇది వారి బట్టల బీరువా. దీని క్కూడా నిలువుటద్దం పెట్టించమని పోరుతున్నాను నేను. ఈ కడపరాతిబల్ల కొని మూణ్ణెల్లయిందిట. ఆ పడక కుర్చీ, ఆ మెత్తకుర్చీ, ఈ టేబిలూ నేనిక వారం దినాలకు వస్తాననగా వచ్చాయి. ఆ అలమూరుకి ఇంటివారితో పోరి నిన్నగాక మొన్న పెట్టించారు అద్దాల తలుపులు, మువ్వ పంపిన మామిడిపళ్ళివిగో, యింకా డజనున్నాయి. పనసపండు రిజిస్ట్రారుకి పంపించారు, ఆవేళే. అనాసపళ్ళు మొన్నా నిన్నా అయిపోయాయి. ఆ సీసాలోది నేతిమిఠాయి, మొన్ననే చేశాము, ఇవాళతో అయిపోతుంది.

ఈవైపువన్నీ ఇంగ్లీషు పటాలు, అవి కృష్ణలీలలు. ఇవి రాములవారి వనవాసపటాలు. అది మా అత్తగారిదీ మామగారిదీ ఎన్‌లార్జ్‌మెంటు. ఈ ఫోటో నేనిక్కడికి వచ్చిన మర్నాడు తీసింది. ఇది మా చిన్నాడబడుచుది, వారిప్పుడు బెడవాడలో వున్నారు. ఈ సంగీతం పెట్టె ఈ వూరు వచ్చిన కొత్తరకం కొన్నారు. ఎన్నో పళ్ళాలున్నాయి దీనికి, అమ్మోయ్! వేదం కూడా చదివేరే యిద్దరు దక్షిణాది బ్రాహ్మలు. మంచికృతులన్నీ యేరికొన్నారు, రాత్రి పాడిస్తాను, విందుగాని. ఈ యినపెట్టె బాగుందా, వారందినాలయింది కొని.

ఇలారా, యిది వసారా గది, ఈ వాటాలో ఇదే ముఖ్యమైనది. ఇది సామాను గది. అది వంటవసారా గదా? అది వొక్కటే యీ వాటాలో ఎక్కువ. అంచేతే తతిమ్మా వాటికన్నిటికీ పదేసే అయినా, అద్దె దీనికి పన్నెండు పుచ్చుకుంటున్నారు. ఈ పక్కనే వున్నాయి, డాబామీదికి మెట్లు. సంవత్సరం కనిపెట్టుకుని వుండగా దొరికిందిట ఈ వాటా, నాలుగుమాసాల కిందట. అద్దెమాట యేమయినా యింటివారు చాలా మంచివారులే పాపం. చిన్న ఖాతగారి కామేశ్వరి అత్తవారి వూరూ, ఈ యింటివారి చిన్న కోడలి పుట్టింటివారి వూరూ వొకటే. ఎదురు గుమ్మాలుట కూడాను. ఇందిరా కుమారి అంటారూ, ఆ పిల్లే ఇంటివారికోడలు. నేతిమిఠాయి నేనూ ఆ అమ్మాయీ కలిసే చేశాం మొన్న, సమానవాటాలుగా. శకుంతలాముత్తుస్వామి దగ్గిర సాంబారు చెయ్యడం నేర్చుకున్నాను మొన్ననే, నీకు నేర్పుతానులే."

తల్లి అడిగినవీ, తనకి తోచినవీ – ఈ రెండింటికీ అనుబంధం కలిపేవీ గబగబా చెప్పేసింది, నరసమ్మ యిలాగ.

చాలామట్టుకి వూకొట్టడంతోనే సరిపోగా, యిక వూరుకోలేక "అంతా బాగానే వుంది, అద్దె పదిరూపాయలయితే బాగుండును" అంది రాజమ్మ.

"మేము ఖాళీచేస్తే యీ వాటాకి పదిహేనివ్వడానికి సిద్ధంగా కూచున్నా రెందరో, తెలుసా?"

"అయితే కష్టమే"

"ఏమీ కష్టం లేదు. ఈ యింటి ముసలాయన, మీ అల్లుడుగారిని మనమడుకంటే ఎక్కువగా చూచుకుంటున్నారులే"

"ఇంకేం మరీ? పోనీ, పదకొండింటి కివ్వరాదూ?"

"ఇవ్వరు" అనేసింది నరసమ్మ, దృఢంగా.

ఇక ఆ విషయమ్మై మాట్లాడి లాభం లేదన్నట్టు మూతి బిడాయించుకుని చురుగ్గా చూసి, పాందాను ముందు పెట్టుక్కూచుంది కూడా.

## 8

ఇద్దరూ తాంబూలం వేసుకున్నారు.

డబ్బు సంగతి వచ్చాటప్పటికీ, కంఠం నొక్కుకుని "ఆ యినప్పెట్టెలో నాలుగువేల రూపాయలూ, యాభైకాసులూ వున్నాయి. అయిదువేల ఎనిమిది వందలు బాంకిలో వున్నాయిట. నాలుగువంద లొకరూ, తొమ్మిది వంద లొకరూ, మూడు వందల

పాతిక వొకరూ, రెండు వందల ఎనభై వొకరూ ఇవ్వాలిట. నోట్లు నా పేర వున్నాయి. ఈ యేటి శిస్తు పన్నెండు వందలూ రయితు దగ్గరే అట్టేపెట్టారు, వడ్డీకి; కాని మీదటికిల్లు కట్టుకుంటే ఇవన్నీ పైసలా!" అంది నరసమ్మ, చేతులు తిప్పకుంటూ.

"మేడే కట్టుకుంటారా?"

"మండువా పంపిణీమీద డాబా మట్టుకు వేయిస్తారుట ముందు"

"స్థలం—"

"అయిదు వందల గజాలు. కావలసినంత పెరడుంటుంది ఇంటికి చుట్టూ"

"నుయ్యీ—"

"పూర్తి అవుతోంది, నాన్నారు లేవనియ్యి, వెళ్ళి చూసివద్దాం"

"ఇల్లు కట్టుకునేప్పుడు సెలవు పెడతాడా నీ మొగుడు?"

"పెట్టవద్దూ? లేకపోతే పని సాగుతుందా?"

"అవు నవును"

"అవునవు నంటే కాదు, నాన్నారు కూడా యిక్కడే వుండాలిట"

"రెండోపంట రోజులు గదా. యెలా వుంటారే?"

"మా మామగారూ లేక, నాన్నారూ రాక —"

"మీ మామగా రెందుకు రారూ?"

"మా పెద్దబావగారూ మేడ కట్టుకుంటారుట ఏలూరిలో, అక్కడ వుండాలిట వారు"

"ఈ కొడుకు పని చూడనక్కరలేదు కామోసు!"

"మా అత్తగా రుంటారుట యిక్కడ?"

"అవిడా నేనూ వుండేం లాభమూ?"

"అలా అనకు" అంది ముందు నరసమ్మ. అని కంఠం నొక్కుకుని "మేము బాంకిలో వేసుకున్న అయిదు వేల యెనిమిది వందలూ ఆవిడ యిచ్చినవే" అంది. కళ్ళు తిప్పకుంటూ.

రాజమ్మ మొగం యింతయింది; కాని "ఆ కొడుక్కి తండ్రి యెంత యిచ్చారో" అంటూ సాగదీసుకుంది, అంతకంటే కంఠం నొక్కుకుని.

"ఇచ్చుకోనీ, మాకు లోటుండదు, మా అత్తగారు బతికివున్నంతకాలమూ"

"అదే మాకు తృప్తి, పార్వతీదేవి అన్నట్టుంటుందా యిల్లాలు. నీ మొగుడంటే ఆవిడకు ప్రాణమే."

"నేనంటేనూ అంతే. ఆవిడ యిక్కడ వుంటే నన్ను మడి కట్టుకోనిస్తారా వొక్కపూట అయినా? కూచోపెట్టి ఆవిడకు చాకిరీ చాయ్యాలని నేను; 'వా నాయనకు నా చేతులతో అన్నం పెట్టుకోవద్దూ?' అని ఆవిడ."

"మా అమ్మ అయినా వుండాలి, మీ అమ్మాయి అయినా వుండాలి, లేకపోతే నాకు అన్నం తిన్నట్టే వుండ' దన్నాడు నీ మొగు డెన్నో మాట్లు, అవునవును."

"పని మొదలు పెట్టించాక ఆవిడ వూరకే రారు. చూసుకో, నే నన్నాను"

"ఎప్పుడు మొదులుపెడతా రేమిటి పని?"

"పున్నమి వెళ్ళాక శంకుస్థాపన. అప్పుడు మీరూ రావాలి, తెలుసా?"

"మే మెందుకమ్మా?"

"చీరా జామారూ యివ్వడాని కమ్మా!"

ఇద్దరూ కొంటెగా చూసుకున్నారు.

చివరికిద్దరూ పకాలుమని నవ్వుకున్నారు.

"ఈ నెలలో పునాది అయిపోతుంది. వానాకాలంలో తలుపులూ ద్వారబంధాలూ కిటికీలూ అలమార్లూ చేయిస్తారు. పునాది గట్టిపడ్డాక మాఘమాసంలో మళ్ళీ పని ప్రారంభిస్తారు, ఫాల్గునంలో గృహప్రవేశం"

ఇలా అని మళ్ళీ కొంటెగా చూసింది నరసమ్మ.

"మళ్ళీ చీరా జామారూ తేవాలి కామోసు మేము"

"తేవద్దా యేమిటి?"

అయితే, యీమాటు—

చిన్నన్నయ్య తెస్తాడుట అప్పుడు "చీరా జామారూను. మొన్ననే రాశాడు, తండ్రికి"

"ఆ మాట యెందుకు వచ్చిందీ?"

"బెంగుళూరులో తన కించక్కని యిల్లు దొరికిందిట అద్దెకు. ఈ వేసవిలో మేమక్కడికి రావాలిట"

"మరీ మా యింటో గృహప్రవేశమో?"

"ఆ మాటే రాశారు మీ నాన్న. దానిమీదే రాశాడు చిన్నన్నయ్య – చీరా జామారులమాట"

"అయితే నాకీమాటు బెంగుళూరుచీర అన్నమాట"

"అన్నమాటే"

"చిన్నన్నయ్య మాటసరే. పెద్దన్నయ్య పోలవరంలో సర్కిల్ ఇనస్పెక్టరు కనక, కలప వూరికేనో రాయితీగానో రావద్దూటే మాకూ?"

"అదీ అయింది. మొన్న వెళ్ళినప్పుడు మీ నాన్న చెప్పివచ్చారు"

"ఏమన్నాడో?"

"నాలుగు టేకి పలకలు సంపాదించి వుంచాట్ట అప్పుడే. తుండ్లెన్ని కావాలో—"

"నాన్నా రీమాట చెప్పారుకారు చూశావా?"

చెప్పడానికేం మించిపోయిందే అప్పుడే? వచ్చారు, స్నానం చేశారు, భోజనం చేశారు, పడుకున్నారు – మాటా మంతీ ఆడిందేదీ?

ఆమె యిలా అంది, అంతే – "అమ్మా" అంటూ పిలిచాడు సోమసుందరం మేలుకుని.

"రండి నాన్నగారూ" అంటూ వూచలాగ వెళ్లింది గదిలోకి నరసమ్మ.

నూతికి వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కువచ్చి పడక కుర్చీలో కూచున్నాడు సోమసుందరం.

తల్లికీ తండ్రికీ చెరో పళ్ళెంతోనూ మిఠాయి అందించి, మామిడిపళ్ళు తెచ్చి కూచుంది నరసమ్మ, కత్తి పుచ్చుకుని ముక్కలు కొయ్యడానికి.

కత్తి లాక్కుని తానే కొయ్యసాగింది రాజమ్మ.

"మిఠాయి పుచ్చుకోండి నాన్నారూ"

"ముందు నువ్వు పుచ్చుకో తల్లీ"

"అది తనతో కలిసి పుచ్చుకోవాలి, లేకపోతే అల్లుడు వొక్క పిసరయినా పుచ్చుకోడు. పోనీ, కాస్త నోట్లో వేసుకోవే"

"......కాస్తేం, ఇవాళ నాన్నారి దగ్గిర కూచునే పుచ్చుకుంటాను. పోనీ, నీకు మళ్ళీ తెచ్చి యిస్తాను, పళ్ళెం యిలా తే. పుచ్చుకోండి నాన్నారూ"

ముందు నరసమ్మ ప్రారంభించింది.

"చెప్పలేదని యిప్పటికే కోపం వచ్చింది నీకు, వినవే అమ్మాయీ" అంటూ ముందు కలప సంగతి చెప్పి, తరవాత సోమసుందరమూ ప్రారంభించాడు ఫలహారం.

రాజమ్మ మామిడిపండు ముక్కలు కోసి, కూతురు చెప్పగా పళ్ళెంతో కొన్ని ముక్కలు గదిలో కడపరాతి బల్లమీద వుంచివచ్చింది.

ఇంతలో గంపెడు మామిడిపళ్ళు పట్టించుకుని రామం వచ్చాడు, కూలి మనిషిచేత.

"ఇన్నిపళ్ళింటో వుండగా మళ్ళీ యెందుక్కొన్నావోయీ?" అంటూ సాగదీసుకుంది రాజమ్మ.

"ఎవరో పంపి వుంటా" రన్నాడు సోమసుందరం.

రామమూ నరసమ్మా గదిలోకి వెళ్ళారు, మౌనంగా.

పళ్ళుగదిలో వుంచేసి కూలిమనిషి వెళ్ళిపోయింది.

రామం నూతికి వెళ్ళివచ్చాటప్పటికి వొకపళ్ళెంలో మిఠాయీ, కూజా నీళ్ళకోసం వెండిగ్లాసూ కూడా కడపరాతి బల్లమీద వుంచింది నరసమ్మ.

కొంతసేపు వారొకరి నోటి కొక రందించుకున్నారవి.

నరసమ్మ చిలుకపలకలమాట చెప్పింది.

"ఛా, యివాళ మిఠాయి బాగాలేదు"

"అదేమిటండీ"

"మీ నాన్నా రంత తియ్యని మాట చెప్పారు మరి"

"అదా?" అంటూ నవ్వేసింది నరసమ్మ.

ఫలహారం అయింది.

ఇద్దరూ మంచినీళ్ళు పుచ్చుకున్నారు.

నరసమ్మ అతని నోటికి తాంబూలం అందించింది.

పెదవులు సజ్జితాలు చేసు కున్నా డతను, వెంటనే.

మెడకి చెయ్యిచుట్టవేసి, అతని మొగాన మొగం వుంచిందామె అరగంట చూస్తూ.

## 9

ఆవేళ శనివారం.

అది మూడో శనివారం కావడంవల్ల ఆఫీసు లేకపోగా యింటోనే వుండిపోయాడు రామం.

పళ్ళెంతో తెచ్చి గదిలో బల్లమీద వుంచి తల్లి వెళ్ళిపోగా "ఇవాళ మా వాళ్ళు వెళ్ళిపోతారుట" అంది నరసమ్మ, అతని నోటికి చెంచాతో ఉపమా అందిస్తూ.

"ఏమంత తొందరా? దుంపలు దుంపలు చేసుకొని రానేవచ్చారు కదా, మరో రెణ్నాళ్ళుండరాదూ!"

"ఎందుకూ, పనిలేందే?"

"మహా పనివుండే వచ్చారు కామోసు, అసలు"

చకిత అయిపోయింది నరసమ్మ; కాని వెంటనే మొదట గాంభీర్యం తెచ్చుకుని, "కనక, వెళ్ళిపోతా రంటున్నానుగా?" అంటూ బుంగమూతి పెట్టుకుంది, చివరికి కొంటెగా చూస్తూ.

"నే నుండ మంటున్నానుగా?" అంటూ అంతకంటే బుంగమూతి పెట్టుకున్నా డతను; కాని చెంచా ఆమె చేతిలో వుండడంవల్ల తప్పనిసరిగా నోరు తెరవ్వలసి వచ్చింది.

ఓడిపోయిన ట్టనిపించింది, దాంతో.

ఆలోచించాడు.

చూశాడు.

బింబాధరాన అడుగు పెట్టడమా మానడమా అని తటపటాయిస్తున్న ఆమె మందహాసం చురుకుపుట్టించింది.

ఆమె కొంటె చూపులు చిలిపితనమున్నూ మప్పాయి.

వెంటనే ఆమెని పొదివి పట్టుకుని వొడిలోకి తీసుకున్నంత దగ్గిరగా తీసుకుని చెంచా వూళ్ళాక్కున్నాడు.

అయితే, ఉపమా తినడమూ, కాఫీ పుచ్చుకోడమూ అయేదాకా గుమ్మం కేసి మధ్యమధ్య బెదురుచూపులు చూస్తూనే వుండిందామె.

ఇద్దరూ ఇవతలికి వచ్చారు.

నరసమ్మ తల్లిమీదికి వాలి బల్లమీద కూర్చోగా, రామం మామగారి పక్కన కుర్చీలో కూచున్నాడు.

ఆమాటా యీమాటా వచ్చాయి.

నలుగురూ అందుకున్నారు, వుత్సాహంగా; కాని కొంత దూరం వెళ్ళి వెళ్ళి "బజారుకి వెళ్ళివస్తానోయ్" అన్నాడు సోమసుందరం, అల్లుడితో.

"నీకేం గావాలో చెప్పు" అన్నాడు, కూతురితోనూ.

"నాకేం కావా లండీ?"

"అదేమి టమ్మా?"

"కాకపోయినా, ఇప్పు డెందుకండీ?"

"ఇవ్వడానికి ముహూర్తం యేమిటమ్మా నీకు?"

"వద్దనగూడ దమ్మా, ఏమి కావాలో చెప్పు. 'మీ అమ్మ కూడా వచ్చింది కదా, యేమిచ్చి వెళ్ళా'రని యెవరయినా అడిగితే ఏమి చెబుతావు?" అనడిగింది, రాజమ్మ కూడా.

నరసమ్మ ఆలోచించింది.

అన్నీ వున్నా యింటో, లోటు లేదు.

ఫలానా కావా లన్న కాంక్షే కలగలేదు. ఈ మధ్య.

కాగా, వారెంత ఖర్చు పెట్టదలుచుకున్నారో బయటికి వస్తుందేమో అని అలాగే మాట్లాడింది మరి కాస్సేపు.

లాభం లేకపోగా, చూసిచూసి గభీ మని లేచి గదిలోకి వెళ్ళాడు రామం, యీ సమయాన.

నర్సమ్మ కూడా వెళ్ళింది

అది చూసి "ఆలోచన కోసం" అంది, కంఠం నొక్కుకునీ, కళ్ళు చికిలించుకుంటూనూ, రాజమ్మ.

"అవు"నన్నట్టు తల వూపాడు సోమసుందరం; కాని, అక్కడ నరసమ్మనిచూసి చకితుడై "నువ్వెందుకు వచ్చావిప్పుడూ?" అనడిగాడు, రామం.

"ఏం?" అంది, నరసమ్మ తెల్లపోయి.

"నీకాలోచన చెప్పడానికి నే నింట్లోకి వచ్చినట్టు కాలేదూ?"

గతుక్కు మనిపోయిందామె.

మాట్లాడలేకపోయింది కూడా.

మరి మాట్లాడకుండా ఇవతలికి వచ్చి "మా ఆఫీసరు గారి ఇంటికి వెళ్ళి వస్తా"నంటూ సెకిలెక్కి వెళ్ళిపోయాడు, రామం.

కళ్ళు మూసుకుని నిట్టూర్పు విడుస్తూ లోపల అలాగే వుండిపోయింది, నరసమ్మ.

చూసి చూసి "ఆలస్యం అయిపోతోంది తల్లీ!" అంటూ తండ్రి పిలవగా "వస్తున్నా నాన్నారూ!" అంటూ తడబడుతూ ఇవతలికి వచ్చింది; కాని అడిగింది చెప్పలేక పోయిందామె.

"అంత మొగమాటం అయితే యెలాగ తల్లీ?" అనడిగాడు సోమసుందరం, ఆ తటపటాయింపు చూసి.

"ఏదో వొకటి అనేసెయ్యి" అంది రాజమ్మ కూడా.

ఆలోచన తోచలేదు; కాని దిటవు వచ్చిం దప్పటికి.

అప్పుడూ మాట్లాడలేకపోయింది.

"పొద్దెక్కిపోతోంది తల్లి! ఎనిమిదికాలేదింకా – ఎండ చురచుర లాడిపోతోందప్పుడే. తొమ్మిది దాటితే మరి బయట వుండలేం ఈ రోజుల్లో. తొరగా తేల్చెయ్యి" అన్నాడు మళ్ళీ సోమసుందరం, లాలనగా.

దగ్గిరికి వెళ్ళి పొదివిపట్టుకుని "అది కావా లిది కావాలంటూ క్షణం తోచనిచ్చేదానవుకావు, ఇదేమిటే ఇప్పుడీ మొగమాటం? చెప్పెయ్యమ్మా, పొద్దెక్కి

ఎండలో తిరిగితే భోజనం చెడుతుంది మీ నాన్నారికి" అంటూ బుజ్జగించింది రాజమ్మ.

అప్పుడంది నరసమ్మ "నామట్టుకి జరీ చెరుకాకంచు చీర తెచ్చి పెట్ట"మని, మొగం వంచుకునేవుండి.

సంతోషమే; కాని నామట్టుకంటే?

చకితులై చూచుకున్నారు రాజమ్మా, సోమసుందరమూ.

రామమూ నరసమ్మా ఇంటోకి వెళ్ళి వుండకపోతే వారికీ సందేహం కలక్కపోవును.

షర్టు మాత్రమే తొడుక్కుని వుండిన రామం, మళ్ళీ ఇవతలికి వచ్చాటప్పటికి, కోటు తొడుక్కునీ టోపీ పెట్టుకునీ వుండడం కనపడుతూనే వుంది; కాని ఈ విషయమై ఆలోచన జరక్కపోలే దని వారి నమ్మకం.

రాజమ్మా సోమసుందరమూ మళ్ళీ చూచుకున్నారు.

ఇది కనిపెడుతూనే వుంది నరసమ్మ, వోరకంట.

రెండునిమిషాలపా టెవరూ అధరస్పందన మయినా చెయ్యలేదు? కాని చొక్కా చెమటతో తడిసిపోయి, వళ్ళు చిటచిట లాడ్డంవల్ల మళ్ళీ తొందర పుట్టింది, సోమసుందరానికి.

తలయెత్తి కూతురుకేసి చూశాడు.

మాట నాలుక చివరికి వచ్చేసింది.

అయితే, రాజమ్మ హఠాత్తుగా అందుకుని "జ్ఞాపకం వుందా, మొన్న వెళ్ళిపోయింది సంవత్సరాదిపండుగ. కానయితే, అమ్మాయి మన ఇంట్లోనే వుంది గాని–" అంటూ మాట నాన్చేసింది.

"ఏమిటీ?" అన్నాడు సోమసుందరం, మొదట, కుర్చీకి చేరబడి.

"అవునేవును, స్ఫురించింది కా"దన్నాడు తరవాత, వుాగిసలాడుతూ,

కూతురి గడుసు రాకడతో సంతోషం తల మునకలయిం దతనికి.

తెరపి మరుపుల్లో బజారుకి వెళ్ళిపోయాడు, వెంటనే.

తండ్రి అలా వీధిలోకి వెళ్ళడంతోటే, తన గుట్టు కనిపెట్టేసిన తల్లి యెదట వుండలేక, యిలా పడకటింటోకి వెళ్ళిపోయింది నరసమ్మ,

తొమ్మిది దాటాక భర్త వొక పొట్లంతెచ్చి అందించగా, అది విప్పి, చీరా రయికలగుడ్డా, ఒక జామారూ, పైకి తీసి, అప్పటికీ నరసమ్మ గోడకేసి తిరిగి మంచంమీద పడుకునే ఉండడంవల్ల అవి బల్లమీద పెట్టేసి గబగబలాడుతూ వంటింటిలోకి చక్కా పోయింది రాజమ్మ.

## 10

"ఇవాళ మావాళ్ళు వెళ్ళిపోతారుట" అంది నరసమ్మ, భోజనానంతరం రామానికి తమలపుచిలక లందిస్తూ.

"పొద్దున్న చెప్పావు కాదూ?" అనడిగాడు రామం.

"చెప్పాను కామోసు, మరిచిపోయాను. నాలుగున్నర గంటల బండికి వెడతారుట"

"ఇప్పటి కిప్పుడిది రెండోమాటు చెప్పడం తెలుసా?"

"ఏమోనండీ! నా మనస్సు మనస్సులో వుండడంలేదు. ఎలాగో వొకలాగ మా నాన్నారు కనపడుతూనే వుంటారు మరి, మా అమ్మ యెన్నాళ్ళక్కన బడుతుందో మళ్ళీ?"

"ఏం, బెంగగా వుందా?"

"బెంగకాదు గానీ – ఏమిటీ – చెయ్యిజారి పోతోన్నట్టుంటోందండీ"

"అయితే, వొకమాటు వెళ్ళిరా, పాపం"

"మీరు పంపుతారా? వొకమాటు వెడతానండీ! నాలుగు – లెక్క నాలుగు రోజులే వుండి, మానాన్నారిని తీసుకు వచ్చేస్తాను. ఏం, పంపరూ? మీ కెంతయినా పుణ్యం వుంటుందండీ"

"నిన్ను మహేంద్రవాడ పంపితేనా?"

"మరేనండీ"

"అంటే, నువ్విక్కడ వుంటే పాపం వస్తుందన్నమాట!" అన్నాడు రామం కొంటెగా చూస్తూ. కాని అది గ్రహించే స్థితిలో లేదామె.

"మీరు వెళ్ళమన్నారు కనక అన్నాను"

"పంపకపోతే పాపం అని, కదూ?"

"చూశారా?" అంటూ తెల్లబోయింది నరసమ్మ.

"నేనలా అన్నానా?" అంటూ అడిగింది కూడా, మిడుతూ మిడుతూ చూస్తూ.

"అన్నానా అంటే, స్పష్టంగా అలా తేల్చావు మరి"

"అయితే, కోప్పడకండేం......"

"ఎందుకూ కోప్పడ్డం? అవకాశం వుంది కనక నేనా అర్థం తీశాను, వేళాకోళానికి, ఇంతమాత్రానికే, నాచేతులు పట్టుకుని బతిమాలాలా?"

"ఏమోబాబూ. నేనే పాపమూ–"

"అదేమిటి, పాపపుణ్యాలమాట ఎందుకూ మళ్ళీ?"

"అయితే పంపుతారా? ఒక్కమాటు పంపండి. మీరు చాలా మంచివారండీ? మళ్ళీ తొరగానే వస్తానులెండి. ఒక్కమాటుగా మా అమ్మని విడిచి వుండడం కష్టంగా వుందండీ"

"అలా అయితే, యెలాగ నరుసూ?"

"ముందుముందెలాగో మరి, యిప్పుడు మాత్రం ఏమీ తోచడం లేదు. సూరిగాడు పళ్ళు తెచ్చాడు, మా అమ్మని చూడాలని భ్రమ పుట్టింది. ఆ రాత్రి ఎక్కువయి పోయిందది. అప్పుడు నేనెలాగో అయిపోయాను, మీరు కనిపెట్టారో లేదోగాని"

"అంచేతనే, వెడతావా అనడుగుతున్నాను"

"దయవుంచి మీరు పంపితే వెళ్ళనూ? మర్నాడు మావాళ్ళు వచ్చారు కనక సరిపోయింది, లేకపోతే మతిపోయి వుండును, నాకు"

"చిక్కే, అయితే నరసూ! ఇక్కడ నా సంగతి నువ్వు చూస్తూనే వున్నావు. నువ్వు మహేంద్రవాడ వెడతానంటే వద్దనలేను గానీ – నువ్వు వెంటనే వచ్చేస్తావు తప్పకుండాగానీ–ఇల్లు అడివయిపోతుంది నాకు"

"అమ్మో!—"

ఇలా అంటూ బెదరిచూస్తూ, ముందు చేతులు పిసుక్కుందామె

"అయితే, నేను వెళ్ళనే వెళ్ళను. ఇల్లు మీకిక్కడ అడవి అయితే, నాకు మాత్రం కాదూ అక్కడ? ఇక ఆ వూసెత్తకం" డంటూ చేతులడ్డంగా వూపింది తరవాత.

"అలాకాదు. ఆడవాళ్ళకీ మొగవాళ్ళకీ భేదం వుంది. ఆడవాళ్ళలో కూడా, మళ్ళీ నీ సంగతి మరీనూ. కనక, వెళ్ళిరా"

"వద్దండీ, ఇందాకా వున్నట్టు లేదిప్పుడు మీ ముఖకళ, నేను వెళ్ళలేనండీ"

"నాలో ఏమంత మార్పు లేదుగానీ – చిలకలాంటి పెళ్ళాం గారిని విడిచి వుండడం అంటే ఎవళ్ళకయినా కష్టమేగానీ – నీ కష్టసుఖాలు చూడవద్దూ నేను? కనక నువ్వు తప్పకుండా వెళ్ళు. వారం కంటే మాత్రం—"

"బాబోయ్, వారం దినాలే?"

"పోనీ, నీఇష్టంవచ్చినన్ని దినాలు – ఏం?"

"మీరిలా అంటూంటే వెళ్ళాలనీవుంది, మిమ్మల్ని చూస్తే మానాలనీ వుంది. వెళ్ళాలేను. మానాలేను"

"వెళ్ళు వెళ్ళు. బిడియపడకు"

"మీరు మంచివారు కనక వెళ్ళమంటున్నారు. మీరు వెళ్ళమంటున్నారు కనక కాళ్ళాడ్డం లేదు నాకు"

"కాదు కాదు—"

"అయితే, వెడదామన్న వుబలాటం పీకుతూనే వుంది సుమండీ. వొకమూల?"

"ఇంకేం మరీ? వెళ్ళాలనుకున్న ప్రయాణం సాగకపోతే అదో బెంగ, తప్పకుండా వెళ్ళిరా"

"మీరు చూస్తే ఇలా అంటున్నారు, మా వాళ్ళేమంటారో, మరి"

"ఏమీ అనరు. అంటే వద్దనరు"

"వద్దనకపోతే సరిటండీ, రమ్మనాలి గానీ?"

"అదేదో నువ్వు చూసుకో"

"చూస్తాను" అంది సరసమ్మ తల వూపుకుంటూ.

అని, మొగుడి మెడలో వున్న చేతులు తియ్యలేక తియ్యలేక తీసి, వాడిలోనుంచి లేవలేక లేవలేక లేచి, అడుగు ముందుకి వెయ్యలేక వెయ్యలేక వేసి – అంతతో ఆగిపోయి, గ్రీవాభిరామంగా వెనక్కి చూస్తూ – "వెళ్ళడం మాట మావాళ్ళే కదిపితే – ఏం?" అంటూ తల యెగరవేసుకుంటూ అడిగి, మాట్లాడలేక అతను మందహాసం చేసి వూరుకోగా – తానుగూడా చిరునవ్వు మొలిపించుకుని, అంతలో మూతి బిడాయించుకుని హాల్లోకి బయలుదేరింది, మెల్లిగా.

# 11

పరవశు డయిపోయాడు రామం, వొక్కక్షణం.

ఆ వొక్క క్షణానా ఈ యిరవై దినాలూ ఆమె చూపించిన విలాసం అంతా అతని కళ్ళ కట్టినట్టయింది.

వచ్చి కొద్ది దినాలే అయినా, యిదే తొలీమాటు రావడమున్నూ అయినా, యింటో మూడో వా ళ్ళెవళ్ళూ లేకపోవడంవల్లా, యౌవన వ్యగ్రతవల్లా వురకలు వేసుకు వచ్చే మహోత్సాహంతో ప్రణయ సాగరంలో వోలలాడిం చేస్తోందామె మరి, అతణ్ణి.

పాతికేళ్ళవాడు తాను; కాని పదిహేడేళ్ళ ఆడపిల్ల – అమ్మని విడిచి అట్టే రోజు లుండలేని ముద్దరాలు – ఆమె లేకపోతే నట్టిల్లు కారడవి అనుకునేటంతటి వెర్రివాడయి పోతున్నా డతను.

ఆఫీసులో యెలా వుంటాడో, యింటో వున్నంతసేపూ ఆమె నిర్వహణ లేకుండా యే పనీ సాగ దతనికి.

పొద్దుపొడవకుండా లేవడం అతనికి వ్రతం; కాని వెలుగు వస్తున్నప్పుడే మేలుకొలిపేస్తుందామె, అంతకి ముందే తాను దంతధావనాదికం ముగించుకుని.

స్నానం చేసేటప్పుడు "నీళ్ళు వేడిగా వున్నాయా, పాళాలుగా వున్నాయా?" అనడుగుతూ, అందుకోసం అన్నట్టు గదిలోకి వెళ్ళి వీపుతోమేసి చక్కావస్తుం దతనికి దినమ్మూ.

తల తుడుచుకుని అతను పంచె కట్టుకునేటప్పటికి, వేసలైనూ కొబ్బరినూనె కలిపి చేతులకు రాసుకుని వుండి, క్షణంలో తలదువ్వేసి రంగరించి చుక్కబొట్టు పెట్టేస్తుంది.

బీరువాలో వున్న షర్టుతీసి బొత్తాలు పెట్టి అందిస్తుంది.

బల్లదగ్గిర డబుల్ పేము కుర్చీలో యిరికి కూచుని "ఇంకాస్త" అని కొసురుతూ కాఫీ యిచ్చి "చాలండీ, చాలండీ" అంటూ తాను పుచ్చుకుంటుంది.

భోజనం దగ్గిర అతను ఏకపంక్తికి రమ్మంటే "ఎవరయినా వస్తారేమో బాబూ" అంటూ గునిసి గునిసి కూచుంటుంది. పదార్థాలన్నీ చేతికందేటట్టుంచుకుని.

ఏ ధోరణిలో నయినా వుండిపోయి అతను మరచిపోతే "ఇవాళ మీరు ముందు భోజనం చెయ్యండి" అంటూ జ్ఞాపకం చేసి, మళ్ళీ మళ్ళీ పిలిపించుకుని, వొక్కొక్కప్పుడతను లేచి వచ్చి పొదివి పట్టుకుని తనని కూచోపెట్టుకునేటట్టున్నా తక్కి తారి, "ఇలా అలవాటయిపోతే, యెవ రయినా వచ్చినప్పుడూ, యెక్కడికయినా వెళ్ళినప్పుడూ వొక్కొక్కళ్ళమే కూచుని భోజనం చెయ్యవలసివస్తే సయిస్తుందా?" అంటూనే కూచుని, పదార్థాలకంటే తియ్యని కబుర్లు చెబుతూ, కబుర్లకంటే కమ్మని పదార్థాలు వడ్డిస్తూ "మీరు గబగబా తినేస్తారు. నాచేతకాదు బాబూ" అని అతను మరికాస్తసేపు తన దగ్గిర కూచునేటట్టు చేసుకుని, మెల్లిగా భోజనం చేస్తుంది, బులిపించీ చూస్తూ.

అత నాఫీసు(డెస్సు వేసుకునేటప్పటి కొక్కొక్కటే తమలపాకుల చిలకలందిస్తుంది, తాను ఎదట నుంచుని.

వీధిగుమ్మందాకా వెంటవెళ్ళి, సైకిలెక్కి అతను వెడుతూవుంటే "మళ్ళీ రెండు దాటితే గాని కళ్ళబడరు" అనుకుంటూ దిగాలుపడి, అతను మళుపు తిరిగే దాకా అతృప్తనయనాలు చెంపకు చేరడేసి చేసుకుని చూసి, అక్కడ అతను వెనక్కి చూస్తూ మందహాసం చెయ్యగా పొంగిపోయి, లేడి పిల్లలాగ లోపలికి వెళ్ళిపోతుంది.

మళ్ళీ రెండున్నర అయిందంటే డికాషన్ తయారుచేసి, తమలపాకులు చుట్టీ, కోపాలూ సాసర్లూ, చెంచాలూ, వెండి పళ్లెమూ, మిఠాయో జిలేబీలో, మైసూరుపాకో - ఆ సీసా బల్లమీద పెట్టి వుంచీ, పాలగిన్నె కుంపటిమీద పడేసీ, అతను వచ్చి నూతికివెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కు వచ్చేటప్పటికి సిద్ధంగా వుండీ, పొద్దున్నలాగే ఫలహారం చేస్తూ, చేయిస్తుంది.

సాయంత్రం దీపాలు పెట్టాకగానీ ఆఫీసు విడిచిపెట్టడానికి వీలుపడ దతనికి.

అప్పటికి వంట చేసేస్తుందామె.

పట్టుచీర మడే కనక, గుమ్మందగ్గిర కెదురువెళ్ళి, టోపీ కోటూ, గుప్తంగా చేతిలో పెట్టే మనీపర్సూ అందుకుంటుంది.

ఏ కాలం అయినా అప్పుడు మళ్ళీ స్నానం చేస్తాడతను.

భోజనాలయిపోతాయి, యథాపూర్వంగా.

ఇలాగ ప్రతిపనికీ అతనికి చేదోడు అవుతుందామె.

పల్లెటూరి పిల్ల అయినా, నాగరికవిలాసాలన్నీ బాగా తెలుసు, ఆమెకి.

ముసిముసినవ్వులు నవ్వితే, తాంబూల రాగానిక్కూడా జీవకళ పుట్టించే సహజరక్తిమ గల ఆ పెదవులూ, విచ్చిన తామరపువ్వుమీద వాలిన జంట తుమ్మెదల్లాగ పచ్చని మొగానికి శోభగూర్చే కాటుక్కళ్ళూ, నల్లతాచులాగ వాలుజడా, గూడకట్టు - వీటితో, చికిలీచేసిన మన్మథ బాణంలాగ, ఆమె, యెదుట మసలుతూ వుంటే అతని కిక నిద్రాహారా లక్కరలేదు.

నాగరికత తెలుసునంటే బద్ధకం మనిషీ, రాయసం మనిషీ కాదామె.

ఇంటి ముసలావిడదగ్గిర రకరకాల పిండివంటలు చెయ్యడం నేర్చుకుంది.

శకుంతలా ముత్తుస్వామి దగ్గిర అరవ వంట లన్నీ నేర్చుకుంది.

ఆమె దగ్గిర పొదుపూ, దక్షతా కూడా నేర్చుకుంది.

కమ్మపిల్ల లాగ తాను పులుగడిగిన ముత్యంలా వుంటూ యిల్లు పరిశుభ్రంగా వుంచడం నేర్చుకుంది.

షట్కర్మయుక్త అయింది.

అలాంటి పిల్ల మహేంద్రవాడ వెళ్ళడం అంటే గుండె గుభేలుమందతనికి మొదట కాని; తన వుల్లాసంకంటే ఆమె మాతృప్రీతి గొప్పదని గుర్తించుకున్నాడతను.

కనక, ఆమెని పుట్టింటికి పంపకపోవడం రాక్షసకృత్యం అవుతుందని నిశ్చయించుకున్నాడు.

కాదు కూడదు, వల్ల కాదంటే యెదురు చెప్పదామె; కాని చిన్నబుచ్చుకుంటుంది.

లోపల్లోపల దిగాలు పడుతుంది.

మరి, ఆమె మునిగిపోయిన కలువపువ్వు అయిపోతే తనకేమి ఆనందమూ? కనక "పంపితీరాలి" అని దృఢపరుచుకున్నాడు –

ఇంతేకాదు –

"నరసు. తల్లిదండ్రులకు తన వుబలాటం సూచించలేకపోయినా, వారది కనిపెట్టలేక ఆమెని తీసుకు వెళ్ళాలనుకోకపోయినా, 'తీసుకు వెళ్ళి వారం దినా లట్టేపెట్టుకుని పంప' మని నేనే చెబుతా"నని కూడా నిరుకు చేసుకున్నాడు.

దాంతో మనస్సు తేలికపడిం దతనికి.

## 12

"అప్పుడు కంగా రవుతుంది" అంటూ తోలుపెట్టె సద్దుకుంటున్నాడు సోమసుందరం, వొక పొట్లం యెడంగా వుంచి.

"బజారుకి వెళ్ళాలి, మరిచిపోయారా?" అడుగుతోంది, రాజమ్మ.

"చిన్నన్నయ్యకి మహాయిష్టం నారింజపళ్ళంటే. బెంగుళూరులో దొరుకుతాయో లేదో, కొనుక్కువెళ్ళి పంపరాదుటండి?" అనడుగుతూ, సరిగా ఆ సమయాన గదిలో కాలు ఇవతల పెట్టింది, నరసమ్మ.

ఆమాటా ఈమాటా మొదలయినాయి.

తా నివతలికి వస్తే రంగు చెడిపోతుందనీ, పెళ్ళాం గడుసుమాటలు వినాలనీ – వుక్కగా వుండినా గదిలోనే వుండిపోయాడు రామం.

మొగుడు చూపించిన ఆదరంతో వుబలాటం రెట్టించగా, వావిడిచి చెప్పకుండా అది తల్లికీ తండ్రికీ సూచించడానికి పథకం ఆలోచిస్తూ అందుకుంది, నరసమ్మ.

"మళ్ళీ తొరగా రావాలి సుమండీ నాన్నారూ"

"వచ్చే సోమవారం తప్పకుండా వస్తానమ్మా"

"మీ నాన్నక జ్ఞాపకం లేకపోయినా, పని కూడా లేకపోయినా నేను పంపిస్తాను లేవే అమ్మాయీ"

"అవు నలా చెయ్యవే అమ్మా"

"ఆవేళ కోర్టులో పనివుంది, తప్పకుండా వస్తానమ్మా"

"సరే, యేదో వొక పనిమీద వచ్చి మీరు కనపడుతూనే వుంటారు; కాని అమ్మ యెన్నాళ్ళకి కనపడుతుందో మరి?"

"ఇక మునపటిలాగ అస్తమానూ అమ్మ కావాలంటే యెలాగ అమ్మాయీ? అలవాటు చేసుకో ఈపాటికి"

"అయితే, వాళ్ళ సుందరమ్మ యెలా కనపడుతుందే మరీ? పోనీ, వాళ్ళ అమ్మనీ నాన్ననీ నేను బతిమాలుకున్నానని చెప్పి, మీరు వచ్చొటప్పు డొకమాటు తీసుకురండీ నాన్నారూ దాన్ని"

"అలా చేస్తే బాగుండదమ్మా, శ్రావణందాకా వోపికపట్టు"

"అమ్మో! వుండలేనండీ"

"అలా అయితే యెలాగ తల్లీ? వచ్చినప్పుడల్లా మీ నాన్న చెబుతూనే వుంటారు కాదూ దాని కబుర్లు?"

"నీకేం చెబుతావు మాటలు; బుడిగావు పాలన్నీ నువ్వొక్కర్తివే తాగేస్తున్నావు కమ్మగా తోడుపెట్టుకుని. శ్రావణంలో నేను వచ్చాటప్పటికి ముమ్మరం తగ్గిపోతుంది, అంతా."

"సూరిగాడిచేత పంపిస్తూ వుంటానులే; నాలుగు దినాలకోమాటు"

"మల్లెపందిరి బాగా పూస్తోంది కామోసు. అంత పరిమళం యెక్కడా చూడలేదు. ఇక్కడ దొరికేవన్నీ కాకినాడ పువ్వులు, అక్కడ పొద్దున్న కొయ్యడంవల్ల బాగా యెదక్కా వాసనే వుండదు."

"ఎవరయినా మెయిలు బండికి వచ్చేవాళ్ళు కనబడితే పంపిస్తూ వుంటానులే నీకు"

"అసలే కొండమీద కట్టారీవూరు. దానికి సాయం యెండలు మండిపోతున్నాయి. మన వూళ్ళో అయితే, ఆ కొబ్బరి మొక్కలూ ఆ అరిటిచెట్లూ ఆ వేపచెట్టూ – చల్లగాలి చల్లదనమూ మన యింటోనే వుంటాయి."

"ఇక్కడి వాళ్ళకి మాత్రం చల్లగాలి లేకుండాపోయిందా యేమిటి? ఇంకో పది రోజులుపోతే నీకిక్కడే బాగుందనిపిస్తోంది, అలవాటయి."

"కాకపోయినా, మీదటి కీవూళ్ళో మెరుపు దీపాలూ పంకాలూ వస్తాయి. మీరిల్లుకట్టుకునేటప్పటికి తప్పకుండా వస్తాయి. సుఖం అంతా అప్పుడు మీదేనమ్మా!"

"మీదటి మాట చెబుతారు నాన్నారు, ఎప్పుడో ప–న్నెం–డు మాసాలనాటి గొడవ అది. దిక్కుమాలింది నాలుగుమైళ్ళుంది అనపర్తిస్టేషనుకూ మహేంద్రవాడకూను అన్నప్పుడూ బోయీలు దొరుకుతారా చేస్తారా? లేకపోతే తణుకోయి మాచవరంలాగ, ద్వారపూడిలో రెయిలు దిగి, జట్కా కుదుర్చుకుని, మండపేట వంతెనమీదనుంచి, మాచవరం రేవులోనుంచి, రాయవరంమీదుగా చుట్టు తిరిగి చేరుకోవాలి. అదీకాకపోతే పుచ్చినట్టు నడవాలి. మహేంద్రవాడలో స్టేషనుంటేనా, శనివారం రాత్రి కక్కడికి వచ్చి సోమవారం తెల్లవారాటప్పటికి కిక్కడికి వచ్చేస్తూ వుందును"

ఎవరో "యిప్పుడయితే యేమీ?"అన్నట్టయింది రాజమ్మకి, ఈమాటమీద.

గుబగుబలాడిపోయిందామె మనస్సు.

"ఏమండీ, రే పెలాగా సెలవే. ఇవాళ గూడ సెలవయింది కనక అమ్మాయినీ అల్లుణ్ణీ పొకమాటు మనవూరు తీసుకువెడితే యేమీ?"

"ఎ–లా–గా?" అనడుగుతూ నిటాగ్గా కూచున్నాడు, సోమసుందరం.

ఆమె మళ్ళీ చెప్పింది.

"ఈ వూహ నిన్న సాయంత్రమే తోస్తే యెంత బాగుండునూ?"

"మనం బయలుదేరామా యేమిటి నిన్న, తోచడానికీ, తోచకపోడానికీని?"

"..............."

"ఆలోచిస్తే కాదండీ, బండివేళ అవుతోంది, తొరగా తెమల్చాలి. ఇవాళ అయితే మాత్రం యేం మించిపోయిందీ, రెండు రాత్రు లుంటారు కదా అక్కడ?"

" "

"మాట్లాడ రేమండీ?"

తల్లి యిలా అనేటప్పటికి, తన కోరిక నెరవేరడమే కాదు, మొగుడున్నూ వస్తూవుండడం గుర్తించి యెంతో మురిసిపోయింది నరసమ్మ, మొగం పక్కకి తిప్పుకుని.

పెళ్ళాం యుక్తి కెంతో సంబరపడ్డాడు, గదిలో పడుకునివున్న రామం.

"అత్తగా రందుకున్నా రిక ప్రయాణం తప్పదు. ఋడిగావు పాలూ పెరుగూ మనకున్నూ దొరికాయన్నమాటే" అంటూ పొంగిపోయాడతను.

## 13

"అలా వూరుకుంటా రేమండీ? ఈ మాట రామంతో చెప్పండీ!

ఎల్లుండి జాముపొద్దెక్కేటప్పటికీ వచ్చేస్తారు మళ్ళీ లక్షణంగా" అంటూ మళ్ళీ తొందరపెట్టింది రాజమ్మ, తాను కంగారే పడిపోతూ.

"ఏమంటావు తల్లీ?" అనడిగాడు కూతుర్ని అతను.

"పడే" అంటూ విసుక్కుంది రాజమ్మ, దానిమీద.

నరసమ్మ యిక అక్కడ వుండలేకపోయింది.

ఉరకలు వేసుకువచ్చేస్తోంది నవ్వు, క్షణం వుంటే బయటపడిపోతుంది మరి, మెరుపులాగ.

అంచేత "యేమో, మీ యిష్టమూ వారి యిష్టమూనూ" అంటూ పెరట్లోకి చక్కాపోయింది, గుమ్మం దాటాక మాత్రం కులికిపోతూ.

"లేవ రేమండీ? ఇల్లంతా సర్దుకోవాలి కూడానూ యింకా. మీకేం, లేడికి లేచిందే ప్రయాణం"

"రామం - యేమంటాడో?"

"బాగుంది. ఎందాకణ్ణుంచీ చెప్పిందంతా–"

"అదికాదు–"

"ఇదీ కాదు. మీకు సందేహం అయితే నేను కనుక్కుంటాను చూసుకోండి, క్షణంలో"

ఇలా అంటూ వొక్క దూకు దూకిందామె గదిలోకి.

"ఒక్కమాటు లే నాయనా, రామం" అందికూడా ఆత్రంకొద్దీ.

ఇదంతా వింటూనే వున్న రామం, తాను గాఢనిద్రలో వుండినట్టూ, ఆమె పిలుపుతో మెలుకువ వచ్చి నట్టూ లేచి కూచుని, కళ్ళుబాగా నులుముకోసాగాడు, మొగంవంచుకుని.

"రామం!"

"ఆ, యెందుకండీ?"

నవ్వాపుకోడమూ, నిద్రబద్ధకం కనపరచడమూ చాలా కష్టంగానే వున్నా యతనికి. కంఠమున్నూ నిద్రాకషాయితంగా చూపించవలసివచ్చింది, పైగా.

"రామం" అంటూ మళ్ళీ పలకరించింది రాజమ్మ, ఆత్రంతో కుదిసిపోతూ.

"ఆ, వింటున్నా నండీ."

"నువ్వూ మా అమ్మాయీ కూడా మాతో మహేంద్రవాడ రావా లిప్పుడు, లే"

"అదేమీ టండీ?"

"రే పెలాగా సెలవే కదా? ఇవాళ కూడా సెలవయింది మరి. తోచింది కాదు, నిన్న సాయంత్రమే వెళ్ళవలసింది, అసలు మనం"

"మొన్ననే కాదుటండీ, మీ అమ్మాయి వచ్చిందక్కణ్ణుంచి?"

"మళ్ళీ సోమవారం వచ్చెయ్యరూ, పొద్దుటి బండిమీద?"

"రావడాని క్కాదు–"

"చిన్నపిల్ల కాదూ మా చిట్టితల్లి? ఇంకో యేడాదిపోతే విడిచి వుండడం దానికీ మాకూ కూడా అలవాటయిపోతుంది, లే, లే"

"నిజమే గానీ–"

"ఇంకెందుకూ కానీ గీనీ? సమయానికి మేమిక్కణ్ణుంచి వెడుతున్నాం కనక యిలా తోచింది. మరి మాట్టాడకు, సర్దుకో."

"నౌకరీకి కుదిరాక యిష్టంవచ్చినప్పుడల్లా–"

"సర్కారయితే మాత్రం సెలవల్లో కూడా పనిచెయ్య మంటారా యేమిచోయ్, ముష్టి డబ్బయి రూపాయి లిస్తున్నారు, మహా?"

"సోమవారం తెల్లవారాటప్పటి కిక్కడ–"

"తప్పకుండా వచ్చేస్తురుగాని, బోయీలు సిద్ధంగానే వుంటారు. లేకపోతే రాయవరంనుంచి జట్కా పిలిపించి దిక్కవోలు స్టేషనుకి పంపేస్తాను, సరా?"

"తీరా, అక్కడికి వెళ్ళాక మీ అమ్మాయిని–"

"ఎందుకూ? శ్రావణం దొర్లబడగానే వచ్చి వినాయకుని చవితి వెళ్ళేదాకా వుంటుంది కాదూ, మహేంద్రవాడలో?"

"మళ్ళీ సుబ్బారాయుడు షష్ఠికి వచ్చి, సంకురాత్రి వెళ్ళేదాకా యెలాగా వుంటుందాయె. ఎల్లుండి తప్పకుండా పంపేస్తాను, నీతో"

"మీ అమ్మాయి–"

"అది రావంటుందా యేమిటి? నువ్వు లేస్తూ"

మొగం వంచుకుని వున్నాడు కనక, యెన్ని ప్రశ్నలయినా వెయ్యగలిగాడు రామం, మొగమాటపడకుండా.

అతను తనకేసి చూడ్డం లేదు. కనక, రాజమ్మ కూడా ఝూంకారంగా మాటడగలిగింది, చేతులూ కళ్ళూ తిప్పుకుంటూ.

"ఇప్పుడెందు కండీ మామగారూ?" అనడుగుతూ చివరి కివతలికి వచ్చాడు, రామం.

సోమసుందరానిక్కూడా యిందులో సబబున్నట్టు తోచిం దప్పటికి.

"ఇప్పుడెందుకూ అంటే? యిది వాత్సల్యానికీ, మమకారానికీ సంబంధించిన విషయం" అన్నాడతను.

"నీకూ ఆడపిల్ల పుట్టాక తెలుస్తుందిది" అంది, రాజమ్మ, తల యెగరవేసుకుంటూ.

"తెలిసిందా? మీ అత్తగారన్నదాల్లో యేమీ తేడా లేదు, మరి లే త్వరగా" అన్నాడు సోమసుందరం, మరి మాట్టాడ కన్నట్టు చూస్తూనూ, పక్కగా వుంచిన పొట్లం పెట్టెలో సద్దుకుంటూనూ.

ఆలోచిస్తున్నట్టు మొగం పక్కకి తిప్పుకున్నాడు రామం, ముందు.

"రిజిస్ట్రారుగారితో చెప్పిరావాలి, మరి" అంటూ మొగం కడుక్కోడానికని వంకపెట్టి పెరట్లోకి బయలుదేరాడు, తరవాత.

కరివేపచెట్టుకింద నుంచుని వుంది నరసమ్మ, చెవులోర చేసుకునీ, వొక కరివేపరెమ్మ తెంపి తుంచి పోస్తూనూ.

ఇద్దరూ నవ్వుకున్నారు వూగిపోతూ, సంవృతాస్యంగా.

"ఏమన్నారు మావాళ్ళు?" అనడిగింది నరసమ్మ, అలుగోజా స్వరంతో.

"మీ అమ్మనీ మీ నాన్నారినీ కూడా బుట్టలో పెట్టేశా వింకా యేమన్నారంటా వెందుకూ?" అని యెదురడిగాడు రామం, అలాగే.

"నిజం చెప్పండీ!"

"మీ అమ్మగా రందుకున్నాక మీ నాన్నా రేమన గలుగుతారు? నేను మాత్రం యేమనగలుగుతాను? పద పద, యిల్లు సద్దు తొరగా"

హాల్లో అయాచితంగా తమకీలాగ యేకాంత స్థితి తటస్థించగా "అయినా పది రూపాయల జామారూ యిక్కడివ్వడం యెందుకూ, అక్కడే కట్టబెడదాం అతనికి, ముంతెడునీళ్లూ పోసి" అంది రాజమ్మ కంఠం నొక్కుకుని.

"ఇదిగో చూసుకో" అన్నట్టు పెట్టె తెరచి పొట్లం చూపించాడు సోమసుందరం.

రామం సైకిలెక్కి వెళ్ళిపోయాడు.

"రావే అమ్మాయీ, యిల్లు సద్దుకుందాం" అంటూ లోపలికి బయలుదేరింది రాజమ్మ.

గదిలో దాచడానికి తల్లి బిందెలూ గిన్నెలూ తెస్తూ వుండగా, వెండి చెంబులూ కంచమూ తాను తెస్తూ "సోమవారం పొద్దున్న తప్పకుండా పంపాలి సుమా – నన్ను కూడా" అంది నరసమ్మ, కళ్ళు తిప్పుకుంటూ.

## 14

రాత్రి నరసమ్మ వచ్చినట్టు తెల్లవారే టప్పటికాయీాడు పిల్లలందరికీ తెలిసిపోయింది, మహేంద్రవాడలో.

"ఒసే నరసమ్మ వదినా" అంటూ కేక వేసింది సోదెమ్మ, చెరువునుంచి యింటికి వెడుతూ వచ్చి, ముందు.

"హోహోయ్ రాజమహేంద్రవరం పిల్లా, యీపాటికి లేచిరావో" అంటూ పిలిచింది, ఆమె వెనకనే హాల్లోకి వచ్చిన గున్నమ్మ.

"నరసమ్మ వచ్చిందిట, నిజమేటర్రా?" అనడిగింది వీధిలోనే నుంచుని రమణ, వారిని.

"నరసమ్మ లేచిందిటే?" అని రమణ నడుగుతూనే యింటికి వెళ్ళి పోయింది సూర్యకాంతం, తడిబట్ట కాళ్ళు కడ్డుపడకుండా సద్దుకుంటూ.

ఇదంతా విని, గభీ మని హాల్లోకి వచ్చి "మొగుడున్నా" డంది రాజమ్మ మెల్లిగా, మాట్లాడ వద్దన్నట్టు చేసన్న చేస్తూ.

దానిమీద "ఇంకేం? చద్దన్నాలవేళే యిక లేవడం" అంటూ చక్కాపోయారు సోదెమ్మా గున్నమ్మానూ, కిల కిల్లాడుతూనూ చెయ్యి పట్టుకుని యిద్దరూ కలిసి రమణని లాక్కుపోతూనూ.

ఆ మాటకి బదులుచెబుదామని మేలుకునే వున్న నరసమ్మ వూచలాగ యివతలికి వచ్చింది కాని; అప్పటి కప్పుడే ఆ పిల్లలు మళుపు తిరిగేశారు.

వెలుగు వస్తూ వస్తూ వుండప్పటికి.

కర్మిష్ఠులూ వితంతువులూ చెంబులు తోముకుంటూ చెరువుకి వెళ్ళేవారు వెడుతూ వుండగా, స్నానాలుచేసి యిళ్ళకి వెళ్ళేవారున్నూ వెడుతూన్నా రప్పటికప్పుడే.

అది చూసి "యీ వూరి నూరిళ్ళ బ్రాహ్మణ్యంలోనూ ఆడా మొగా అంతా కూడా పొద్దు పొడవకుండానే దంతధావనం చేసుకుంటారు, లేవండి" అంటూ మొగుణ్ణి కుదిపేసింది నరసమ్మ, కంగారుపడి పోతూ లోపలికి వెళ్ళి.

రామం లేవడమూ, కాల్యాలు కానిచ్చేసుకోడమూ, యింటిమంగలి సంతనాగా తల అంటటమూ వరాసగా జరిగిపోయాయి.

ఇవన్నీ ముగిశాటప్పటికి వుపమా కాఫీ తయారుచేసి "యిద్దరూ పుచ్చుకోండి"అంటూ పడకటింటి వసారాలో పెట్టేసి చక్కావచ్చింది, రాజమ్మ.

వారిద్దరూ వుపమాపళ్ళెం కాళీ చేశాటప్పటికి "లాజమ్మత్తా, పెలుగివ్వవూ?" అనడుగుతూ పొరుగింటి పిల్ల సుందరమ్మ వచ్చింది.

"ఇలా తీసుకురా ఆ అమ్మాయి" నన్నాడు రామం, కాఫీ పాళాలు చేసుకుంటూ.

"పాట పాడితే గాని పెరుగివ్వం" అంది నరసమ్మ, విరగబడి చూస్తూ.

"నువ్వెప్పులు వచ్చావే నలసమ్మ వొదినా?" అనడుగుతూ వొక్కదూకు దూకింది గాని; రామాన్ని చూసి బెదరిపోయి నిలిచిపోయింది సుందరమ్మ.

"రా, రా, మీ అన్నయ్యేగా?" అనడుగుతూ వచ్చి యెత్తుకు తీసుకువెళ్ళి "వుపమా అయిపోయిందేమరీ" అంటూ కాఫీ యిచ్చిందామెకి నరసమ్మ.

సహజంగా అది వేసవి కావడంవల్లా, అప్పుడే స్నానాలు చేసి వుండడం వల్లా, వేడి వేడి కాఫీ కూడా పుచ్చుకుని వుండడం వల్లా ముచ్చెమటలూ పోశాయి, ముగ్గురికీ.

రామం నరసమ్మకీ, నరసమ్మ రామానికీ విసరడంలో, ఎడతెగకుండా గాలి తగలడంవల్ల సుందరమ్మకి ముందు ఆరిపోయింది చెమట.

"పాట పాడించు" అన్నాడు రామం.

"పాడవే" అంది నరసమ్మ.

అవ్యధానంగా మొదలుపెట్టేసింది సుందరమ్మ పాట, మొగం వంచుకుని.

పల్లవి ముగించింది, అనుపల్లవి అందుకుంది,

కంఠం యింకా సాపు కాలేదు.

కళ్ళు తిప్పకోడం చూడమని రామానికి సన్న చేస్తోంది, నరసమ్మ.

సరిగా అలాంటప్పు డయిదారుగురు యువతులు వచ్చి, పిలుపుమీద పిలుపు పిలిచారు, ముద్దినుసువరసలూ పెట్టి.

చకితుడై చూశాడు రామం; కాని "వస్తానుండండే" అన్నట్లు కళ్ళు చికిలించి అంతకిముందే హాల్లో వాలింది నరసమ్మ.

తాను కూడా వచ్చేసి, పెరుగు పుచ్చుకుని వెళ్ళిపోయింది, సుందరమ్మ.

ఆ రావడం రావడం పదిన్నర దాకా చెలికత్తెలతోటే వుండిపోవలసి వచ్చింది నరసమ్మకి.

ఆ రెండు మూడు గంటలూ మతిపోయినవాడిలాగ గదికీ వసారాకీ మధ్య తిరుగుతూ వుండిపోయాడు రామం.

కార్యం కాకమును పెప్పుడయినా వస్తే, కాఫీ పుచ్చుకోడం తడవుగా వూళ్ళోకి బయలుదేరేవా డతను.

అతనికీ వున్నారు ప్రాణం యిచ్చే స్నేహితు లావూళ్ళో,

కనక, అప్పుడున్నూ అలా చేద్దా మనుకుంటూనే వచ్చాడు కాని; నరసమ్మ క్షణంలోనో క్షణంలోనో వస్తుందనుకుంటూ కదల్లేకపోయాడు.

యువతుల కార్యక్రమం యెప్పటికీ పూర్తి అయేటట్టు లేకపోయింది హాల్లో.

వారి గోష్ఠి వినబడుతూనూ వుంది, హృదయంగమంగానూ వుంది కాని; నరసమ్మ సాన్నిధ్యంలాగ వుత్తేజకం మాత్రం కాలేక పోయిం దతనికి.

"భోజనానికి లెమ్మని" సోమసుందరం పిలవ్వలసి వచ్చింది, చూసిచూసి.

కాళ్ళు కడుక్కోడానికి రాజమ్మ యివ్వవలసి వచ్చింది, చెంబుతో నీళ్ళు.

పట్టుతాపితా స్వయంగా అందుకోవలసి వచ్చిం దతనికి.

మొత్తానికి, చెయ్యి తుడుచుకుంటూ వచ్చి "భోజనానికి వెళ్ళు తల్లీ" అంటూ సోమసుందరం అనేదాకా యెవరూ కదల్లేదు.

అప్పుడయినా "వెళ్ళు, వెళ్ళు, గోరుముద్దలు తినిపించడాని క్కనిపెట్టుకుంది రాజమ్మత్త" అంటూ చెయ్యిపట్టుకుని యింటోకి పంపుతున్నట్టు నటిస్తూ తనకేసిలాక్కుంది జగ్గమ్మ, నరసమ్మని.

"ఏకపంక్తి లేకుండా చేశాం మేము, మనసులో వుంచుకోకేం"అంది సూర్యకాంతం, గడ్డం పట్టుకుని.

"బావగారికి కడుపు నిండిందో లేదో పాపం, మళ్ళీ నీ కంచంలో కూచోబెట్టుకోవే అక్కా" అంది రమణ, పడకటింటికేసి చూస్తూ.

"తల్లి వండేది వండుతూ వుండగానే తినేసి వుంటుందిది, లేకపోతే యింతసేపు కూచునివుండునా యేమిటే మనతోనూ" అంది చుక్కమ్మ, చేతులు తిప్పకుంటూ.

"అన్నయ్య క్కోపం వచ్చివుంటుంది మామీద, కాస్త సద్దిచెబుతావు కదూ?" అనడిగింది విశాలాక్షి, తల అడ్డంగా వూపుకుంటూ.

ఇంకా యేమిటేమిటో అంటూనే వెళ్ళిపోయారు వారందరూ కిల కిల్లాడుతూ.

అప్పుడయినా వచ్చి "భోజనం అయిందా?" అనడుగుతుం దనుకున్నాడు రామం.

తన అసహాయత చెప్పుకోడాని కయినా వస్తుం దనుకున్నాడు కాని; అక్కణ్ణుంచి తిన్నగా పడమటింటోకి పుడాయించింది, నరసమ్మ.

"తాంబూలం యిచ్చి రావే, పాపం" అంది రాజమ్మ; కాని బుంగమూతి పెట్టుకుని ముందు తల అడ్డంగా వూపుకుంది నరసమ్మ.

"ఆకలి దహించేస్తోంది బాబూ, అన్నం తింటేగాని నావల్లకా"దంటూనే పీటమీద కూచుని కంచంలో చెయ్యి పెట్టేసింది, తరవాత.

"అదేమిటే" అంది రాజమ్మ, తెల్లబోయి.

"అమ్మా! ఈ పూట – కొత్తావకాయలోకి – నాకు కాస్త వెన్నపూస వెయ్యవుటే?" అంటూ గునిసింది, ఆ మాటమీద నరసమ్మ.

## 15

ఏడున్నరకి విడిపోయిన ఆ దంపతులు, పదకొండు దాటాకగాని మళ్ళీ కలుసుకోలేకపోయారు.

రాజమహేంద్రవరంలో రామాని కిది నిత్యపరిపాటే కాని; యిక్కడ మాత్రం దుర్భరం అయిపోయింది.

అరగంట అయితే అతను గుర్తించలేక పోయివుండును, గంట అయితే లెక్కచేయకపోవును, రెండుగంట లయినా యేదో విధంగా సమాధానపడి వూరుకుండును కాని; మూడయినా కాదు, నాలుగు గంటల కాలం – తహ తహ లాడిపోయా డతడు.

పోనీ, తల్లితో నరసమ్మ యెవరి యింటికయినా పేరంటానికి వెళ్ళివుందేమో అంటే, ఆమె మాటలూ, సాగదీసుకోడాలూ, ఛలోక్తులూ, బుకాయింపులూ వినపడుతూనే వున్నాయి – చూస్తే కనపడుతుంది కూడా.

తొంగిచూస్తూ కళ్ళతో మాట్లాడవచ్చు, యెదటబడి పలకరించినా పలకరించ వచ్చు.

వచ్చివున్న ఆడపిల్ల లయినా యెరిగి వుండినవాళ్ళుగాని కొత్తవాళ్ళు కారు తనకి.

పైపెచ్చు, కొందరు తననే పలకరిస్తారు, కొందరిని తానే పలకరించవచ్చు, నిస్సంకోచంగా.

కొందరు పరియాచకా లాడినా, కొందరు కుశల ప్రశ్న లడుగుతారు "వచ్చికూచో"మంటూ పక్కగావున్న కవాచీబల్లే చూపిస్తారు మరికొందరు.

అదంతా యెంతో వుల్లాసమున్నూ కలిగిస్తుంది కాని; సహించలేక లోపలే వుండిపోయా డతను, తల్లకిందులయిపోతూ.

"ఏకాంత వాస శిక్ష" అనుకున్నా డత నిది. అయితే, యువతులు విధించారా, నరసమ్మ విధించిందా, తనకు తానే విధించుకున్నదా అన్నది మాత్రం నిరుకు చేసుకోలేకపోయాడు.

ఉండుండి, యిది పల్లెటూరి లక్షణం అనుకున్నాడు, ముందు దృఢంగా.

కాదు కాదు, తానూ పల్లెటూరివాడే మరి, యిది మహేంద్రవాడ పద్ధతి అనుకున్నాడు, చివరికి.

కనక "ఇంకెప్పుడూ నరసమ్మ వున్నప్పుడు మహేంద్రవాడ రాకూడ"దనుకున్నాడు గాని; "వుండగలవా?" అంటూ నిలవదీసింది బుద్ధి.

"నాలుగు గంట లుండలేకపోయావు ఆమెని చూడకుండా వున్న యింటో, పొరుగూళ్ళో వుండగలవేం మాసాలకొద్దీ ముందుముందు?" అంటూ యెవరో డెకారించినట్టైనన్నా అయింది.

పైగా, రెయిలుకి నాలుగు మైళ్ళ దూరాన వుందేగాని, ఆ వూరు అచ్చంగా నందనవనం.

అరటితోటలు, చెరుకుతోటలు, బత్తాయితోటలు, సన్న వరి పండే సుక్షేత్రాలు. ఎక్కడ చూసినా కొబ్బరిచెట్లు, చుట్టూ గోదావరి కాలవలు, వూరిమధ్య దేవాలయాల నానుకుని చక్కని చెరువు–నీటితో శాంతి, దానికి భంజకం కాని వుల్లాసం – నిగ్రహం, దానికి అభ్యంతరం కలిగించని ఉత్సాహం – హద్దులేని విద్యలు – వాటికి వెలుగు తెచ్చే శమదమాలు – నిజంగా ఋషివాటికలా లేదూ ఆ వూరూ?

ఎవరి హద్దులో వారుంటూ యువతీయువకు లావూళ్లో వున్నంత కలిసి కట్టుగా మరే వూళ్ళో వున్నారు?

సభ్యత గుర్తించుకుని మసులుకోగలవారికి, సార్థకనామం అయి ఆ వూరు కలిగించే మధురానుభూతి మరచిపోడం శక్యమా?

దీంతో నరసమ్మేకాదు, తనకున్నూ ఆత్మీయత కనపడిం దావూళ్ళో అతనికెంతో.

ఈ స్థితిలో అడుగుపెట్టింది గదిలో, నరసమ్మ.

గోడకేసి తిరిగి చూస్తూనే పడుకుని వున్నాడేమో, పొద్దు గుంకాక వున్నట్టుండిన గదిలో, సూర్యోదయం అయినట్టు మళ్ళీ వెలుగు రావటం చూసి ఆమెరాక గుర్తించేశా డతను.

అంతసేపు విడిచివుండిన వ్యధ యెలా తీరుతుందో అతనికి తెలుసు. అయినా, గాలి చాలక వుక్కబోస్తూ చిరాకుగా వుండినా, అంతసేపటికి వచ్చి ఆమె యేమి చేస్తుందో చూద్దామని కళ్లు మూసేసుకున్నాడు, గాఢనిద్ర నటిస్తూ.

పాపం, నరసమ్మ లోటు లేదు.

బహిరంగంగా చెలికత్తెలతో వుల్లాసంగానే గడపగలిగింది కాని; అతని లాగే అయిపోయింది ఆమె కూడా అంతరంగికంగా.

పెళ్ళిలో తెర అవతల పీటమీద అతనూ, యివతల బుట్టలో తానూ అయినట్టు, ఇప్పటిదాకా, గోడ అవతల గదిలో అతనూ, ఇవతల హాల్లో తానూ అయి – ఎప్పుడు చూసుకుందామా అని, అప్పుడయితే యెప్పుడు మాట్లాడుకుంటామా అని యిప్పుడయి, గుటకలు మింగుతూనే వుండిపోయిందామె.

అంచేత, చెలికత్తెలకోసం విడిపోడం చాలక కొంతసేపయాక, తన భోజనంకోసం మళ్ళీ మరోమాటు విడిపోడం సహించలేక, ఆ బిగినే – చెలికత్తెలు విడిచిపెట్టడం తడవుగా పడమటింటోకి వెళ్ళిపోయిందామె.

పోనీ అంటే, భోజనం, సయించిందా అతనికి?

"అదేమే, నాలుగు మెతుకులయినా తినలేకపోతున్నావూ?" అంటూ యెన్ని మాట్లడగలేదు; తల్లి తనని?

కోరి వేయించుకున్న, నాటి వెన్నపూస యెంత రుచి హీనం అయిపోలేదు, తనకి?

తనకిష్టంగదా అని పెరుగు మానివేసి తల్లి తొరకతో పాలు వడ్డించగా, రెండు ముద్దలు తినిన్నీ "పప్పు వడ్డించవేమే?" అనడగలేదూ తాను?

ఏం?

తన కాకలి లేకపోయిందా, తల్లికి వంట చేతకాదా?

అదేమీ కాదు.

ఇది మధురానుభూతేగాని అవతల రాజయోగం భంగపడిపోయింది.

దాంతో, బ్రహ్మానందానుభూతి దూరం అయిపోయింది.

అయితే?

మనసు మనసులో లేదు.

కనక?

వెళ్ళాలి.

రామం హొడిలో వాలాలి.

అతని చేతుల్లో కరిగిపోవాలి.

ఈ చూపుతో ఆమె అన్నం తిన్నాననిపించుకుంది.

ఈ కాంక్షతో బయలుదేరింది,.

ఈ తపనతో అడుగుపెట్టింది గదిలో.

ఇంతా చేస్తే అతనలా వున్నాడు.

తుళ్లిపడిందొక్కమాటు, ఆమె.

"నిద్రా?" అనుకుంది, పరకాయించి.

"కాదు, అసంభవం" అనిపించింది, ఆ వాలకం.

అప్పుడే కరిగిపోసిన బంగరు కణికమీద పూతలాగ తన రాకతో, ఆపాదమస్తకమూ అతని మేన మహోల్లాసం వురకలు వేస్తోంది, మరి.

అది గుర్తించి, తల పంకించుకుందామె.

దగ్గిరికి వెళ్ళింది, మెల్లిగా.

మీద చెయ్యి వేసింది, మృదువుగా,

వోస్, తెలిసిపోయింది, స్పష్టంగా.

అయినా, నిదానించింది.

సద్దిచెప్పుకోవలసిన తన బాధ్యతా గుర్తించుకుంది.

మనస్సు చమత్కృతం అయింది, అంతలో.

మళ్ళీ తల పంకించుకుంది, అధరం కరుచుకుంటూ.

చెవిలో నోరు పెట్టి పిలిచింది, సన్నగా.

కదిపింది, సుతారంగా.

అయినా, గుట్టుగానే వుండిపోయా డతను.

గమ్మత్తు చెయ్యాలనిపించిందామెకి, దాంతో.

నిటాగా నుంచుని ఆలోచించింది.

చూసింది, చురుగ్గా.
ఆవేశం తెచ్చుకుంది, కావలసినంతా.
ఊపిరి బిగపట్టుకుంది, చలించిపోతూ.
గిలిగింతలు పెట్టేసింది, విడవకుండా.
త్రుళ్ళిపడ్డాడు పాపం, అతను.
ఆమె మరో రాకడ వస్తుందనుకున్నా డతను.
దానికి పై యెత్తూ ఆలోచించుకుని వున్నాడు.
అది లేకపోగా యిది దిగ్భ్రమ కలిగించింది.
చేసేది లేక కిలకిల్లాడుతూ యెగిసికూచున్నా డతను.
కలకల్లాడుతూ గభీమని పొదువుకుందామె, పడిపోకుండా అతణ్ణి.

# 16

"కోపం వచ్చిందా?" అనడిగిందతణ్ణి నరసమ్మ, బుజ్జగిస్తూనూ, కింద నుంచునేవుండి రెండు చేతులూ పట్టుకునీని.

"నువ్వింతసేపు నన్ను విడిచిపెట్టేస్తే రాదా యేమిటి?" అని ముదలకించా డతను, బుంగమూతి పెట్టుకుని.

"వాళ్ళంతా వచ్చి చుట్టుక్కూచుంటే యేమి చెయ్యను చెప్పండీ మరీ?"

"ఏదో వంక పన్ని పంపెయ్యాలండీ క్షణంలో"

"నోరుజారి అలాంటి మాట వచ్చిందంటే యింక బతగ్గలనా వాళ్ళతో?"

"కొడతారా యేమిటి?"

"కొట్టినంత పని చేస్తారు"

"........."

"ఆ మాటకి వస్తే కొడితేనే నయం, సూదులకంటే చురుకయిన మాట లంటారు"

"............"

"కొడతారా అంటే, పొద్దున్న తాను వచ్చాటప్పటికి లేచి వుండనందుకు బుగ్గలు చిదిమి చేతిలో పెట్టింది బుచ్చమ్మత్తగారి సోదెమ్మ"

"వాళ్ళ మొగుళ్ళెక్కడో దూరంగా వున్నారు కనక."

"ఇక్కడే వున్నా రండోయి, వాళ్ళలో యిద్దరికి, మీలాగే నిన్నరాత్రికే వచ్చారు వారూనూ, తొమ్మిది దాటాక.

"అయినా నన్ను చూడకుండా వుండలేక–"

"ఇంకాస్త సేపుండే వస్తేం?"

"వాళ్ళ మొగుళ్ళిలా అడగలేకపోయారు కామోసు."

"కాకపోయినా, వాళ్ళ ధర్మమా అంటూ యిక్కడికే వచ్చారు, నన్నే అక్కడికి రమ్మంటే యెలా వుండునో ఆలోచించుకున్నారా, పోనీ?"

"మీ అమ్మే చేరదీస్తున్నారు వాళ్ళని, వచ్చినప్పుడల్లా ఫలహారాలు పెట్టీ, కాఫీలిచ్చీని"

"ఇందాకా యేమి పెట్టిందండీ పాపం?"

"నే నెన్నోమాట్లు చూశాను. పొద్దున్న పెట్టలేదనుకో, మధ్యాహ్నం అదో అలవాటు, ఆవిడకు"

"జ్ఞానం వచ్చిన అంతమంది ఆడపిల్లలను వుసూరుమంటూ వాకిట్లో కూచోపెట్టి, రహస్యంగా కలకండ పలుకయినా నోట్లో వేసుకోలేదు సుమండీ మా అమ్మ"

"మీ నాన్నారితో చెప్పాలి, యీ పద్ధతి మాన్పించమని"

"అయ్యో, రామ! ఆయన పురమాయింపే యిది"

"ఐతే, నే నింకెప్పుడూ మహేంద్రవాడ రాకూడదు"

"ఇంతమాత్రానికే?"

"ఓమాత్రం అయినదా యిది? నాకా – యిక్కడ పనిలేకపోయె. నువ్వా, ఆశమ్మ బోశమ్మ కథుర్లు చెపుతూ చెలికత్తెలతో కూచుంటుంటావాయె. పోనీ అంటే, పాలమో రామచంద్రపురమో వెళ్ళి కూచుంటారు, మీ నాన్నారు"

"మా నాన్నారితో కణుగూ పెణుగూ మాట్లాడం యెప్పుడయినా వుంది కామోసు పాపం, మీకు"

"పెద్దలు కదా అని –"

"ఇదే కామోసు పెద్దరికం మన్నించడం?"

"ఏమయినా, కాలక్షేపం కావాలంటే, నాతిగల బ్రహ్మచారులను వెతుక్కుంటూ యిక వూరమ్మట బయలుదేరాలి కదా నేను, ఇక్కడికి వచ్చిన సుఖం యేమిటీ మరీ?"

"ఉండండి, ఆ మాటమీద –"

"ఓ, ఉంటాను, ఉన్నానుకూడా"

"ఇక్కడ నేను చెలికత్తెలతో కూచుంటా నన్నారు. అక్కడ మీరు ఆఫీసులో కూచోరూ?"

"..............."

"నేనే నయం, కళ్ళకి కనపడుతూనే వుంటాను. మా మాటలూ వినబడుతూనే వుంటాయి మీకు, నాకేంవుందీ అక్కడా? ఏ ఇరుగమ్మో పొరుగమ్మో వస్తేతప్ప. లేకపోతే గుడిపాములాగ వుసూరుమంటూ పడివుండవలసిందే కదా నేను?"

"............"

"అయినా, దీపాలు పెడితేగాని సాధారణంగా యింటికి రారుగా మీరు?"

"................"

"రెండో ఆటకేగాని, మొదటి ఆట కెప్పుడయినా వెళ్ళగలిగామా సినిమాకి మనం?"

"..............."

"మాట్లాడరేమండీ?"

"నోరు కుట్టేశావు కాదుటోయ్ నువ్వు?"

"అయితే, తమలపాకు చిలక ముక్కులతో కుట్లు విప్పేస్తా నుండండి"

ఇద్దరూ రాజీపడ్డారు.

రామం మంచం దిగివచ్చి కుర్చీలో కూచున్నాడు.

తాంబూలప్పళ్లెం పట్టుకున్న యెడమచెయ్యి అతని మెడకి చుట్టవేసి, వొడిలో కూచుంది నరసమ్మ.

అబగా చూసుకుంటూ, వూర్ధ్వశ్వాసతో మొగాన మొగం వుంచి యేమిటేమిటో అనుకుంటూ, నవ్వుకుంటూ తుళ్ళుకుంటూ తాంబూలం వేసుకున్నారు, వారిద్దరూ.

ఇక లేస్తుంది నరసమ్మ, అలాంటప్పుడు "వొసేరాజా, నరసమ్మని తీసుకువచ్చావుట కాదూ?" అంటూ వొకమాట వినవచ్చింది హోల్లో.

"మళ్ళీ మొదలు" అన్నాడు రామం నిరాశతో చేతులు దులుపుకుంటూ.

"నేనంటే ప్రాణం యిస్తుంది మా లచ్చమ్మత్త, వెళ్ళి కనపడకపోతే బాగుండదు. నాలుగు మాటలు చెప్పి, మరిపించి, అయిదు నిమిషాల్లో వచ్చేస్తాను. అసలు మా అమ్మా ఆవిడా మాటలందుకున్నారంటే. యిక యేది యేమయినా వాళ్ళకి తెలియదు" అంటూ లేచి, "మళ్ళీ కోప్పడకండేం?" అంటూ గడ్డం పట్టుకుని, "అలా వుంటారు మీరు ఏం?" అంటున్నట్టు కళ్ళు తిప్పుకుంటూ హోల్లోకి బయలుదేరింది, అడుక్కోమాటు వెనక్కి తిరిగి చూస్తూ.

అతనూ యెరుగును "లచ్చమ్మ పిన్ని" గారిని. పెళ్ళయింది మొదలు తన యింటికి తీసుకువెళ్ళి, తనకీ నరసమ్మకీ లక్షమాట్లు కాఫీ యిచ్చిందావిడ, ఫలహారం పెట్టి.

ఇప్పుడున్నూ ఆహ్వానించడానికి వచ్చి వుండవచ్చు, ఏదో పిండివంట చేసి, మూత పెట్టివుంచి.

దానా దీనా, ఆమె రాకా యీామె పోకా – పువ్వులూ రాళ్ళూ కలిసి శిరస్సున పడ్డట్టనిపించాయి, రామానికి.

## 17

అన్నప్రకారం అయిదు నిమిషాలకే వెనక్కి మళ్ళింది నరసమ్మ కాని; "రాత్రనగా వచ్చావుట కనపడ్డావే కాదేమిటే మా తల్లీ? అంతఃపురంలోకా యేమి – మహా చురుగ్గా వెడుతున్నావు, నుంచో కాస్సేపు" అంటూ గుమ్మంలో నుంచే అడుగుతూ వచ్చి హోల్లోనే రెక్క పట్టుకుంది, నిమ్మన్నగారి సీతమ్మ.

"పొద్దున్న నువ్వు వచ్చావా యేమిటమ్మా, మహా!" అని యెదురడిగింది నరసమ్మ తల యెగురవేసుకుంటూ.

"పదిగంటలకి వచ్చానో లేదో మీ నాన్నారి నడుగు తెలుస్తుంది."

"తొమ్మిదిన్నరకే మా నాన్నారు రామచంద్రపురం వెడితేనా?"

"తొమ్మిది ముప్పావుకి నాకు కనపడితేనా?"

"చూశావా దీని బుకాయింపు?..........అయితే, యెక్కడ కనపడ్డారమ్మా నీకు?"

"లొల్ల సోమేశ్వరం మధ్య"

"ఎక్కడికయినా వెళ్ళావా యేమిటే?"

"రామచంద్రపురంలో మావారి స్నేహితుడికి కూతురు పుట్టింది. బారసాల చేసుకున్నా రెంతో గొప్పగా. నిన్న పొద్దున్న వెళ్ళాం, యీ వేళ పొద్దున్న వచ్చాం."

"పిల్ల బాగుంటుందా?"

"గుమ్మడిపండులా వుంది. వెండి గిన్నె పట్టుకు వెళ్ళాం బహుమతి; కాని పది రూపాయల కాగితంకూడా యిచ్చిగాని రాలేకపోయాను. విడిచిపెట్టలేకపోయానే, ముండని"

"అసలు బహుమతీ అది" అంది నరసమ్మ.

ఇద్దరూ నవ్వుకున్నారు.

"సరేగాని, మా అన్నయ్య నిద్రా మెళుకువా?"

"పడుకుని వున్నారు"

"నిద్రా మెళుకువా, అది చెప్పవే జాణా!"

".........చెల్లీ"

"ఆ – వస్తున్నా.......క్షేమమేనా అన్నయ్యా?"

"క్షేమమేనమ్మా, బావగారు –"

"ఎదురుచూస్తున్నారు నీకోసం. నువ్వూ వదినా వెంటనే నావెంట రావాలి, మా యింటికి"

చిటికెలు వేస్తూ పిలిచింది సీతమ్మ.

లేచి కూచుని వున్న రామం వెంటనే మంచం దిగి "అదిగో మీ వదిన, ఇదిగో నేను సిద్ధం" అంటూ యివతలికి వచ్చాడు, క్రాపింగు సరిచేసుకుంటూ.

"వాళ్లెందుకే సీతా?" అనడిగింది, ఈ మాటలు విని హాల్లోకి వచ్చిన రాజమ్మ.

"మా యింటికి తీసుకువెళ్ళి, తాసికలు చెప్పి, మా అన్నయ్యచేత నీ కూతుర్ని కొట్టించడాని క్కాదమ్మోయ్, రాజమ్మత్తా! మా నాన్నగారు వైశాఖ పూజ తలపెట్టారు. ఇవాళే వెళ్ళాలా సోమసుందరం మామయ్య రామచంద్రపురం? నువ్వు కూడా రావాలి, వారెవరు, లచ్చమ్మ పిన్నిగారా?

"నేనేనే సీతా! అయితే యింత జాప్యం చేశాడేం మీ నాయన, వూరంతా కానిచ్చేశారు గదా?"

"తొలికాపు ఈ సంవత్సరమే కాసింది పంచదార కలశ. మా తోటలో పెద్దకాయ లేరి కోసి అవి ముగ్గేదాకా వుండవలసి వచ్చిందండీ"

"బాగుందమ్మా?"

"మీరు కూడా రావాలి. మీ యిల్లు తాళం వేసివుంది, చూసేవచ్చాను"

"నా కొడుకూ కోడలూ–"

"పది నిమిషా లయింది మా యింటికి వచ్చి."

"అయితే మీరు రుక్కమ్మ పిన్నిగారి యింటికి–"

"అవునవును, అక్కడే తెలిసింది నరసమ్మ వచ్చినట్టు – ఇక వుండలేక యిలా వచ్చాను."

"మరి రండి. అడుగు వెయ్యవే వదినా! ఊరందరూ వచ్చారు మొగవాళ్ళు, మా అన్నయ్య వస్తేగాని ప్రారంభించడానికి వీల్లేదంటూ కూచున్నారు, మీ అన్నయ్య"

"నాకోసం నువ్వుమాత్రం కూచోలేకపోయావు, కనిపెట్టుకుని. జ్ఞాపకం వుంచుకో"

"బాగుంది మాట. మా అన్నయ్యకోసం మీ అన్నయ్య అక్కడ కూచునే కనిపెట్టుకుని వున్నారు గాని, వెతుక్కుంటూ నీకోసం వచ్చి నే నిక్కడే కనిపెట్టుకు నుంచున్నానే వొయ్యారి భామా!"

రామం ముందు బయలుదేరగా, చెట్టాపట్టాలు వేసుకుని, పరియాచకాలు చేసుకుంటూ అతనివెంట బయలుదేరారు నరసమ్మా, సీతమ్మాను.

అవతలి వీధికి వెళ్ళడం కనక, లోపలి తలుపులన్నీ గొళ్ళెంపెట్టి వీధితలుపు తాళంవేసి, అడుగులు లెక్క పెట్టుకుంటూ లచ్చమ్మతో బయలుదేరింది రాజమ్మ.

## 18

రెండయేదాకా అక్కడే సరిపోయింది.

"ఇక బాగుండ" దనుకుంటూ, నరసమ్మని దొడ్డిదారిన పంపేసి, పదిమందిలోనూ కూచునివున్న రామానికా సంగతి కళ్ళతో చెప్పింది సీతమ్మ.

చుట్టూ మూగివున్న పరిచితుల సెలవుపొంది అతనున్నూ బయలుదేరాడు కాని; వీధిలో అడుగు పెట్టాటప్పటికి, అప్పటికి తెమల్చుకొని అక్కడికే వస్తున్న పరిచిత దంపతు లెదురుపడి, పది నిమిషాలు నుంచోపెట్టేశారు, ఆ సంభాషణ మాత్రం తెమల్చుకోలేక.

మరి పదిబారలు వచ్చాటప్పటి కిలాంటివాడే ఆ వూరి అల్లుడొకడు, అరుగుమీద పచారుచేస్తూ "వైశాఖ పూజకి వెళ్ళారా యేమిటండీ? అబ్బా, నేను రాలేకపోయానండీ పదిమందిలోకిని" అంటూ పలకరించి, చెయ్యిపట్టుకుని గుమ్మంలోకి తీసుకువెళ్ళి పక్కా పావుగంటసే పాపేశాడు.

మరికొంచెం ముందుకి వచ్చాటప్పటికికొక ముసలావిడ యెదురుపడి, యిక్ష్వాకులనాటి గొడవ యెత్తుకుని, యేమిటేమిటో – అడిగిందే అడుగుతూ అయిదు నిమిషాలసేపు విసిగించి విసిగించి "మరి వెళ్ళు, అవతల తొందరగా వుందేమో?" అంటూ అప్పటికిన్నీ నిష్ఠూరాలాడుతూనే విడిచిపెట్టింది.

అక్కణ్ణుంచి ముందుకి సాగాటప్పటికి "రామం బాబూ!" అంటూ వొక యువతి పిలిచింది.

"పిన్ని యేదీ?" అనిన్నీ అడిగింది.

"ఇంకా చివుకులవారి యింటోనే వున్నట్టుందమ్మా!"

"అయ్యో, ఇద్దరూ కలిసే వస్తారనుకుంటూ కనిపెట్టుకుని వున్నానయ్యా"

"ఏం, నువ్వు రాలేదూ అక్కడికీ?"

"మీ అల్లుడుగారు గాఢనిద్రలో వున్నారు"

ప్రసంగవశాన గుమ్మంలోకి వెళ్ళవలసి వచ్చింది, రామానికి.

తీరా గుమ్మంలోకి వచ్చాడుగదా అని గొడవ విడేసిందాయువతి.

దాంతో, మూడు నిమిషాలకుగాని అక్కణ్ణుంచి కదలడానికి వీలులేక పోయిందతనికి.

ఆమెభర్త అదృష్టం మెచ్చుకుంటూ బయలుదేరి యిక మలుపు తిరగడమే

అన్నస్థితిలో వుండగా దస్తావేజుల లేఖరి వొకడు గబగబా గుమ్మం దిగివచ్చి, చెయ్యిపట్టుకు తీసుకువెళ్ళి తన అరుగుమీద కూచోపెట్టి, ఇంగిత జ్ఞానం లేకుండా రిజిస్ట్రేషనుకి సంబంధించిన సందేహాలేమిటో తీర్చుకుని–

"గంగాబొండం తీయించనా?"

"మజ్జిగతేట తెప్పించనా?"

"కూజానీరు పట్టుకురానా?"

"లైముజ్యూసుకోసం పంపనా?"

"బంగినపల్లి మామిడిపండొకటి కోయించనా?"

"అయ్యో, పనసతొన అయినా స్వీకరించరుటండీ మా యింట్లో, పోనీ!"

అంటూ తొమ్మిది నిమిషాలు "నిలువుకై" దనిపించి విడిచిపెట్టాడు చివరికి.

విసురుగా బయలుదేరాడు రామం.

మళుపున్నూ తిరిగేశాడు.

తనకోసమే యెదురు తెన్నులు చూస్తోంది అరుగుమీద నుంచుని నరసమ్మ కనపడింది.

తను కనపడీ కనపడగానే వాలుజడ యెగిరి చుట్టు తిరిగి మెడకి చుట్టుకునేటట్టు గిరుక్కున తిరిగి విలాసంగా యింటోకిన్నీ వెళ్ళిపోయింది – "మొగుడికోసం వెతుక్కుంటోం"దని యే చెలికత్తె అయినా చూసి వేళాకోళమూ వెక్కిరింతా మొదలు పెడుతుందనుకుంది కామోసు, పాపం.

జాలిపడ్డాడు.

ఆ స్థితిలో వెళ్ళి బెల్లించి చూస్తూ యెదట నుంచుంటేనే మజా అనుకున్నాడు.

ఆమె విభ్రమవిలాసా లూహించుకున్నాడు.

ఏమిటేమిటో అనుకున్నాడు.

మొగాన చిరునవ్వొన్నూ తెచ్చుకున్నాడు.

ఉరుకులు మొదలు పెట్టేశాడు; కాని "మరిదిగారికి కోపం వచ్చినట్టుంది మనమీద" అంటూ వొక చెణుకు చెవికి పడింది, రివ్వున దూసుకువచ్చి.

ఉలిక్కిపడి చూడగా, వేళ్ళుమార్చి వేళ్ళతో కాఫీగ్లాసులు పట్టుకుంటూ, మందహాసం చేస్తూ పక్కయింటి ద్వారాన వొక జంట.

"మీ వదినగారి కళ్ళబడ్డారు తమ్ముడుగారు, గుమ్మాలెక్కాలి తప్ప" దన్నాడు, పురుషుడు.

వెళ్లి హాల్లో బల్లమీద కూచున్నాడు రామం, లోపల మహా విసుగ్గా వుండినా పైకి మాత్రం ముసిముసినవ్వులు మొలిపించుకుంటూ.

పురుషుడు తన గ్లాసు ఇద్దామనుకుంటూ వుండగా, అతనికి ముందే తన గ్లాసు రామం ముందుంచేసింది, "ఎంగిలి కాదులెండి" అంటూ ఆ యువతి.

దానికి బదులు చెప్పగలడు రామం.

స్ఫురించింది కూడా.

కాని, వెళ్ళాలి.

"ఈ నిర్బంధం మాత్రం సులువుగా విడిపించుకోవాలి. త్వరగా తప్పించుకోవాలి వారిని."

అందుకోసం ముందు చిరునవ్వు నవ్వాడతను.

గ్లాసు నోటిదగ్గర పెట్టేసుకున్నాడు, తరవాత.

తరవాతే కూచోగలిగాడు పురుషుడు అతనిపక్కన.

యువతికూడా తరవాతే మరోగ్లాసు తెచ్చుకుని యెదట స్తంభానికానుక్కూచుంది.

అందరూ కాఫీ సేవ ప్రారంభించారు.

అయితే, గ్లాసులో కాఫీ తరుగుతున్నకొద్దీ సంభాషణమాత్రం పెరిగిపోయింది.

కుశలప్రశ్న లయినాయి.

పరియాచకాలు ప్రారంభం అయినాయి.

చిరునవ్వులు, అలతినవ్వులు, విరగబడి నవ్వులున్నూ వచ్చేశాయి.

క్రమంగా స్వార్థాలు రూపొందాయి.

"భాషామంజరి స్సమాప్తః"

ముగ్గురూ గుమ్మాలు దిగారు "మళ్ళీ దర్శనం –" అని మాట తేల్చేసుకుంటూ.

సెలవంటే సెలవనుకున్నారు.

వారు గుమ్మా లెక్కాక, రామం మధ్యదారిలో రిష్టువాచీ చూసుకున్నాడు. పదిమూడు నిమిషాలు ఖర్చయిపోయాయి, ఈ నాగరిక విలాసంలో.

అది తెలిశాటప్పటి కొక యిల్లు దాటా డతను.

ఆ యిల్లు దాటడం యేమిటి, అత్తింటి గుమ్మా లెక్కడం యేమిటి – వొక్కమాటే జరిగిపోయాయి.

అయితే, అది జరుగుతూ వుండగానే అడిగింది నరసమ్మ "మా బంగారమ్మక్క కాఫీ యిచ్చిందా లేదా?" అని.

"ఇంతసే పున్నారేం?" అంది జరగ్గానే.

"నా వెనకనే పంపేస్తానందే సీతమ్మ?" అనికూడా అడిగింది, ముందు తాను గడపదాటుతూ.

జరిగిందంతా చెప్పాడతను.

"వీధిలోకి వెడితే అనుకున్న క్షణానికి రావడం సాధ్యమా?" అనిన్నీ అడిగాడు, తాను పడ్డ గమనశ్రమ కనపరుస్తూ; కాని దొరికిపోయాడు.

"మీ స్నేహాలెలాంటివో మా స్నేహాలలాంటివికావూ?" అనడిగిందామె. "సాధ్యం అని యెవరన్నారూ?" అంటూ ముందు ముదలకించే.

"మొగవాళ్ళెక్కడ కలుసుకున్నా కలుసుకుంటారు. మాకలా వీలవుతుందా? నేను వాళ్ళ యిళ్ళకయినా వెళ్ళాలి, వాళ్ళు మన యింటికయినా రావాలి. లేక లేక పొద్దున్నలా కలుసుకున్నామంటే వాళ్ళూ విడిచిపెట్టలేరు, నేనూ విడిచిపెట్టలేనూ, తెలిసిందా?" అనిన్నీ అడిగింది, నిలదీస్తున్నట్టు చూస్తూ.

మాట్లాడలేకపోయాడు రామం.

అతనిస్థితి కనిపెట్టి "మా బంగారమ్మక్క యిచ్చిన కాఫీ బాగుందా?"అనడిగిందామె.

"గుడ్డతో వడకట్టిన కాఫీ యెలా వుంటుందేమిటి?" అనడిగా డతను, ప్రసంగం మారినందుకు సంతోషిస్తూను, అక్కడ తాను కాఫీ పుచ్చుకున్న దోషం తప్పించుకుంటూను.

"అయితే నే నిస్తాను రండి, ఫిల్టరు కాఫీ"

ఇలా అంటూ వీధిగుమ్మం కేసి అడుగువేసిందామె.

"ఓహోయ్, కాఫీచేస్తూ కూచుంటావా యేమిటి నువ్వు?" అనడిగా డతను, చకితుడై వెనక్కిచూస్తూ.

"ఎందుకూ? క్షణంలో వచ్చి నిమిషంలో చేసెయ్యదూ మా అమ్మ? రండి, మనం యింతలో మినపసున్ని పుచ్చుకుందాం."

"అక్కడ పానకం పుచ్చుకున్నానూ? దారిలో బంగారు కాఫీ అయిందీ? మళ్ళీ యిక్కడ తప్పదూ? ఇక మినపసున్నికి–"

"పొద్దున్నే చేసింది రెక్కలు ముక్కలు చేసుకుని మా అమ్మ, మీకోసం. నాకేం? పోనీ, ఆవిడకే చెప్పకుందురుగాని క్షమాపణో కృతజ్ఞతో మీరు"

నరసమ్మ గదికేసి బయలుదేరింది, గభీమని వీధి తలుపు చేరవేసి.

"వద్దు, వద్దు. అది మరీ గొడవ అవుతుంది, నువ్వే పట్టుకురా మినపసున్నో, మరొకటో" అంటూ ఆమెవెంట బయలుదేరాడు, రామం.

# 19

పొద్దుగూకింది.

దీపాలు పెట్టారు.

చీకట్లలుముకున్నాయి.

అయినా స్త్రీలు పురుషులూకూడ ధారాళంగానే నడిచిపోతున్నారు మహేంద్రవాడ వీధుల్లో.

కర్షకులిళ్ళు చేరుకునే సమయం అది, మరి.

దేవతాదర్శనానికి వెళ్ళినవారున్నూ యిళ్ళకు మళ్ళేవేళ అది, ధౌతచిత్తులయి.

వారిలో రామం వున్నాడా అని నరసమ్మ గవేషణ.

ఇలా కాఫీలయినాయి, అలా వచ్చి చెలికత్తెలు తనని పిలిచారు, నాలుగుదాటుతోందనగా.

ఇక లాభం లేదనుకుంటూ బయటికి వెళ్ళిపోయాడతను, దాంతో.

ఊరియువకు లతణ్ణి చెరుకుగానుగుల దగ్గిరికే తీసుకువెళ్ళారో, షికార్లే తిప్పతున్నారో, చీట్లాటలోనే కూచోపెట్టారో, మరి.

బయట యింతసేపుండే రకం కాదతను, దారిలో అడ్డంకొట్టి మాటల్లో దింపారేమో యెవరయినా.

ఏమయినా, ఆలస్యం అవుతున్నందుకు బహు చిరాకుగా వుందామెకు.

అసలే ప్రణయోన్మేషం.

దానికి తోడు, వంట అయివున్నదన్న ఆత్రం,

తండ్రి జపం పూర్తి కావస్తోం దన్న ఆరాటమున్నూ వొకటి, పులిమీద పుట్రగా!

అంచేత, గబగబా వీధిగుమ్మంలోకి వస్తుందామె.

అరుగుమీదికి వెళ్లి వీధిపొడుగునా పారజూస్తుంది.

దీపాలు పెట్టింది మొద లిదే వరస ఆమె రామం కోసం.

తెల్లని గ్లాస్కో చీరా, రవికా ధరించి వుందామె.

తలలోనూ మెడనిండాను మల్లెలు.

చేతులకు గు–మ్ము మంటూ మంచిగంధం.

గిలుకుగిలుకుమంటూ పాదాలకు మువ్వల పాంజేబులు.

ఈ తెలుపులన్నీ కలిసి పసుపు పచ్చని ఆమె శరీరానికొక వింత తళుకిచ్చాయి.

దీనికి సాయం, హాల్లోవున్న గొడుగులైటు వెలుగు వీధి గుమ్మం దాటి, చీడీలమీద ఉత్తరంగితమై అరుగులమీది కెగబాకుతోంది.

కాగా, వీధి అరుగుమీదికి వెళ్ళిందా, జ్యోత్స్నాభిసారిక అయిపోతోందామె.

"సత్యభామ తెరకెడలిందేవ్ అంటుందేమో యే చెలికత్తె అయినా చూసి" అని చిరాకుకి సాయం, దీంతో ఆమెకి వులుకు.

ఆత్రంగా వీధి అరుగుమీదికి వస్తుందేగాని, రావడం తడువుగా గిరుక్కున మళ్ళి యింటోకి వెళ్ళిపోతుందామె, పండు వెన్నెలలో గాలివిసురు తగిలిన శరన్మేఘంలాగ.

ఆ వెళ్ళడంలోనూ పడమటింటోకి వెళ్ళిపోతుంది.

టేబిలులైటు ఎగసనదీసి "బతకనిస్తారా, చూస్తే, యెవళ్ళయినా?" అనుకుంటుంది, అనిమిషలోచనాలతో నిలువుటద్దంలో యోగాదిగా తనని తానే చూసుకుంటూ.

"ఎవరికోసం యిదంతా?" అన్న ఆకాంక్ష పుడుతుంది వెంటనే,

రామం స్ఫురిస్తాడు నవమన్మథాకారంతో.

"వచ్చేశారేమో?" అనుకుంటుంది, దాంతో.

పరుగులు పెడుతుంది అరుగుమీదికి, మళ్ళీ.

వెడుతుంది, మెరుపుతీగ అయి; యింటోకి దూకేస్తుంది, వుత్తరక్షణాన.

మధ్యమధ్య హాల్లోవున్న కుర్చీలో వాలి, చూపులు వీధి గుమ్మంలోనే వుంచి, యేదో పాడుకుంటుంది, సన్నంగా.

చీమ చిటుక్కుమంటే వులిక్కిపడుతుంది.

ద్వారంలోనూ వాలుతుంది, యెగిసెగిసిపడుతూ వెళ్ళి.

ఒకమాటామె అలా వాలింది, ఇలా చీడీలెక్కుతున్నాడు రామం.

గడప దగ్గిరగా లోవైపున నుంచుని వుందామె, బయట నుంచున్నాడతను వెళ్ళి, బెల్లించి చూస్తూ ఆ గడపకే దగ్గిరగా,

వొళ్ళు జల్లుమం దామెకి మనసు ప్రఫుల్లం అయి.

"ఇంతసేపు చేశారేం?" అనడిగింది, తమ అవిరళిత స్థితి యెవరయినా చూసిపోతారేమో అని బెదిరి బెదిరి వీధికేసి చూస్తూనూ, వెనక్కి వెనక్కి హాల్లోకి తప్పుకుంటూనూ, మెల్లిగా.

దీపం వెలుగంతా ఆమెని కమ్ముకుంది, వెంటనే.

చకితుడయిపోయాడు రామం, ఆమెను చూసి.

అంత మహోజ్జ్వల రూపంలో అలాంటి స్థితిలో ఆమెని చూడలేదు రాజమహేంద్రవరంలో అత నెప్పుడూ మరి.

తాను రతీదేవి యెదట నుంచున్నట్టనిపించి దతనికి.

పరవశుడయిపోయాడు, దీంతో.

అది గుర్తించి "ఇంతసేపు చేశారేమండీ?" అనడిగిందామె, అక్కడ కూడా వొక్క అడుగు వెనక్కే వేస్తూ.

"నీ చెలికత్తె లప్పుడే నిన్ను విడిచిపెట్టారని యెవరయినా చెప్పారా యేమిటి నాకు, ఆ క్షణంలో వూడిపడ్డానికి?" అని యెదురడిగా డతను, ఆశగా చూస్తూ, మళ్ళీ దగ్గిరసా వెళ్ళి.

"ఏం వులకం మాటలు నేర్చుకున్నారండీ?"

"నువ్వు నేర్చుకోలేదా వులకంగా అడగడం?"

"పోనీగానీ – దీపాలు పెట్టాటప్పటికే యిల్లు చేరుకుంటే యేమో చెప్పండీ?"

"అవునుగానీ – పొలమూరి దగ్గిరనుంచి చీకట్లో నడిచి రావడం నాకు సరదాయేమో నువ్వే చెప్పు"

"పొద్దు గూకాటప్పటికే –"

"నా వుద్దేశమూ అదే కాని; 'లేవండీ లేవండీ' అంటూ నేనెంత పోరినా 'వుండండీ, వుండండీ' అంటూనే మళ్ళీ మళ్ళీ కబుర్లు విడేశారు మీ బంగారమ్మక్కగారి బావ"

"సడే!"

ఇలా అంటూ ముక్కూ మూతీ తిప్పుకుందామె, చేతులున్నూ తిప్పుకుంటూ.

"ఏం?" అన్నా డతను.

"కూచుంటే లేవడు, లేస్తే అడుగు వెయ్యడు, వేస్తే ఆగడు, ఆయనే దొరికాడూ మీకు!"

"దొరికాడా అంటావేం. గెంటుకుపోయాడా అనక?"

"బాగానే వుంది"

ఇలా అని వొక్కక్షణం వూరుకుని "అక్కడ కచేరీ, యిక్కడ షికారూనూ" అంది, నిష్ఠూరంగా.

అతను మాట్లాడలేడనుకుందామె; కాని "అక్కడ వంటా యిక్కడ చెలికత్తెలూనూ" అనేశా డతను.

బొమ్మ అయిపోయిందామె.

"ఏం, మాట్లాడవేం?"

"........."

"ఏదో అభాండం మీద పడేసెయ్యి, చూస్తావేం?"

"నాకు చేతకావు సుమండీ అలాంటివి!"

"అలాగేం?"

"మీ కలావుంటుంది; కాని గంటనుంచి కనిపెట్టుకుని వున్నారు మా నాన్నారు మడికట్టుకని, పొద్దున్న తొమ్మిదింటికి తిన్న మెతుకులు, పాపం!"

"మూడుగంటల వేళ, మధ్యాహ్నం, రామచంద్రపురం కాఫీహోటల్లో పుచ్చుకున్న టిఫిన్–"

"మీరు చూశారా?"

"లక్షముంది–"

"మీ నాన్నారులా కాదు, మా నాన్నారు హోటలు మొగమయినా చూడరు."

"అవతల మీ నాన్నారు కనిపెట్టుకుని వుండగా, యివతల నేను కూడా తహతహలాడిపోతూ వుండగా–"

"గుమ్మం యెక్కాటప్పటి కయినా ఆకలనిపించింది, నయమేకాదూ?"

"కనక, వడ్డించమంటావు నువ్వు, దయవుందన్న మాటే కాదూ?"

"దయకేం లోటు – స్నానం చెయ్యరా యేమిటి?"

"ఇంకా అదోటుందీ? అయితే, యిదుగో, చెరువుకి వెళ్ళానంటే క్షణం"

"చీకట్లో చెరువేమిటండీ?"

"మరి –"

"గంగాళంనిండా తోడిపోశాను, రెక్కలు పడిపోయేలాగ, నూతెడునీళ్ళూ"

"చెలికత్తెలు విడిచిపెట్టారూ నిన్ను, అన్ని నీళ్ళు తోడి పొయ్యడానికి?"

"పాపం, వాళ్ళే తోడిపెట్టారు లెండి, నా చేతిలో వున్న చేద వుళాక్కుని"

"అలా చెప్పమరీ ........ ఇదిగో స్నానం అయిందన్నమాటే"

షర్టందుకుని గదిలో వుంచేసి, సబ్బుపెట్టే తువ్వాలూ పుచ్చుకుని ముందు బయలుదేరిందామె, పెరట్లోకి.

## 20

పాలకీ వీధిలో దింపించి, తమ రాక విన్నవించుకుందామని యింటి చాకలి చీడీ లెక్కాటప్పటికి గణగణమంటూ రెండు నిమిషాలసేపు అలారం కొట్టింది, సోమసుందరం తల్లింపునహాల్లో మంచంకింద వుండిన బిగ్ బెన్.

అందరూ మేలుకున్నారు.

చెరువుకివెళ్ళి క్షణంలో స్నానంచేసి చక్కావచ్చాడు రామం, నరసమ్మ నూతిదగ్గిర నీళ్ళు పోసుకునేటప్పటికి.

ఇద్దరికీ కాఫీ యిచ్చింది రాజమ్మ.

అప్పటికప్పుడే తాంబూలాలు సద్దివుండిన సోమసుందరం రామానికి జామారివ్వగా, నరసమ్మకి చీరా రవికా యిచ్చింది రాజమ్మ.

"ఇప్పుడెందుకండీ?" అన్నాడు రామం, జామారు మాత్రం పుచ్చుకుంటూనే.

"అల్లుడు వచ్చినపుడు తెలుస్తుంది నాయనా నీకది" అంది రాజమ్మ, కళ్ళుతిప్పుకుంటూ.

ముసిముసినవ్వులు నవ్వుకుంటూ అవి ధరించి వచ్చి నవ దంపతు లిద్దరూ పురాణదంపతులకు పాదాభివందనాలు చేశారు, ముందు.

ఏదో మరిచిపోయినట్టు రామమూ, "ఏందుకండీ?" అంటూ కళ్ళు చికిలించుకుంటూ నరసమ్మ గదిలోకి వెళ్ళారు తరువాత.

"ఈ జామారు మీకెంతో చక్కగా వుంది, కదూ?" అనడిగింది నరసమ్మ కంఠం నొక్కుకుని.

"ఈ చీర కట్టుకుంటే నువ్వు హంసపిట్టలా లేవూ?" అంటూ పొదువుకున్నా డామెని, అతను.

"పుట్టింటివా రెలాంటి చీర పెట్టినా సంబరపడుతుంది కూతురు, తెలుసా?"

"అలాగేం? ఏదో వొకటి – అత్తగారు పచ్చంచుల బట్ట పెట్టడమే అల్లుడికి చాలా గౌరవం, అదికావా లిదికావాలంటూ మారాం పెడుతుంది గాని; అల్లుడులాగ వోపట్టాన తృప్తిపడదు కూతురు, తెలుసా?"

పాలకీ సిద్ధంగా వుంది, బోయీలు తొందరపడిపోతున్నారు, తొరగా తెమలాలి.

పైమాటకూడా తోచలేదు.

"పోనీ, మీ మాటే వొప్పుకుంటాను గానీ – కొత్త చీరకట్టుకున్న పిల్ల యేమి చెయ్యాలో?" అనడిగిందామె, కొంటెగా చూస్తూ.

"నీతో నాకు వాదం యేమిటిగానీ – కొత్త జామారు కట్టుకున్న పిల్లవా డేమిచెయ్యాలో మరి?" అని యెదురడిగా డతను. అంతకంటేనూ కొంటెగా చూస్తూ.

ఇద్దరి కళ్ళూ మెరిశాయి.

ఇద్దరి మొగాలూ విరిశాయి.

ఇద్దరి పెదవులూ స్ఫురించాయి, చివరికి.

ఇవతల సోమసుందరం, పాలకీలో పరచమని తన హోల్డాల్లో వున్న పరుపు చూపించాడు, చాకలికి.

"ఏమే అమ్మాయీ! ఏమీ మరిచిపోలేదు గదా?" అనడిగింది రాజమ్మ, గదిలో కాలివతల పెడుతున్న నరసమ్మని.

"ఏమేమి యివ్వదలచుకున్నావో నువ్వే జ్ఞాపకం చేసుకో" అంది నరసమ్మ,

కూతురి మాట పూర్తికాకముందే గంప దగ్గిరగా కూచుంది రాజమ్మ, అందులో వుంచిన వస్తువు లొక్కొక్కటే పైకి తీసి పరిశీలిస్తూ.

"ఇది అప్పడాల డబ్బా. ఇది వడియాల మూట. ఇది చారుపొడి సీసా. ఇది మజ్జిగ మిరపకాయల బుట్ట. ఇది వట్టి వడియాల పొట్లం. ఇది సగ్గువడియాల డబ్బి. ఇవి పసుపు కుంకుమ పొట్లాలు. ఇది సున్నిపిండి ... హాయ్యో, నా తెలివి తెల్లవారి పోనూ –"

"అదేమిటే?"

"పెళ్ళికివెడుతూ పెళ్ళికూతుర్ని మరచిపోయిందిట నావంటిదే. రెక్కలు ముక్కలు చేసుకుని చేసిన మినపసున్ని –"

"అవునేవ్! నాకయినా జ్ఞాపకం వచ్చిందికాదూ, చూశావా?"

బుగ్గలు నొక్కుకుంటూ నరసమ్మ యిలా సాగతీసుకోగా, సిసింద్రీలాగ లేచి లోపలికి వెళ్ళింది రాజమ్మ.

క్షణంలో మినపసున్ని డబ్బా తెచ్చి అక్కడ వుంచి "అలాచూస్తే యెలాగా, గంప సద్దండీ" అని కూడా ఆజ్ఞాపించిందామె మొగుణ్ణి, తప్పంతా తనదయితే విసుగంతా అతనిమీద చూపిస్తూ.

ఇలాగ ప్రయాణ సన్నాహాలు జరుగుతూనే వున్నాయి, మనస్సులు మాత్రం యెలాగో అయిపోయి వున్నాయి, తల్లికీ కూతురికీ.

ఇటుచూస్తే గంపెడు ఉత్సాహమూ, అటుచూస్తే పుట్టెడు బెంగానూ, యిద్దరికీ కూడా.

"అట్టేపెట్టుకుంటే యెలాగా?" అని యిటూ "విడిచిపెట్టి వుండడం యెలాగా?" అని అటూ తల్లికయితే, "వెడితే అమ్మ కనబడ"దని యిటూ "వెళ్ళకపోతే వారు కనబడ"రని అటూ కూతురికి.

వీటిలో యేవొకటి ఆలోచించినా తప్పనిసరిగానే కనపడుతోంది, రెండూ కలిపితేనే వస్తోంది చిక్కు.

మారుచెప్పకుండా గంప సద్దుతున్నాడేగాని. సోమసుందరానికీ వుంది యీ విభ్రాంతి.

"ఈ వారం అంతా శెలవుకావా"లని తంతి కొట్టెయ్యమందామనుకున్నాడు ముందు; కాని "అంత వుండలేకపోతే యే క్షణంలోనయినా వెళ్ళి చూసి చక్కారావచ్చు" ననుకున్నాడు, చివరికతను.

తల్లీకూతుళ్ళే తల్లకిందులయిపోతున్నారు.

"బండి అందకపోతే మమ్మల్నంటారు కామందులు" అంటూ కేకవేశాడు వీధిలోనే వుండి యింటి చాకలి, ఈ సమయాన.

"అమ్మా, తెమలాలి" అన్నాడు సోమసుందరం, వులిక్కిపడి గంప దగ్గిరనుంచు లేస్తూ.

"అయిందండీ నాన్నారూ" అంది నరసమ్మ యిటు తిరిగి కాని–

"హోమాటిలా రావే అమ్మాయీ" అంటూ చెయ్యి పట్టుకుని యింటిలోకి తీసుకువెళ్లిందామెని రాజమ్మ.

అది చూశాడు రామం, యిక వూరుకోలేకపోయాడు.

తల్లీ కూతుళ్ళిద్దరూ అప్పుడు పడమటింటిలోకి వెళ్ళడం వొకర్నొకరు విడిచిపెట్టుకోలేని బెంగవల్ల తప్ప, మరోపని వుండి కాదని గుర్తించేశాడతను.

కాదంటే, "చెట్టునిండా వుండే కరివేపాకు–పట్టుకు వెడతావా" అంటారత్తగారు, అదికాకపోతే సూరిగాణ్ణి పొలం పంపి కొత్తిమిరి తెప్పించనా అనో, రాయిలా తోడుకుంది పెరుగుబుడ్డి కూడా గంపలో పెట్టించనా అనో అడుగుతా రనుకున్నాడతను.

అత నను కున్నట్టు పెరుగుబుడ్డే తెచ్చింది రాజమ్మ, అయితే, తానే సద్దింది గంపలో.

అయినా సోమసుందరం నిమ్మకు నీరుపోసినట్టూరుకోడమూ, తాను తొందరపెడితే బాగుండకపోడమూ – ఇది యోచించుకున్నా డతను.

అటు చూశాడు, ఇటున్నూ చూశాడు.

రిస్టువాచీ చూసుకున్నాడు, లైటుకిందికి వెళ్ళి.

చిన్నముల్లు నాలుగుదాటీ, పెద్దముల్లు తొమ్మిదిమీదా వున్నాయి, సెకండ్లముల్లు మాత్రం గబాగబా తిరిగిపోతోంది, కాలుకాలిన పిల్లిలాగ.

ఖరాగా ఆరున్నర అయ్యాటప్పటికి వస్తుంది, అనపర్తి స్టేషనుకి రెయిలు.

ఎంత లేదన్నా యింకో పది నిమిషాలయినా పడుతుంది. పాలకీ యిక్కడ బయలుదేరడానికి.

ఎంత వడిగా నడిచినా నాలుగు మైళ్ళీదాలి, తాను.

అనపర్తికివతలా అవతలా రెండు బల్లకట్లున్నూ దాటాలి, కనిపెట్టుకుని వుండి.

మనస్సు గుబగుబలాడిపోయిందతనికి గాని; ఆ కంగారులోనే వొక వూహా తోచింది.

చురుగ్గా చూశాడు మామగారికేసే.

"ఆలస్యం అయిపోతోందండీ! పోనీ, ముందు వెడుతూ వుంటాను నేను, పాలకీ వెనకాల పంపండి" అన్నాడు, దృఢనిశ్చయం కనపరుస్తూ.

అన్నాడు, స్లిప్పర్లలో కాళ్ళున్నూ పెట్టేశాడు, తలుపు మూలకు వెళ్ళి.

"అవు నలా చేస్తేనే బాగుండేలా వుంది" అంటూ లేచి నుంచున్నాడు, సోమసుందరం.

"గంప నా కెత్తియ్యండి బాబయ్యా!" అంటూ సూరిగాడున్నూ ముందుకి వచ్చేశాడు, ఈ సందట్లో.

సాహసించేశాడు రామం.

సోమసుందరం అడుగువేశాడు కాని; అంతకుముందు తానే ఆ పని చేసి, బయలుదేరేడు కూడా, "అత్తా, వెడుతున్నానండీ" అంటూ.

మొదట తడబడిపోయింది రాజమ్మ; కాని తరవాత "వె–డు–తున్నా–వా?"

అని పైటకొంగు పెదవులమీదికి తీసుకుంటూ వీధిగుమ్మం కేసి రెండడుగులు వేసింది కాని; నిలిచిపోయింది.

నరసమ్మకిమాత్రం యెక్కడలేని తొందరా పుట్టింది.

కాళ్ళలో వొణుకే పుట్టేసిందామెకి.

"అమ్మా, తెమలా" అన్నాడు సోమసుందరం మళ్ళీ.

ఆత్రం కనపరుస్తూ కూడా అన్నా డతనీ మాట.

అది కంగారే పుట్టించగా "వస్తున్నానండీ" అంటూ నరసమ్మ అడుగువేసిందిటు.

తుళ్ళిపడింది రాజమ్మ, అదిచూచి.

"చాకళ్ళు వూరుకునేవుండగా మీ తొందర యెక్కువయి పోయిందేమిటండీ మహా? కష్టమూ సుఖమూ మాట్లాడుకోవాలా బిడ్డా నేనూను?" అంటూ కస్సుమంది, పెనిమిటి మీద ఆమె.

"అమ్మాయీ –" అని పిలిచింది.

ఆబగా పొదువుకుంది కూతుర్ని "మళ్ళీ –" అని.

చివరికి నరసమ్మే సాహసించేసింది.

"వెళ్ళిపోతున్నారు మరి వారు"

తానిక్కడ దిగడిపోడమూ, అతనుమాత్రం రాజమహేంద్రవరం వెళ్ళడమూ తటస్థపడితే దిగులుగానే వుండేదామెకి గాని; అలా లేదిది.

ఇదేమిటో కొత్తగా వుంది.

అంతకంటే తీక్ష్ణంగానూ వుంది.

పరకాయించుకోగా "వెడుతున్నానండీ" అంటూ అతనన్న మాటలో అసంతృప్తీ ఆ నడకలో కోపమూ స్ఫురించాయామెకి.

అయితే, ఆ కోపం తనమీదా, అమ్మమీదా?

ఇదికూడా యేర్పరించుకోలేకపోయిం దామె.

గుండెలు దడదడ కొట్టుకున్నాయి.

చూపులున్నూ చెదిరిపోయాయి.

కాళ్ళుమాత్రం ఆడాయి, అప్రయత్నంగా.

"పాలకీలో కూచో తల్లీ!" అన్నాడు సోమసుందరం వెనకనే వచ్చి.

అంతవరకూ తల్లీ కూతురూగూడా యెరగరు, వీధిలోకి రావడం.

అప్పుడున్నూ వొకర్నొకరు విడిచిపెట్టుకునేటప్పటికి రెండు మూడు నిమిషాలు గడిచిపోయాయి.

"వెళ్ళివస్తానండీ, నాన్నారూ" అంటూ తండ్రితో చెప్పాటప్పటి కింకో రెండు నిమిషాలు పట్టింది, నరసమ్మకి.

"అమ్మా" అంది మరి మాట్లాడలేకపోయింది.

చూడగా, తల్లి దిగాలుపడిపోయివుంది.

మిడుతూ మిడుతూ చూసుకున్నా రిద్దరూ.

"లేవండిరా" అన్నాడు ఇంటిచాకలి, తనవాళ్ళని.

దాంతో మనస్సులు కరిగిపోయాయి, తల్లికీ కూతురికీ. కళ్ళూన్నూ చెమ్మగిల్లాయి.

ఇటు పెదవులు రావిరేక లయిపోయాయి; కాని అటు కాళ్ళు పాలకీలోకి దారితీశాయి, నరసమ్మకి.

ఇటు చూపులు చెదిరిపోయాయి; కాని అటు, కింద జీరాడుతున్న నరసమ్మ కుచ్చెళ్ళకొంగు పాలకీలో సర్దాయి, రాజమ్మ చేతులు.

రెప్ప వేశాటప్పటి కిద్దరి మొగాలూ వొక యెత్తున వున్నాయి.

పరకాయించగా, పాలకీ యెత్తుకునివున్నారు బోయీలు.

నిదానించాటప్పటికి ఓంబాయిపాట ప్రారంభించేశారు కూడా, దురుసుగా అడుగు లేస్తూ.

తడబడుతూ వెంటబయలుదేరింది రాజమ్మ.

"అమ్మాయీ –" అంది మాట తెములుచ్చుకుని. మరి, ఆమెకి ముందు మాటా రాలేదు, ఆ వచ్చినమాట అయినా నరసమ్మకీ వినపడాలేదు.

ఇంతలో మళుపు తిరిగేసింది పాలకీ.

ఝంఝామారుతంలో యేలకీలత అయిపోయింది రాజమ్మ, దాంతో.

నుంచోనూ లేకపోయింది.

ఉసూరుమంటూ వెనక్కిమళ్ళి, తూలుతూతూలుతూ పోల్లోకి వెళ్ళి, నిట్టూర్పు విడుస్తూ కవాచీబల్లమీద వాలిన్నీ పోయిందామె, చివరికి.

సోమసుందరంకూడా, మురుగుకాలవ దాటేదాకా యేమిటేమిటో చెబుతూ పాలకీ పట్టుకునడిచి "తల్లీ, నాలుగైదు రోజుల్లో వస్తానేం?" అంటూ గరువు మీదికి వెళ్ళిపోయాడు, కాళ్ళీడ్చుకుంటూ.

నలుగురు బోయీలు పాలకీ మోస్తున్నారు, మరోయిద్దరు చెమటలు కక్కుంటూ వెంట వస్తున్నారు; కాని తా నేకాకి అయిపోయిన ట్టనుకుంది నరసమ్మ.

క్షణక్షణానికీ తల్లీతండ్రీ యింకా యింకా దూరం అయిపోతూవుండడమున్నూ గుర్తించుకుందామె.

అయితే, రామం ముందు వెడుతూవుండడం జ్ఞాపకం వచ్చిం దింతలో.

పాలకీ అటే వెడుతోంది, త్వరగానే కలుసుకుంటుంది కాని; సూరిగాడితో సమంగా నడుస్తున్నాడతను, పాపం.

గబగబా నడుస్తున్నాడు, రెయిలందదేమో అని.

ముచ్చెమటలూ పోసివుంటాయి.

తహతహ పుట్టిందామె కీస్ఫురణతో,

రాణీ అయి తాను పాలకీ యెక్కడమూ, తన యేడుగడ – తన ప్రభువు – తన దేవుడు నడవడమూనా?

గిలగిల్లాడిన్నీ పోయింది ఈ భావనతో.

అది భరించలేక వొక్క కేకపెట్టింది "త్వరగా నడవా"లని వ్రూగిపోతూ; కాని వెంటనే సిగ్గుపడిపోయింది "పెనిమిటిగారిని పాలకీ యెక్కమందామనుకుంటున్నా రమ్మాయిగా" రసుకుంటారేమో బోయీలని.

"మాట అనేస్తారేమోకూడా మొగాన?" అనిన్నీ భయపడిపోయింది.

గభీమని వెంటనే పాలకీ తలుపులు మూసేసుకుంది, రెండు పక్కలా.

"ఇంకేం?"

భయం పోయింది దీంతో.

మనస్సున్నూ కుదుటబడింది.

ఈ స్థితి కలిగాటప్పటికి "ఈపాటికి స్టేషనుకి చేరుకుని వుంటా"రనిపించింది.

ప్లాటుఫారంమీద వొక చివర కూచునివుండినట్టున్నూ తోచిందతను.

తనకోసమే యెదురుచూస్తున్నా డతనక్కడ.

మరి, తాను?

ఈ జిజ్ఞాస కలిగాటప్పటికి, తలుపులు మూసివుండిన పాలకీ, అంతఃపురం అన్నట్టు తోచిందామెకి.

ఇటు సిగ్గు, అటు బిడియం; ఇటు మురిపం, అటు ముచ్చట; ఇటు వుత్సాహం, అటు వుల్లాసం; ఇటు దిటవు, అటు సాహసమున్నూ అయి, తెరమీద ఫిలింరీలు నడుస్తున్నట్టు తమ అంతఃపురిక విలాసాలున్నూ స్ఫురించాయి, వెంటనే.

ముగ్ధమోహనమైన ఆమె మొగం ఆనందముగ్ధం అయిపోయింది, దీంతో.

*1927* ఆగష్టు నెల అభ్యుదయ పత్రికనుంచి
(సవరణలతో)

★ ★ ★

# అరికాళ్లకింద మంటలు

"దిమ్మచెక్కలాగ అలా కూచోకపోతే కాస్త గంధం తియ్యరాదుషే? రోజా పురమాయించాలా?"

"పెద్దబావ నిన్ననే వెళ్ళిపోయాడు కదా–"

"గంధం పూసుకోతగ్గవాళ్ళే కనపడ్డంలేదూ నీకు?"

"పోనీ, పురమాయించినట్టే చెబితే యేం?"

"మీ అమ్మా మీ నాన్నా–నోటితో చెప్పాలిషే?"

"లేకపోతే యెలా తెలుస్తుందీ నావంటిదానికీ?"

"నిజంగా నీకీమాత్రం వూహా తోచనేలేదూ? ముసలాళ్ళా ముక్కాళ్ళా వాళ్ళకేమే? నిక్షేపంలాగ గంధంపూసుకోకా?"

"..............."

"ఈ జన్మలో నీకెలాగా ఆ యోగం లేదు. ముందుజన్మలోనయినా సుఖపడాలంటే యెప్పుడిలాగ ముత్తయిదువులికి గంధంతీసి యివ్వడమూ, మల్లెమొగ్గలు దండలుగుచ్చి వెయ్యడమూ – అందులోనూ కన్నవాళ్ళకి. ఇంతకంటే పుణ్యం యేమిషే?"

"చూశా, అనుభవించా, గంధం పూసుకుంటే యెలాంటి సుఖం కలుగుతుందో వొకళ్ళ కలాంటి సుఖం కలిగిస్తే యెంత పుణ్యం వస్తుందో తెలవడానికి? ఇంతకీ ఈ జన్మలో యింతయింది, ముందు జన్మలో సుఖపడనేమో అని బెంగ. ఏదో చేతులారా ప్రాణాలు తీసుకోలేక బతకడం. కాకపోయినా ముందుజన్మలో మనిషినే అయి పుడతానన్న మాటేమిటి?"

"నిజమే. ఇలాంటి బుద్ధులుండే వాజమ్మకి మనిషిజన్మ రమ్మంటే మాత్రం యెలావస్తుందీ?"

"వచ్చేం వొరగదోసిందీ? ఇంతకంటే పశువు జన్మో, పిట్ట జన్మో వస్తే నయం, యీ రాతా యీ కోతా –"

"వెనకటి జన్మలో యెవళ్ళని చూసి యేడ్చావో? ఎవళ్ళ సుఖం పడగొట్టావో? ఎవళ్ళకి యెడబంధాలు కల్పించావో? లేకపోతే నీకిప్పుడీరాత యెందుకు వస్తుందీ? కనక ముందు జన్మకోసం జాగ్రత్తపడవే అంచే – నీకోసమే గాని నా కోసమా యేమిషి?"

"నీకోసమని యెవరన్నారేమిటి? అసలెవరికోసం అయితే మాత్రం నాకు తప్పుతుందేమిటి? నువ్వు ప్రేమ వున్నదానవు కనక నీ కూతురికోసం గంధం తియ్యమన్నావు, తప్పని యెవరన్నా రేమిటి? నాకా వూహా కలగలేదు గాని, నేనేం తియ్యనన్నానా, తియ్యనా? నువ్వు స్పష్టంగానూ, కచ్చితంగానూ చెప్పావు కనక

యివాళ మొదలుకుని యేరోజునయినా తియ్యకపోతే అడుగు. తిని కూచోవాలంటే సాగుతుందా యేమిటి నాకు? రెక్కల్లో సత్తువ వుందికదా?"

"వోసి నీ మొగం యీడ్చా, కాస్తమాట అనేటప్పటి కెంత దండకం విడేశావే"

"............"

"తల్లికీ తండ్రికీ చెయ్యడానికే యేడ్చేదానవు నువ్వు మరొకళ్ళకేం చేస్తావే?"

"................"

"పెద్దబావ వుండిన వారందినాలూ యేడుస్తూనో, మొగం మాడ్చుకునో కాస్త గంధం తీశావే! స్నానానికి కసిన్ని వేన్నీళ్ళు కాచావే! ఇంతేనా నువ్వు చేసింది అతగాడికి? వేదం అంతా చదువుకున్న బ్రాహ్మడు, అతగాడికి చెయ్యడం దేవుడికి చెయ్యడం కాదుషే!"

"ఆ వివరాలన్నీ పెట్టిపుట్టినవాళ్ళకిగాని నాకు గాదు. నా బతుక్కి దేవుడయినా వొకటే, మనిషయినా వొకటే – తుదకి దెయ్యం అయినా వొకటే. ఎవరికయినా చెప్పిందల్లా – తోచింది కూడా – చేతనయినంతా చేశాను. నేనేమీ వొళ్ళు దాచుకోలేదు."

"దాచుకుందామనుకుంటే సాగనిస్తారా యేమిషి?"

"సాగనిస్తున్నారా యేమిటి? సాగనివ్వమని నే నేడ్చానా యేమిటి? దొడ్లో గేదీ వుంది, యింట్లో నేనూ వున్నాను, ఇంటిల్లిపాదికీ –"

"వోసి నీ సిగ్గు చిమడా, కనిపెంచే గేదికీ నీకు సాపత్యంషే? కనాలని – యెంత వూహావుందే దిక్కుమాలినపీనుగా?"

"............"

"దరిద్రం వోడుకుంటూ పుట్టుకువచ్చావు. నీకే అంత అదృష్టం?"

".............."

"నువ్వే మూహూర్తాన కడుపున పడ్డావో అప్పుడు చచ్చిబతికింది మా అమ్మ. నువ్విలా చేటలో పడ్డావు. మీ నాన్న వుద్యోగం అలా పోయింది."

"నాకు పుస్తికట్టాడు ఆ పిల్లాడు చచ్చాడు. ఏం, యీ మాటకూడా అన్నావుకాదేం?"

"వోసి నీ యిల్లు – అనలేదేమని యింకా ముదలకించడం కూడానా? నిజంగా నిన్ను పెళ్ళాడి వుండకపోతే బతికే వుండును ఆ వెర్రితండ్రి. పదహారేళ్ళకే 'దరుదుపారం' – అతనెంత వుద్యోగస్థుడయిపోయివుండునో నీకేం తెలుసూ? పైగా 'చచ్చాడు చచ్చా'డని యీసడింపు కూడానా?"

"..............."

"నీకు పుస్తి కట్టడమే అతనికి ముప్పయిపోయింది"

"................."

"నువ్వు కాలుపెట్టావు, వొక్క కొడుకు – ఆ తల్లి కడుపు కాలిపోయింది."

".............."

"నిజంగా చచ్చే సుఖపడ్డాడా అబ్బాయి. అతను బదికే వుంఛే నువ్వు కాపరం చేస్తువా? కాపరమే చేస్తే అన్నం పెడుదువా? అన్నం పెడితే నిద్రపోనిస్తువా?"

"నిద్రపోనిస్తే ఆ నిద్రలో, పీక పిసికి –"
"ఆ,ఆ! ఏమని పేలావూ? ఎంత పొగరెక్కావూ?"

"నువ్వంతపనీ చేసేదానవు మాత్రం అవుదువు. విన్నావా? నువ్వెంతకేనా సాహసురాలవు."

"చేసుకున్నవాణ్ణీ, చచ్చి స్వర్గానున్న మొగుణ్ణీ –"
"నన్ను చేసుకున్నాడుగదా మరి, ఆ పిల్లాడికి స్వర్గం వస్తుందా?"
"నిజమే. అదీ నిజమేనే. ఎంత జాణవయినావూ? కొంప చెడపుట్టి మనోవర్తికయినా గతిలేకుండా –"
"మనోవర్తా? నాకెందుకూ మనోవర్తీ? నాకు డబ్బెందుకూ? చాకిరీ చెయ్యడంకోసం పుట్టాను, ఎవళ్ళు చేయించుకున్నా చేస్తాను. చేయించుకున్నవాళ్లు గంజినీళ్లు పొయ్యక పోతారా?"
"కనక చెయ్యి, పుచ్చినట్టు చెయ్యి
"పుచ్చినట్టేం, చచ్చినట్టు చేస్తాను. చేస్తూనూ వున్నాను కనపడ్డంలేదూ?"
"కనపడకేం, నిక్షేపంలా కనబడుతోంది, నాకేం కనపడకా? మీ నాయనమ్మకిలాగ నాకూ కళ్ళు పోవాలనుకుంటున్నావు కాబోలు, వొక్కనాటికీ పోవు. నన్నన్నవాళ్ళ కళ్ళు పోతాయి. దించుకు పోతాయి.... నా చేతుల్లో పుట్టి, నా చేతుల్లో పెరిగి నన్నెదిరిస్తావా? నన్నెదిరిస్తావా అంఛ! నన్నెదిరించి నువ్వు బతగ్గలవుషే?"
"నాకు బతకాలని వుంటేనా నీతో పంతం వేసుకోడానికీ? కనక, ఆ వుపాయంమాత్రం కాస్త తొందరగా చూడు; చాలా పుణ్యం వస్తుంది నీకు"
"ఏమన్నావూ? ఏం పేలుతున్నావూ? నేనేం మందులు పెడతానా, మాకులు పెడతానే? ఎంతలేసి మాట లంఛున్నావే, చలితేలులాగ, కుంకపీనుగా"
"............"
"ఎంత వొళ్ళు కరుచుకుని తిరుగుతున్నావే పింజారీ!"
"............"
".......చద్దువుగాని, చద్దువుగాని – నేను కాస్త నిద్రపోయి లేచాటప్పటికి, అవిగో, బాగుచెయ్యకపో మహమ్మాయి వండించేస్తానో లేదో చూసుకుందువుగాని"

'నేలబెట్టి రాసేస్తాను కాని, నిన్ను చావనిస్తానుషే"

"ఏమే చెల్లీ, వొక్కపని చెబుతాను చేసిపెట్టవూ?"
"అడగడం యెందుకే?"
"అయితే చేస్తానను"
"చెయ్యకపోవడం యెలా వస్తుందీ? చేస్తానని చెప్పే చేస్తున్నానా చేసేవన్నీనీ"

"........ఈ గుడ్డ రైక కుట్టిపెట్టాలి. అంతే"

"అలాగే........"

"దీపాలు పెట్టాటప్పటికి – తెలిసిందా?"

"ఇవాళ నావల్లకాదు సుమా! రేపు –"

"ఇవాళేం చేస్తావమ్మా?"

"పెద్దక్క తన కూతురికి జుబ్బా కుట్టమని భోజనం కాగానే యిచ్చింది గుడ్డ. ఈ పని తెమలగానే ముందది–"

"పోనీలే........"

"....అదేమే అలా వుళాక్కుంటావూ?"

"........అక్కర్లేదులే ........"

"నేను కుట్ట ననలేదు, ఆపైని నీ యిష్టం"

"కుట్టనని నోటితో అనాలా యేమిటి? పైగా నీ యిష్టం కాని, నా యిష్టమా యేమిటి? నా యిష్టమే అయితే నువ్వు వాయిదా వెయ్యగలవా యేమిటి?"

"ముందు పుచ్చుకున్న పని వెనక్కి పెడితే అదేమంటుందో యేమయినా ఆలోచించావా?"

"కొడుతుందా యేమిటి?"

"దాని కూతురికి లగ్గం మించిపోతుందా యేమిటి?"

".........."

"అసలు పెద్దదంటే నీ కభిమానం. అది నే నెరగననుకున్నావా? స్పష్టంగా చెప్పెయ్యక యీ ముసుగులో గుద్దులాట లెందుకూ?"

"దుడుగూ దుడుగూ మాట లనెయ్యడమేనా, కాస్తేనా నా సంగతి చూడ్డంవుందా?"

"నీ సంగతి కేమమ్మా? వండాలా, వార్చాలా?"

"అదే నయం, మడికట్టుకుంటే చాలా పనులు తప్పించుకోవచ్చు"

"ఇప్పుడయితే మాత్రం, యీ కసిన్ని కందులూ బాగు చెయ్యడమేనా?"

"........ కసిన్నిటే యివీ?"

"కసిన్ని కాదు, నాలుగు కుంచాలు, అంతేనా?"

"ఇప్పుడెన్ని గంటలయిందో యెరుగుదువా?"

"రెండే కాదూ? మూడు కొట్టాటప్పటికి యిదయిపోతుంది. తరవాత?"

"ఒక్క గంటలోనా?"

"పోనీ నాలుగింటికి. తరవాత యేం చేస్తావమ్మా?"

"గంధం యెవరు తీస్తారూ?"

"అదెవరికే? బావ నిన్ననే వెళ్ళిపోయాడు కాదూ?"

"అమ్మకీ నాన్నకీని"

"అమ్మ తియ్యమందా?"

"అమ్మకాదు, అమ్మమ్మ"

"అదేమిటే?"

"అదేమిటే అంటే?"

"అమ్మమ్మ చెప్పడానికి-"

"తప్పేం? ప్రేమగల తల్లులు, ముద్దుల కూతుళ్ళకోసం పురమాయించుకుంటారు. చెప్పకుండానే యెందుకు తీశావు కాదని-"

"శాబాస్, పోనీ అరగంటలో అదయిపోతుంది."

"అరగంటకా?"

"వొక్క గంటకే అను. అప్పుడు?"

"మరోపని తగలకపోతే అక్క కూతురి జుబ్బా-"

"ఎంత చెప్పినా చివరి కదేమాట, కాస్తేనా సరసం తెలిస్తేనా? ఇవాళో రేపో వస్తారు మీ బావ. నెల్లాళ్ళ కిందట వచ్చినప్పుడు తెచ్చి యిచ్చారిది. మళ్ళీ వచ్చాటప్పటికే-"

"ఇన్నాళ్ళు చెప్పావుకావేం మరీ?"

"ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. కాకపోయినా, గంట పని, ఎన్నాళ్ళు చెప్పా లేమిటి యీమాత్రం మహాభాగ్యానికి? నువ్వు గట్టిగా తలుచుకుంటే అరగంటకే అయిపోతుంది......కుట్టి పెట్టవే – ఏమే చెల్లీ?"

"కుడతానన్నాను కదూ?"

"ముందు కుట్టాలి .... ఏం?"

"ఏది ముందయినా నా కొక్కటే. అయితే పెద్దక్కకి కోపం రాకుండా చూస్తావా?"

".....నీ యిష్టం వచ్చినట్లు తగులడు. నే నేపని చెప్పినా యింతే నువ్వు. పెద్దదంటే పడిచచ్చిపోతావు. అదీ నువ్వూ కట్టకట్టుకుని గోదావరిలో దిగండి. కాస్త రైక భాగ్యానికి – నేను కుట్టుకోలే ననుకుంటున్నావు కాబోలు పాపం. నువ్వీ మాత్రం సాయం చెయ్యకపోతావా అని ఆసపడ్డందుకు – పోనీ, రేపు సాయంత్రానికి తప్పకుండా కుట్టేస్తావా?"

"..........ఆ"

"వీలయితే రేపు పొద్దున్నే కుట్టెయ్యి. కొత్తచీర కట్టుకుని పాప సోదెమ్మ అత్తగారి యింటికి వెడదామని – దానిమీది కిదెంతో బావుంటుంది. కదుటే చెల్లీ?"

"చెల్లాయికి తల అంటడమూ, తమ్ముడికి తల దువ్వడమూ, అక్క కూతురి పక్కగుడ్డలు –"

"అవెంతసేపే?"

"మరి దూడల సాల?"

"బాగుచేస్తా వనుకో?"

"పాలు?"

"పితికేస్తావు. దానిమీద పడేస్తావు. చల్లకూడా అయిందనిపించేస్తావు. నాన్న పంచె వుతికి ఆరేస్తావు. ఇంతేనా? ఇంకేమిటమ్మా?"

"అవన్నీ నీకెందుకు, నేను చూస్తాను కాదూ?"

"చూస్తానేమిటి, చేస్తానను"

"అంటే చేసినట్టా అనకపోతే మానేసినట్టానా?"

"సరే, యేం నంగనాచివే మమ్మా?"

"........."

"ఎంత కటికతనమే మా తల్లీ?"

"........."

"ఎంత బతిమాలినా గిజా అనే – అయితే రేపు సాయంత్రానికి తప్పకుండా కుడతావా?"

"కుడతాను"

"మరిచిపోకు సుమా! అసలు, మధ్యాహ్నం భోజనాలు కాగానే నీదగ్గిరే పడుకుంటానులే నేను. దిక్కుమాలిన యెండలు ముదిరిపోవడంవల్ల తిండి తినగానే కసింత్సేపు నిద్రపోతేగాని – మళ్ళీ లేచాటప్పటికి కుట్టేస్తావు, కాదుటే?"

"..............."

"మీ బావ యెంతో మెచ్చుకుంచారు నిన్ను. మాకు వుద్యోగం అయ్యాక నువ్వు వచ్చి మాదగ్గిర వుండువుగాని. ఏం, వుంటావా?"

"..........."

"మాట్లాడవేమే?"

"మాట్లాడ్డం యెందుకూ? ఎవరిదగ్గిరా వుండకపోతే రోజు లెలా వెడతాయీ నా బతుక్కి?"

"ఎంత మాటన్నావే దిక్కుమాలినదానా? నీకంత నీరసంగా వుందా నే నంటేనూ? నువ్వు రాకపోతే నేను చేసుకోలే ననుకుంటున్నావా? అసలు వంటలక్కనే పెట్టేసుకుంటాము మేము, ఒకళ్ళ అవసరమే మాకు లేదు"

"  "

"తోడబుట్టినదానవు కదా – గతిలేనిదానవు కూడా కదా అని ... రేపు కుట్టకపోతే అమ్మమ్మతో చెబుతా నేమనుకున్నావో మరి?"

"..........."

"వోస్! మాట్లాడితే కంటనీళ్ళు. ఎవరికీ భయం లేదు."

"జాబ్బా యెంతవరకూ – ఇంకెందుకే గంధం?"

"పూసుకోడానికి"

"ను – ఎవరూ?"

"అమ్మా, నా –"

"మళ్ళీ యెప్పణ్ణుంచే?"

"ఎప్పణ్ణుంచో, యెందాకానో నాకు తెలియనూ తెలియదు. తెలియనూ అక్కర్లేదు. నీకు కావలిస్తే అమ్మమ్మని –"

"ఆవిడ పురమాయించిందా?"

"అవును"

".....సరే, అదంతా నాకెందుకుగానీ – సగమేనా కుట్టావా జాబ్బా?"

"కత్తిరింపు లయినాయి"

"సెబాస్! పదకొండున్నర కనగా యిస్తే యిప్పటికి కత్తిరింపులా అయినాయి?"

"అవయినా అయినందుకు–"

"సంతోషించమంటావా? నా పనంటే నీకంత వేళాకోళమూ, వెక్కిరింతగానూ వుందా?"

"..........."

"ఎందుకమ్మా అలా చూస్తావూ? ఈ కాస్తకే యింత రోషం వచ్చేదానవు, మరి, సగంసగమే చేసి యెందుకు మానేశావూ?"

"అయ్యో, నా బతుక్కి రోషం కూడానూ. ఎవళ్ళేపని చెబితే అది పుచ్చుకోవాలిగాని, లేకపోతే–"

"ఇంకా యెవరెవ రేమేం పనులు చెప్పారూ?"

"నువ్వా అలా వెళ్ళావు, నాలుగు కుంచాల కందులతట్టా వచ్చి నా నెత్తికెక్కింది."

"అయితే?"

"అయితేనా?.......... చచ్చి దోరి అది దింపేసుకుని యిదిగో సానదగ్గిర కూచున్నాను"

"ఇదయ్యాకా?"

"..........."

"నాలుగు తిప్పాలు తిప్పుతావు గిన్ని, గిర్రున నిండి చక్కాపోతుంది. తరవాత యేం చేస్తావమ్మా?"

"........ఇప్పటికి నీ కూతురి జాబ్బామాత్రమే కనపడుతోంది,. మరో పనేదీ తగలకపోతే అదే చేస్తాను"

"తప్పకుండా చేసిపెట్టు. ఇదెంతసేపులే? తరవాత యెవరికీ తెలియకుండా జాబ్బా పుచ్చుకుని డాబామీద కూచో, యించక్కటి గోదావరి గాలి వస్తుందక్కడికి"

"గాలికోసం డాబామీదికే వెళ్ళనక్కర్లేదు. నే నెక్కడుంటే అక్కడే కావలసినంతానూ"

"ఇక నీయిష్టం. ఊరికే నీ సుఖంకోసం చెప్పాను గాని; నాకు కావలసింది జాబ్బా కుట్టెయ్యడమే. అయితేనూ, చిన్నక్క యేమిటీ యిచ్చి వెళ్ళిందిటా?"

"దానికి రైక కుట్టి పెట్టాలిట!"

"తనకి చేతకాదటనా?"

"..........."

"దొరగారు దయచేసారటనా?"

నే నిచ్చినప్పుడే యివ్వాలి కామోసునటనా?"

"అయితే దానిక్కూడా చింపు లయినాయటనా?"

"............"

"వులిక్కిపడి చూడనక్కర్లేదు. అబ్బో, నీ గుణం నాకు తెలియదనుకున్నావేం? అదంటే నీకు దిక్కుమాలిన అభిమానం. అంచేత నేను ముందిచ్చిన పని మానేసి అది మొదలుపెట్టావు"

"చూసీ చూడని మాటలు–"

"చూడనే అక్కర్లేదు. లక్షమాట్లు చూశానుకూడా. దాని మొగుడు ఇంగ్లీషు చదువుతున్నాడని – ఇంకా నాలుగేళ్ళక్కాని బి.య్యే కాడుట. అదయినా యీమధ్య ఫేలయిపోకుండా వుంటేట. మీ బావ చెప్పారు చాలా మాట్లు. బి.యే. అయితేగాని – అయినా యీ రోజుల్లో లాభం లేదుట"

"చెప్పేదేమయినా వినిపించుకోడం........"

"ఇంకా చెప్పడం యెందుకూ, యీమాత్రమూ తెలియదనుకున్నావా? నువ్వెప్పుడూ దానికోసం దొర్లిపోతావు. నాకంటే నీకదేమీ వొరగబెట్టదు"

"చంటిపిల్లే యెక్కువో, తాడిచెట్టులాగ కాపరం చేసేదే యెక్కువో కనిపెట్టలేక పోయావు"

"............"

"తండ్రి తెచ్చిన గుడ్డ, పింతల్లివి నువ్వు కుట్టిపెడతానని – చూడవే నీ కేసి యెంత ఆశగా చూస్తోందో నా రత్నాల మూట?"

"దిక్కుమాలిన పిన్ని, చచ్చిపోయిన పిన్ని, నాకేసి చూస్తే యేం వుంది తల్లీ.... మామ్మే, మా తల్లే! నామీద వాల్తావు, మీ అమ్మదగ్గిర నే నెంతటిదాన్ని కన్నా? బాబ్బా కుట్టిపెడతానమ్మా! రాత్రి తిండేనా మానేసి కుట్టిపెడతాను. ఏం, సరా?"

"చేరదీసినవాళ్ళని పట్టుకుని పాకులాడుతారు పిల్లలు. నీకు తెలిసింది కాదు గాని, నా పిల్ల నీ పిల్లే అనుకుంటే యెంత బాగుంటుందీ? ఇలా అయినవాళ్ళు లోకంలో అక్కల పిల్లల్ని పెంచుతూ యెందరు సుఖపడ్డంలేదూ?"

"............"

"చిన్నక్కలాగ మాయమాటలు చెప్పడం నాకు చేతకాదు. నువ్వంటే నేనెంత అభిమానపడి ఛస్తానో – యెందుకూ చెప్పకోడం? నువ్వు నాతో మా యింటికి వచ్చావంటే నిమిషంలో లేవగొట్టెయ్యనూ మా అడబడుచునీ? నా యింటి పెత్తనంకూడా నీ కిచ్చెయ్యనూ?"

"............"

"నువ్వు చేసే చాకిరీచూస్తే – నువ్వు పిల్లని చూసుకుంటూ వుంటే నీకొక్క పని చెబుతానా నేను?"

"............"

"ఇంచక్క మాధవస్వామి గుడి మా యింటి కెంతో దగ్గిర. రోజూ వెళ్ళి పురాణం – అంతకంటే నీకు మరేంకావాలీ? గుప్పె డన్నమూ, చారెడు బట్టా – నీకు లోటు చేస్తానా నేను? తాళాలు నీ చేతికి యిచ్చేస్తారు మీ బావ. నెల్లాళ్ళు

తిరిగారంటే దోసెడేసి రూపాయలు. నోములూ, వ్రతాలూ, కాశీరామేశ్వరాలూ – వో! నీ కర్మేమిటే నా యింటోనూ?"

"............"

"చిన్నక్కతో వెడదామని వుబలాటపడుతున్నావేమో, అది నిన్ను తీసుకువెళ్ళదు. వొంటెత్తు పీనుగు అది, నీకు అన్నంకూడా పెడుతుందా? కాకపోయినా పెట్టడానికి దానికేం వుందీ? పాస్ పీస్ మంటూ యింగ్లీషేగాని భూమేదీ? రెండెకరాలేనా? అదేనా మెరక. మాది పదెకరాల చెరువు కింది పల్లం ఇంతకీ దాని మొగుడు – అలాంటిచోట నువ్వుండ గూడదు"

నువ్వేనా వూహ తెలిసినదానవుగాని చంటిపిల్లవుకావు, బాగా ఆలోచించుకో"

"ఈ మాటలు చిన్నక్కతో అన్నావు సుమీ! వో–ర్థి కజ్జాగోరు పీనుగు. నన్నేం చెయ్యగలదు గానీ – అయినా యెందుకూ?"

"............"

"చెప్పవేం"

"అలాగే"

"నే నొక్కమాటు వాళ్ళ సుందరమ్మగారి యింటికి వెళ్ళివస్తాను, యిదయిపోగానే జబ్బా కుట్టేస్తావు కాదూ"

"............"

"మాట్లాడవేమే?"

"వెళ్ళిరా"

"మనం మళ్ళీ వచ్చాటప్పటికి పిన్ని నీకు జబ్బా కుట్టేస్తుంది, వెంటనే నీకు తొడిగేస్తానది, ఇవాళ రాత్రి దాని పక్కలో పడుకుందువుగాని నువ్వు ఇంచక్క ...ఏం తల్లీ..."

"        "

"నువ్విక్క డున్నావూ? మహా బాగా దొరికావులే"

"గంధంపు గిన్ని పడిపోతుంది, దూరం దూరం"

"పడిపోదే .... పోనీ, దూరంగానే ........ఏం?"

"ఊ"

"నేను సాయం పట్టనా?"

"అక్కర్లే దయేపోయింది. ఈ వాయి వొక్కటే తీస్తే గిర్రున నిండిపోతుంది గిన్ని"

"అయితే వొక్కమాటు లేవే. ఏమే అక్కా?"

"ఎందుకూ?"

"పనుందే"

"ఏమిటమ్మా ఆ పనీ?"
"ఇంచ–క్షటి పని, మాాం–ఛిపని, చేసిపెట్టవూ?"
"ఏమిటో చెప్పు"
"చేస్తానను"
"ముందు చెప్పమన్నాను కాదూ?"
"చెబితే చేస్తావా?"
"నేను చెయ్యగలదయితే చేస్తాను"
"చూ–శావా? ..... నో రూరిపోతోందే"
"ఏమయినా కొనుక్కున్నావా?"
"డబ్బేదీ?"
"అమ్మ నడగలేకపోయావా?"
"అడిగాను. ఇస్తానంది. ఇవ్వబోయిందికూడాను. ఇంతలో అమ్మమ్మ ముండ–"
"తప్పుతప్పు, ఏమిటా తిట్లు?"
"మరి – మరి – ఇచ్చేవాళ్ళని చెడగొట్టడమేం? ఆ డబ్బుంటే మా బువ్వాలాట యెంత బాగుండునూ?"
"ఎవరెవ రాదుకుంటున్నారూ?"
"వాళ్ళ వెంకట సుబ్బులూ, వాళ్ళ బుచ్చెమ్మా, వాళ్ళ లక్ష్మీరాజ్యమూ, వాళ్ళ గవిరిముండా –"
"ఛీ! ఛీ! ఏమిటలా అయిపోతున్నావు చివరికి?"
"మరి వొట్టి చేతులతో రావడమేం?"
"తక్కినవాళ్ళేమి తెచ్చారూ?"
"సుబ్బులు డబ్బు కారపు సెనగపప్పు తెచ్చింది. బుచ్చెమ్మ డబ్బు వేరుసెనక్కాయలు తెచ్చింది. రాజ్యం పే–ద్ద కొబ్బరిపెచ్చు తెచ్చింది."
"ఉహూ"
"నన్ను డబ్బు బెల్లంముక్క తెమ్మన్నారు"
"కొనడం యెందుకూ, అమ్మనడుగు యిస్తుంది"
"నువ్వియ్యి"
"నే నివ్వకూడదమ్మా!"
"చూ–శావా?.........ఇవ్వవుటే అక్కా?"
"చెప్పినమాట విను. ముందు దూరంగా వెళ్ళు."
"అయితే, యేడుస్తా నేమనుకున్నావో"

"లేకపోతే తిట్టేస్తాను"
"నువ్వేం చేసినా నేనివ్వను, ఇవ్వకూడదు."
"వంటింటో యెవరూలేరే, అంతా వాకిట్లో వున్నారే, నాకు గొళ్ళెం అందిందికాదు, నేనే తీసుకుందునే!"

"ఇవ్వవ్?"
"ఇవ్వను"
"ముచ్చెం మూడు మాట్లూ అడుగుతాను"
"..............."
"అడిగేస్తా"
"        "
"ఇవ్వవ్? ఇవ్వవ్? ఇ–వ్వవ్?"
"............."
"ఇంకొక్క మాటడుగుతాను, ఇస్తావా యివ్వవా?"
"..............."
"సరే, మాట్లాడకు. ఇలా వుందా నీ పనీ......"
"......అయ్యో! అయ్యో! గంధపుగిన్ని ఘట్టుకుపోతావుటే? అమ్మమ్మతో చెప్పనా?"
"చెప్పకో......చెప్పకో.....చెబుతావేం?......ఏం?"
"......రామా! రామా! గిన్నెడు గంధమూ నేలపాలు చేసిందోయ్ తండ్రీ! ఇప్పటికే నా రెక్కలు పడిపోయాయోయ్ నాయనా! ఒక్క చుక్కయినా పనికిరాదోయ్ బాబూ! వోయి దేవుడా–"
"అలా యేడు. అలా కూలబడు. ఏం, నన్నేడిపిస్తే వూరకుంటాననుకున్నావేం?........"
"        "

"ఏం చేస్తున్నావు రుక్కూ?"
"ఇప్పుడే గంధం యింటో పెట్టేసి వచ్చి కూచున్నాను, పెద్దక్క కూతురు జాబ్బా కుడదామని"
"దాని కిప్పుడేం తొందరా?"
"ఎవళ్ళపని వాళ్ళకి తొందరే. ఇంకా పూర్తి చెయ్యలేదా అని క్షణం కిందటే సాగతీసుకు వెళ్ళిందది."
"తేరగా చేసేవాళ్ళు దొరికితే సరి, తనేం చేస్తుందిట?"
"అడగలేదు"
"అడగనేవద్దు. అది యింటో పడేసి చక్కారా"
"ఎందుకూ?"
"చెబుతా, ముందు పడేసిరా"
"పడేస్తాను చెప్పు"
"కందులు వేయించాటప్పటికి అమ్మమ్మకి వొళ్ళు హూనం అయిపోయింది."
"ఊఁహూ"
"నన్ను మీ నాన్న తలంట మంటున్నారు. నేనే కాని పనికిరాదుట"
"ఊఁహూ"

"అమ్మమ్మ తనకి వుప్పపిండి చేసుకుంటుందిట"
"   "
"నువ్వు వంట చెయ్యాలి"
"........"
"ఏం, అలా తెల్లపోతావేం?"
"..........."
"ఇవాళకే, రేపు నేనే మడి కట్టుకుంటానులే"
"కందులు బాగుచేశాటప్పటికీ, రెండుమాట్లు గంధం తీశాటప్పటికీ నాకు రెక్కలు పడిపోయాయే అమ్మా!"
"రెండు మాట్లో మూడు మాట్లోనూ. ఏం, అంత రెచ్చగొట్టడమేం దాన్ని?"

'ఇంతకీ పొయిదగ్గిర కూచోడమే కాదూ, రుబ్బాలా, పోటు వెయ్యాలా?"

"అరటికాయ పప్పులోవేసి, వంగవరుగూ మునక్కాడలూ పనసపెచ్చూ బెండకాయా వేసి పులుసు చెయ్యి"
"పెద్దక్కనైనా చిన్నక్కనైనా చెయ్యిమనరాదుటే?"
"వాళ్ళెందుకు చేస్తారమ్మా మనకీ? ఇక్కడ మనం చెబితే అక్కడ వాళ్ళ మొగుళ్ళ కేం కోపం వస్తుందో? అత్తగార్లేం దెప్పతారో"

"వాళ్ళంతటివాళ్ళు వాళ్ళూ, మనంతటివాళ్ళం మనమూనూ, మనకి వోపిక వుంటే పెట్టాలి, లేకపోతే పంపెయ్యాలిగాని పని చెప్పగూడదు."
"..........."
"అప్పుడే ఆరయిపోయింది. లే, కూచోకు. మీ నాన్న పెందరాళే వంట కావాలంటున్నారు. ఆ గుడ్డ అవతల పడేసి – ఇంకా చూస్తావేం?"

"చద్దన్నాల్లోకి వుండాల, మామిడికాయల పచ్చడి మాత్రం – తెలిసిందా? అమ్మమ్మ నడుగు, ఎన్ని కాయలు చెయ్యాలో చెబుతుంది."
"............"
"అన్నట్టు పొక్క చెక్కపేడైనా లేదుకింద. చీకటి పడకుండా తొరగా చిట్టటక యెక్కి, నాలుగు పూటలకి సరిపడేవి తీసి, చూరులో పెట్టాలి. మరిచిపోకు."
"..........."
"అమ్మమ్మ కొయ్యరొట్టె చేసుకుంటానంటే కొబ్బరికాయ కొట్టి ముక్కలు తరిగి ఇయ్యి. పచ్చట్లోకూడా – వినపడుతోందా యేమయినా?"
"..........."
"లేవా ల్లేవాలి, కూచుంటేకాదు........"
"........స్స్, రామయ్యతండ్రీ, నా బతు కిలా వెళ్ళిపోవలసిందానా మహాప్రభూ?......"

## 6

"ఏయ్, ఎవరు వంటింటో?"
"నేనురా తమ్ముడూ!"
"నిమిషంలో అన్నం పెట్టెయ్యాలి నాకు"
"..........."
"మాట్లాడవేం? సినిమాకి వేళ అయిపోతుంది, తొరగా వడ్డించెయ్యాలి"
"అంత తొందరయితే –"
"తొందరన్న తొందర కాదు, కంచం పెట్టుకోనా, ఆకు వేస్తావా?"
"ఇంతసేపటిదాకా యేం చేస్తున్నావురా?"
"డబ్బులు చూసుకోవాలా మరీ?"
"ఇప్పుడా డబ్బులు చూసుకోవడం?"
"తెల్లవారింది మొదలు అడుగుతున్నాను. మూడు గంటలికి వొప్పుకుంది అమ్మ కాని; వెధవ అమ్మమ్మ–"
"ఆ,ఆ"
"నా సినిమా డబ్బు లడ్డుకొడితే వూరుకుంటానేం?"
"............"
"అలా నుంచుంటావేం వడ్డించక?"
"ఎసట్లో బియ్యం పొయ్యలేదురా మరీ"
"ఇప్పటిదాకా యేం చేస్తున్నావూ? వెధవది – రెండో ఆటకి వెడితే రేపు చదువు పాడయిపోతుంది. ఇప్పుడేనా బియ్యం పోసెయ్యవేం?"
"ఎసరు కాగందే?"
"నీ మొఘంలాగే వుంది, మరెలాగా యేడవడం?"
"పొడి అన్నం వుంది, తింటావా?"
"అఘోరించినట్టుంది నీ మాట. పోనీ అదే –"
"చిన్నక్కనైనా, పెద్దక్కనైనా పెట్టమను"
"వాళ్లు రారట. వాళ్ళకి తీరుబడి లేదుట"
"ఏం చేస్తున్నారూ?"
"చిన్నక్క మల్లెమొగ్గల దండ గుచ్చుకుంటోంది. పెద్దక్క యెదటింటి శ్యామలాంబగారితో గవ్వలాడుకుంటోంది – నువ్వే పెట్టాలి"
"నేను ముట్టుకోగూడదురా"
"అయితే తగలడు, వెధవ ఆచారమూ నువ్వూనూ"
".........."
"లేకపోతే పదిన్నరదాకా మేలుకొని వుండు."
"స్నానం యెలాగా చేస్తుంది కనక, అమ్మమ్మ పెడుతుందేమో వెళ్ళి అడిగిరా"
"నా కక్కర్లేద్దు?"
"ఏం?"

"ఆవిడ కళ్ళుపడితే అన్నం జీర్ణంకాదు."

"పనసపెచ్చు ముక్కలూ, మునక్కాడ ముక్కలూ నాకు చాలా అట్టే పెట్టాలి సుమా! లేకపోతే చితక్కొట్టేస్తా – నేమనుకున్నావో?"

"ఇవాళ నువ్వు మడికట్టుకున్నా వేమమ్మా?"

"అమ్మ కట్టుకోమంది నాన్నారూ"

"పెద్దక్క యేం చేస్తోంది?"

"ఏమోనండీ"

"చిన్నక్కో?"

"ఏమోనండీ"

"మీ అమ్మమ్మో?"

"చివరికదీ మాట. అందరికళ్ళూ తిరిగి తిరిగి నామీద పడతాయి. పనిదగ్గరికి వచ్చాటప్పటి కొక్కళ్ళూ నన్ను మరిచిపోరు. నే నలాంటి పుణ్యం చేసుకున్నాను కామోసు! అయితేనూ, యేమోయ్? నాలుగు కుంచాల కందులు వేయించి, నడుం లాక్కుపోయి, ముద్దయి పోయి, వోమూాల కూలబడ్డాను కదా, నేనింకా వండి వడ్డించగలననే అనుకున్నావుషోయ్?"

"ఆ సంగతి నాకేం తెలుసునండీ?"

"ఇదేకాదు, యింటిసంగతులే యేమీ తెలవడంలేదు నీకు. భోజనం చేస్తావు, వూళ్ళో తిరిగి తిరిగి మళ్ళీ వంట అయాటప్పటి కింటికి చేరుకుంటావు. లేకపోతే ముసుగు తన్ని – చెయ్యలేక నేను చచ్చిపోతున్నాను –"

"మీ అమ్మాయి యేం చేస్తోందీ?"

"అది వూరికే కూచుంఛోందనా నీ వూహ?"

"........."

"వంటలోకి రాదు కాని, పై పనంతా యెవరు చేస్తున్నారో నీకేమయినా తెలుసూ?"

"..........."

"అయినా, నా శక్తి సన్నగిల్లి పోయింది. నా రెక్కలు మూలపడ్డాయి. మునుపటిలాగ నేనిక చెయ్యలేను. దీనికి నువ్వేమయినా వుపాయం చూడాలి"

"రేపు డాక్టరు బ్రహ్మానందంగారికి కబురు చేస్తాను –"

"శాస్త్రం చెప్పిన తరవాయిగా వుంది నీ మాట. కాటికి కాళ్ళు చాచుక్కూచున్న దానికి నాకు వైద్యాలేమిషోయ్ యిప్పుడూ?"

"పనిమాట దేవు డెరుగును, మీరు సుఖంగా తిని కూచోడాని కయినా శక్తి వుండాలా?"

"పని చెయ్యడం కష్టంగా వుందిగాని నాకేం తెగులా? పైపని కేమీ బాధ లేదు. వంట దగ్గిరే వస్తోంది"

"మీ అమ్మాయి వంటే చెయ్యరాదూ, పైపని రుక్కమ్మకప్పగించీ?"

"చెప్పాను కాదూ? అవి తెములుచ్చుకోడం మాత్రం మాటలా? కాకపోయినా, తలచెడ్డవాళ్ళిద్దరింటో వుండగా పునిస్త్రీపడుచు మడికట్టుకోడం యేమిషోయ్?"

"..........."

"లోకంలో ఎక్కడైనా వుందిషోయ్? యీ సబబూ?"

"పైగా, పదిహేను రోజులనుంచి మా అమ్మకి అన్న హితవు లేదు కూడానూ?"

"అయితే, అప్పుడప్పుడు వండిస్తూ వుండండి రుక్కమ్మచేత, రోజూ మాత్రం వద్దు"

"అయితే నా మాట?"

"అంటే?"

"నీకింత తెలియకుండా వుందేమిషోయ్? అది చేసిన వంట నన్ను తినమంటావా యేమిషోయ్? అయ్యో, నా గ్రహచారమా?"

"నేను పొయ్యిదగ్గిర పడి దేవుళ్ళాడడం యెలాగా తప్పనప్పు డిక అదిన్నీ మడికట్టుకున్న అందం యేమిషోయ్?"

"దానివల్ల నాకు వొరిగింది మాత్ర యేమిషోయ్?"

"అయితే, నన్నేం చెయ్యమంటారూ?"

"నా నోటితో చెప్పించుకోవాలని వుందా?"

"..........."

"నిజంగా నీకు ఆలోచనే తోచలేదంటావా?"

"తోచలేదు"

"అయ్యో?"

"............"

"ఎప్పే చదివావు కదా—"

"మీరు చెబితే యేం?"

"అయితే విను, చెబుతాను. దాని బతు కంతా తెల్లారేపోయింది, ఇంకేమున్నా లేనట్టే"

"కనక?"

"ఎప్పుడో వొకప్పు డెలాగా తప్పదు. రోజులు గడవడమేకాని లాభం యేమీలేదు."

"అయితే......ఏమిటి చివరికి?"

"తల అంటుకోనా? దువ్వుకోనా? జడ వేసుకోనా? యింకెందుకోయ్ దానికా దిక్కుమాలిన జుట్టు?"

"—అదేమమ్మా పులుసు కింద పోసేస్తున్నావూ?"

"........గరిటె వేడిగా వుండడంవల్ల చెయ్యి వొణుకుతోంది నాన్నారూ"

"ఇందాకా రామదీక్షితులుగారి నడగ్గా యెల్లుండి దశమినాడు మంచి దన్నారు. కోటిలింగాలికి వెడితే వొక్కనిమిషం పనీ"

"............"

"నువ్వు కాస్తదూరం ఆలోచిస్తేకాని వీలులేదు. మొగుడు చచ్చిన పడుచుపిల్లలికి మంచిరోజులు కావివి. మొన్ననే వీరేశలింగం తోటలో వొక వెధవపెళ్ళి అయిందిట. ఇంక నలుగురు వెధవకొడుకులకోసం వెతుకుతున్నారట ముండల్ని తోటలోవాళ్ళు. ఒక ముహూర్తం లేకుండా, వొక సమయాసమయాలు చూడకుండా, యే క్షణంలో దొరికితే ఆ క్షణంలో చేసేస్తున్నారట పెళ్ళిళ్ళు. తరవాత యేమనుకున్నా యిక కలసిరాదు సుమా?"

"పదిహేడేళ్ళయినా యింకా నిండలేదుకదా –"

"అయితే? ఎన్నేళ్ళు నిండితే యేమిటే? కాకపోయినా, పదిహేడేళ్ళు నిండలేదు కనకనే పాడు బుద్ధులేమీ పుట్టకుండా జాగ్రత్తపడాలి వెనకాలవాళ్ళు"

"అమ్మ పేరు కదా అని, గారాం చూపిద్దా మనుకుంటున్నావేమో, యిది కొరివితో తల గోక్కోవడంకాని మరోటి కాదు."

'మీ అమ్మాయి యేమంటుందీ?"

"దానిమా టెందుకూ నీకూ?"

"అయినా

"ఎంత అవసరం వచ్చినా తల్లిపీనుగు నోటితో చెప్పగలదుషోయ్ ఆ మాట."

"నేను మాత్రం?"

"మొగరాజువు నీకేం? కాకపోయినా, యెవరికీ బాధ లేకుండా నేనున్నాను కాదూ, మూడోకంటివాడికి తెలియకుండా తెల్లవారాటప్పటికి చేయించెయ్యడానికీ!"

"........అదేమమ్మా, నీళ్ళలా వొలకబోశావూ?"

"........నేతిజిడ్డు మూలాన చేతిలో చెంబు జారిపోయింది నాన్నారూ"

"చూశావా?....విన్నావా? ఇదీ వరస. ఒక్కపని చేతకాదు. చేసినంత మట్టుకయినా వొబ్బిడీ, నిదానమూ లేదు. తేరగా తిని కూచున్నట్టే వుంటుందా వండి వడ్డించడం అంటేనూ?"

"........."

"మాట్లాడవేమోయ్?"

"ఏమనమంటారండీ?"

"ఏమనమంఛానా?.....నువ్వూరుకుంఛే నేనూరుకుంఛా ననుకున్నావా?"

"..........."

"వీధికి వెడితే పెద్దలందరూ నా గుడ్లు పీకేస్తున్నారు. తెలుసా నీకేమయినా?"

"..........."

"దేనికీ మాట్లాడవు కనక దానికీ మాట్లాడకుండానే వూరుకో నువ్వు. చేస్తేగాని ఆగిపోయేదేమీలేదు"

"రేపు లేదెల్లుండి దశమీ బుధవారం తప్పదు. నీకిదే చెప్పడం, ఏమనుకున్నావో"

"వినపడిందిషోయ్?"

"చెవుల్లో హోరు పుట్టుకు వస్తూవుంటే వినపడకపోవడం యేమిటండీ?"

# 8

రుక్కమ్మ తన పక్కమీదికి వచ్చాటప్పటికి ఖరాగా పదకొండయింది, రాత్రి.

అప్పటి కప్పుడే – యింటిల్లిపాదీ – బహిరంగంగా పడుకుని వున్నవారంతా గాఢనిద్రలో వున్నారు.

ముసలమ్మ బావురుబిల్లులతో కాట్లాడుతోంది, వంటింటి వసారాలో నులకమంచంమీద.

మండువా హాల్లో రుక్కమ్మ పడక.

అక్కడికి తానెలా వచ్చిందీ యెరగదామె.

వచ్చాక మాత్రం అంత యింట్లో – అంతమంది వున్న యింట్లో తానొక్కతె మట్టుకే మేలుకొని వుండడంచూసి తన అసహాయతను పూర్తిగా గ్రహించేసుకుంది.

దాంతో, దీపం బంతి పువ్వులాగే వెలుగుతోంది కాని; యిల్లంతా అంధకారబంధురంగా కనపడిందామెకి.

ఆమెకి అసలేమీ తోచడమేలేదు.

తోచినా బోధకావడం లేదు.

అయినా అది నిలవడం లేదు.

నిలవడమే వస్తే అంతలో అంతా అడివీ ముళ్ళూ అయిపోతోంది.

కాగా, తన వొంటరితనం భరించుకోలేక ఆమె గట్టిగా కళ్ళు మూసుకుంది.

కాని, దానివల్ల మరీ విషమించింది.

రైకగుడ్డ చేతపట్టుకుని కొరకొరచూస్తూ చిన్నక్క వొకవేపునా, జుబ్బా గుడ్డ పట్టుకుని పళ్ళు పటపట్లాడిస్తూ పెద్దక్క వొకవేపునా, కత్తినూరుతూ మంగలి వెంటరాగా, సగం పళ్ళూడిపోయిన దెయ్యపునోరు తెరుచుకుని స్వయంగా కత్తెర చేత్తో పుచ్చుకుని అమ్మమ్మ వొకవేపునా, రెక్కలు పడిపోయేటట్లు తాను తీసిన గంధం అంతా సెంటు కలిపి పూసుకుని బుగ్గా బుగ్గా అనించుకుని తల్లీ తండ్రీ వొకవేపునా –

రుక్కమ్మకి వొళ్ళు రణకంపరం యెత్తిపోయింది.

ఇక పడుకుని వుండలేక వెంటనే ఆమె గభీమని లేచి కూచుంది, చాపమీద.

కూచోనూలేక వుబ్బెత్తుగా లేచి నుంచుంది.

నుంచోడం తడవుగా వూచలాగ వాకిట్లోకి వచ్చేసింది. వచ్చిన వెంటనే తలుపులు తెరుచుకుని వీధిలో పడింది. చెర తప్పినట్లనిపించిం దామెకి దాంతో.

ఆమె కాళ్ళలో విద్యుద్వేగం పుట్టింది.

కళ్ళల్లో దివ్యజ్యోతి వెలిగింది.

ఒక్క నిమిషంలో, ఒక్కమాటు, ఇన్నీస్‌పేట వీధులు, పటం తిప్పేసినట్టయిపోయాయి.

నిదానించగా ఆమె నాళంవారి సత్రం వెనకవేపున నిలిచివుంది.

ఎదట—వరదరావు హోటలు, ముందర ఆమె కెవరో మనుష్యులు కనపడ్డారు.

"బాబోయ్" అనుకుంటూ ఆమె నిలువునా కొయ్యయిపోయింది.

ఒక గోడవార జట్కాకింద పడుకుని చుట్ట కాల్చుకుంటూ వున్న జట్కావాడిదంతా చూశాడు.

"బండి కావాలా?"

"..........."

"మేఘాలమీద యెగిరిపోతేనే డబ్బివ్వండి"

"............"

"అర్ధరాత్రి, తేళ్ళో పాములో – రూపాయలా, అర్ధలా – పావలా డబ్బులివ్వండి"

అవి అడిగినా జవాబు రాకపోవడంవల్ల జట్కామనిషి అనుమానపడి లేచివచ్చి పరకాయించి చూస్తూ "యెక్కడికి వెడతా రమ్మాయిగారూ?" అనడిగాడు మెల్లిగా.

"ఏ పేట నీది?" అని ఆమె అంతకంటేనూ మెల్లిగా అడిగింది.

"దానవాయిగుంట"అని చెప్పాడు చెవిలో వూదినట్టు, ఆ మనిషి.

"ఏం పుచ్చుకుంటావు?" అంటున్నట్టు పెదవులు కదిపిందామె.

"పంతులుగారి తోటకా?" అని అడిగాడు వాడు, ఏదో జ్ఞాపకం చేసుకుంటూ.

ఉప్పొంగిపోయి "అవు"నన్నట్టు తల వూపిందామె.

"నిమిషాలమీద తోలుకుపోతాను, బండెక్కండమ్మాయిగారూ" అంటూ వాడు బండికేసి బయలుదేరాడు.

అయితే "నా దగ్గిర వొక్క రాగిదమ్మిడీ అయినా లేదు" అంటూ ఆమె చరా చరా రెండడుగులు వేసింది.

"పంతులుగారి తోట కయితే నాకేమీ యివ్వనక్కర్లేదు తల్లీ!" అని చెబుతూ గుర్రంపూన్చి, వాడు జట్కా తీసుకువచ్చాడు.

వెంటనే మాట్టాడకుండా బండిలో యెగిరిపడి, శరీరం కుంచించుకుం దామె.

కొరడా ఫెడేలుమంది.

వేగం అందుకునీదాకా గుర్రంతోకూడా పరిగెత్తి తరవాత వాడుకూడా బండిమీదికి వురికాడు.

"నాకూ తెలుసునం డమ్మాయిగారూ, కష్టసుఖాలు. నాకొక్కత్తే కూతురండి. అది యీడేరిన నెలకే – పెద్దల్ని చెయ్యకుండానే – పదిరోజుల కిందటే దాని మొగుడు చచ్చిపోయాడండి. దాన్ని చూసినా, జ్ఞాపకం వచ్చినా నా కడుపు మడుగయిపోతోందం డమ్మాయిగారూ! ........నా పనే యిలా వుంటే, యిక మా యింటిదాని మాట చెప్పడానికేం వుందండి? అది గంజినీళ్ళుకూడా మానేసి లంకణాల మనిషిలాగ మంచం పట్టేసిందండి. పిల్లని వూరుకోమనడానికి నోరురాకా, ఇంటిదాన్ని కనిపెట్టుకుని వుండడానికి వీలులేకా, బండితోలడం మానేసి నెల్లాళ్ళు

ఇంటో వుండిపోదామంటే గడిచే దారిలేకా, నే ననుభవించే యాతన దేవుడయినా గుర్తించుకోలేడండి.

"పంతులుగారి తోటలో మొన్న రాత్రి రెండు పెళ్ళిళ్ళయినాయండి. నిన్న మూడో దయిందండి. నాలుగోది కూడా అయిపోయాదే కాని, సగం దారిలో నా బండే అటకాయించి తండ్రీ అన్నలూ ఆ అమ్మాయిగారిని వెనక్కి లాక్కుపోయారండి. నాకు గుండె లాగిపోయాయండి. ఎంత కోరికతో వచ్చారో, యెన్నాళ్ళనుంచి ఆశ పడుతున్నారో, యిప్పుడేం బాధ పడిపోతున్నారో, యికముందు ఆవిడ గతి యేమయిపోతుందో – నా ప్రాణాలు మహా కొట్టుకుంటున్నాయం డమ్మాయిగారూ!

"మరో పిల్లకోసం వెతుకుతున్నారండి....

"మహా బాగుంటా రండి, రాచకొమారుడిలాగ ఆ అబ్బాయిగారు.....

"నెలకి అరవై రూపాయల జీతమంటండి.....

"రెండో పెళ్ళేగాని పాతికేళ్ళేనా వుండవండి, పాపం!

"తండ్రిగారు యగ్గిం పట్టినోరుటండి...

"అక్కడికి వెళ్ళీ వెళ్ళగానే అయనకీ మీకూ పెళ్ళయిపోతుందండి......

"మీరు పుణ్యం చేసుకున్నారు, ఏమీ భయపడకం డమ్మాయిగారూ! ఇక మీకు సుఖమేకాని కష్టం లేదం డమ్మాయిగారూ.....

"పదిరోజులు పోయాక – కొంచెం పాతబడి పోయాక మా పిల్లక్కూడా–"

మళ్ళీ యెవరయినా వచ్చి మొన్నటిలాగే అటకాయిస్తారేమో అన్న భయంతో కొరడా మళ్ళీ చెళ్ళుమనిపించాడు జట్కామనిషి.

మేఘాలమీద యెగిరిపోయింది జట్కా.

మలుపుకూడా తిరిగేసింది.

*1935 జూన్, ప్రబుద్ధాంధ్ర నుంచి*
*(సవరణలతో)*

★ ★ ★

# శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి

❋ జననం : 23-4-1891 ❋ మరణం : 25-2 1961

ఫ్యూడల్ సంస్కృతి నుంచి వచ్చినా శాస్త్రిగారు ఆ సంస్కృతి పాత్రల చేత ఫ్యూడల్ సంస్కృతి భాషను మాట్లాడించినట్లు మరెవరూ మాట్లాడించ లేరన్నది శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథల గురించి కొడవటిగంటి కుటుంబరావుగారి అభిప్రాయము. శ్రీపాదవారి కథలు విని ఉండకపోతే తెలుగుల ఉనికి అయోమయం చదువరులకే చదువు చెప్పగలిగినది ఆయన రచన. తీయందనపు తీయందనము చదువులిచ్చినదాయన శైలి. ఆయన రచనలు మరో భాషకు లొంగవు. తెలుగు వారైన వారికే శ్రీశాస్త్రిగారి కథలు చదివి ఆనందించే అదృష్టము - అన్నది మల్లాది రామకృష్ణశాస్త్రిగారి అంచనా. అచ్చమయిన వ్యావహారికాంధ్రం వ్రాసిన వారిలో ప్రథమగణ్యులు శ్రీపాద వారు - అన్నది పిలకా గణపతిశాస్త్రి బేరీజు. దీన్నే తనదైన శైలిలో "సర్వదా తమరీనాటియాంధ్ర వ్యావహారిక భాషానిర్మాతృగణ ప్రథమగణనీయులు" అని అన్నారు విశ్వనాథ సత్యనారాయణగారు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సుమారు 75 కథలు రాశారు. తమ కథలను వారు చిన్న కథలని పిలిచినా అవన్నీ ఓ రకంగా నవలికలనే అనచ్చు, వస్తువురీత్యా ప్రణయం, సంఘ సంస్కారం, ప్రబోధం, కుటుంబ జీవితం, అపరాధ పరిశోధనం, భాషా వివాదాత్మకం, అవహేళనాత్మకం, చారిత్రకం-అంటూ స్థూలంగా విభజించుకోవచ్చు.

శ్రీపాదవారు ఇవేకాక పద్య రచనలు, నాటకాలు, నాటికలు - రేడియో నాటికలు, నవలలు, అనేక వచన రచనలు, అనువాదాలు, వైద్యగ్రంథాలు సహితం రాశారు.

'ప్రబుద్ధాంధ్ర' పత్రికను చాలాకాలం నిర్వహించారు. వ్యావహారిక భాషావాదిగా గిడుగు ఉద్యమానికి అండదండలందించారు.

గాంధీ - ఖద్దరు - హిందీ ఈ మూటినీ వ్యతిరేకించిన వ్యక్తి. శాస్త్రి వాచస్పతి, తార్కికుడు, వసంతుడు, కుమారకపిసింహుడు, బటాచార్యుడు, కౌశికుడు, - అన్న మారుపేర్లతో శతాధిక వ్యాసాలు రాశారు.

1891 లో తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకా పొలమూరులో జన్మించారు వేదం, జ్యోతిషం, ధర్మశాస్త్రాలను అభ్యసించారు. పిఠాపురం సంస్థాన కవులు శ్రీ వేంకట రామకృష్ణ కవుల శిష్యులు. పలు అష్టావధానాలు చేశారు. వల్లూరు, వేటపాలెం గ్రామాలలో అధ్యయనం చేశారు. తెలుగు కథకులలో కనకాభిషేక గౌరవం లభించిన మొదటివారు వీరు. (1956)

ఇవే మా తెలుగు కథలంటూ తెలుగువాళ్ళు గర్వించతగ్గ కథలనందించిన ఘనాపాఠీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. 1961 లో రాజమండ్రిలో చనిపోయారు.

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyd.